గురులింగశాస్త్రులు, నోరి

విక్రమార్కమహారాజు చరిత్రము

చన్నపురి, 1896

Record no. 136

## Bibliographic Record Target

గురులింగశాస్త్రులు, నోరి.

విక్రమార్కమహారాజు చరిత్రము / ఈ గ్రంధము నోరి గురులింగశాస్త్రులచే రచియింపబడినది. - చన్నపురి : గీర్వాణభాషారత్నాకరముద్రాక్షరశాల, 1896.

216 p. ;19 cm.

Record no. 136

Guruliṅgaśāstrulu, Nōri.

Vikramārkamahārāju caritramu / Ī grandhamu Nōri Guruliṅgaśāstrulacē raciyimpabaḍinadi. - Cannapuri : Gīrvāṇabhāṣāratnākaramudrākṣaraśāla, 1896.

216 p. ;19 cm.

Record no. 136

35 mm microfilm

Image placement: IA IIA IB IIB          Date filming began:

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

———(*)———

ధైర్యౌదార్యసాహసవితరణాది
గుణములనుగలిగించుటయగాక
సకలనీతులనున్ను బోధించెడి

# విక్రమార్క మహారాజ చరిత్రము.

ఈగ్రంథము

వోరి - గురులింగశాస్త్రిలచే
రచియింపఁబడిన
ప్రతిపదటీకా తాత్పర్యసహితముగ

———(*)———

చన్నపురి
బరరాపు - త్యాగరాయశాస్త్రులచే
స్వకీయ
గీర్వాణభాషారత్నాకరముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

౧౮౯౬ సం॥

ప్రకటన.

ఈ గ్రంథము గవర్నమెంటువారి రిజిస్టర్ కాపీ రైట్ ఆక్టుప్రకారము రిజిస్టరు చేయబడి యున్నది. కావున యితరులు ముద్రింపఁగూడదు.

ఈ విక్రమార్కమహారాజచరిత్రము మొదలగుగ్రంథములువలయువారు చెన్నపట్టణము- గోవిందప్పనాయనివీధి (౨౧౬) వ- నెంబరుగలగృహమునఁ దుండు బరూరు - త్యాగరాయశాస్త్రులవారి పేరవ్రాసి తెప్పించుకొనవచ్చును. దీనిక్రయము ౧—౦—౦ తపాల్‌ఛార్జి (౩) అణాలు.

వాల్యూపేయబిల్ తపాల్‌ద్వారా సహా పంపబడును.

బరూరు-త్యాగరాయశాస్త్రులు

—(*)—

శ్రీరస్తు.

# విక్రమార్క మహారాజు చరిత్రము ప్రతిపదటీకాతాత్పర్య సహితము.

శ్లో॥ వందేహం వందనీయానాం వంద్యాం వాచామధీశ్వరీమ్। కామితాశేషకల్యాణకలనాకల్పవల్లికామ్॥ గజాననాయమహతే ప్రత్యూహతిమిరచ్ఛిదే। అపారకరుణాపూరతరంగితదృశే నమః॥ శ్రీపురాణపురుషం పురాంతకం పద్మసంభవముమాసుతం మయా। సంప్రణమ్య చసురాన్ సరస్వతీం విక్రమార్కచరితం విరచ్యతే॥

తా॥ నమస్కరింపఁదగిన దేవతలచేతఁగూడ నమస్కరింపఁదగినదియును, వేదాధిదేవతయును, కోరఁబడినసకలకోర్కెలను కలుగఁజేయునట్టిదియును, అయినపరదేవతను నమస్కరించుచున్నాను॥ మిగుల గొప్పవాఁడును, విఘ్నములనియెడు చీకటిని నశింపఁజేయువాఁడును, మితిలేనిదయాప్రవాహముచేత తరంగములుకలవైచేయఁబడినదృక్కులుకలవాఁడును, అయిన వినాయకునికొఱకు నమస్కారములగుఁగాక॥ సంపత్కరుఁడును, పురాణపురుషుఁడును అయిననారాయణుని, త్రిపురములను సంహరించిన పరమశివుని, పద్మమువలనఁ బుట్టినబ్రహ్మదేవుని, పార్వతీనందనుఁడగు కుమారస్వామిని, మఱియునితరులగు దేవతలను సరస్వతీదేవిని నమస్కరించి విక్రమార్కమహారాజచరిత్రమును చేయుచున్నానని తా॥ మాళవదేశమునందు సకలవస్తుసమృద్ధికలదియును, ఇంద్రపట్టణమయిన అమరావతీపట్టణముకంటెమిగుల మనోహరమైనదియును, ఉజ్జయినీఅనునామధేయముకలదియును, అగునొకపట్టణముకలదు. ఆపట్టణమునందు సకలరాజులయొక్కయు శిరస్సులయందు అలంకారముకొఱకుఁగా నుంచఁబడిన మణులచేతను, సింధూరముచేతను, ఎఱ్ఱనైనపాదపద్మద్వయముకలవాఁడు (సకలసామంతరాజులచేతనునమస్కరింపఁబడుచున్నపాదపద్మములుకలవాఁడు) అయిన భర్తృహరియనుపేరుకలయొకరాజుగలదు. మఱియును, ఆపట్టణమునందు సకలశాస్త్రము

లను చక్కఁగఁ దెలిసినవాఁడును, సమస్తమంత్రశాస్త్రమునందు మిగుల ర్పుకలవాఁడును, అయిన యొకబ్రాహ్మణుఁడు కలఁడు. ఆబ్రాహ్మణుఁడు వలదరిద్రుఁడు. అతఁడొకనాఁడు మంత్రానుష్ఠానముచేత భువనేశ్వరియను దేవతను సంతోషపెట్టెను. అంతట నాభువనేశ్వరీదేవత మిగుల సంతోషముకలదై ఆబ్రాహ్మణునితో నిట్లనియె. ఓబ్రాహ్మణుఁడా! ఇదిగో నీకొకఫలము నిచ్చెదను. ఈఫలమును భుజింపుము. ఈఫలమును భుజించితివేని జరామరణములు లేనివాఁడవగుదువనియె. అంతట నాబ్రాహ్మణుఁడు ఆఫలమును గ్రహించి తనయింటికివచ్చి స్నానమునుచేసి దేవతార్చనమును జేసి ఆఫలమును భక్షించుటకొఱకు ప్రయత్నించె. అట్లు ప్రయత్నించినసమయమునందు ఆబ్రాహ్మణునిమనస్సునందు ఒకవిధమైన తలంపుకలిగె. ఎట్లనిన?—అయ్యో నేనైతే మిగుల దరిద్రుఁడను. దరిద్రుఁడనైన నేను జరామరణములు లేనివాఁడనైయుండి యెవరికేమియుపకారమును చేయఁగలను. ఏమియును చేయఁజాలను. మఱియును, నేను చిరకాలముజీవించియున్నను భిక్షాటనమును జేసి జీవింపవలసినదేకాని సుఖముగానైనను జీవించువాఁడను గాను. ఛీఛీ, భిక్షాటనమును చేయుచు చిరకాలముజీవించుటవలన ఏమిలాభముకలదు. ఏమియును లేదు. కాఁబట్టి నేను ఈఫలమును తినను. మఱియేమనిన, పరోపకారుఁడైన పురుషుఁడు కొంచెముకాలము జీవించినను శ్రేష్ఠముఅగుచున్నది. మఱియును, లోకములోనే మానవుఁడు జ్ఞానశౌర్యాదిగుణములతోఁ గూడుకొనినవాఁడగునో అట్టివానియొక్క జీవితమే సఫలమైనదగుచున్నది. మఱియును,

శ్లో॥ యజ్జీవతిక్షణమపిప్రథితైర్మనుష్యో విజ్ఞానశౌర్యవిభవాదిగుణైస్సమేతః। తత్తస్యజీవితఫలంప్రవదంతిసంతః కాకోపిజీవతి చిరాత్తుబలించభుంక్తే॥

టీ॥ మనుష్యః=మానవుఁడు. ప్రథితైః=ప్రసిద్ధములయిన. విజ్ఞాన, శౌర్య, విభవాదిగుణైః= విజ్ఞానము, శౌర్యము, విభవము, మొదలుగాఁగలగుణములచేత. క్షణమపి=క్షణమాత్రమైనను. జీవతీతి యత్= జీవించుచున్నాఁడనుట యేదికలదో. తత్=అది. తస్య=అట్టిపురుషునకు. జీవితఫలమ్=జీవనమునకు ఫలమునుగా. సంతః= సత్పురుషులు. ప్రవదంతి= చెప్పుచున్నారు. కాకోపి= కాకమును. చిరాత్=చిరకాలము. జీవతి= జీవించుచున్నాఁడు. బలించ=బలిని. భుంక్తే=భుజించుచున్నాఁడు॥ తా॥ మానవుఁడు మిగులఁ బ్రసిద్ధములయిన విజ్ఞానము, శౌర్యము, విభవము, మొదలుగాఁగలగుణములతోఁగూడుకొనినవాఁడై క్షణముసేపు జీవించినను చాలుననియును, అట్టి జీవనమే సర్వోత్తమ



మైనదనియును, సత్పురుషులు చెప్పుచున్నారు. మఱియును, కాకముచిరకాలముజీవించుచున్నది. బల్యన్నమును భుజించుచున్నది. కావున ఆలోచింపఁగా నిరుపకారుఁడగు దరిద్రునియొక్క జీవనము కాకముయొక్క జీవనమువలె నిష్ప్రయోజనమగుచున్నదని తాత్పర్యము. మఱియును,

శ్లో॥ యస్మిన్జీవతిజీవంతి బహవస్సతుజీవతు। బకోపికింనకురుతే చంచ్వాస్వోదరపూరణమ్॥

టీ॥ యస్మిన్= ఏపురుషుఁడు. జీవతిసతి= జీవించుచుండఁగా. బహవః=అనేకులు. జీవంతి= జీవించుచున్నారో. సతు=ఆపురుషుఁడే. జీవతు= జీవించుఁగాత. బకోపి=కొంగయును. చంచ్వా=ముక్కుచేత. స్వోదరపూరణమ్=తనయొక్కయుదరపూరణమును. నకురుతేకిమ్= చేయుదాయేమి? తా॥ ఏపురుషుఁడు జీవించుచుండఁగా అనేకులయిన జంతువులు జీవించుచున్నవో అటువంటిపురుషుఁడొక్కఁడే జీవించుఁగాత. నిరుపయోగమైనవాని జీవనమెందుకు. కొంగతనముక్కుతో తనపొట్టనుపోసికొనుటలేదా? పోసికొనుచునేయున్నది. అట్లుల నేనిరుపయోగమైనవాఁడను జీవించుచున్నాఁడనని తా॥ మఱియును,

శ్లో॥ క్షుద్రాస్సంతిసహస్రశస్స్వభరణవ్యాపారపూర్ణాదరాస్స్వార్థేయస్తుపరార్థఏవసపుమానేకస్సతామగ్రణీః। దుష్పూరోదరపూరణాయపిబతిస్రోతఃపతింబాడబో జీమూతస్తు నిదాఘసంభృతజగత్సంతాపవిచ్ఛిత్తయే॥

టీ॥ స్వార్థే= స్వనిమిత్తముకొఱకు. స్వభరణవ్యాపారపూర్ణాదరాః=తమనుభరించుకొనునట్టి వ్యాపారమునందు నిండైనఆదరముకల. జనాః=జనులు. యే=ఎవరు. సంతి=కలరో. తే=అటువంటి. జనాః=జనులు. సహస్రశః=అనేకులు. సంతి=ఉన్నారు. యస్తు=ఏపురుషుఁడు. పరార్థఏవ=ఇతరులయొక్కపనియేప్రయోజనముగాఁగలవాఁడై. వర్తతే= ప్రవర్తించుచున్నాఁడో. సః=అటువంటి. పుమాన్=పురుషుఁడు. ఏకః= ఒక్కఁడే. సతామ్= సత్పురుషులలోపల. అగ్రణీః= శ్రేష్ఠుఁడు. బాడబః= బడబాగ్ని. స్రోతఃపతిమ్=సముద్రమును. దుష్పూరోదరపూరణాయ=దుష్టమైనపొట్టనునిండించుటకొఱకు. పిబతి=పానమును చేయుచున్నాఁడు. జీమూతస్తు=మేఘుఁడైతే. నిదాఘసంభృతజగత్సంతాపవిచ్ఛిత్తయే= ఉష్ణకాలముచేత. సంభృత= సంపాదింపఁబడిన. జగత్=లోకముయొక్క. సంతాప= సంతాపముయొక్క. విచ్ఛిత్తయే= నాశముకొఱకు. పిబతి=పానముచేయుచున్నాఁడు॥ తా॥ తమ నిమి ముగా తమపొట్టనునిండించుకొనుటకుఁదగిన వ్యాపారమునందు పూ

ర్ణమైనఆదరనముకల జనులు అనేకులుకలరు. అయితే వారందఱును నీచు లనఁబడుదురు. మఱియును, లోకములో ఏమానవుఁడు పరులకొఱకుఁగానే ప్రయత్నమును చేయుచుండునో అట్టి పురుషుఁడొక్కఁడే సత్పురుషులలోనుత్తముఁడని చెప్పఁబడును. మఱియును, బడబాగ్నిసముద్రమును దుష్టమైనపొట్ట నిండించుటకొఱకు పానమును చేయుచున్నాఁడు. మేఘుఁడన్ననో ఉష్ణకాలముచేత సంపాదింపఁబడిన లోకముయొక్క సంతాపముయొక్క వినాశముకొఱకు సముద్రోదకమును పానము చేయుచున్నాఁడని తా॥ మఱియును,

శ్లో॥ అసంపాదయతఃకంచిదర్థంజాతిక్రియాగుణైః। యదృచ్ఛాశబ్దవత్పుంసస్సంజ్ఞాయై జన్మకేవలమ్॥

టీ॥ జాతిక్రియాగుణైః= జాతిచేతను, క్రియచేతను, గుణములచేతను. కంచిత్=ఒకానొకటయిన. అర్థమ్=అర్థమును. అసంపాదయతః=సంపాదింపనటువంటి. పుంసః=పురుషునియొక్క. జన్మ=జన్మము. కేవలమ్= ముఖ్యముగా. యదృచ్ఛాశబ్దవత్= స్వేచ్ఛచేత కల్పింపఁబడినశబ్దమువలె. సంజ్ఞాయై=గుర్తుకొఱకు. భవతి=అగుచున్నది॥ తా॥ జాతిక్రియాగుణములచేత ఏప్రయోజనమును సంపాదింపనిపురుషునియొక్క జన్మము జాతిక్రియాగుణములచేత ఏయర్థమును సంపాదింపనియదృచ్ఛాశబ్దమువలె కేవలసంజ్ఞకొఱకగుచున్నది. అనఁగా,నిష్ప్రయోజనమగుచున్నదని తాత్పర్యము. అనునట్టి ప్రమాణవచనములనుపట్టి ఆలోచింపఁగాపరులకుపకారమును చేయలేనివానిజన్మము నిరర్థకమైనదనియును, పరులకుపకారమును చేయువానిజన్మము సఫలమగుననియును తోఁచుచున్నదని ఆలోచించి ఈఫలమును రాజునకిచ్చెదను. ఆరాజు ఈఫలమునుభుజించి జరామరణవర్జితుఁడై చాతుర్వర్ణ్యమును, ఆచాతుర్వర్ణ్యధర్మములను చక్కఁగఁబాలించును. అనినిశ్చయించి ఆఫలమునుతీసికొని రాజసమీపమునకుఁబోయెను.

శ్లో॥ అహీనమాలికాంబిభ్రత్తథాపీతాంబరంవపుః। హరోహరిశ్చభూపాలకరోతుతవమంగళమ్॥

టీ॥ అహీనమాలికామ్= సర్పశ్రేష్ఠములయొక్క మాలికను. బిభ్రత్=భరించుచున్న. హరశ్చ= ఈశ్వరుఁడును. తథా= ఆప్రకారముగా. పీతాంబరమ్=పచ్చనివస్త్రములుకల. వపుః=శరీరమును. బిభ్రత్= భరించుచున్న. హరిశ్చ=నారాయణుఁడును. హేభూపాల=ఓరాజా! తవ=నీకు. మంగళమ్=శుభమును. కరోతు=చేయుఁగాత॥ తా॥ ఓరాజేంద్రా! సర్పశ్రేష్ఠములయొక్క మాలికనుభరించుచున్న యీశ్వరుఁడును, పచ్చనిపట్టువస్త్రముకల



శరీరమునుభరించుచున్న నారాయణుఁడును, నీకుశుభమును చేయుఁగాతఅని, ఈశ్లోకమునుచదివి ఆశీర్వచనమును చేసి ఆఫలమునిచ్చి యిట్లనియె. ఓరాజా! ఈఫలము దేవతావరప్రసాదముచేత పొందఁబడినది. కావునఇదిఅపూర్వమైనది. మఱియును, ఇదిభూలోకమునందెక్కడను దొరకునదికాదు. కాఁబట్టి యీఫలమును నీవు భుజింపుము. దీనిభుజించినయెడల జరామరణములులేనివాఁడవగుదువనియె. అంతటనారాజుఆఫలమునుతీసికొనిఆబ్రాహ్మణునకుధనకనకవస్తువాహనములనిచ్చిసన్మానమును చేసి పంపినపిమ్మటతనమనస్సునందిట్లనియాలోచించెను. ఓహో ఈఫలమును నేనుభక్షించితినేని మరణములేనివాఁడనగుదును. నాకు నాభార్యయయిన అనంగసేనయందు అధికమైనప్రేమకలదు. దానికిఈఫలమునియ్యక నేనేభుజించితినేని నాకంటెముందుగఆఅనంగసేనమరణమునుపొందును. ఆఅనంగసేన నాకంటెముందుగమరణమునుపొందెనేని దానివియోగదుఃఖమును నేనుసహింపఁజాలను. కాఁబట్టి యీఫలమును, నాప్రాణములకంటె ప్రియురాలయిన అనంగసేనకిచ్చెదను అనిఆలోచించి అంతఃపురములోనికిఁబోయి ఆయనంగసేననుపిలిచి దానికాఫలమునుఇచ్చెను. ఆయనంగసేనకు,మందురికుఁడనువాఁడు మిగులఁబ్రియుఁడైయుండెను. కావున ఆయనంగసేనరాజువలెనే యోచించి ఆఫలమునుఆమందురికుఁడనువానికిచ్చె. ఆమందురికునకు ఒకదాసియందు మిగులఁబ్రియముకలిగియుండె. కావున వాఁడాఫలమును ఆదాసికిచ్చె. ఆదాసికి ఒకగోపాలుఁడు మిగులఁబ్రియముకలవాఁడైయుండె. కావునఆదాసిఆఫలమునుగోపాలునకిచ్చె. ఆగోపాలునకు పేడకువచ్చునట్టి యొకస్త్రీయందు ప్రేమకలిగియుండుటచేత ఆఫలమునువాఁడు దానికిచ్చె. ఆయాఁడుదిగ్రామమునకు బయలునపేడనుపోగుచేసి తట్టలోవేసికొని ఆఫలమునుదానిమీఁదపెట్టి ఆపేడతట్టనునెత్తిపెట్టుకొని రాజవీథియందువచ్చుచుండె. ఆసమయమునందు భర్తృహరియనురాజు రాజకుమారులతోఁగూడ క్రీడార్థముగ బయలునకువచ్చి తిరుగుచు పేడతట్టయందున్న ఆఫలమునుచూచి యింటికివచ్చి ఆఫలమునిచ్చినబ్రాహ్మణునిపిలిపించి యిట్లనియె. ఓబ్రాహ్మణుఁడా! నీవు నాకిచ్చినఫలమువంటిది యింకొకటికలదాయేమి? అనినవినియాబ్రాహ్మణుఁడిట్లనియె. ఓరాజా! ఆఫలము దేవతావరప్రసాదమువలన ప్రాప్తమైనది. అటువంటిఫలము భూలోకమునందెక్కడనులేదు. నేను సత్యముగాచెప్పుచున్నాను. అదియునుగాక రాజుప్రత్యక్షముగా ఈశ్వరునివంటివాఁడు. కాఁబట్టి రాజుదగ్గర అబద్ధమునుచెప్పఁగూడదు. మఱియును రాజును దేవునివలెఁ

భావింపవలయును. మఱియును,

శ్లో॥ సర్వదేవమయోరాజా ఋషిభిఃపరికీర్తితః । తస్మాత్తం దేవవత్పశ్యేన్నవ్యళీకంవదేద్బుధః॥

టీ॥ రాజా=రాజు. సర్వదేవమయః= సర్వదేవస్వరూపమైనవాఁడు. (ఇతి=ఇట్లని.) ఋషిభిః=ఋషులచేత. పరికీర్తితః=చెప్పఁబడెను. తస్మాత్= అందువలన. తమ్=ఆరాజును. దేవవత్=దేవునివలె. పశ్యేత్=చూడవలయును. సుధీః=విద్వాంసుఁడు. తేన=ఆరాజుతో. వ్యళీకమ్=అసత్యమును. నవదేత్=చెప్పఁగూడదు॥ తా॥ రాజుసర్వదేవస్వరూపుఁడనిఋషులచేత చెప్పఁబడుచున్నాఁడు. కావున రాజునుదేవునివలెఁజూడవలయును. మఱియును, ఆరాజుతోఁ అసత్యమునుపలుకఁగూడదని తా॥ అనిశాస్త్రము చెప్పుచున్నదికనుక ఓరాజా! నేనునీతోఁ అసత్యమును చెప్పుచున్నవాఁడను కానని వినిపి ఆరాజుమరలనిట్లనియె. ఓబ్రాహ్మణుఁడా! ఇప్పుడే నీవిచ్చినఫలమువంటిఫలమును రాజపత్నియందుఁజూచితిని. అనినవిని ఆబ్రాహ్మణుఁడిట్లనియె. ఓరాజా! నేనిచ్చినఫలమును నీవు భుజించితివా లేదా? అనిన రాజిట్లనియె. ఓ బ్రాహ్మణుఁడా! నేను ఆఫలమునుభుజింపలేదు. నాకు ప్రియురాలును, భార్యయును, అయిన అనంగసేనయనుదానికిచ్చితిననియె. ఆమాటనువిని ఆబ్రాహ్మణుఁడు ఓ రాజేంద్రా నీవీవిషయమును నీభార్యనుపిలిచి అడుగుమనియె. అంతట నా రాజుతనభార్యనుపిలిచి ఆఫలముయొక్కసంగతిని వాస్తవముగఁ జెప్పుమనిన ఆయనంగసేన ఓరాజేంద్రా ఆఫలమును మందురికుఁడనువానికిచ్చితిననియె. అంతట నారాజుమందురికునిఁబిలిపించి నీకునాభార్యయిచ్చినఫలమును ఏమిచేసితివనినవిని ఆమందురికుఁడు నేనొకదాసికిచ్చితిననియె. అంతట ఆదాసిని పిలిపించి అడిగిన అదియొకగోపాలునకిచ్చితిననియె. అంతట నాగోపాలునిపిలిపించి అడిగిన నేనుగోమయమునుపోగుచేయునట్టి యొకస్త్రీకిచ్చితిననియె. ఈవృత్తాంతమును సర్వమునువిని ఆరాజుఅధికముగాదుఃఖమునుపొంది మిగులత్వరగా ఆపేడను మోసికొనిపోవుచున్నదానినిపిలిపించి ఆఫలమును తీసికొని యిట్లనితలఁచె. ఎట్లనిన;

శ్లో॥ రూపేమనోహారిణియౌవనేచవృథైవపుంసామభిమానబుద్ధిః। నతత్ స్త్రీవాంచేతసిచిత్తజన్మాకర్తుంయదేవేచ్ఛసితత్కరోతి॥

టీ॥ రూపే=రూపమునందును. మనోహారిణి= మనోహరమైన. యౌవనేచ=యౌవనమునందును. పుంసామ్= పురుషులకు. అభిమానబుద్ధిః=అభిమానబుద్ధి. వృథైవ=వ్యర్థముగానే. భవతి=అగుచున్నది. చిత్తజన్మా= మన్మథుఁ



డు. నతత్ స్త్రీవామ్=స్త్రీలయొక్క. చేతసి=చిత్తమునందు. యత్=దేనిని. కర్తుమ్=చేయుటకొఱకు. ఇచ్ఛతి=ఇచ్ఛయించుచున్నాఁడు. తదేవ=దానినే. కరోతి=చేయుచున్నాఁడు॥ తా॥ మనోహరమైనరూపమునందును, మనోహరమైనయౌవనమునందును, పురుషులకు వ్యర్థముగానే అభిమానబుద్ధికలుగుచున్నది. మన్మథుఁడు స్త్రీలయొక్కహృదయమునందు దేనినికోరుచున్నాఁడో దానినే చేయుచున్నాఁడని తా॥ ఆహా! స్త్రీలయొక్క చిత్తము స్త్రీలయొక్కచరిత్రము అనువానిని లోకములో నెవ్వఁడును తెలిసికొనలేడు. మఱియును,

శ్లో॥ అశ్వప్లుతంవాసవగర్జితంచ స్త్రీణాంచచిత్తం పురుషస్యభాగ్యం। అవర్షణంచాప్యతివర్షణంచ దేవోనజానాతికుతోమనుష్యః॥

టీ॥ అశ్వప్లుతమ్= గుఱ్ఱపుగురుకును. వాసవగర్జితంచ= మేఘధ్వనిని. స్త్రీణామ్=స్త్రీలయొక్క. చిత్తంచ=చిత్తమును. పురుషస్య = పురుషునియొక్క. భాగ్యంచ=భాగ్యమును. అవర్షణంచ= వర్షింపకపోవుటయును. అతివర్షణంచ= అధికముగావర్షించుటయును. దేవః=దేవుఁడు. నజానాతి= ఎఱుఁగఁడు. మనుష్యః=మనుష్యుఁడు. కుతః=ఎట్లు. జానాతి= తెలియుచున్నాఁడు॥ తా॥ గుఱ్ఱపుగురుకును, మేఘధ్వనిని, స్త్రీలయొక్కచిత్తమును, పురుషునిభాగ్యమును, వర్షింపకపోవుటయును, అధికముగావర్షించుటను దేవుఁడుకూడ ఎఱుఁగఁడు. దేవునకే తెలియకపోవుచుండఁగా మనుష్యునకెట్లు తెలియును. తెలియదని తాత్పర్యము. మఱియును,

శ్లో॥ గృహ్ణాతివిపినేవ్యాఘ్రం విహంగంగగనేస్థితం। సరిన్మధ్యగతంమీనం నస్త్రీణాంచపలమనః॥

టీ॥ పురుషః= పురుషుఁడు. విపినే=అరణ్యమునందు. వ్యాఘ్రమ్= పెద్దపులిని. గృహ్ణాతి=గ్రహించుచున్నాఁడు. గగనే=ఆకాశమునందు. స్థితమ్= ఉన్నటువంటి. విహంగమ్=పక్షిని. గృహ్ణాతి=గ్రహించుచున్నాఁడు. సరిన్మధ్యగతమ్= నదులయొక్కమధ్యమునందున్న. మీనమ్=చేపను. గృహ్ణాతి= గ్రహించుచున్నాఁడు. స్త్రీణామ్=స్త్రీలయొక్క. చపలమ్=చంచలమైన. మనః= మనస్సును. నగృహ్ణాతి=గ్రహింపజాలఁడు॥ తా॥ పురుషుఁడు అరణ్యమునందు పెద్దపులినిగ్రహించుచున్నాఁడు. ఆకాశమునందున్న పక్షినిగ్రహించుచున్నాఁడు. నదులమధ్యయందున్న చేపలనుగ్రహించుచున్నాఁడు. స్త్రీలయొక్కచపలమైనమనస్సును మాత్రము గ్రహింపఁజాలఁడని తా॥ మఱియును,

శ్లో॥ హీనభాగ్యస్యరాజ్యశ్రీః పుష్పశ్రీర్గగనస్యవా। భవేదేవనతు స్త్రీణాంమనశ్శుద్ధిర్మనాగపి॥

టీ॥ హీనభాగ్యస్య= దరిద్రునకు. రాజ్యశ్రీః= రాజ్యలక్ష్మియును. గగనస్య= ఆకాశమునకు. పుష్పశ్రీః= పుష్పసంపదయును. భవేదేవ= కలిగినను కలుగును. స్త్రీణామ్= స్త్రీలయొక్క. మనశ్శుద్ధిః= మనశ్శుద్ధి. మనాగపి= కొంచెమైనను. నభవేదేవ= కానేకాదు॥ తా॥ దరిద్రుడగువానికి రాజ్యలక్ష్మికలిగినను కలుగును. ఆకాశమునకు పుష్పసంపదకలిగినను కలుగును. కాని స్త్రీలకు మనశ్శుద్ధిమాత్ర మెన్నటికిని కలుగదని తా॥ మఱియును,

శ్లో॥ సుఖదుఃఖజయపరాజయజీవితమరణాని యేవిజానంతి। ముహ్యంతి తేపినూనం తత్త్వవిదశ్చాపిచేష్టితైస్స్త్రీణామ్॥

టీ॥ యేపి. తత్త్వవిదః= తత్త్వవేత్తలు. సుఖదుఃఖ...ణాని— సుఖ= సుఖమును. దుఃఖ= దుఃఖమును. జయ= జయమును. పరాజయ = పరాజయమును. జీవిత= ఆయుష్యమును. మరణాని= మరణమును. విజానంతి= తెలిసికొనుచున్నారో. తేపి= అటువంటివారుకూడ. స్త్రీణామ్= స్త్రీలయొక్క. చేష్టితైః= చేష్టలచేత. నూనమ్= నిశ్చయముగా. ముహ్యంతి= మోహమును చెందుచున్నారు॥ తా॥ ఏతత్త్వవేత్తలుసుఖము, దుఃఖము, జయము, పరాజయము, ఆయుష్యము, మరణము, అనువానిని తెలిసికొనుచున్నారో అటువంటి తత్త్వవేత్తలుకూడ స్త్రీలయొక్క చేష్టలచేత మోహమునుపొందుచున్నారని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ వినాయంత్రేణమంత్రేణతంత్రేణవినయేనచ। వంచయంతిన క్షణంనార్యః ప్రజ్ఞాఘనమపిక్షణాత్॥

టీ॥ నార్యః= స్త్రీలు. యంత్రేణ= యంత్రములేకయే. మంత్రేణవినా= మంత్రములేకయే. తంత్రేణవినా= తంత్రములేకయే. వినయేనచవినా= వినయములేకయే. ప్రజ్ఞాఘనమ్= ప్రజ్ఞయేధనముగాఁగల. నరమపి= మానవునిగూడ. క్షణాత్= క్షణములోపల. వంచయంతి= వంచించుచున్నారు॥ తా॥ స్త్రీలు యంత్రమంత్ర తంత్రవినయములులేకయే ప్రజ్ఞాధనముకలమానవునిగూడ క్షణములోపలవంచించుచున్నారని తా॥ మఱియును,

శ్లో॥ స్మరోపమమపిప్రాప్య వాంఛంతి పురుషాంతరం। నార్యస్సర్వాస్స్వభావేననోచ్యన్తేహ్యమలాశయాః॥

టీ॥ సర్వాః= సమస్తమైన. నార్యః= స్త్రీలు. స్మరోపమమపి= మన్మథునితోసమానుఁడైనవానినికూడ. ప్రాప్య= పొంది. పురుషాంతరమ్= మఱియొకపురుషుని. వాంఛంతి= కోరుచున్నారు. అపిచ= ఇంతియగాక. స్వభావేన= సహజముగా. అమలాశయాః= నిర్మలమైనస్వభావముకలవారు. (ఇతి= ఇట్లని.) నోచ్యన్తే= చెప్పఁబడుచుండుటలేదు॥ తా॥ స్త్రీలుమన్మథునకు సమానుఁడగు పురుషునిపొందియుండికూడ మఱియొకపురుషునికోరుచున్నారు. కాఁబట్టి స్త్రీలునిర్మలస్వభావముకలవారని చెప్పఁబడుట లేదని తా॥ మఱియును,



శ్లో॥ కులజాతిపరిభ్రష్టం నికృష్టందుష్టచేష్టితం। అస్పృశ్యమధమం ప్రాయోమన్యేస్త్రీణాంప్రియంవరమ్॥

టీ॥ స్త్రీణామ్= స్త్రీలకు. ప్రాయః= తరుచుగా. కులజాతిపరిభ్రష్టమ్= కులమువలననుజాతివలనను భ్రష్టుఁడును. నికృష్టమ్= నీచుఁడును. దుష్టచేష్టితమ్= దుష్టచేష్టలుకలవాఁడును. అస్పృశ్యమ్= స్పృశింపఁదగనివాఁడును. అధమమ్= అధముఁడును. (అయిన) మానవుని. ప్రియమ్= ఇష్టమైన. వరమ్= వరునిగా. మన్యే= తలఁచుచున్నాను॥ తా॥ కులముజాతిఅనునవిలేనివాఁడును, మిగులనీచుఁడును, దుష్టచేష్టలను చేయువాఁడును, స్పృశించుటకుఁదగనివాఁడును, అధముఁడును, అయినపురుషుఁడు స్త్రీలకుప్రియమైనభర్తయని తా॥ మఱియును,

శ్లో॥ గౌరవేషుప్రతిష్ఠాసుగుణేష్వారాధ్యకోటిషు। వృథైవహినిమజ్జంతిదోషపంకేస్వయంస్త్రియః॥

టీ॥ స్త్రియః= స్త్రీలు. గౌరవేషు= గౌరవములయందును. ప్రతిష్ఠాసు= ప్రతిష్ఠలయందును. గుణేషు= గుణములయందును. ఆరాధ్యకోటిషు= ఆరాధింపఁదగిన జనసముదాయమునందును. వృథైవహి= వ్యర్థముగానే. నిమజ్జంతి= మునుఁగుచున్నారు. దోషపంకే= దోషమనియెడుబురదయందు. స్వయమ్= సహజముగా. నిమజ్జంతి= మునుఁగుచున్నారు॥ తా॥ స్త్రీలుగౌరవములయందును, ప్రతిష్ఠలయందును, సుగుణములయందును, ఆరాధింపఁదగినమానవాదులయొక్క సముదాయములయందును, వ్యర్థముగా అభిమానముకలవారగుచున్నారు. దోషపంకమునందుమాత్రము స్వయముగామిగులఁ బ్రియముతోమునుఁగుచున్నారని తా॥ మఱియును,

శ్లో॥ ఏతాహసంతిచరుదంతిచవిత్తహేతోర్విశ్వాసయంతిచనరంనతువిశ్వసంతి। తస్మాన్నరేణకులశీలవతాసదైవనార్యశ్శ్మశానఘటికాఇవవర్జనీయాః॥

టీ॥ ఏతాః= ఈస్త్రీలు. విత్తహేతోః= ద్రవ్యముకొఱకు. హసంతిచ= నవ్వుచున్నారు. రుదంతిచ= రోదనమునుచేయుచున్నారు. నరమ్= మానవుని. విశ్వాసయంతి= నమ్మకముకలవానినిగాఁజేయుచున్నారు. నతువిశ్వసంతి= నమ్మరు. తస్మాత్= అందువలన. కులశీలవతా= సత్కులమును, సత్స్వ

భావమునుకల. నరేణ=మానవునిచేత. సదైవ=సర్వకాలములయందును. నార్యః= స్త్రీలు. శ్మశానమధుపాఇవ= శ్మశానమునందలిమద్యపానమునుచేయువారివలె. వర్జనీయాః=విడువదగినవారు॥ తా॥ ఈస్త్రీలు ద్రవ్యముకొఱకునవ్వుచున్నారు. రోదనమునుచేయుచున్నారు. మఱియును మానవుని నమ్మించి తాము నమ్మకములేనివారగుచున్నారు. కాబట్టి సత్కులమును, సత్స్వభావమునుకల మానవుఁడు సర్వకాలములయందును స్త్రీలనుశ్మశానమునందలి కటికవాండ్రను విడిచిపెట్టినట్లు విడువవలయునని తా॥ మఱియును,

శ్లో॥ నవైరాగ్యాత్పరంభాగ్యంనబోధాదపరంసుఖం। నహరేఃపరస్త్రాతా నసంసారాత్పరోరిపుః॥

టీ॥ వైరాగ్యాత్=వైరాగ్యముకంటె. పరమ్=శ్రేష్ఠమైన. భాగ్యమ్=భాగ్యము. న=లేదు. బోధాత్=జ్ఞానముకంటె. అపరమ్=అన్యమైన. సుఖమ్=సుఖము. న=లేదు. హరేః=నారాయణునికంటె. అపరః=అన్యుఁడు. త్రాతా=రక్షకుఁడు. న=లేదు. సంసారాత్=సంసారముకంటె. పరః= అన్యుఁడగు. రిపుః=శత్రువు. న=లేదు॥ తా॥ వైరాగ్యముకంటె నధికమైన భాగ్యములేదు. జ్ఞానముకంటెనధికమగుసుఖములేదు. నారాయణునికంటె రక్షకుఁడు వేరేలేదు. సంసారముకంటెశత్రువు వేరేలేదని తా॥ ఈవిధములగు ప్రామాణికవచనములను తలఁచుకొని భర్తృహరియనుపేరుగల ఆరాజశేఖరుఁడుకుమారుఁడగు విక్రమార్కునకు పట్టాభిషేకమును చేసి ఆఫలమును ఆవిక్రమార్కునకిచ్చి తానువనమునకుఁబోయెను. అంతటనావిక్రమార్కుఁడు రాజ్యభారమునుపొందినవాఁడై సకల భూమండలమును న్యాయముచేత పరిపాలనమును చేసెను. అట్లుండఁగా నొకనాఁడొకదిగంబరుఁడొకఁడు ఆరాజసమీపమునకువచ్చి॥

శ్లో॥ లీలయామండలీకృత్య భుజంగాన్ధారయన్హరః। దద్యాద్దేవో వరాహశ్చతుభ్యమభ్యధికాంశ్రియమ్॥

టీ॥ లీలయా=విలాసముచేత. మండలీకృత్య=మండలాకారమునుగాఁజేసి. భుజంగాన్=సర్పములను. ధారయన్=ధరించుచున్న. హరః= ఈశ్వరుఁడును. వరాహః=వరాహమనుపేరుకల. దేవశ్చ= దేవుఁడును. తుభ్యమ్=నీకొఱకు. అభ్యధికామ్=గొప్పదైన. శ్రియమ్=సంపదను. దద్యాత్= ఇచ్చుఁగాత॥ తా॥ విలాసముచేత మండలాకారమునుగాఁజేసి సర్పములనుధరించుచున్నశివుఁడును, వరాహావతారమునుపొందిన నారాయణుఁడును, నీకొఱకు అత్యధికమైనసంపదనుఇచ్చుఁగాకని తా॥ ఇట్లని ఆశీర్వచనమును చేసి



ఆవిక్రమార్కమహారాజుయొక్క హస్తమునందొకఫలమునుబెట్టి యిట్లనియె. ఓరాజా! నేను కృష్ణచతుర్దశినాఁడు మహాశ్మశానమునందు అఘోరమంత్రముచేత హోమమును చేయుచున్నాను. ఆహోమము సంపూర్తిని పొందునప్పుడు నీవుసాధకుఁడవై యుండవలసియున్నదనినవిని ఆవిక్రమార్కమహారాజు అట్లనేచేసెదననియె. అంతటనాదిగంబరుఁడు ఆవిక్రమార్కమహారాజుతోఁగూడ శ్మశానమునకుఁబోయెను. పోయినపిమ్మట ఆదిగంబరుఁడు ఆవిక్రమార్కమహారాజును జంపుటకారంభించి ఆరాజుచేత తానే చంపఁబడియె. ఆసమయమునందు ఆవిక్రమార్కమహారాజునకు భేతాళుఁడు స్వాధీనుఁడయ్యె. మఱియును, అణిమము, మహిమము, గరిమము, లఘిమము, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము, అనునట్టియెనిమిదివిధములగుసిద్ధులును కలిగె. అందువలన ఆవిక్రమార్కమహారాజుయొక్క కీర్తి ముల్లోకములయందును అనర్గళమైనగంగవలెఁ బ్రవహించుచుండెను. అట్టి కాలమునందు దేవతానగరమున రంభోర్వశులకు నర్తనవిద్యయందు వివాదముకలిగెను. ఆసమయమునందు ఆయిరువురియొక్కయు విద్యాతారతమ్యమును తెలిసికొనుటకు దేవతలలో నెవ్వఁడును సమర్థుఁడు కాకపోయె. అట్లుండఁగా, సింహాసనమునందుఁగూర్చున్న దేవేంద్రునితో నారదుఁడిట్లనియె. ఓదేవోత్తమా! మాలోకమునందువిక్రమార్కుఁడనునామధేయముకలరాజొకఁడుకలఁడు. అతఁడు సకలవిద్యలను చక్కఁగఁజదివినవాఁడు. ఇంతియగాక విశేషముగ సంగీతవిద్యయందు నేర్పుకలవాఁడు. కావున నతఁడు ఈరంభోర్వశులయొక్క విద్యావివాదనిర్ణయమును చేయుటకొఱకు సమర్థుఁడగును. అనినారదుఁడుచెప్పినవచనమునువిని దేవేంద్రుఁడు విక్రమార్కమహారాజును తీసికొనివచ్చుటకొఱకు మాతలినిపంపె. అంతట మాతలిరథమును తీసికొని విక్రమార్కమహారాజునొద్దకువచ్చె. వచ్చినపిమ్మట విక్రమార్కమహారాజు మాతలిచేత తీసికొనిరాఁబడిన రథమునెక్కి భేతాళునితోఁగూడ సుధర్మయనుపేరుకల దేవసభను ప్రవేశించి దేవేంద్రునిచేత గౌరవింపఁబడినవాఁడై ఉచితమైనసింహాసనముమీఁదనెక్కి కూర్చుండెను. అప్పుడు రంభోర్వశులు ఇరువురును నాట్యవిద్యనుచూపించుటకు ప్రారంభించిరి. అంతట కొంతసేపు వారినాట్యవిద్యను చక్కఁగఁబరిశీలించిచూచి నాట్యశాస్త్రరహస్యమును చక్కఁగఁదెలిసిన వాఁడగుటచేత ఆనాట్యశాస్త్రమునుగుఱించి కొంతసేపు ఉపన్యాసమును చేసి ఈయిరువురిలో ఊర్వశికొంచెమధికురాలనియె. అంతట దేవేంద్రుఁడు అధికముగాసంతోషించి మణులచేత చేయఁబడినయొకసిం

హాసనమును విక్రమార్క-మహారాజునకు బహుమానముగా నిచ్చె. ఆసింహాసనమునందు ముప్పది రెండు బొమ్మలు కలిగియుండె. ఆబొమ్మలశిరస్సుమీఁద పాదమును పెట్టి ఆసింహాసనముమీఁద ఎక్కఁదగినట్లు నిర్మింపఁబడియుండె. అట్టిసింహాసనమును బహుమానముగాఁ బుచ్చుకొని విక్రమార్క-మహారాజు దేవేంద్రునితో పోయివచ్చెదనని చెప్పి తననగరమునకు మరలవచ్చె. అట్లువచ్చినపిమ్మట నొకనాఁడు శుభకరమైన ముహూర్తమునందు బ్రాహ్మణాశీర్వాదమును పొందుచు ఆసింహాసనము నెక్కె. అంతట మరల నెప్పటియట్ల రాజ్యమును పాలించుచుండె. అట్లుండఁగా నొకనాఁడు కాలగతి మిగుల గొప్పదైయుండె. ఎట్లనఁగా వివరించి చెప్పెదను. ప్రతిష్ఠ అను పేరుకలయొక పట్టణమునందు ఒకకన్యకకు శాలివాహనుఁడను పేరుకల యొకకుమారుఁడు పుట్టె. ఆశాలివాహనుఁడు పుట్టినపుడు ఉజ్జయినీపట్టణమునందు అంతట భూకంపము కలిగె. ధూమకేతువు పుట్టె. దిగ్దాహము కలిగె. మఱియు ననేకములగు దుర్నిమిత్తములు కలిగె. ఆసమయమునందు విక్రమార్క-మహారాజు జ్యోతిష్కులను రప్పించి ఈభూకంపము మొదలుగాఁ గల యుత్పాతములకు ఫలమేమని అడిగె. అప్పుడా జ్యోతిష్కు లిట్లనిరి. ఓ రాజోత్తమా! ఈభూకంపము సాయంకాలమునందుఁ గలుగుటవలన రాజునకు నష్టము కలుగునని శాస్త్రమునందుఁ జెప్పఁబడెనది. మఱియు నటులనే నారదీయమునందు॥

శ్లో॥ అనిష్టదః క్షితీశానాం భూకంపస్సంధ్యయోర్ద్వయోః । రాజ్ఞాం వినాశపిశునో ధూమకేతురుదాహృతః॥

టీ॥ ద్వయోః= రెండగు. సంధ్యయోః= సంధ్యలయందు. భూకంపః= భూకంపము. భవేద్యది= అయ్యెనేని. క్షితీశానామ్= రాజులకు. అనిష్టదః= అనిష్టము నిచ్చునట్టిది. భవతి= అగుచున్నది. ధూమకేతుః = ధూమకేతువు. రాజ్ఞామ్= రాజులకు. వినాశపిశునః= నాశమును సూచించునట్టిది. ఇతి= ఇట్లని. ఉదాహృతః= చెప్పఁబడినది॥ తా॥ ప్రాతర్మధ్యాహ్న సంధ్యాకాలములయందు భూకంపము కలిగెనేని రాజులకు నాశము కలుగును. ధూమకేతువు రాజులకు నాశమును సూచనము చేయుచున్నదని తా॥ అని నారదీయమను గ్రంథమునందుఁ జెప్పఁబడియె. అని దైవజ్ఞులు చెప్పినమాటను విని ఆవిక్రమార్క-మహారాజిట్లనియె. ఓ జ్యోతిష్కులారా! పూర్వమునందొకనాఁడు పరమేశ్వరుఁడు నా తపస్సుచేత సంతోషమును పొంది నాతో నిట్లనియె. ఓ విక్రమార్క-మహారాజా! నీతపస్సునకు సంతోషమును పొందితిని. అమరత్వమును తప్పఁ దక్కిన వరములను కోరుమనిన విని నేను ఆపరమేశ్వరునితో నిట్లు చెప్పితిని. ఓ మహా



దేవా! నేను రెండున్నర సంవత్సరముల వయస్సుకల కన్యకయందు పుట్టిన పుత్రునివలన మరణమును పొందునట్లు అనుగ్రహింపుమనిన విని ఆమహాదేవుఁడు అటులనే జరుగునని చెప్పి అంతర్హితుఁడై పోయెనని విక్రమార్క-మహారాజు చెప్పిన వాక్యమును విని ఆజ్యోతిష్కులు అటులనే రెండున్నర సంవత్సరముల వయస్సుకల కన్యయందొక పుత్రుఁడు ఎక్కడనో పుట్టియున్నాఁడని చెప్పిరి. ఆవచనమును విని విక్రమార్క-మహారాజు ఆహా దైవసృష్టి యెంత విచిత్రమైనది. అటువంటి పుత్రుఁడు ఏదేశమునందు పుట్టియుండునో యని వ్యాకులమైన మనస్సుకలవాఁడై భేతాళుని పిలిచి యీవృత్తాంతమును సర్వమును భేతాళునకుఁ జెప్పి యిట్లనియె. ఓ యక్షుఁడా! భూమియంతటను తిరిగి ఇటువంటి పుత్రుఁడు ఏదేశమునందు ఏపట్టణమునందుఁ బుట్టెనో తెలిసికొని అతిశీఘ్రముగ రమ్మనియె. ఆమాటను విని భేతాళుఁడు మహాప్రసాదము స్వామీ! అని చెప్పి నాలుగు సముద్రములలోపల నున్న భూమిని సర్వమును పర్వతారణ్య నగరాదులయందంతటను వెదకి ప్రతిష్ఠానగరమునందుఁ బ్రవేశించి ఒకానొక కుమ్మరవాని గృహమునందు ఆడుకొనుచున్న ఎనిమిదేండ్లకులోబడిన ఒకచిన్నవానిని ఒకకన్యకను చూచి యిట్లనియె. ఓ బాలులారా! మీ రెవరనియె. ఆమాటను విని ఆయిరువురిలో కన్యక యిట్లనియె. ఓ మానవోత్తమా! ఈబాలుఁడు నాపుత్రుఁడు. అనిన భేతాళుఁడు మరల నిట్లనియె. ఓకన్యకా! నీకు తండ్రి ఎవ్వఁడనిన ఆకన్యక ఒకబ్రాహ్మణుని జూపించె. అంతట నాభేతాళుఁడు ఆబ్రాహ్మణునొద్దకుఁ బోయి ఓ బ్రాహ్మణోత్తమా! నీకు ఆడుకొనుచున్న ఆయిరువురును పుత్రియును మనుమఁడును అని చెప్పఁగా వింటిని. అది మొదలుకొని నాకు మిగుల నాశ్చర్యము గనుచున్నది. ఈవృత్తాంతమును సర్వమును తెలియఁజెప్పుమనిన ఆబ్రాహ్మణుఁడిట్లనియె. ఓ మానవోత్తమా! దేవతలయొక్క చరిత్రము అగోచరమైనది. అయినను జరిగినవృత్తాంతమును తెలియఁజేసెదను వినుము. ఈకన్యకయొక్క రూపలావణ్యాదులను చూచి ఆదిశేషుఁడగు నాగేంద్రుఁడు మోహమును చెందినవాఁడై ఈకన్యకను పొందె. అందువలన ఈపుత్రుఁడు బుట్టె. ఇతనికి శాలివాహనుఁడని పేరు అనిన విని భేతాళుఁడు అతిశీఘ్రముగ బయలువెడలివచ్చి ఆవృత్తాంతమును సర్వమును విక్రమార్క-మహారాజునకు తెలియఁజెప్పె. ఆవృత్తాంతమును సర్వమును విని విక్రమార్క-మహారాజు ఆభేతాళునకు బహుమానమును చేసి ఖడ్గమును చేతఁబట్టుకొని ప్రతిష్ఠానగరమునకుఁ బోయె. పోయి శాలివాహనునిమీఁద ఖడ్గమును ప్రయోగించుటకు యత్నించె. అంతలోపల ఆశాలివాహనుఁడు ఖడ్గమును ప్రయోగించి ఆవిక్రమార్క-మహారాజును ఖండించె.

అట్లు ఉంకించి ఆవిక్రమార్కమహారాజుయొక్క మొండెములు ఉజ్జయినీపట్టణమునందుఁబడవైచెను. అట్లు విక్రమార్కమహారాజు ఉజ్జయినీపట్టణమునందుంచబడి వేదనను సహింపఁజాలక ప్రాణములను విడిచెను. ఆసమయమునందు విక్రమార్కమహారాజుయొక్క మంత్రులిట్లు ఆలోచించిరి. ఈవిక్రమార్కమహారాజు పుత్రరహితుఁడై మరణమును పొందెను. కావున మిప్పుడు చేయఁదగినపని యేమని ఆలోచించిరి. ఆసమయమునందు భట్టియనువాఁడిట్లనియె. ఓమంత్రులారా! చక్కఁగ నాలోచింపుఁడు. ఈవిక్రమార్కమహారాజుయొక్క భార్యలలోపల ఒకానొకతె గర్భవతియై యుండవచ్చునని యె. అంతట నామంత్రులందఱును చక్కఁగ నాలోచింపఁగా ఆరాజుభార్యలలోనొకతె యేడు మాసముల గర్భముకలదై యుండెను. ఆసమయమునందు మంత్రులందఱును చక్కఁగ నాలోచించి ఆగర్భమునకు పట్టాభిషేకమును చేసి తామే అనఁగా ఆమంత్రులే రాజ్యమును పరిపాలించిరి. ఆసమయమునందు దేవేంద్రునిచేతఁ ఇయ్యఁబడిన సింహాసనము శూన్యమైనదై యుండెను. ఆసమయమునందు ఆసభామధ్యమున ఒకానొక అశరీరవాణి యిట్లనియె. ఓ మంత్రులారా! ఈసింహాసనమునందు కూర్చుండఁబెట్టుటకు విక్రమార్కమహారాజువంటి రాజెవ్వఁడును లేఁడు. కాఁబట్టి ఓమంత్రులారా! ఈసింహాసనమును చక్కఁగ ఫలించునట్టి భూమియందుఁ బాతిపెట్టుఁడనియె. ఆమాటను విని మంత్రులందఱును మిగులఁ బవిత్రమైన యొకానొక క్షేత్రమునందు పాతిపెట్టి ఆక్షేత్రమునందు జొన్నమొదలుగాఁగల పైరులను పెట్టి ఆపైరుపంటకు వచ్చేసమయమునందాభూమిని ఒకబ్రాహ్మణునకు దానము చేసిరి. అంతట ఆబ్రాహ్మణుఁడును అధికానందమును పొంది సింహాసనము పాతిపెట్టియున్నచోటు మిట్టగానున్నదని తలఁచి ఆచోట మంచమును వైచి ఆమంచమునెక్కి పక్షులను తోలుకొనుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁడా మార్గమున భోజరాజు పోవుచుండెను. ఆసమయమునందా మంచమునెక్కియున్న బ్రాహ్మణుఁడు మార్గమునఁ బోవుచున్న రాజును పిలిచి యిట్లనియె. ఓమహారాజా! ఈక్షేత్రము చక్కఁగా ఫలించియున్నది కావున నీవు నీసైన్యముతోఁగూడ ఈచేనియందు ప్రవేశించి యీజొన్నకంకులను యథేచ్ఛముగా భుజించి గుఱ్ఱములకు శనగలను పెట్టుకొని పొమ్ము. నీయట్టి మహానుభావుఁడు అతిథియై వచ్చుటచేత నా జన్మము సఫలమయ్యె. ఇటువంటి అతిథి నాకెన్నఁడును దొరికి యుండలేదనిన విని ఆభోజమహారాజు తనసైన్యముతోఁగూడ క్షేత్రమునందుఁ బ్రవేశించెను. ఆసమయమునందు బ్రాహ్మణుఁడు పక్షులను తోలుటకొఱకు మంచమును దిగెను. అట్లు దిగి చేనుమధ్యయం



దుఁ బ్రవేశించియున్న రాజునుచూచి మిగుల భయముకలవాఁడై యిట్లనియె. ఓ రాజా! ఏమిది? అన్యాయము చేయుచున్నావే? ఇది బ్రాహ్మణునిసొమ్ము. దీనియందుఁ బ్రవేశించి నాశమును చేయుచున్నావు. ఇట్లు చేయఁ దగునా? ఇతరులు అన్యాయమును చేసినయెడల నీవు శిక్షింపఁదగినవాఁడవు. లోకులను శిక్షింపఁదగిన నీవే యిట్లు అన్యాయమును చేయుటకు ప్రవర్తించినయెడల నిన్నెవ్వఁడు శిక్షింపఁగలఁడు. మఱియు నోరాజోత్తమా!

శ్లో॥ గజేకడంగరీయేతు జారేరాజనివాళ్ళునః । పాపకృత్సుచవిద్వత్సు నియంతాజంతురత్రకః॥

టీ॥ గజే= ఏనుఁగు. కడంగరీయేసతి= ఊచుకను తినుటకు బయలువెడలినదగుచుండఁగా. రాజనివాళ్ళనః= రాజు. జారిణిసతి= జారుఁడగుచుండఁగా. విద్వత్సు= విద్వాంసులు. పాపకృత్సుచ= పాపమును చేసినవారగుచునుండఁగా. అత్ర= ఈవిషయమునందు. నియంతా= నియామకుఁడైన. జంతుః= జంతువు. కః= ఎవ్వఁడు॥ తా॥ ఏనుఁగు ఊచుకను తినుటకు ప్రారంభించినను, రాజగువాఁడు జారకృత్యమును చేయుటకు యత్నించినను, విద్వాంసులు పాపమును చేయుటకు ప్రారంభించినను వీరలను నియమించునట్టివాఁడు అనఁగా అడ్డుపరచువాఁడెవ్వఁడు కలఁడని తా॥ అను న్యాయానుసారముగ ఆలోచింపఁగా శాస్త్రాభిజ్ఞుఁడవైన నీవు బ్రాహ్మణద్రవ్యమును అపహరించుటకు యత్నించినయెడల నిన్ను అడ్డుపరచువాఁడెవ్వఁడు కలఁడు. మఱియును, సకలశాస్త్రములను చదివిన నీవు బ్రాహ్మణద్రవ్యము నెట్లు హరించుచున్నావు. మఱియును,

శ్లో॥ నవిషంవిషమిత్యాహుర్బ్రహ్మస్వంవిషముచ్యతే। విషమేకాకినంహంతి బ్రహ్మస్వంపుత్రపౌత్రకమ్॥

టీ॥ విషమ్= విషము. నవిషమ్= విషము కాదు. ఇతి= ఇట్లని. ఆర్యాః= పూజ్యులు. ఆహుః= చెప్పుచున్నారు. బ్రహ్మస్వమ్= బ్రాహ్మణద్రవ్యము. విషమ్= విషము. ఇతి= ఇట్లని. ఉచ్యతే= చెప్పఁబడుచున్నది. విషమ్= విషము. ఏకాకినమ్= ఒకనిని. హంతి= చంపుచున్నది. బ్రహ్మస్వమ్= బ్రాహ్మణద్రవ్యము. పుత్రపౌత్రకమ్= పుత్రులను పౌత్రులను. హంతి= చంపుచున్నది॥ తా॥ విషము విషము కాదనియును, బ్రాహ్మణద్రవ్యము విషమనియును చెప్పుచున్నారు. విషము ఒకనిని మాత్రము చంపును. బ్రాహ్మణద్రవ్యము పుత్రులను పౌత్రులనుకూడ నశింపఁజేయునని తా॥ అను న్యాయానుసారముగ బ్రాహ్మణద్రవ్యము అధికమైన విషమని చెప్పఁబడుచున్నదిగదా? అని చెప్పినమాటను విని ఆ

భోజమహారాజు తనపరివారజనముతోఁగూడ ఆచేనిని విడిచిపెట్టి పోవుచుండె. అంతలోపల మరల నాబ్రాహ్మణుఁడు మంచమీదికెక్కి యిట్లనియె. ఓ రాజోత్తమా! నీవెందుకు పోవుచున్నావు. ఈక్షేత్రము చక్కఁగ ఫలించియుండుటను చూచితివా? ఈజొన్నబియ్యమును, భుజించి శనగలను గుఱ్ఱములకుఁ బెట్టుకొని పొండు. మఱియును దోసపండ్లను యథేచ్ఛముగ భుజించి పొండనియె. ఆమాటను విని భోజమహారాజు మరల సైన్యముతోఁగూడ ఆచేనియందుఁ బ్రవేశించుటకు యత్నించె. అంతలోపల మరల నాబ్రాహ్మణుఁడు మంచముమీదనుండి దిగి మునుపటివలెనే రాజుతో అన్యాయమును చేసితివనియె. అంతట ఆభోజమహారాజు తనమనస్సునం దిట్లని యాలోచించె. ఆహా! ఇది మిగుల నాశ్చర్యముగనున్నది. యీబ్రాహ్మణుఁడు మంచముమీద నెక్కినప్పుడు దానమును చేయవలయునని యిష్టము కలవాఁడగుచున్నాఁడు. మంచముమీదనుండి దిగగానే దీనబుద్ధి కలవాఁడగుచున్నాఁడు. కాఁబట్టి నేనీమంచముపైనెక్కి యీవిషయమును పరిశీలించెదనని తలఁచి ఆమంచముపైనెక్కె. ఆసమయమునందు భోజమహారాజుయొక్క చిత్తమునందు ప్రపంచముయొక్క దుఃఖము సర్వమును పోఁగొట్టఁదగినదనియును, లోకమునకు దారిద్ర్యము లేకుండునట్లు చేయవలసినదనియును, దుష్టులు దండింపఁదగినవారనియును, శిష్టులు పరిపాలింపఁదగినవారనియును, ప్రజలు ధర్మమును తప్పక పరిపాలింపఁదగినవారనియును తలంపుకలిగె. మఱియును, విశేషముగ ఆసమయమునందు ప్రాణమును కోరినను ఇచ్చుటకు ఇష్టము కలవాఁడైయుండె. అంతట నా భోజమహారాజు పరమానందము కలవాఁడై మరల నిట్లని యాలోచించె. ఇది యీక్షేత్రముయొక్క మాహాత్మ్యమైయుండునని తోఁచుచున్నది. కావున నేఇటువంటిబుద్ధిః పుట్టించుచున్నది. మఱియును,

శ్లో॥ జలే తైలం ఖలే గుహ్యం పాత్రే దానం మనాగపి। ప్రజ్ఞాదానం
స్వయం యాతి విస్తారం వస్తు రక్షితమ్॥

టీ॥ జలే=ఉదకమునందు. తైలమ్=తైలము. ఖలే=దుర్మార్గునియందు. గుహ్యం=రహస్యము. పాత్రే=తగినవానియందు. దానమ్=దానము. ప్రజ్ఞాదానమ్=ప్రజ్ఞాదానము. మనాగపి=కొంచెమైనను. రక్షితమ్=రక్షింపఁబడిన. వస్తు=వస్తువు. స్వయమ్=సహజముగా. విస్తారమ్=విస్తారమును. యాతి=పొందుచున్నది॥ తా॥ ఉదకమునందు తైలమును వైచినను, దుర్మార్గునియందు రహస్యమునుంచినను, మంచివానియందు దానమును పయోగించినను, ప్రజ్ఞాదానమును, కొంచెమైనను మిగుల విస్తారముగ వ్యాపించునని తా॥ కావున దీని



వాస్తవము తెలియుట మిగులఁ గష్టతరమైయున్నదని ఆలోచించి మఱియు నిట్లని తలఁచె. ఈక్షేత్రముయొక్క మాహాత్మ్యమెట్లు తెలియఁబడునని ఆలోచించి ఆబ్రాహ్మణుని పిలిచి యిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! నీకీక్షేత్రమునందు ఎంతమాత్రము లాభము కలుగుచున్నదనిన ఆబ్రాహ్మణుఁడిట్లనియె. ఓరాజోత్తమా! నీవు సకలమును తెలిసినవాఁడవు. నీకుఁ దెలియనిది యేమికలదు. నీకు ఏది తగునని తోఁచుచున్నదో దానిని నీవే ఆలోచింపుము. మఱియును, రాజనఁగా, రాజగువాఁడు విష్ణుదేవునియొక్క అవతారభూతుఁడు. కావున రాజుయొక్క కటాక్షములు ఎవనిమీఁదఁ బడుచున్నవో అతనికి దైన్యదుర్భిక్షాదులుండవు. కాఁబట్టి యిప్పుడు నాదారిద్ర్యమును తొలఁగింపుము. ఈక్షేత్రమెంతమాత్రమనిన విని ఆభోజమహారాజు బ్రాహ్మణునకనేకవిధములుగా ధనధాన్యాదికము నిచ్చి గౌరవించి ఆక్షేత్రమును కైకొని ఆమంచముక్రిందఁ ద్రవ్వించె. అట్లు త్రవ్వుచుండఁగా పురుషప్రమాణము త్రవ్వఁగానే మనోహరమైన యొక్క శిలకనఁబడియె. ఆశిలయొక్క క్రిందప్రదేశమునందు ఒకానొక చంద్రకాంతశిలకనఁబడియె. అంతట నానావిధరత్నములచేత ఖచితమైనదియును, ముప్పదిరెండుబొమ్మలతోఁగూడుకొనియున్నదియును, మిగుల మనోహరమైనదియును, అయినయొక సింహాసనము కనఁబడియె. అప్పుడు భోజమహారాజు పరమానందామృతప్రవాహముచేత పరిపూర్ణమైన హృదయము కలవాఁడై ఆసింహాసనమును తననగరమునకు తీసికొనిపోవుటకు ప్రయత్నమును చేసె. ఆసమయమునందాసింహాసనము ఎందరెత్తినను కదలకయుండె. అప్పుడా భోజమహారాజుయొక్క మంత్రిపుంగవులలో నొకఁడిట్లనియె. ఓరాజోత్తమా! ఇది దివ్యమైన సింహాసనము. కావున బలిపూజాదికములు లేక యీసింహాసనము చలింపదు. కాఁబట్టి బలిపూజాదికమును చేయుమనిన విని బ్రాహ్మణులను రప్పించి బలిపూజాదికమును సర్వమును విధ్యుక్తప్రకారముగఁ జేసె. అంతట ఆసింహాసనము మిగుల లఘువైయుండి స్వయముగా నే చలించె. అట్లగుటను చూచి భోజమహారాజు మంత్రితో నిట్లనియె. ఓమంత్రిపుంగవా! లోకములో నెవ్వఁడు అనర్థమును పోఁగొట్టుచున్నాఁడో ఎవ్వఁడు అలభ్యమగు నర్థమును సంపాదించుచున్నాఁడో అట్టివాఁడు మంత్రియని చెప్పఁబడును. మఱియు నిటులనే,

శ్లో॥ స్థితస్య కార్యస్య సముద్భవార్థమనర్థకార్యప్రతిఘాతనార్థం। ఆ
గామినోర్థస్య చ సంగ్రహార్థం యో మంత్రకృత్సా హృత్పరమస్స మంత్రీ॥

టీ॥ స్థితస్య=ఉన్నటువంటి. కార్యస్య=కార్యముయొక్క. సముద్భ

వార్థమ్= ఉత్పత్తికొఱకును. అనర్థకార్యప్రతిఘాతనార్థమ్= అనిష్టకార్యమును తొలఁగించుటకొఱకును. ఆగామినః= రాఁబోవునట్టి. అర్థస్యచ=అర్థముయొక్క. సంగ్రహార్థమ్= సంగ్రహముకొఱకును. యః= ఎవ్వఁడు. మంత్రకృత్= ఆలోచించువాఁడో. సః=వాఁడు. పరమః=ఉత్కృష్టుఁడైన. మంత్రీ=ప్రధాని. భవతి=అగుచున్నాఁడు॥ తా॥ ఉన్నదానికి కాపాడుటకొఱకును, అనర్థములనుపోఁగొట్టుటకొఱకును, రాఁబోవునట్టిదానిని సంపాదించుటకొఱకును ఎవ్వఁడు తెలిసియుండునో వాఁడు శ్రేష్ఠుఁడగుమంత్రియనితా॥ అనిప్రమాణవచనముకూడ కలిగియున్నదనినవిని ఆమంత్రిపుంగవుఁ డిట్లనియె. మఱియును,

శ్లో॥ మంత్రః కార్యానుగో యేషాం కార్యంస్వామి హితానుగమ్।
తఏ తేమంత్రిణో రాజ్ఞాంనతు యేగతపల్లవాః॥

టీ॥ యేషామ్= ఏమంత్రులయొక్క. మంత్రః=ఆలోచన. కార్యానుగః=కార్యమునను సరించినదో. కార్యమ్=కార్యము. స్వామిహితానుగమ్=రాజుయొక్క-హితమును పొందియున్నదో. తఏతే= ఆటువంటివారు. రాజ్ఞామ్=రాజులకు. మంత్రిణః=మంత్రులు. యే=ఎవరు. గతపల్లవాః= పోయిన జ్ఞానవేశముకలవారో. తే=అట్టివారు. మంత్రిణః=మంత్రులు. న=కారు॥ తా॥ ఎవరియొక్క-ఆలోచన కార్యమునను సరించియుండునో కార్యము స్వామిహితమైనదై యుండునో అటువంటి, వారేమంత్రులు గాని జ్ఞానవేశముకూడ లేనివారు మంత్రులుకారని తా॥ అనుప్రమాణానుసారముగ ప్రభువులకు హితమును కోరువారే మంత్రులని చెప్పఁబడుదురు——మఱియును, మంత్రిలేని రాజ్యము, ధాన్యములేనిదుర్గము, కారుణ్యములేని సౌభాగ్యము, జ్ఞానములేని వైరాగ్యము, దుర్జనుల సామర్థ్యము, పాషండులయొక్క-బుద్ధి, వైశ్యులయొక్క-విశ్వాసము, రాక్షసులయొక్క-ప్రియము, తస్కరులయొక్క-యుక్తియును, దుర్జనులయొక్క-మైత్రియు, పరాధీనమైనవానియొక్క-స్వాతంత్ర్యము, నిర్ధనునియొక్క-ఆటోపము, సేవకునియొక్క-కోపము, ప్రభువుయొక్క-స్నేహము, కృపణునియొక్క-గృహము, జారస్త్రీయొక్క-పతిభక్తియును, మూర్ఖులయొక్క-సాంగత్యము, అనునవిఅన్నియును నిష్ఫలములు. మఱియునో రాజోత్తమా! రాజగువాఁడు మహాత్ములను పూజింపవలయును. ఆప్తులయొక్క-బుద్ధినివినవలయును. దేవబ్రాహ్మణులను పరిపాలింపవలయును. న్యాయమార్గమునందు ప్రవర్తింపవలయును. ఓరాజోత్తమా! ఈసద్గుణములన్నియును నీయందుఁగలిగియున్నవి. అందువలన నీవు సకలరాజులలోపలను త్తముఁడవు. మఱి



త్రియగువాఁడుకూడ ఇటులనేమంచిగుణములు కలిగియుండవలయును. ఎల్లినిమంత్రియొక్క-ప్రయత్నము ప్రభువునకు హితమును చేయుటయే ముఖ్యప్రయోజనముగాఁగలదై యుండవలయును. పాపమువలన భయమును పొందవలయును. ప్రజలకుహితమును చేయవలయును. పరివారజనులకు సంయోజనమును చేయవలయును. రాజుయొక్క-చిత్తవృత్తిననుసరింపవలయును. సమయమునకుతగినట్లు ప్రజ్ఞానముకలిగియుండవలయును. అపాయకార్యమునుండి రాజునుతొలిగింపవలయును. ఇటువంటిసుగుణములుకలవాఁడును, కులక్రమానుసారముగ వచ్చినవాఁడును, కామందకచాణక్యధౌమ్యబృహస్పతులచేతఁజేయఁబడిన నీతిశాస్త్రమును సంపూర్ణముగఁ దెలిసినవాఁడును, అగువాఁడుమంత్రిపదమునకు తగినవాఁడగుచున్నాఁడు. మఱియు నో రాజోత్తమా! పూర్వము నందభూపాలుఁడను రాజు సకలశాస్త్రసంపన్నుఁడైనమంత్రిచేత బ్రహ్మహత్యనుండి నివారింపఁబడెననినవిని ఆభోజమహారాజు ఆకథనువివరించిచెప్పుమనిన ఆమంత్రిపుంగవుఁడిట్లనియె. ఓరాజోత్తమా! చెప్పెదను. వినుము. విశాలనగరమునందు నందుఁడనియెడు రాజుకలఁడు. అతఁడుమహాశౌర్యసంపన్నుఁడైయుండె. అతఁడు తనబలముచేత శత్రురాజులను తనదుపాదపద్మములయందుఁబడి జీవించువారలనుగాఁజేసి యేకచ్ఛత్రాధిపత్యముతో రాజ్యమును చేసె. ఆనందమహారాజునకు సకలశాస్త్రసంపన్నుఁడైన మంత్రియొకఁడుకలఁడు. అతనికి భానుమతియనుభార్యకలదు. జయపాలుఁడనియెడుపుత్రుఁడుకలఁడు. ఆనందమహారాజునకు ఆభానుమతియందు అత్యధికమైనప్రీతికలిగియుండె. కావున నతఁడు సింహాసనమునందు భార్యతోఁగూడఁ గూర్చుండి రాజ్యమును పాలించుచుండును. మఱియును, క్షణముసేపైనను భార్యనువదలియుండువాఁడుకాఁడు. ఇట్లుండఁగా ఆమంత్రి యొకనాఁడు తనమనస్సునందిట్లనియాలోచించె. ఆహా ఈరాజుసిగ్గులేనివాఁడై సభయందుసింహాసనముమీఁద భార్యనుకూర్చుండఁబెట్టుకొని రాజ్యమును పాలించుచున్నాఁడు. ఆసమయమునందు అందఱును ఆమెనుచూచుచున్నారు. ఇతఁడీపనియుచితమైనదికాదనియెఱుఁగఁడు. మఱియును,

శ్లో॥ కిముకువలయనేత్రాస్సంతినో దేవలోకే త్రిదివపతిరహల్యాం
తాపసీంయత్సిషేవే। హృదయవసకుటీరందహ్యమానస్స్మరాగ్నా వుచితమనుచితంవావేత్తినోపండితోపి॥

టీ॥ దేవలోకే= దేవలోకమునందు. కువలయనేత్రాః = పద్మపత్రములవంటి నేత్రములుకలస్త్రీలు. నోసంతికిము=లేరాయేమి? త్రిదివపతిః=

ఇంద్రుఁడు. యత్= ఏ హేతువువలన. తాపసీమ్= తపోవంతురాలగు. అహల్యామ్= అహల్యను. సిషేవే= సేవించెనో. తత్= ఆ హేతువువలన. స్మరాగ్నౌ= మన్మథాగ్నియందు హృదయవసకుటీరమ్= హృదయమనియెడు వాసకుటీరమును. దగ్ధుకామః= తగులఁబెట్టవలయునని యెడు కోరికకల. పండితోపి= పండితుఁడును. ఉచితంవా= ఉచితమునైనను. అనుచితంవా= అనుచితమునైనను. నోవేత్తి= ఎఱుఁగఁడు॥ తా॥ దేవలోకమునందు పద్మపత్రములవంటి నేత్రములుకల స్త్రీలు అనేకులు కలిగియుండఁగా, ఇంద్రుఁడు తపోవంతురాలయిన అహల్యనుపొందుటనుపట్టి ఆలోచింపఁగా మన్మథాగ్నియందు హృదయమనియెడు వాసకుటీరమును తగులఁబెట్టవలయునని యెడు కోరికకల పండితుఁడుకూడ ఉచితానుచితములను తెలియఁడని తా॥ మఱియును, స్త్రీలయొక్క కటాక్షములుమీద పడువఱకును ధైర్యప్రతిష్ఠలుకలవాఁడైయుండునుగాని స్త్రీలయొక్క కటాక్షములుమీద పడినపిమ్మట ధైర్యప్రతిష్ఠ లుండవు. మఱియును,

శ్లో॥ తావద్ధత్తే ప్రతిష్ఠాంశమయతిచమనశ్చాపలం తావదార్యస్తావత్సిద్ధాంతమాత్రంస్ఫురతిహృదిపరంసర్వలోకైకదీపం। కాళిందీపూరదీవ్యత్కువలయకలితోద్దామదామాభిరామైర్యావన్నో హన్యమానంకలయతిహృదయంకామినీనాంకటాక్షైః॥

టీ॥ యావత్= ఎంతపర్యంతము. కామినీనామ్= స్త్రీలయొక్క. కాళిందీ..రామైః= కాళిందీపూర= కాళిందీనదియొక్క ప్రవాహమునందు. దీవ్యత్= ప్రకాశించుచున్న. కువలయ= నల్లకలువలయొక్క. కలిత= ఒప్పుచున్న. ఉద్దామదామ= అధికములయినమాలికలవలె. అభిరామైః= మనోహరములయిన. కటాక్షైః= క్రీఁగంటిప్రసారములచేత. హృదయమ్= హృదయము. హన్యమానమ్= కొట్టఁబడినదగుచు. నోకలయతి= వ్యాకులతనుపొందదో. తావత్= అంతపర్యంతమును. ఆర్యః= పూజ్యుఁడగువాఁడు. ప్రతిష్ఠామ్= ప్రతిష్ఠను. ధత్తే= ధరించుచున్నాఁడు. తావత్= అంతపర్యంతమును. మనశ్చాపలమ్= మనశ్చాంచల్యము, శమయతి= శాంతినిపొందుచున్నది. తావత్= అంతపర్యంతమును. హృది= హృదయమునందు. పరమ్= సర్వోత్తమమైనదియును. సర్వలోకైకదీపమ్ = సకలలోకములను ప్రకాశింపఁజేయునట్టిదియును. (అయిన) సిద్ధాంతమాత్రమ్= సిద్ధాంతమాత్రము. స్ఫురతి= ప్రకాశించుచున్నది॥ తా॥ కాళిందీనదియొక్క ప్రవాహమునందు ప్రకాశించుచున్న నల్లకలువలయొక్క మాలికలవలె మనోహరములయిన స్త్రీలయొక్క



క్రీఁగంటిప్రసారములచేత హృదయము కొట్టఁబడినదై యెంతకాలముదనుక వ్యాకులతనుపొందకయుండునో అంతపర్యంతమును ఆర్యుఁడగువాఁడు ప్రతిష్ఠనుధరించుచున్నాఁడు. మఱియును, అంతపర్యంతమును మనశ్చాంచల్యము శాంతిఁబొందియుండును. మఱియును, సర్వలోకములను ప్రకాశింపఁజేయునట్టిసిద్ధాంతములు హృదయమునందు స్ఫురించుచుండునని తా॥ అహా! మన్మథుని మాహాత్మ్యమునేమనిచెప్పవచ్చును. సకలకలాకోవిదుఁడుకూడ మన్మథుని మాహాత్మ్యముచేత మోహమునుపొందుచున్నాఁడు. ఎట్లనిన॥

శ్లో॥ వికలయతికలాకుశలంహసతిశుచింపండితంవిదూషయతి। అర్దయతిధీరపురుషంక్షణేనమకరధ్వజో దేవః॥

టీ॥ మకరధ్వజః= మన్మథుఁడనియెడు. దేవః= దేవుఁడు. క్షణేన= క్షణమాత్రముచేత. భృశమ్= అధికముగా. కలాకుశలమ్= విద్యచేతకుశలుఁడగువానిని. వికలయతి= వికలతకలవానినిగాఁజేయుచున్నాఁడు. శుచిమ్= పరిశుద్ధునికూడ. హసతి= నవ్వుచున్నాఁడు. పండితమ్= పండితుని. విదూషయతి= నిందించుచున్నాఁడు. ధీరపురుషమ్= ధైర్యముకలపురుషుని. అర్దయతి= పీడించుచున్నాఁడు॥ తా॥ మన్మథుఁడనియెడు దేవుఁడు క్షణములోపల సకలకలాకోవిదునికూడ అధికముగా వికలతనుపొందించుచున్నాఁడు. పరిశుద్ధునికూడ నవ్వుచున్నాఁడు. పండితునికూడ నిందింపఁజేయుచున్నాఁడు. ధైర్యముకల పురుషుని పీడించుచున్నాఁడని తా॥ మఱియును,

శ్లో॥ శ్రుతంసత్యంతపశ్శీలం విజ్ఞానంవిత్తమున్నతిం। ఇంధనీకురుతే మూఢఃప్రవిశ్యవనితానలమ్॥

టీ॥ మూఢః= మూఢుఁడు. వనితానలమ్= స్త్రీయనియెడునగ్నిని. ప్రవిశ్య= ప్రవేశించి. శ్రుతమ్= శాస్త్రసంపదను. సత్యమ్= సత్యమును. తపః= తపస్సును. శీలమ్= సత్స్వభావమును. విజ్ఞానమ్= తెలివిని. విత్తమ్= ధనమును. ఉన్నతిమ్= గొప్పదనమును. ఇంధనీకురుతే= కట్టెలనుగాఁజేయుచున్నాఁడు॥

తా॥ మూఢుఁడు స్త్రీయనియెడు నగ్నిహోత్రమునందుఁ బ్రవేశించి వేదశాస్త్రసంపదను, సత్యమును, తపస్సును, సత్స్వభావమును, విజ్ఞానమును, ధనమును, గొప్పదనమును, కట్టెలనుగాఁ జేయుచున్నాఁడని తా॥ మఱియును,

శ్లో॥ వృత్తంవిత్తంతపస్స్వాంతం స్వకులస్యాపిలాంఛనం। మరణం వాసమీపస్థంకామీలోకేనపశ్యతి॥

టీ॥ లోకే= లోకమునందు. కామీ= కాముకుఁడు. వృత్తమ్= సత్ప్రవర్త

నమును. విత్తమ్=ధనమును. తపః=తపస్సును. స్వాంతమ్=చిత్తమును. స్వకులస్య=తనకులముయొక్క. లాంఛనమపి=గుర్తును. సమీపస్థమ్=సమీపమునందున్న. మరణంవా=మరణమునైనను. నపశ్యతి=చూచుచుండలేడు॥ తా॥ లోకమునందు కాముకుఁడగువాఁడు సత్స్వభావమును, ధనమును, తపస్సును, చిత్తమును, తనకులముయొక్క మంచిగుర్తులను, సమీపమునందున్న మరణమునుచూడఁడని తా॥ ఇట్లనిఆలోచించి ఆమంత్రిపుంగవుఁడు ఒకనాఁడు సమయమునుకనిపెట్టి రాజుతోనిట్లనియె. ఓరాజోత్తమా! ఒక్కవిన్నపముకలదనిన రాజిట్లనియె. ఓమంత్రిపుంగవా! ఆవిజ్ఞాపనమేమి? అనినమంత్రి యిట్లనియె. ఓరాజోత్తమా! నీవు భానుమతితోఁగూడ సింహాసనమునందుఁ గూర్చున్నావు. అట్లు కూర్చుండుట మిగులననుచితమైయున్నది. రాజభార్యలుసూర్యునిగూడఁజూడఁగూడదని సంప్రదాయము. సంప్రదాయమిట్లుండఁగా, అనేకులగుజనులువచ్చి ఆమహానుభావురాలిని చూచుచున్నారనిన విని రాజిట్లనియె. ఓమంత్రిపుంగవా! నేను భానుమతినిచూడక క్షణమాత్రమైన నుండఁజాలను. కాఁబట్టి దానికిఁదగినయుపాయమునునిరూపించిచెప్పుమనినవిని ఆమంత్రిపుంగవుఁడిట్లనియె. ఓరాజశ్రేష్ఠుఁడా! ఆభానుమతీదేవిని చిత్తరువునందువ్రాసి సర్వకాలములయందును చూచుచుండుమనినరాజందులకు అంగీకారమును పొంది రాజుచిత్రకారునిపిలిచి భానుమతీదేవియొక్కరూపమునుచిత్రపటమునందువ్రాయుమని ఆజ్ఞాపించె. అంతట నాచిత్రకారుఁడు భానుమతీదేవినిసాక్షాత్తుగాఁజూచి పద్మినీలక్షణములతోఁ గూడుకొనిన ఆభానుమతీదేవినిచిత్తరువునందువ్రాసె. అంతట నానందభూపాలుఁడు చిత్తరువునందు వ్రాయఁబడిన ఆప్రియురాలినిచూచి సంతోషమును పొందినవాఁడై ఆచిత్రకారునకు బహుమానమునిచ్చె. అనంతరమందు రాజగురువగుశారదానందుఁడు చిత్రపటమునందు వ్రాయఁబడిన భానుమతీదేవినిచూచి చిత్రకారునితోనిట్లనియె. ఓరీ! చిత్రకారుఁడా! భానుమతీదేవియొక్క లావణ్యమును సర్వమునువ్రాసితివికాని ఒక్కవిషయమునుమాత్రము మరచిపోతివనిన ఆచిత్రకారుఁడిట్లనియె. ఓగురూత్తమా! నేను మరచినవిషయమేదియో దానిని తెలుపుమనిన శారదానందుఁడిట్లనియె. ఆభానుమతీదేవియొక్క యెడమతొడయందునువ్వుగింజవంటి మచ్చయొకటికలదు. దానినివ్రాయక మరచిపోతివనియె. ఆమాటనువిని రాజుసంభోగసమయమునందు భానుమతీదేవియొక్క యెడమతొడను పరిశీలించిచూడఁగా ఆతొడయందునువ్వుగింజవంటిమచ్చయొక్కటియుండె. దానినిచూచి తనమనస్సునయిట్లనియాలోచించె. శారదానందుఁడు దీనిగుహ్య



ప్రదేశమునందున్నమచ్చనెట్లుచూచె. వాస్తవముగా దీనితోసంయోగముకలిగియుండును. అట్లుకాదేని అతనికీవిషయమెట్లుతెలియును. స్త్రీలవిషయములో ఇట్టికార్యములయందు సందేహములేదు. ఎందువలననఁగా,

శ్లో॥ జల్పంతిసార్ధమన్యేన పశ్యంత్యన్యంసవిభ్రమాః। హృదయేచింతయంత్యన్యం నస్త్రీణామేకతోరతిః॥

టీ॥ స్త్రియః=స్త్రీలు. సవిభ్రమాః=విలాసములతోఁ గూడుకొనినవారై. అన్యేనసార్ధమ్=ఇతరునితోఁగూడ. జల్పంతి=మాటలాడుచున్నారు. అన్యమ్=మఱియొకనిని. పశ్యంతి=చూచుచున్నారు. అన్యమ్=మఱియొకనిని. హృదయే=హృదయమునందు. చింతయంతి=ఆలోచించుచున్నారు. స్త్రీణామ్=స్త్రీలకు. ఏకతః=ఒక్కస్థలమునందు. రతిః=ప్రేమ. న=లేదు॥ తా॥ స్త్రీలువిలాసములతోఁగూడుకొనినవారై ఒకనితోమాట్లాడుచున్నారు. మఱియొకనినిచూచుచున్నారు. మనస్సునందు మఱియొకనిని ఆలోచించుచున్నారు. కాఁబట్టి ఆలోచింపఁగా, స్త్రీలకుఒకనియందే ప్రేమలేదని తా॥ మఱియును,

శ్లో॥ నాగ్నిస్తృప్యతికాష్ఠానాంనాపగానాంమహోదధిః। నాంతకస్సర్వభూతానాంనపుంసాంవామలోచనా॥

టీ॥ అగ్నిః=అగ్నిహోత్రుఁడు. కాష్ఠానామ్=కట్టెలకు. నతృప్యతి=తృప్తినిపొందఁడు. మహోదధిః=సముద్రుఁడు. ఆపగానామ్=నదులకు. నతృప్యతి=తృప్తిఁబొందఁడు. అంతకః=యముఁడు. సర్వభూతానామ్=సకలభూతములకు. నతృప్యతి=తృప్తినిపొందఁడు. వామలోచనా=ఆడుది. పుంసామ్=పురుషులకు. నతృప్యతి=తృప్తిఁబొందదు॥ తా॥ అగ్నిహోత్రుఁడు ఎన్నికట్టెలనువైచినను తృప్తిఁబొందఁడు. సముద్రుఁడు ఎన్నినదులు వచ్చితనయందుపడినను తృప్తిఁబొందఁడు. యముఁడు ఎన్నిభూతములను చంపినను తృప్తినిపొందఁడు. స్త్రీలు ఎందరుపురుషులను పొందినను తృప్తిఁబొందరని తా॥ మఱియును,

శ్లో॥ రహోనాస్తిక్షణోనాస్తినాస్తిప్రార్థయితాజనః। ఇదంనారదనారీణాంపాతివ్రత్యంప్రకల్ప్యతే॥

టీ॥ హేనారద=ఓనారదుఁడా! స్త్రీణామ్=స్త్రీలకు. రహః=ఏకాంతప్రదేశము. నాస్తి=లేదు. క్షణః=సమయము. నాస్తి=లేదు. ప్రార్థయితా=అపేక్షించునట్టి. జనః=జనము. నాస్తి=లేదు. ఇదమ్=ఈలేకపోవుటను. పాతివ్రత్యమ్=పాతివ్రత్యమై. ప్రకల్ప్యతే=కల్పింపఁబడుచున్నది॥ తా॥ ఓనా

రదమునివర్యా! ఏకాంతస్థలము దొరకకపోవుటవలనను, సమయము లభింపకపోవుటవలనను, అపేక్షించునట్టిజనము లేకపోవుటవలనను స్త్రీలు పతివ్రతలైయుందురేకాని లేనియెడల ఉండరని తా॥ మఱియును,

శ్లో॥ యోమహాన్మన్యతేమూఢో౽రక్తేయంమమకామినీ। సతస్యావశగో భూత్వానృత్యేత్క్రీడాశకుంతవత్॥

టీ॥ యః= ఏ. మూఢః= మూఢుఁడు. ఇయమ్= ఈ. కామినీ= ఆడుది. మమ= నాకు. రక్తా= అనురాగముకలది. ఇతి= ఇట్లు. మహత్= అధికముగా. మన్యతే= తలఁచుచున్నాఁడో. సః= వాఁడు. తస్యాః= ఆస్త్రీకి. వశగః= స్వాధీనుఁడు. భూత్వా= అయి. క్రీడాశకుంతవత్= క్రీడార్థమైనపక్షివలె. నృత్యేత్= నృత్యమునుచేయవలసినది॥ తా॥ లోకములో ఏమానవుఁడు ఈస్త్రీనాయందు అనురాగముకలదని అధికముగా తలఁచునో అట్టివాఁడు ఆస్త్రీకిస్వాధీనుఁడై క్రీడార్థమైనపక్షివలె ఆస్త్రీచెప్పినట్లుఆడుచుండునని తా॥ మఱియును,

శ్లో॥ తాసాంవాక్యానికృత్యాని స్వల్పానిసుగురూణ్యపి। కరోతియః కృతీలోకేలఘుత్వంతస్యనిశ్చితమ్॥

టీ॥ యః= ఏపురుషుఁడు. తాసామ్= ఆస్త్రీలయొక్క. స్వల్పాని= స్వల్పములయిన. కృత్యాని= కార్యములను. వాక్యాని= వాక్యములను. సుగురూణ్యపి= మిగులనధికమైనవానినిగా. కరోతి= చేయుచున్నాఁడో. తస్య= అతనికి. లోకే= లోకమునందు. లఘుత్వమ్= అగౌరవము. సునిశ్చితమ్= చక్కఁగానిశ్చయింపఁబడినది॥ తా॥ లోకములో ఏమానవుఁడు స్త్రీలయొక్క వాక్యములను కార్యములను అధికమైనవానినిగాఁ జేయుచున్నాఁడో అటువంటిపురుషుఁడు అగౌరవమునుపొందుచున్నాఁడని తా॥ మఱియును,

శ్లో॥ అలక్తకోయథారక్తోనిపీడ్యఃపురుషస్తథా। అబలాభిర్బలాద్రక్తః పాదమూలేప్రణీయతే॥

టీ॥ రక్తః= ఎఱ్ఱనైన. అలక్తకః= లత్తుక. యథా= ఏప్రకారముగా. నిపీడ్యః= పీడింపఁదగినదో. తథా= ఆప్రకారముగా. రక్తః= అనురాగముకల. పురుషః= పురుషుఁడు. అబలాభిః= స్త్రీలచేత. బలాత్= బలాత్కారముగా. పాదమూలే= పాదమూలమునందు. ప్రణీయతే= పొందింపఁబడుచున్నాఁడు॥ తా॥ ఎఱ్ఱనిదగు లత్తుకపాదములయందుఁ దగులుకొని యేవిధముగాఁబీడింపఁబడుచున్నదో ఆవిధముగా అనురక్తుఁడగు పురుషుఁడుకూడ స్త్రీలచేత కాలిక్రింద త్రొక్కఁబడి పీడింపఁబడుచుండునని తా॥ ఈవిధముగా ఆలోచించి మంత్రినిపిలిచి పూర్వవృత్తాంతమును సర్వమును చెప్పె. ఆసమ



యమునందు మంత్రియునుఅతనిచిత్తానుసారముగ మాటలాడె. మఱియు ఓరాజోత్తమా! దేవరవారియొక్క చిత్తమునందుఁ దోచునదియంతయును సరియేయని తోఁచుచున్నదనినవిని ఆరాజుపరమానందమునుపొంది నీవు నాకుప్రియమైనమంత్రివనిచెప్పి మఱియునిట్లనియె. ఓమంత్రిపుంగవా! నీవు నాకుప్రియుఁడవైనయెడల శారదానందునిచంపుమనియె. ఆమాటకు మంత్రిఅంగీకారమునుపొంది యెల్లవారలయెదుటను శారదానందుని దృఢముగాబంధించె. ఆసమయమునందు శారదానందుఁడిట్లనియె. ఆహా! రాజులోకములో నెవ్వనికిని ఇష్టుఁడుకాడనుటనిజమే. అదియెట్లనిన?—

శ్లో॥ కోర్థాన్ప్రాప్యనగర్వితోవిషయిణఃకస్యాపదోస్తంగతాః స్త్రీభిః కస్యనఖండితంభువిమనఃకోనామరాజ్ఞాంప్రియః। కఃకాలస్యనగోచరత్వమగమత్కోర్థీజనోగౌరవంకోవాదుర్జనవాగురాసుపతితః క్షేమేణ యాతఃపుమాన్॥

టీ॥ అర్థాన్= అర్థములను. ప్రాప్య= పొంది. కః= ఎవ్వఁడు. నగర్వితః= గర్వమునుపొందఁడు. విషయిణః= విషయాభిలాషకల. కస్య= ఎవనికి. ఆపదః= ఆపదలు. అస్తంగతాః= అస్తమయమునుపొందినవి. భువి= భూలోకమునందు. స్త్రీభిః= స్త్రీలచేత. కస్య= ఎవనియొక్క. మనః= మనస్సు. నఖండితమ్= ఖండింపఁబడలేదు. రాజ్ఞామ్= రాజులకు. కోనామ= ఎవ్వఁడు. ప్రియః= ఇష్టుఁడు. కః= ఎవ్వఁడు. కాలస్య= యమునకు. గోచరత్వమ్= గోచరత్వమును. నాగమత్= పొందలేదు. అర్థీ= యాచకుఁడు. (అయిన) జనః= జనుఁడు. కః= ఎవ్వఁడు. గౌరవమ్= గౌరవమును. అగమత్= పొందెను. దుర్జనవాగురాసు= దుర్జనులవలలయందు. పతితః= పడవేయఁబడిన. కః= ఏ. పుమాన్= పురుషుఁడు. క్షేమేణ= క్షేమముచేత. యాతః= పోయెను॥ తా॥ లోకములో సకలపదార్థములనుపొంది యెవ్వఁడుగర్వమునుపొందఁడు. అందఱునుపొందుదురనుట. మఱియును, విషయాభిలాషకలయేపురుషునకుఆపదలుతప్పిపోయినవి. అనఁగా విషయాభిలాషకలవారందఱును ఆపదలనుపొందుచున్నారు. మఱియును, భూలోకమునందుఏపురుషునియొక్కమనస్సు స్త్రీలచేత ఖండింపఁబడలేదు. అందఱిమనస్సులును ఖండింపఁబడుచునేయున్నవి. మఱియును, లోకములో రాజులకుప్రియమైనవాఁడెవ్వఁడు. ఎవ్వఁడును ప్రియమైనవాఁడులేఁడు. మఱియును, లోకములో ఏమానవుఁడు యమునికంటఁబడఁడు. అందఱును యమునికంటఁబడుదురు. మఱియును, లోకములో యాచించునట్టివారలలో నెవ్వఁడుగౌరవమునుపొందెను. యాచించునట్టివాఁడెవ్వఁడును గౌరవ

మునుపొందఁడు. మఱియును, లోకములోదుర్జనులవలనయిందుఁబడినవారల లోనెవ్వఁడు క్షేమమును పొందెను. ఎవ్వఁడును క్షేమమును పొందియుండలేదనితా॥ మఱియును,

శ్లో॥ కాకే శౌచం కాముకే సత్యవాక్యం క్లీబే శౌర్యం మద్యపే తత్త్వచింతా। సర్పే క్షాంతి స్త్రీషు కామోపశాంతీ రాజ్ఞాం మిత్రం కేన దృష్టం శ్రుతం వా॥

టీ॥ కాకే= కాకమునందు. శౌచమ్= పరిశుద్ధతయును. కాముకే= కాముకునియందు. సత్యవాక్యమ్= నిజమైనమాటయును. క్లీబే= నపుంసకునియందు. శౌర్యమ్=పరాక్రమము. మద్యపే=మద్యపానమునుచేయువానియందు. తత్త్వచింతా= వాస్తవపదార్థవిచారణయును. సర్పే= సర్పమునందు. క్షాంతిః=ఓర్పును. స్త్రీషు= స్త్రీలయందు. కామోపశాంతిః= కామముయొక్క-ఉపశాంతియును. రాజ్ఞామ్=రాజులకు. మిత్రమ్= స్నేహితుఁడును. కేనవా=ఎవనిచేత. శ్రుతమ్=వినఁబడినది. కేనవా= ఎవనిచేత. దృష్టమ్=చూడఁబడినది॥ తా॥ కాకమునందు పరిశుద్ధతయును, కాముకునియందు నిజమైన మాటయును, నపుంసకునియందు పరాక్రమమును, మద్యపానమును చేయువానియందు తత్త్వచింతయును, సర్పమునందుఓర్పును, స్త్రీలయందుకామముయొక్క-ఉపశాంతియును, రాజులకుస్నేహితుఁడును, లోకమునందెవనిచేతను చూడఁబడియును, వినఁబడియును, ఉండలేదనితా॥ మఱియును, రాజునకు ఎవనిమీదకోపమువచ్చునో వాఁడుపరిశుద్ధుఁడైనను అపరిశుద్ధుఁడగును. మఱియును,

శ్లో॥ శుచిరశుచిః పటురపటుశ్శూరోభీరుశ్చిరాయురల్పాయుః। కులజఃకులేనహీనో భవతినరోనరపతేరతిక్రోధాత్॥

టీ॥ నరపతేః= రాజుయొక్క. అతిక్రోధాత్= అధికమైనకోపమువలన. నరః=మానవుఁడు. శుచిః= పరిశుద్ధుఁడైనను. అశుచిః= అపరిశుద్ధుఁడు. భవతి= అగుచున్నాఁడు. పటుః=సమర్థుఁడును. అపటుః= అపరిశుద్ధుఁడు. భవతి= అగుచున్నాఁడు. శూరః=పరాక్రమవంతుఁడును. భీరుః=భయశీలుఁడు. భవతి= అగుచున్నాఁడు. చిరాయుః= దీర్ఘాయుష్యముకలవాఁడు. అల్పాయుః=అల్పమైనఆయుష్యముకలవాఁడు. భవతి= అగుచున్నాఁడు. కులజః= మంచికులమునందుఁబుట్టినవాఁడు. కులేన= కులముతో. హీనః= హీనుఁడు. భవతి=అగుచున్నాఁడు॥ తా॥ రాజునకు కోపమువచ్చెనేని పరిశుద్ధుఁడు అపరిశుద్ధుఁడగును. సమర్థుఁడు అసమర్థుఁడగును. పరాక్రమవంతుఁడు భయ



ముకలవాఁడగును. దీర్ఘాయుష్యముకలవాఁడు అల్పాయుష్యముకలవాఁడగును. మంచికులమునందుఁ బుట్టినవాఁడు కులహీనుఁడగును అనితా॥ ఇవిమొదలుగాఁగల శ్లోకములను పఠించుచు ఆశారదానందుఁడు మంత్రిచేత ఉరిదీయుచోటునకుఁదీసికొనిపోఁబడియె. ఆసమయమునందు శారదానందుఁడు॥

శ్లో॥ వనే రణే శత్రుజలాగ్ని మధ్యే మహార్ణవే పర్వతమస్తకేవా। సుప్తం ప్రమత్తం విషమే స్థితం వా రక్షంతి పుణ్యాని పురాకృతాని॥

టీ॥ వనేవా= వనమునందుఁగాని. రణేవా=యుద్ధమునందుఁగాని. శత్రుజలాగ్నిమధ్యేవా= శత్రువులయొక్కయు, ఉదకములయొక్కయు, అగ్నియొక్కయు, మధ్యయందుఁగాని. మహార్ణవేవా= అధికమైన సముద్రమునందుఁగాని. పర్వతమస్తకేవా= పర్వతశిఖరమునందుఁగాని. సుప్తంవా= నిదురనుపొందుచున్నవానినైనను. ప్రమత్తంవా= మదించిపడియున్నవానినైనను. విషమే= అతికఠినమైనప్రదేశమునందు. స్థితంవా=ఉన్నవానినైనను. పురాకృతాని= పూర్వజన్మమునందుఁ జేయఁబడిన. పుణ్యాని=పుణ్యములు. రక్షంతి= రక్షించుచున్నవి॥ తా॥ వనమునందయినను, యుద్ధమునందైనను, శత్రువులయొక్కయు, ఉదకములయొక్కయు, అగ్నియొక్కయు, మధ్యయందయినను, అధికమైనసముద్రమునందైనను, పర్వతమస్తకమునందైనను, నిద్రించిననుగాని, మూర్ఛిల్లినను, పూర్వజన్మమునందలి పుణ్యములు కాపాడుచున్నవనితా॥ అనునట్టి శ్లోకమునుపఠించె. ఆశ్లోకార్థమునువిని ఆమంత్రిపుంగవుఁడు తనమనస్సునందిట్లని ఆలోచించె. ఆహా ఈసంగతినిజమో అబద్ధమో తెలిసినదికాదు. వాస్తవమును తెలిసికొనక యెందునిమిత్తముగ బ్రాహ్మణవధచేయవలయును. ఛీ ఇట్లు చేయుట అనుచితముగనున్నదనితలఁచి శారదానందుని రహస్యముగా తనయింటికిఁదీసికొనిపోయి భూగృహమునందుంచె. అట్లుంచి రాజసన్నిధికిఁబోయి యోరాజోత్తమా! మీరు చెప్పినవిధముగశారదానందునివధించితిననిచె. ఆమాటనువిని నందభూపాలుఁడు మంచికార్యమును చేసితివని సంతోషమునుపొందె. అంతటఁ గొన్నిదినములు కడచినపిమ్మట ఒకనాఁడు రాజకుమారుఁడు వేటకొఱకు వనమునకు బయలువెడలె. ఆసమయమునందు అకాలవృష్టిమొదలుగాఁగల దుశ్శకునము లనేకములుకలిగె. అవియెవ్వియనిన॥

శ్లో॥ అకాలవృష్టిస్త్వథ భూమికంపో నిర్ఘాతఉల్కాపతనం తథైవ। ఇత్యాద్యనిష్టానితతో బభూవుర్నివారణార్థం సుహృదో వచశ్చ॥

టీ॥ అకాలవృష్టిః= అకాలమునందలివర్షము. అథ= పిమ్మట. భూమి

కంపః= భూకంపము. నిర్ఘాతః=పిడుగు. తథైవ=అప్రకారముగానే. ఉల్కాపతనమ్= ఉల్కలురాలుట. తతః=అనంతరమందు. ఇత్యాద్యనిష్టాని= ఇవిమొదలుగాఁగల అనిష్టములు. బభూవుః= ఆయెను. నివారణార్థమ్= ఆదుర్నిమిత్తములయొక్క నివారణముకొఱకు. సుహృదః= స్నేహితునియొక్క. వచశ్చ= వాక్యమును. బభూవ= ఆయెను॥ తా॥ అకాలవర్షము, భూకంపము, పిడుగుపడుట, ఉల్కలురాలుట, మొదలుగాఁగలదుశ్శకునము లనేకములుకలిగె. అట్టి దుశ్శకునములవలనఁ గలిగినట్టి అనర్థములుశాంతినిపొందుటకొఱకుస్నేహితులవచనములును వినఁబడియెనని తా॥ ఇట్టిదుశ్శకునముల నేకములు కలిగినకాలమునందు మంత్రికుమారుఁడగుబుద్ధిసాగరుడు రాజపుత్రునిజూచిఓరాజపుత్రుఁడా! దుశ్శకునము లనేకములుకలుగుచున్నవి కనుక ఇప్పుడుమనము వేటకుఁబోవుట యుచితముకాదని నివారించె. ఆమాటనువిని రాజపుత్రుఁడగు జయపాలుఁడిట్లనియె. ఓమంత్రినందనుఁడా! ఈదుశ్శకునములను నేనుచూచితిని. అయినను నేనునిలువక వేటకుఁబోదును. దుర్నిమిత్తముల ఫలములనునీవుచూడుమనిన బుద్ధిసాగరుఁడు మరలనిట్లనియె. ఓరాజోత్తమా! ఈవిషయముపరీక్షింపఁదగినదికాదు. మఱియును,

శ్లో॥ నవిషంభక్షయేత్ప్రాజ్ఞో నక్రీడేత్పన్నగైస్సహ। ననింద్యోయోగిబృందశ్చబ్రహ్మద్వేషంనకారయేత్॥

టీ॥ ప్రాజ్ఞః= బుద్ధిమంతుఁడగువాఁడు. విషమ్= విషమును. నభక్షయేత్= భక్షింపఁగూడదు. పన్నగైస్సహ=సర్పములతోఁగూడ. నక్రీడేత్= క్రీడింపఁగూడదు. యోగిబృందశ్చ= యోగిసముదాయమును. ననింద్యః= నిందింపఁదగినదికాదు. బ్రహ్మద్వేషమ్= బ్రాహ్మణద్వేషమును. నకారయేత్= చేయఁగూడదు॥ తా॥ మిగుల బుద్ధిమంతుఁడగువాఁడు విషమునుభక్షించి పరీక్షను చేయఁగూడదు. సర్పములతోఁగూడ ఆటలనాడఁగూడదు. యోగిసముదాయమును నిందింపఁగూడదు. బ్రహ్మద్వేషమును చేయఁగూడదని తా॥ ఇట్లని అతనిచేత నివారింపఁబడియును ఆజయపాలుఁడు బుద్ధిసాగరునిమాటయందు అనాదరమును చేసి బయలువెడలె. అట్లు తనమాటనువినక పోవుచున్న రాజపుత్రునితో మరల నిట్లనియె. ఓజయపాలుఁడా! విచారింపఁగా, నీకువినాశకాలమువచ్చియున్నట్లు తోఁచుచున్నది. అట్లుకానిచోఁ దలనీకెటువంటివిపరీతబుద్ధిపుట్టదు. మఱియును,

శ్లో॥ ననిర్మితోనైవచ దృష్టపూర్వో నశ్రూయతే హేమమయఃకురంగః। తథాపితృష్ణా రఘునందనస్య వినాశకాలే విపరీతబుద్ధిః॥



టీ॥ హేమమయః= సువర్ణమయమైన. కురంగః=కురంగము. ననిర్మితః= (దేవునిచేత) నిర్మింపఁబడలేదు. నచదృష్టపూర్వః= పూర్వమునందెకడను చూడఁబడలేదు. నశ్రూయతే=వినఁబడలేదు. తథాపి=అయినప్పటికిని. రఘునందనస్య= రామునకు. తృష్ణా=ఆశ. సమజని=కలిగెను. వినాశకాలే= వినాశకాలమునందు. విపరీతబుద్ధిః= విపరీతమైనబుద్ధి. భవతి= అగుచున్నది॥

తా॥ సువర్ణమయమైన కురంగమెక్కడను చూడఁబడలేదు. ఏదేవునిచేతను నిర్మింపఁబడలేదు. వినఁబడనులేదు. అయినను రఘునందనునకు ఆశకలిగెను. వినాశకాలమునందు విపరీతమైన బుద్ధికలుగుచున్నదని తా॥ ఈహేతువువలన జన్మాంతరమునందు సంపాదింపఁబడినకర్మములుఅనుభవింపకనాశమునుపొందవు. మఱియును,

శ్లో॥ సద్భావోనాస్తివైశ్యానాం స్థిరతానాస్తిసంపదాం। వివేకోనాస్తిమూర్ఖాణాం వినాశోనాస్తికర్మణామ్॥

టీ॥ వైశ్యానామ్= వైశ్యులకు. సద్భావః=సత్స్వభావము. నాస్తి= లేదు. సంపదామ్= సంపదలకు. స్థిరతా=స్థిరత్వము. నాస్తి=లేదు. మూర్ఖాణామ్= మూర్ఖులకు. వివేకః=వివేకము. నాస్తి=లేదు. కర్మణామ్=కర్మములకు. వినాశః=వినాశము. నాస్తి=లేదు॥ తా॥ వైశ్యులకు సత్స్వభావములేదు. సంపదలకు స్థిరతలేదు. అనఁగా సంపదలుస్థిరముగానుండవు. మూర్ఖులకువివేకములేదు. కర్మములకు వినాశములేదని తా॥ అనుశ్లోకముమొదలగువానినిజెప్పి బుద్ధిసాగరుఁడంతటితో నూరకుండె. అంతట జయపాలుఁడుపట్టణమునుండి ఖడ్గమృగములు, వ్యాఘ్రములు, శరభమృగములు, జింకలు, మొదలుగాఁగల క్రూరమృగములచేత సంకులమైనదియును, మిగులగొప్పదియును, అయిన అరణ్యమునందుఁబ్రవేశించె. అట్లు ప్రవేశించి వెనుకతిరిగిచూచె. ఆసమయమునందు సైన్యవర్గమంతయును తననగరమార్గమునందులగ్నమయ్యె. తానొంటరివాఁడయ్యె. మఱియును, గుఱ్ఱమొక్కటిమాత్రము సహాయముగాఁ గలవాఁడయ్యె. అంతఁగొంతసేపటికి ముందర నొకమడుగునుచూచె. అంతట నాజయపాలుఁడు అశ్వమునుండిదిగి యొకచెట్టు యొక్కకొనయందు గుఱ్ఱమునుకట్టి నీటియందుదిగి యుదకపానమునుచేసి దప్పిని దీర్చుకొనినవాఁడై ఆచెట్టుయొక్కనీడయందు విశ్రమించె. ఆసమయమునందు మిగులభయంకరమైన యొకపెద్దపులివచ్చె. ఆపెద్దపులినిచూచి గుఱ్ఱము త్రాళ్ళను త్రెంచుకొని యుష్టమువచ్చినట్లు పరుగెత్తె. ఆరాజకుమారుఁడునుభయముచేత వణఁకుచున్నశరీరముకలవాఁడై కొమ్మనుపట్టుకొని చెట్టుమీఁదికె

కొ. అట్లుచెప్పెడికొనపిమ్మట అంతకుముందుగా ఆచెట్టుమీదికెక్కిన యెలుగుబంటినిచూచి మునుపటికంటె నధికమైనభయముకలవాఁడయ్యె. అట్లుమునుపటికంటె నధికముగాభయమునుపొందుచున్న రాజపుత్రునిచూచిభల్లూకముసాంత్వవచనములచేతనిట్లనియె. ఓరాజకుమారుఁడా! భయమునుపొందకుము. ఇప్పుడు నీవు నన్నుశరణమునుపొందితివి. కాఁబట్టి నీకిప్పుడు అనిష్టమునుచేయుదునాయేమి? చేయను. కాఁబట్టి నాయందువిశ్వాసముకలవాఁడవై పెద్దపులివలన భయమునుపొందకుమనిన రాజకుమారుఁడు మిగుల భయముతోఁగూడుకొనినవాఁడై యిట్లనియె. ఓభల్లూకరాజమా! నేను నిన్నుశరణమునుపొందితిని. విశేషముగా భయమునుపొందితిని. శరణాగతునికాపాడుటచేత విశేషమయిన పుణ్యముకలదు. మఱియును, ఇటులనే॥

శ్లో॥ ఏకతఃక్రతవస్సర్వే సమగ్రవరదక్షిణాః। ఏకతోభయభీతస్య ప్రాణినఃప్రాణరక్షణమ్॥

టీ॥ సమగ్రవరదక్షిణాః= సంపూర్ణములును, శ్రేష్ఠములును అయినదక్షిణలుకల. సర్వే-సమస్తములయిన. క్రతవః-క్రతువులు. ఏకతః=ఒకస్థలమునందు. భయభీతస్య= భయముచేతభీతుఁడైన. ప్రాణినః= జంతువుయొక్క. ప్రాణరక్షణమ్ = ప్రాణసంరక్షణము. ఏకతః = ఒకస్థలమునందు॥ తా॥ సంపూర్ణములును, శ్రేష్ఠములును, అయినదక్షిణలుకల క్రతువులన్నియును ఒకయెత్తు. భయముచేత భీతుఁడయినవానిని సంరక్షణముఒకయెత్తుఅనితా॥ శాస్త్రమునందుఁగూడఁ జెప్పఁబడియున్నది. అనినవిని భల్లూకముఆరాజనందనునకు విశేషముగానమ్మకముకలుగునట్లుచేసె. ఇంతలోపల ఆపెద్దపులిచెట్టుమొదటికివచ్చె. అంతటఁ గొంతసేపటికి సూర్యుఁడు అస్తమయమునుపొందె. అంతట రాజకుమారుఁడు వేటయందుఁ దిరుగుటచేత మిగులవలసియున్నవాఁడగుటచేత నిద్రాపరవశుఁడై ఆభల్లూకముయొక్క తొడయందుఁబరుండి సుఖముగా నిద్దురనుపొందె. అట్లురాజకుమారుఁడునిద్రనుపొందుటనుజూచి పెద్దపులి భల్లూకముతోనిట్లనియె. ఓభల్లూకోత్తమా! ఈపురుషుఁడు పట్టణమునందు నివసించువాఁడు. కాఁబట్టి మనలనే చంపుటకొఱకువచ్చువాఁడు. అందువలన ఈపురుషుఁడు మనకుశత్రువు. ఇటువంటిశత్రువును తొడమీదపరుండఁబెట్టుకొనుటయెట్లు. నీవు ఇతనికుపకారమునుచేసినను నీకితఁడు అపకారమునేచేయఁగలఁడు. మఱియును,

శ్లో॥ మానుషేషుకృతంనాస్తితిర్యగ్యోనిషుధర్మితా। వ్యాఘ్రవానరసర్పాణాం భాషితంనశ్రుతమ్।



టీ॥ మానుషేషు= మనుష్యులయందు. కృతమ్ - మేలునుమరవకుండుట. నాస్తి-లేదు. తిర్యగ్యోనిషు=తిర్యగ్యోనులయందు. ధర్మితా- ధర్మిత్వము. నాస్తి=లేదు. వ్యాఘ్రవానరసర్పాణామ్= పెద్దపులులకును, కోతులకును, సర్పములకును. భాషితమ్= సంభాషించుట. నశ్రుతమ్ - వినఁబడలేదు॥ తా॥ ఓభల్లూకమా! మనుష్యులయందు మేలును మరవకపోవుటలేదు. తిర్యగ్జంతువులయందు ధర్మిత్వములేదు. పెద్దపులులకును, కోతులకును, సర్పములకును, సంభాషణములేదనితా॥ కాఁబట్టి ఈమానవునిక్రిందఁ బడవేయుము. నేనీమానవునిభక్షించి సుఖముగాఁబోయెదను. నీవును నీచోటునకుఁబొమ్మనినవిని భల్లూకమిట్లనియె. ఓవ్యాఘ్రమా! ఇతఁడెటువంటివాఁడైనఁగానిమ్ము. వీఁడునన్నుశరణమునుపొందెను. కాఁబట్టి వీనినిక్రిందఁబడవేయను. మఱియును శరణాగతునిచంపుటచేత అధికమైనపాపముకలుగును. మఱియును,

శ్లో॥ విశ్వాసఘాతుకాశ్చైవ శరణాగతఘాతుకాః। వసంతినరకేఘోరేయావచ్చంద్రదివాకరమ్॥

టీ॥ యే-ఎవరు. విశ్వాసఘాతుకాశ్చైవ = విశ్వాసఘాతకులో. యే- ఎవరు. శరణాగతఘాతుకాః= శరణాగతులను సంహరించుదురో. తే- అటువంటిజనులు. ఘోరే= భయంకరమైన. నరకే - నరకమునందు. యావచ్చంద్రదివాకరమ్= సూర్యచంద్రులెంతవఱకుందురో. తావత్=అంతపర్యంతమును. వసంతి= నివసించుచున్నారు॥ తా॥ ఓవ్యాఘ్రమా! విశ్వాసఘాతుకులును, శరణాగతులను సంహరించువారును, అగు మానవులుసూర్యచంద్రులున్నవఱకును మిగుల భయంకరమైన నరకమునందు నివసించుదురనితా॥ అని శాస్త్రముచెప్పుచున్నది కనుక నేనీమనుష్యుని క్రిందఁబడవేయననియె. అట్లు వ్యాఘ్రభల్లూకములు రెండును మాటలాడుచునుండఁగా రాజకుమారుఁడునిద్రనువదలిలేచె. అట్లునిద్రనుండిలేచినరాజకుమారునితోభల్లూకమిట్లనియె. ఓరాజకుమారుఁడా! నేనునిద్రనుపొందుచున్నాను. నీవిక్కడ భద్రముగనుండుము. కురుకుపాట్లనుపడకుమనిన రాజకుమారుఁ డిట్లనియె. ఓభల్లూకరాజమా! నీయిష్టానుసారముగఁ జేయుమనియె. అంతట ఆభల్లూకము రాజకుమారునిసమీపమునందు నిదురనుపొందె. ఆసమయమునందు చెట్టుక్రిందనున్న పెద్దపులి యిట్లనియె. ఓరాజకుమారుఁడా! నీవీభల్లూకమునునమ్మకుము. ఇది మిగుల చపలచిత్తముకలది. కాఁబట్టి దీనియనుగ్రహముమిగులభయంకరమైనది. మఱియును,

శ్లో॥ క్షణేతుష్టాః క్షణేరుష్టా విత్రుష్టాశ్చక్షణేక్షణే। అవ్యవస్థితచిత్తానాం ప్రసాదోపి భయంకరః॥

టీ॥ యే= ఎవరు. క్షణే= క్షణమాత్రమునందు. తుష్టాః= సంతోషించినవారో. క్షణే=క్షణమాత్రమునందు. రుష్టాః=కోపమును పొందినవారో. క్షణేక్షణే= ప్రతిక్షణమునందును. విత్రుష్టాః= మిగుల తృప్తిని పొందినవారో. తేషామ్= అటువంటి. అవ్యవస్థితచిత్తానామ్= చిత్తవ్యవస్థలేనివారలయొక్క. ప్రసాదోపి=అనుగ్రహమును. భయంకరః=భయమును కలుగఁజేయును॥ తా॥ లోకములో ఏమానవులు క్షణము సేపు సంతోషించుదురో. క్షణములోపల కోపమును పొందుదురో. ప్రతిక్షణమునందును తుష్టిని పొందుచుందురో. అటువంటి చపలచిత్తులయొక్క అనుగ్రహముకూడ మిగుల భయంకరమైనదని తా॥ కాఁబట్టి చపలచిత్తముకల యీభల్లూకము నిన్నురక్షించి తుదకుఁ దానే నిన్నుచంపును. కావున నీవు ఈభల్లూకమును క్రిందఁబడవేయుము. నేను దీనిని భక్షించి నాయిష్టము వచ్చినచోటునకుఁబోయెదను. అంతట నీవును నీపట్టణమునకుఁబోయి సుఖముగనుండవచ్చునని మోసపువచనములను పలికి మోసపుచ్చె. ఆమాటనువిని రాజకుమారుఁడు క్రిందఁబడవేయుటకు ప్రయత్నపడె. అంతలోపల భల్లూకము వృక్షమునుండి పడుచు మఱియొక కొమ్మను పట్టుకొనియె. అంతట రాజకుమారుఁడు విఫలమైన ప్రయత్నముకలవాఁడై ఆభల్లూకమునుచూచి అధికముగాభయమును పొందె. అప్పుడు భల్లూకమిట్లనియె. ఓరీ పాపిష్ఠుఁడా! రాజకుమారుఁడా! ఎందుకు భయమును పొందెదవు. నీపూర్వజన్మమునందు చేసిన కర్మమును నీవనుభవింపవలసి యున్నది. కాఁబట్టినీవు "ససేమిరా,, అని చెప్పుచు పిశాచమై ప్రతివనమునందును సంచరింపుమని శపించె. అంతఁగొంత సేపటికి సూర్యోదయమయ్యె. పిమ్మట పెద్దపులియును నిరాశను చేసికొని అచ్చోటును విడిచిపోయె. అంతట ఆవిధముగా రాజకుమారుని శపించి భల్లూకముకూడ యథేచ్ఛముగపోయె. అనంతరమందు రాజకుమారుఁడును "ససేమిరా,, అని చెప్పుచు పిశాచమై వనములయందంతటను తిరుగుచుండె. అంతటఁ గొంత సేపటికి ఆరాజనందనుఁ డెక్కిన గుఱ్ఱము పట్టణమునకుఁబోయె. అట్లు రాజపుత్రుని విడిచివచ్చిన గుఱ్ఱమునుచూచి ఆవృత్తాంతమును జనులందఱునుపోయి రాజునకుఁ జెప్పిరి. ఆవృత్తాంతమును సర్వమునువిని నందభూపాలుఁడు మంత్రులఁ బిలిచి యిట్లనియె. ఓమంత్రులారా! నాకుమారుఁడు వేటకుఁబోవునప్పుడు అనేకములగు దుశ్శకునములు కలిగె. అట్టి దుశ్శకునములు కలిగినప్పటికిని మ



త్తుఁడై వనమునకుఁబోయె. ఆదుశ్శకునములకు తగినఫలమును వెంటనే పొందె. కాఁబట్టి అశ్వమొక్కటియే వచ్చెను. కాఁబట్టి ఇప్పుడు నేను నాపుత్రుని మార్గమును వెదకుటకొఱకు వనమునకుఁబోయెదననియె. అంతట నామంత్రులందఱును అంగీకారమును పొందిరి. పిమ్మట ఆరాజు మంత్రులతోడను పరివారజనముతోడను కూడుకొనినవాఁడై కుమారుఁడుపోయిన మార్గమును పట్టిపోయి వనమునందుఁ బ్రవేశించె. అంతటఁగొంత సేపటికి ఆయరణ్యమునందు "ససేమిరా,, అని అరచుచు తిరుగుచున్నవాఁడును, పిశాచమువంటివాఁడును, అయినకుమారుని చూచి నందభూపాలుఁడు అధికమైనదుఃఖముకలవాఁడై ఆకుమారుని తీసికొని తనపట్టణమునకు వచ్చె. వచ్చినపిమ్మట ఆపుత్రునకుఁగలిగియున్న పిచ్చిని పోఁగొట్టుటకొఱకు అనేకములయిన చికిత్సలను చేసె. ఎటువంటి చికిత్సలను చేసినను అతని పిచ్చి కుదురకపోయెను. ఆసమయమునందా రాజు నానాశాస్త్రములను చదివిన మంత్రితో నిట్లనియె. ఓమంత్రివర్యా! ఈసమయమునందు శారదానందుఁడున్నయెడల క్షణమాత్రములోపల చికిత్సను చేయునుగదా? అతనిని నేను నిర్నిమిత్తముగా వధించితిని. ఏకార్యమును చేసినను చక్కఁగ నాలోచించి చేయుట యుచితము కాని విచారింపక చేయుట యుచితము కాదు. కావున విచారింపక చేసినయెడల నానావిధములయిన ఆపదలు కలుగును. మఱియును,

శ్లో॥ సహసావిదధీతనక్రియామవివేకః పరమాపదాంపదం। వృణుతేహి విమృశ్యకారిణం గుణలుబ్ధాస్స్వయమేవసంపదః॥

టీ॥ సహసా=శీఘ్రముగా. క్రియామ్=కార్యమును. నవిదధీత = చేయఁగూడదు. అవివేకః=అవివేకము. పరమాపదామ్= అధికములయిన ఆపదలకు. పదమ్=స్థానము. గుణలుబ్ధాః=గుణములయందాసక్తికల. సంపదః= సంపదలు. స్వయమేవ= స్వయముగానే. విమృశ్యకారిణమ్= విచారించిచేయువానిని. వృణుతేహి= వరించుచున్నవికదా॥ తా॥ శీఘ్రముగా ఏకార్యమును చేయఁగూడదు. అవివేకము నానావిధములయిన ఆపదలను కలిగించును. గుణములయందాసక్తికల సంపదలు విచారించి చేయువానియొద్దకు తమంతటఁదామే వచ్చి చేరునని తా॥ మఱియును,

శ్లో॥ అపరీక్ష్యనకర్తవ్యం కర్తవ్యం సుపరీక్షితం। పశ్చాద్భవతి సంతాపో బ్రాహ్మణేన కులం యథా॥

టీ॥ అపరీక్ష్య= విచారింపక. నకర్తవ్యమ్=చేయఁదగినది కాదు. సుపరీక్షితమ్= చక్కఁగా పరీక్షింపఁబడునట్లుగా. కర్తవ్యమ్=చేయఁదగినది. య

ద్వా= ఇట్లుకాదేని. పశ్చాత్=పిమ్మట. సంతాపః=పరితాపము. నకులమ్=నకులముగురించి. బ్రాహ్మణీ=బ్రాహ్మణస్త్రీవలె. భవతి=అగుచున్నది॥ తా॥ ఎట్టికార్యమునైనను విచారింపక చేయఁగూడదు. కావున చక్కఁగ నాలోచించి కార్యములను చేయవలయును. అట్లుగాక అవిచారితముగా కార్యమును చేసినయెడల బ్రాహ్మణస్త్రీ తనబిడ్డను చంపవచ్చిన పామును కఱచి చంపిన ముంగిసయొక్క శరీరమునందు వ్యాపించిన రక్తమును చూచి తనబిడ్డను కఱచియుండునని తలఁచి ఆముంగిసను చంపి పిమ్మట లోనికిఁబోయి చూచి వాస్తవమును తెలిసికొని విచారమును పొందినట్లు విచారమును పొందవలసివచ్చునని తా॥ అను ప్రమాణవచనముల ననుసరించి విచారింపఁగా నేను అవిచారితముగా శారదానందుని చంపితినని విచారమును పొందుచున్న రాజునకు వైద్యుఁడెవ్వఁడును కనఁబడకపోయె. ఆసమయమునందు మంత్రియిట్లనియె. ఓరాజోత్తమా! కాఁగలకార్యానుసారముగ బుద్ధులుపుట్టుచుండును. మఱియును,

శ్లో॥ సహాయస్తాదృశో జ్ఞేయోయాదృశీభవితవ్యతా । తాదృశీసాధ్యతేబుద్ధిస్సామతిస్సాచభావనా॥

టీ॥ భవితవ్యతా= కాఁదగినది. యాదృశీ= ఎటువంటిదో. సహాయః= సహాయము. తాదృశః= అటువంటిది. ఇతి=ఇట్లని. జ్ఞేయః= తెలియఁదగినది. తాదృశీ=అటువంటి. బుద్ధిః=బుద్ధి. సాధ్యతే= సాధింపఁబడుచున్నది. మతిః= బుద్ధి. సా=అది. భావనా= యోచనయును. సా=అది॥ తా॥ ఎటువంటికార్యము కాఁదగియున్నదో అటువంటిబుద్ధి పుట్టును. దానికిఁదగిన సహాయముకలుగును. అటువంటితలంపుకలుగును. అని తా॥ మఱియును,

శ్లో॥ నహిభవతియన్నభావ్యంభవతిచభావ్యంవినాపియత్నేన। కరతలగతమపినశ్యతియస్యహిభవితవ్యతానాస్తి॥

టీ॥ యత్=ఏది. నభావ్యమ్=కాఁదగినదికాదో. తత్= అది. నభవతి= కాదు. భావ్యమ్=కాఁదగినకార్యము. యత్నేనవినాపి= ప్రయత్నములేకయే. భవతిచ=అగుచున్నది. యస్యహి= దేనికి. భవితవ్యతా= కాఁదగుట. నాస్తి=లేదో. తత్=అది. కరతలగతమపి= కరతలమును పొందినప్పటికిని. నశ్యతి= నశించుచున్నది॥ తా॥ ఏది కాఁదగిన కార్యము కాదో అది కానేకాదు. కాఁదగిన కార్యము ప్రయత్నములేకయే అగును. మఱియును, ఏకార్యము కాఁదగినది కాదో అది చేతిలోనేయున్నను నశించిపోవునని తాత్పర్యము॥ అను ప్రమాణవచనముల ననుసరించి ఆలోచింపఁగా మనయోచన లేవియును అక్కఱకు రావని రాజిట్లనియె. ఓమంత్రిపుంగవా! మనమేమిచేయవచ్చును సర్వ



మును కర్మాయత్తమైయున్నది. గతజలసేతుబంధనముతోఁ బ్రయోజనమేమి? ఇప్పుడు మిగులగొప్పదగు ప్రయత్నమును చేయవలయుననిన మంత్రియిట్లనియె. ఓరాజోత్తమా! మిగులగొప్పదగు ప్రయత్నము నెట్లు చేయవలయుననిన రాజిట్లనియె. ఓమంత్రిపుంగవా! నాకుమారునకుఁగల పిచ్చికుదిర్చువాఁడెవ్వఁడైన వచ్చునేని అతనికి అర్ధరాజ్యమునిచ్చెదను. మఱియును, సర్వాభీష్టములను ఇచ్చెదను. అని పట్టణమునందంతటను చాటింపును చేయింపుమనిన విని మంత్రి మీయాజ్ఞానుసారముగఁ జేసెదనని చెప్పి తనయింటికి వచ్చి జరిగినవృత్తాంతమును సర్వమును శారదానందునకుఁ దెలియఁజేసె. ఆవృత్తాంతమును సర్వమును విని శారదానందుఁడిట్లనియె. ఓమంత్రిపుంగవా! నీవు రాజునొద్దకుఁబోయి నాయింట నొకకన్యక కలదు. అది నీపుత్రునిచూచెనేని యేదైన నొకచికిత్సను చేయఁగలదనిన విని మంత్రి అతిశీఘ్రముగఁబోయి ఆవృత్తాంతమును రాజునకు తెలియఁజేసె. అవృత్తాంతమును విని రాజు పరమానందమును పొందినవాఁడై పుత్రునితోడను, పరివారజనముతోడనుకూడ కూడుకొనినవాఁడై మంత్రియొక్క గృహమునకు వచ్చి ఆమందిరమునఁగూర్చుండె. ఆసమయమునందు రాజకుమారుఁడుకూడ ససేమిరా అని చెప్పుచు కూర్చుండె. అప్పుడు శారదానందుఁడు తెరచాటుననుండి యోరాజపుత్రుఁడా! అనిపిలువఁగా ఆరాజపుత్రుఁడు ససేమిరా అని ప్రత్యుత్తరమునిచ్చె. అంతట ఆశారదానందుఁడు॥

శ్లో॥ సద్భావంప్రతిపన్నానాం వంచనేకింవిదగ్ధతా । అంకమారుహ్యసుప్తానాం హననేకింనుపౌరుషమ్॥

టీ॥ సద్భావమ్= మంచియభిప్రాయమును. ప్రతిపన్నానామ్=పొందినవారలయొక్క. వంచనే= వంచనమునందు. విదగ్ధతాకిమ్= నైపుణ్యమాఏమి? అంకమ్= తొడను. ఆరుహ్య=అధిష్ఠించి. సుప్తానామ్= నిద్రించుచున్నవారలయొక్క. హననే= చంపుటయందు. పౌరుషంకిమ్= పరాక్రమమాఏమి? తా॥ ఓరాజపుత్రుఁడా! మంచిస్వభావముకలవారిని వంచనచేయుటయందు నేర్పరితనముకలదా? తొడమీఁదఁబరుండి నిద్రించువారలను చంపుటపరాక్రమమా? అని తా॥ ఇట్టి తాత్పర్యముకల పద్యమును చదివె. ఆపద్యమును వినఁగానే రాజనందనుఁడు నాలుగువర్ణములలోపల ఒకవర్ణమును విడిచిపెట్టి ససేమిరా అని పలుకుచుండె. మరల శారదానందుఁడు॥

శ్లో॥ సేతుందృష్ట్వాసముద్రస్య గంగాసాగరసంగమం। బ్రహ్మహత్యాప్రముచ్యేత మిత్రద్రోహీనముచ్యతే॥

టీ॥ సముద్రస్య = సముద్రముయొక్క. సేతుమ్ = సేతువును. గంగాసాగరసంగమమ్ = గంగాసముద్రములు కలిసినచోటును. దృష్ట్వా = చూచి. బ్రహ్మహత్యా = బ్రహ్మహత్య. ప్రముచ్యేత = విడిచిపోవును. మిత్రద్రోహః = మిత్రద్రోహము. నముచ్యతే = విడువఁబడదు॥ తా॥ సముద్రముయొక్క సేతువును, గంగాసముద్రములయొక్క సంగమస్థానమును చూచినయెడల బ్రహ్మహత్యాదిదోషములుపోవునుకాని మిత్రద్రోహమువలనఁ గలుగు పాతకముమాత్రము పోదనితా॥ అనునట్టి పద్యమును పఠించె. ఆపద్యమును వినుటతోడనే మొదటిరెండక్షరములనువిడిచిపెట్టి "మిరా,, అని పలుకుచుండె. అంతట నూరకుండక శారదానందుఁడు॥

శ్లో॥ మిత్రద్రోహీకృతఘ్నశ్చ యస్తువిశ్వాసఘాతుకః। త్రయస్తేన రకంయాంతి యావచ్చంద్రదివాకరమ్॥

టీ॥ యస్తు = ఎవ్వఁడు. మిత్రద్రోహీ = మిత్రులకుద్రోహమునుచేయువాఁడో. యస్తు=ఎవ్వఁడు. కృతఘ్నశ్చ = చేసినమేలునుమరచిపోవువాఁడో. యస్తు = ఎవ్వఁడు. విశ్వాసఘాతుకః = నమ్మినవాండ్రనుచెరచినవాఁడో. తే = వారు. యావచ్చంద్రదివాకరమ్ = సూర్యచంద్రులున్నంతవఱకు. నరకమ్ = నరకమును. యాంతి = పొందుచున్నారు॥ తా॥ మిత్రులకు ద్రోహమునుచేయువాఁడును, చేసినమేలులను మరచినవాఁడును, నమ్మినవారలను చెరచువాఁడును, సూర్యచంద్రులున్నంతవఱకు నరకమును పొందుచున్నారనితా॥ అనునట్టిపద్యమునుపఠించె. ఈపద్యమునువినఁగానే రాజపుత్రుఁడు మొదటిమూడక్షరములను విడిచిపెట్టి "ససేమిరా,, అనిపలుకుచుండె. అంతటనూరకుండక శారదానందుఁడు॥

శ్లో॥ రాజన్ భోతవపుత్రస్య యదికల్యాణమిచ్ఛసి। దానందేహి ద్విజాతిభ్యోవర్ణానాంబ్రాహ్మణోగురుః,,

టీ॥ భోరాజన్ = ఓరాజా! తవ = నీయొక్క. పుత్రస్య = పుత్రునకు. కల్యాణమ్ = శుభమును. ఇచ్ఛసియది = ఇచ్ఛయించితివేని. వర్ణానామ్ = నాలుగువర్ణములవారికిని. బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు. గురుః = గురువు ఇతి = ఇట్లని. ద్విజాతిభ్యః = బ్రాహ్మణులకొఱకు. దానమ్ = దానమును. దేహి = ఇవ్వుము॥ తా॥ ఓరాజోత్తమా! నీవు నీపుత్రునకు శుభమునుకోరినయెడల నాలుగు వర్ణములవారికిని బ్రాహ్మణుఁడు గురుఁడని బ్రాహ్మణులకు దానమునుచేయుమని తాత్పర్యము॥ అనునట్టి పద్యమును పఠించెను. అటువంటి పద్యమును వినినతోడనే ఆరాజపుత్రుఁడు "ససేమిరా,, అను మాటనువదలి స్వ



స్థచిత్తుఁడైయుండె. పిమ్మట ఆరాజకుమారుఁడు భల్లూకముయొక్క వృత్తాంతమును సర్వమును తెలియఁజేసె. ఆవృత్తాంతమును సర్వమునువిని ఆనందభూపాలుఁడు శారదానందునితో నిట్లనియె.

శ్లో॥ గ్రామేవససికల్యాణి విపినంనైవగచ్ఛసి। ఋక్షవ్యాఘ్రమనుష్యాణాంకథంజానాసిభాషితమ్॥

టీ॥ హేకల్యాణి = ఓశుభప్రదురాలా! గ్రామే = గ్రామమునందు. వససి = నివసించుచున్నావు. విపినమ్ = అరణ్యమును. నైవగచ్ఛసి = పొందవు. ఋక్షవ్యాఘ్రమనుష్యాణామ్ = భల్లూకములయొక్కయు, పెద్దపులులయొక్కయు, మనుష్యులయొక్కయు. భాషితమ్ = సంభాషణమును. కథమ్ = ఏవిధముగా. జానాసి = తెలిసికొనుచున్నావు॥ తా॥ శుభప్రదురాలవైనయోకన్యకా! నీవు గ్రామమునందు నివసించుచున్నావు. అరణ్యమునకుఁబోయినదానవుకావు. ఇంటనుండి యేభల్లూకములయొక్కయు పెద్దపులులయొక్కయు, మనుష్యులయొక్కయు, సంభాషణముల నెట్లు తెలిసికొంటివనితా॥ అనిరాజడిగిన మాటనువిని శారదానందుఁడిట్లనియె. ఓ రాజోత్తమా!

శ్లో॥ దేవద్విజప్రసాదేన వాణీజిహ్వాంమమాశ్రితా। తేనాహమనుజానామిభానుమత్యాయథాంకితమ్॥

టీ॥ దేవద్విజప్రసాదేన = దేవతలయొక్కయు, బ్రాహ్మణులయొక్కయు, అనుగ్రహముచేత. వాణీ=సరస్వతి. మమ=నాయొక్క. జిహ్వామ్= జిహ్వను. ఆశ్రితా=ఆశ్రయించినది. తేన=అందుచేత. భానుమత్యాః= భానుమతియొక్క. అంకితంయథా= చిహ్నమునువలె అనుజానామి= తెలిసికొనుచున్నాను॥ తా॥ దేవతలయొక్కయు బ్రాహ్మణులయొక్కయు అనుగ్రహముచేత సరస్వతి నాజిహ్వను ఆశ్రయించియున్నది. అందుచేత నేను భానుమతియొక్క తొడయందలి మచ్చను తెలిసికొనినట్లు తెలిసికొంటిననితా॥ అనునట్టి తాత్పర్యముకల పద్యమునువిని రాజు అత్యాశ్చర్యముకలవాఁడై తెరనుతీసిచూచె. ఆసమయమునందు శారదానందుఁడు కనఁబడియె. అప్పుడు రాజు పరమానందము కలవాఁడై పుత్రపరివారజనముతోఁ గూడ ఆశారదానందునకు నమస్కారమునుచేసె. అంతట మంత్రి పూర్వవృత్తాంతమును సర్వమును ఆరాజునకుఁ దెలియఁజేసె. ఆవృత్తాంతమును సర్వమునువిని సకలశాస్త్రసంపన్నుఁడగు మంత్రితో నిట్లనియె. ఓమంత్రిపుంగవా! నీసహవాసముచేత నేను కీర్తికలవాఁడనైతిని. కావున సజ్జనసహవాసమునే చేయవలయును. మఱియును,

శ్లో॥ వారయతివర్తమానా మాపదమాగామినీంచసత్సంగః। తృష్ణాంచహంతిపీతం గంగాయాందుర్గతించసద్యోంభః॥

టీ॥ సత్సంగః= సజ్జనసహవాసము. వర్తమానామ్= జరుగుచున్న. ఆపదమ్= ఆపదను. వారయతి= నివారించుచున్నది. ఆగామినీంచ=రాఁబోవునట్టి ఆపదనుకూడ. వారయతి= నివారించుచున్నది. గంగాయాః= గంగానదియొక్క. అంభః=ఉదకము. పీతంసత్=పానముచేయఁబడినదగుచు. సద్యః= అప్పుడే. తృష్ణాంచ= దప్పిని. దుర్గతించ= దుర్గతిని. హరతి= హరించుచున్నది॥ తా॥ సజ్జనసహవాసము ఇప్పటియాపదను ఇఁకమీద రాఁబోవునాపదను వెంటనే పోఁగొట్టుచున్నది. మఱియును, గంగానదియొక్క యుదకము పానము చేయఁబడినతోడనే దప్పినిపాపమునుకూడ పోఁగొట్టుచున్నదని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ నీసహవాసమువలన కీర్తిని పొందితిని. మఱియును, రాజులు నీవంటిమంత్రులను సంపాదించుకొనియుండవలయును. ఓమంత్రిపుంగవా॥

శ్లో॥ సంగ్రహంనకులీనస్యసీదత్యేవకరోతియః। సఏవవధ్యతేరాజ్ఞా సమ్యగారూఢికోయథా॥

టీ॥ యః=ఎవ్వఁడు. కులీనస్య= మంచికులమునందుఁ బుట్టినవానియొక్క. సంగ్రహమ్= సంపాదనమును. కరోతి= చేయుచున్నాఁడో. సః= వాఁడు. సీదత్యేవ= దుఃఖించుచునేయున్నాఁడు. సఏవ= వాఁడే. రాజ్ఞా= రాజుచేత. సమ్యక్=లెస్సగా. ఆరూఢికోయథా= ఆరూఢికునివలె. వధ్యతే= చంపఁబడుచున్నాఁడు॥ తా॥ లోకములో ఏరాజు సత్కులమునందుఁ బుట్టినవానిని సంపాదింపఁడో అటువంటిరాజు దుఃఖమునుపొంది యేతీరును. మఱియును అట్టి కులహీనుఁడు రాజుచేత ఆరూఢికునివలె చంపఁబడునని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ సద్గుణములుకల మంత్రిలేనివాఁడు చెడిపోవునని చెప్పి మఱియు ననేకవిధముల ఆమంత్రిని స్తోత్రముచేసి అనేక విధములగు బహుమానములనొసంగి ఆమంత్రియొక్క సహాయముచేత రాజ్యమును చేయుచుండెనని మంత్రిభోజరాజునకు చెప్పి మఱియు నిట్లనియె. ఓభోజమహారాజా! ఏరాజు మంత్రివాక్యమును వినుచుండునో అటువంటిరాజు దీర్ఘాయుష్యముకలవాఁడును, సుఖముకలవాఁడును అగుచున్నాఁడని చెప్పి అంతటితో నేమియుఁజెప్పక యూరకుండె. ఆవిధముగా మంత్రిచెప్పినమాటలనువిని భోజమహారాజు తనమంత్రిని గౌరవించి ఆసింహాసనమును పట్టణములోనికిఁ దీసికొనిపోయి వేయిసంఖ్యకల రత్నస్తంభములచేత మంటపమునుచేయించి మంచిముహూర్తముకల దినమునందు సింహాసనమును ప్రతిష్ఠచేసె. అంతట దివ్యౌషధములతోఁగూడుకొనిన పుణ్యతీర్థోదకములచేత మంత్రపూర్వకముగ బ్రాహ్మణులచే అభిషేకమునుచేయించి స్త్రీలచేత నీరాజనమునిప్పించె. అంతట కవులచేతను, బ్రాహ్మణులచేతను ఆశీర్వదింపఁబడి అధికముగా సంతోషించె. వందిమాగధులచేత ప్రశంసచేయఁబడె. పిమ్మట నాలుగువర్ణములవారిని దానమానములచేత గౌరవించిదీనులు, అంధులు, బంధిసులు, కుబ్జులు, మొదలగువారికి నానావిధములగు ధనములనిచ్చి ఛత్రచామరాంకితుఁడైవచ్చి ఆసింహాసనము నెక్కఁదలఁచి ఆసింహాసనముయొక్క మెట్లయందు నిర్మింపఁబడియున్న మొదటిబొమ్మయొక్క శిరస్సునందు పాదపద్మములను పెట్టఁబోయె. ఆసమయమునందు ఆసాలభంజిక (ఆబొమ్మ) మనుష్యవాక్కుతో రాజునకిట్లనియె. ఓభోజమహారాజా! నీవు విక్రమార్కునకుఁగల శౌర్యధైర్యదానదాక్షిణ్యసాహసాది గుణములుకలిగియున్నయెడల నీవీసింహాసనమునెక్కుటకుఁ దగినవాఁడవగుదువనినవిని భోజమహారాజిట్లనియె. ఓసాలభంజికా! నాకుమాత్రము ధైర్యశౌర్యదానదాక్షిణ్యాదిగుణములులేవా? నావలన అనేకులగు యాచకులుతృప్తినిపొందుటలేదా? అనినవిని సాలభంజిక యిట్లనియె. ఓభోజరాజా! నీవు నీగుణములను నిన్నును పొగడుకొనుచున్నావు కనుక ఈపొగడుకొనుట అనుచితమైయున్నది. మఱియునోరాజోత్తమా! లోకములో ఏపురుషుఁడు తనగుణములను ఇతరులదోషములను ప్రశంసచేయునో అట్టివాఁడు దుర్జనుఁడనఁబడును. సజ్జనుఁడు ఆవిధముగా తనగుణములను ఇతరులదోషములను చెప్పఁడు. మఱియును,

శ్లో॥ స్వగుణానివపరదోషాన్వక్తుంశక్నోతిదుర్జనోలోకే। పరదోషాన్న స్వగుణాన్వక్తుంశక్నోతిసజ్జనస్సత్యమ్॥

టీ॥ లోకే= లోకమునందు. దుర్జనః= దుర్జనుఁడు. స్వగుణానిః= తనగుణములనువలెనే. పరదోషాన్= ఇతరులదోషములను. వక్తుమ్= చెప్పుటకొఱకు. శక్నోతి= సమర్థుఁడగుచున్నాఁడు. సజ్జనః=సజ్జనుఁడు. స్వగుణాన్= తనగుణములను. పరదోషాన్= ఇతరులదోషములను. వక్తుమ్= చెప్పుటకొఱకు. నశక్నోతి= సమర్థుఁడుకాఁడు. సత్యమ్=నిజము॥ తా॥ ఓభోజమహారాజా! లోకములో దుర్జనుఁడగువాఁడు తనగుణములను ఇతరులదోషములను చెప్పుచుండును. సజ్జనుఁడగువాఁడు తనగుణములను ఇతరులదోషములను చెప్పఁడని తా॥ మఱియును,

శ్లో॥ ఆయుర్విత్తం గృహచ్ఛిద్రంమంత్రమౌషధసంగమౌ । దానం మానావమానౌచనవగోప్యానికాంయేత్॥

టీ॥ ఆయుః- ఆయుష్యము. విత్తమ్- ధనము. గృహచ్ఛిద్రమ్- ఇంటిలోనిలోపములు. మంత్రమ్- ఆలోచన. ఔషధసంగమౌ- మందునుసంగమములు. దానమ్- దానము. మానావమానౌచ- మానావమానములు. (అనునట్టి) నవ- తొమ్మిదియును. మనీషిభిః- విద్వాంసులచేత. గోప్యాని- దాచదగినవి॥ తా॥ ఆయుష్యము, ధనము, ఇంటిలోనిఛిద్రములు, ఆలోచన, ఔషధము, సంగమము, దానము, మానావమానములు, అనుతొమ్మిదియును విద్వాంసులగువారిచేత దాచఁదగినవనితా॥ అను ప్రమాణానుసారముగ ఆత్మస్తుతినిచేసికొనుట యుచితముకాదు. నీవు ఆత్మస్తుతిని చేసికొంటివి కనుక నీవు యోగ్యుఁడవుకావని ఆమొదటి సాలభంజిక చెప్పినమాటనువిని భోజరాజు ఆశ్చర్యముకలవాఁడై ఆసాలభంజికతో నిట్లనియె. ఓసాలభంజికా! నీవు నిజమును చెప్పితివి. తనగుణములను పొగడుకొనినవాఁడు మూర్ఖుఁడే. నేను ఆత్మస్తుతినిచేసికొనుట అనుచితమే. అయినను అదియంతయును అటుండనిచ్చి ఈసింహాసనము ఏమహారాజుదో ఆమహారాజుయొక్క గుణములను చెప్పుము. వినియెదననినవిని సాలభంజిక యిట్లనియె. ఓ మహారాజా! ఈసింహాసనము విక్రమార్కమహారాజుగారిది. ఆవిక్రమార్కమహారాజుయొక్క ఔదార్యమును చెప్పెదను. వినుము.

శ్లో॥ నిరీక్షితేసహస్రంతునియుతంతుప్రజల్పితే। హసితేలక్షమాప్నోతితుష్టేర్థీకోటిశోనృపే॥

టీ॥ నృపే- విక్రమార్కమహారాజు. నిరీక్షితేసతి- చూడఁబడినవాఁడగుచునుండఁగా. అర్థీ- యాచకుఁడు. సహస్రంతు- వేయివరహాలను. ఆప్నోతి- పొందుచున్నాఁడు. ప్రజల్పితేసతి- సంభాషించిన వాఁడగుచునుండఁగా. నియుతమ్- పదివేలవరహాలను. ఆప్నోతి- పొందుచున్నాఁడు. హసితేసతి- నవ్వినవాఁడగుచునుండఁగా. లక్షమ్- లక్షను. ఆప్నోతి- పొందుచున్నాఁడు. తుష్టేసతి- సంతోషించినవాఁడగుచునుండఁగా. కోటిశః- కోటికోటిగా. ఆప్నోతి- పొందుచున్నాఁడు॥ తా॥ ఓభోజమహారాజా! యాచకుఁడు విక్రమార్కమహారాజును చూచినతోడనే వేయివరహాలనుపొందును. విక్రమార్కమహారాజుతో సంభాషించినతోడనే పదివేలవరహాలను పొందుచున్నాఁడు. విక్రమార్కమహారాజును నవ్వించినతోడనే లక్షవరహాలను పొందుచున్నాఁడు. విక్రమార్కమహారాజు సంతోషించెనేని కోటికోటిగా



పొందుచున్నాఁడనితా॥ ఓభోజరాజా! ఇటువంటిఔదార్యము నీయందుఁగలదా? అని ఆసాలభంజిక చెప్పినమాటనువిని భోజమహారాజు ఏమియునుపలుకక ముహూర్తమునుంచిపోవుటచేత ఇంటికిపోయె.

ఇట్లని విక్రమార్కచరిత్రమునందలి మొదటికథముగిసెను.

అంతటఁ గొన్నిదినములు కడచినపిమ్మట భోజరాజు శుభముహూర్తమును విచారించుకొని విక్రమార్కుని సింహాసనము నెక్కుటకువచ్చె. వచ్చి మొదటివలెనే సింహాసనము నెక్కఁబోయె. ఆసమయమునందు రెండవసోపానమునందున్న సాలభంజిక యిట్లనియె. ఓహో భోజమహారాజా! విక్రమార్కమహారాజునకుఁగల యౌదార్యము నీకుఁగలదేని ఈసింహాసనమునందెక్కుమనినవిని భోజమహారాజిట్లనియె. ఓసాలభంజికా! ఆవిక్రమార్కమహారాజుయొక్క ఔదార్యాదికమును చెప్పుమనిన సాలభంజిక ఆవృత్తాంతమును చెప్పఁదలఁచి యిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కమహారాజు రాజ్యమును చేయుచుండఁగా ఒకనాఁడుచారులనుపిలిచి యిట్లనియె. ఓచారులారా! భూమియందంతటను తిరుగుఁడు. ఎక్కడెక్కడ కౌతుకమును కలుగఁజేయునట్టి తీర్థములుకలవో వానినన్నింటినిచూచిరండు. మఱియును, విచిత్రములగు దేవాలయములను చూచిరండు. వచ్చి ఆవృత్తాంతములనన్నింటిని నాకుఁదెలియఁజేయుఁడనినవిని ఆచారులు తమయాజ్ఞానుసారముగఁ బోయివచ్చెదమనిచెప్పి బయలువెడలిపోయిరి. అట్లు పోయిన చారులు సకలదేశములయందును తిరిగివచ్చిరి. వచ్చినవారలలో నొకఁడుముందుగావచ్చి విక్రమార్కమహారాజునకు నమస్కారమును చేసి వినయముగా నిట్లనియె. ఓరాజోత్తమా! చిత్రకూటపర్వతముయొక్క సమీపమునందలి యొకతపోవనమధ్యయందు మిగుల మనోహరమైన యొకదేవాలయముకలదు. ఆపర్వతమునందు మిగుల నున్నతమైన శిఖరమునుండి నిర్మలమైన యొకజలధారపడుచున్నది. ఆజలధారయందు స్నానమునుచేయుటచేత మహాపాతకాదులుకూడ నశించుచున్నవి. మఱియును, ఏపాపాత్ముఁడు ఆజలధారయందు స్నానమును చేయుచున్నాఁడో అట్టివానియొక్క శరీరమునుండి మిగులకలుషమైన యుదకము బయలువెడలుచున్నది. అందువలనవాఁడుపావనుఁడగుచున్నాఁడు. ఓరాజోత్తమా! అక్కడ ఇంకొక్కవిచిత్రము కలదు. అదియేమనిన?— ఆపర్వతమునందొకబ్రాహ్మణుఁడు అత్యధికమైన హోమకుండమునందు దినదినమందును హోమమును చేయుచున్నాఁడు. అతనికెన్నిసంవత్సరములు గతించినదియును తెలియదు. ప్రతిదినమందు

ను॥ ఆగ్నికుండము వలన బయలుదేరినభస్మము పర్వతాకారమైయున్నది. ఆ బ్రాహ్మణుఁడెవ్వనితోడను మాటలాడఁడు. ఈవిధముగా మిగుల నాశ్చర్యకరమైన స్థానమును చూచితిని. మిగిలినసంగతు లేమియును తెలియవని చెప్పి యూరకుండె. అంతట నావిక్రమార్కమహారాజు ఒంటరిగా ఆయూతతోఁగూడ చిత్రకూటపర్వతమునకుఁబోయి యిట్లనియె. ఓహో ఈస్థానము మిగుల పవిత్రమైనది. ఇక్కడసాక్షాత్తుగా జగదంబిక నివసించుచున్నది. చూచుచుండఁగానే నామనస్సు సఫలమగుచున్నది. ఇకను చిరకాలము నివసించువారలను గుఱించి యేమిచెప్పవలయును. అనిచెప్పి ఆకొండకాలువయందు స్నానమునుచేసి దేవతకు నమస్కారమునుచేసి బ్రాహ్మణుఁడు హోమము చేయుచున్నచోటునకుఁబోయి నమస్కరించి ఓబ్రాహ్మణోత్తమా! ఎన్నిదినములనుండి హోమమును చేయుచున్నావనినవిని ఆబ్రాహ్మణుఁడిట్లనియె. ఓరాజోత్తమా! సప్తర్షిమండలమెప్పుడు రేవతీ ప్రథమచరణమునుపొందెనో అప్పుడు నేనిహోమమును చేయుటకు ప్రారంభించితిని. ఇప్పుడు ఆసప్తర్షిమండలము అశ్వినీనక్షత్రమునందు నివసించుచున్నది. ఇంతవఱకు నూరుసంవత్సరములయ్యెను. ఇంతకాలమైనను ఆదేవతప్రసన్నురాలుకాలేదనినవిని అవిక్రమార్కమహారాజు దేవతకు నమస్కారమునుచేసి హోమమునుచేసె. అప్పుడును ఆదేవతప్రసన్నురాలు కాకపోయె. అనంతరమందావిక్రమార్కమహారాజు అధికమైన సాహసముకలవాఁడై తనతలకాయను ఛేదించి హోమమునుచేయుచున్నానని చెప్పి కంఠమునందు ఖడ్గమును పెట్టి శిరస్సును ఖండింపఁబోయె. ఆసమయమునందు ఓసాహసవంతుఁడా! నేను ప్రసన్నురాలనయితిని. వరమును కోరుమనిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓదేవీ! ఈబ్రాహ్మణుఁడు చిరకాలమునుండి అతినియతుఁడై హోమమునుచేయుచున్నాఁడు. ఏమిహేతువుచేత నాకుఁబ్రసన్నురాలవైన విధముగ ఈబ్రాహ్మణునకేలప్రసన్నురాలవుకాలేదనిన ఆదేవియిట్లనియె. ఓరాజోత్తమా! ఈబ్రాహ్మణుఁడు చిరకాలమునుండి హోమమును చేయుచున్నాఁడుగాని యితనిమనస్సుమాత్రము స్వస్థమైయుండలేదు. చపలచిత్తుని తపస్సుఫలమునీయదుకదా? మఱియును,

శ్లో॥ అంగుళ్యగ్రేణయజ్జప్తం యజ్జప్తంపర్వలంఘనైః। వ్యగ్రచిత్తేనయజ్జప్తంత్రివిధంనిష్ఫలంభవేత్॥

టీ॥ యత్ = ఏమంత్రము. అంగుళ్యగ్రేణ= వ్రేళ్లయొక్క అగ్రభాగములచేత. జప్తమ్=జపింపఁబడినదో. పర్వలంఘనైః= పర్వములనతిక్రమించు



టలచేత. యత్=ఏమంత్రము. జప్తమ్=జపింపఁబడినదో. వ్యగ్రచిత్తేన= చపలచిత్తునిచేత. యత్=ఏమంత్రము. జప్తమ్= జపింపఁబడినదో. తత్ = అటువంటి. త్రివిధమ్= మూఁడువిధములయినజపమును. నిష్ఫలమ్ = ఫలరహితమైనది. భవేత్=అగును॥ తా॥ అంగుళ్యగ్రములచేత చేయఁబడినజపమును, పర్వములనతిక్రమించి చేసినజపమును, చపలచిత్తునిచేత చేయఁబడిన జపమును నిష్ఫలమైనదగుచున్నదని తా॥ మఱియును,

శ్లో॥ నకాష్ఠేవిద్యతేదేవో నపాషాణేనమృణ్మయే। భావేహివిద్యతేదేవస్తస్మాద్భావోహికారణమ్॥

టీ॥ కాష్ఠే= కాష్ఠమునందు. దేవః=దేవుఁడు. నవిద్యతే=లేడు. పాషాణే= పాషాణమునందును. మృణ్మయే=మృద్వికారమైనదానియందును. దేవః=దేవుఁడు. నవిద్యతే=లేడు. దేవః=దేవుఁడు. భావే=భావమునందు. విద్యతే=ఉన్నాఁడు. తస్మాత్= అందువలన. భావః= భావము. కారణంహి= కారణముకదా॥ తా॥ దేవుఁడుదారువునందును, పాషాణమునందును, మృణ్మయమైనబొమ్మయందును లేఁడు. మఱియేమనిన దేవుఁడు భావమునందున్నాఁడు. కాఁబట్టి సర్వమునకును భావమేకారణముకదా? అని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ మంత్రేతీర్థేద్విజేదైవేదైవజ్ఞేభేషజేగురౌ। యాదృశీభావనాయత్రసిద్ధిర్భవతితాదృశీ॥

టీ॥ మంత్రే= మంత్రమునందును. తీర్థే=తీర్థమునందును. ద్విజే= బ్రాహ్మణునియందును. దైవే= దేవునియందును. దైవజ్ఞే=జ్యోతిష్కునియందును. భేషజే= వైద్యునియందును. గురౌ= గురువునందును. యత్ర= ఏస్థలమునందు. యాదృశీ=ఎటువంటి. భావనా= తలంపు. భవతి=అగుచున్నదో. తాదృశీ=అటువంటి. సిద్ధిః=సిద్ధి. భవతి=అగుచున్నది॥ తా॥ మంత్రమునందును, తీర్థమునందును, బ్రాహ్మణునియందును, దేవునియందును, జ్యోతిషునియందును, వైద్యునియందును, గురువునందును, ఎటువంటి భావన కలిగియుండునో ఆభావనకు తగినఫలము కలుగుచున్నదని తా॥ అను ప్రమాణానుసారముగ చపలచిత్తునితపస్సు ఫలింపదనిచెప్పఁగావిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓదేవీ! నీవు నాకుప్రసన్నురాలవైనయెడల ఈ బ్రాహ్మణునియొక్క మనోరథమును నిండింపుమనినవిని ఆదేవియిట్లనియె. ఓవిక్రమార్కమహారాజా! మిగుల గొప్పదైన కృత్యమువలె నీదేహాయాసమును గణనచేయక ఇతరులయొక్క దేహాయాసమును పోఁగొట్టుచున్నావు. మఱియును,

శ్లో॥ ఛాయామన్యస్యకుర్వంతి స్వయంతిష్ఠంతిచాతపే। ఫలంతిచపరార్థేషు నాత్మహేతోర్మహాద్రుమాః॥

టీ॥ మహాద్రుమాః= గొప్పవగువృక్షములు. అన్యస్య= ఇతరునకు. ఛాయామ్= ఛాయను. కుర్వంతి= చేయుచున్నారు. ఆతపే= ఎండయందు. స్వయమ్= సహజముగా. తిష్ఠంతి= ఉన్నవి. పరార్థేషు = ఇతరులనిమిత్తముగా. ఫలంతి= ఫలించుచున్నవి. ఆత్మహేతోః= తననిమిత్తము. నఫలంతి= ఫలించుటలేదు॥ తా॥ మిగుల నధికములయిన వృక్షములు తాముఎండయందు నివసించి యితరులకు నీడనిచ్చుచున్నవి. మఱియును పరుల నిమిత్తముగా ఫలించుచున్నవని తా॥ మఱియును,

శ్లో॥ పరోపకారాయవహంతినిమ్నగాః పరోపకారాయదుహంతిధేనవః। పరోపకారాయఫలంతిభూరుహాః పరోపకారాయసతాంవిభూతయః॥

టీ॥ నిమ్నగాః= నదులు. పరోపకారాయ= ఇతరులకుపకారముచేయుటకొఱకు. వహంతి= ప్రవహించుచున్నవి. ధేనవః= ధేనువులు. పరోపకారాయ= పరోపకారముకొఱకు. దుహంతి= (పాలను) పిండుచున్నవి. భూరుహాః= వృక్షములు. పరోపకారాయ= పరోపకారముకొఱకు. ఫలంతి= ఫలించుచున్నవి. సతామ్= సజ్జనులయొక్క. విభూతయః= సంపదలు. పరోపకారాయ=పరోపకారముకొఱకు. భవంతి=అగుచున్నవి॥ తా॥ నదులు పరోపకారముకొఱకు ప్రవహించుచున్నవి. వృక్షములు పరోపకారముకొఱకు ఫలించుచున్నవి. గోవులు పరోపకారముకొఱకు పాలను పిండుచున్నవి. సత్పురుషులయొక్క సంపదలు పరోపకారముకొఱకగుచున్నవని తా॥ అను ప్రమాణానుసారముగ ఓవిక్రమార్కమహారాజా నీసంపదలు పరోపకారముకొఱకే ఉపయోగించుచున్నవని స్తోత్రముచేసి ఆబ్రాహ్మణునియొక్కకోర్కెనుతీర్చి ఆదేవత అంతర్ధానమునుపొందె. అంతట ఆ విక్రమార్కమహారాజును తనపట్టణమునకుఁబోయెనని యీకథనుచెప్పి సాలభంజిక భోజమహారాజుతో నిట్లనియె. ఓభోజమహారాజా! నీకీసింహాసనము నెక్కవలయునని కోర్కెయున్నయెడల విక్రమార్కునకుఁ గలిగియున్న గుణములు నీయందు లేవు. కావున నీవీసింహాసనము నెక్కఁదగ వనినవిని భోజమహారాజూరకుండి సుముహూర్తము మించిపోవుటచేత ఆనాటికిఇంటికిఁబోయె.



ఇట్లని విక్రమార్కునిచరిత్రమునందలి రెండవకథ ముగిసెను.

———(*) మూడవచరిత్రము. (*)———

అంతట మరల నొకనాఁడు భోజమహారాజు సుముహూర్తమును విచారించుకొని అట్టి మంచిముహూర్తమునందు విక్రమార్కమహారాజుయొక్క సింహాసనము నెక్కుటకువచ్చె. వచ్చినవెంటనే మూడవసాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! ఈసింహాసనముమీద నీవెక్కుటకు తగవు. విక్రమార్క మహారాజునకుఁగల శౌర్యధైర్యాది గుణములుకలవాఁడు ఈసింహాసనముమీద నెక్కఁదగును కాని యితరుఁడు ఈసింహాసనముమీద నెక్కఁదగడనినవిని భోజమహారాజిట్లనియె. ఓసాలభంజికా! విక్రమార్కునియొక్క ఔదార్యము మొదలుగాఁగల గుణములను చెప్పుమనిన సాలభంజికయిట్లనియె. ఓభోజమహారాజా! నీకు విక్రమార్కమహారాజుయొక్క ఔదార్యమును వినవలయునని కోర్కెకలదేని చెప్పెదను. వినుము. విక్రమార్కమహారాజుతో సమానుఁడగురాజు భూలోకమునందెవ్వఁడును లేడు. అతని మనస్సునందు అణుమాత్రమైనను వికల్పములేదు. మఱియును,

శ్లో॥ అయంనిజఃపరశ్చేతివికల్పోలఘుచేతసాం। పునస్తూదారచిత్తానాంవసుధైవకుటుంబినీ॥

టీ॥ అయం= వీఁడు. నిజః= స్వీయుఁడు. అయమ్= వీఁడు. పరః= ఇతరుఁడు. ఇతి=ఇట్లని. లఘుతేజసామ్= స్వల్పమైనతేజస్సుకలవారికి. వికల్పః= వికల్పము. భవతి= అగుచున్నది. ఉదారచిత్తానాంపునః = గంభీరమైనచిత్తముకలవారికైతే. వసుధైవ= భూమియే. కుటుంబినీ= కుటుంబముకలది॥ తా॥ స్వల్పమైనబుద్ధికలవారికి వీఁడుస్వీయుఁడు వీఁడుపరుఁడు అని వికల్పముకలుగుచున్నది. గొప్పవారికి భూమియంతయును తమకుటుంబమే అగుచున్నదని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ నాలోచించి విక్రమార్కమహారాజు తనమనస్సునందు కొంచెమైనను వికల్పములేకయుండును. మఱియును, సాహసమునందును, దీనరక్షణమునందును, ధైర్యమునందును, ఆవిక్రమార్కమహారాజునకు సమానుఁడెవ్వఁడును లేడు. మఱియును, ఇంద్రాదులుకూడ ఆవిక్రమార్కమహారాజునకు సహాయమును చేయుచుందురు. మఱియును,

శ్లో॥ ఉద్యోగస్సాహసంధైర్యం బుద్ధిశ్శక్తిఃపరాక్రమః। షడేతేయస్యతిష్ఠంతితస్యదేవోపిశంకతే॥

టీ॥ ఉద్యోగః= ఉద్యోగము. సాహసమ్= సాహసము. ధైర్యమ్=

ధైర్యము. బుద్ధిః=బుద్ధియును. శక్తిః=సామర్థ్యమును. పరాక్రమః= పరాక్రమమును. (అనునట్టి) ఏతే=ఈ. షట్=ఆఱును. యస్య=ఎవనికి. తిష్ఠంతి= ఉన్నవో. తస్య=అట్టివానికి. దేవోఽపి=దేవుఁడును. శంకతే= భయపడుచున్నాఁడు॥ తా॥ ప్రయత్నము, సాహసము, ధైర్యము, బుద్ధి, సామర్థ్యము, పరాక్రమము, అను నాఱును ఎవనికికలిగియుండునో వానికిదేవుఁడుకూడ భయమునుపొందుచున్నాఁడని తా॥ మఱియును, అతిథులయొక్క ఇష్టమును ఎవ్వఁడు నెరవేర్చుచున్నాఁడో అట్టివానియొక్క ఇష్టమును దేవుఁడే సంపాదించుచున్నాఁడు. మఱియును,

శ్లో॥ కృతోవినిశ్చయః పుంసాందేవఃపూరయతీప్సితం। విష్ణుచక్రం గరుత్మాంశ్చ నాస్తితస్య యదాహవే॥

టీ॥ పుంసామ్= పురుషులకు. వినిశ్చయః= నిశ్చయము. కృతశ్చేత్= చేయఁబడెనేని. పుంసామ్= పురుషులయొక్క. ఈప్సితమ్= ఇష్టమును. పూరయతి= నిండించుచున్నాఁడు. యత్= ఏకారణమువలన. తస్య=అతనికి. ఆహవే= యుద్ధమునందు. విష్ణుచక్రమ్= విష్ణుచక్రమును. గరుత్మాంశ్చ= గరుత్మంతుఁడును. నాస్తి= లేడో॥ తా॥ నిశ్చయమైన బుద్ధికలవానికి యుద్ధమునందు విష్ణుచక్రము గరుత్మంతుఁడు అనునవి లేకపోవుటవలన దేవుఁడే వానియొక్క ఇష్టమును నిండించుచున్నాఁడని తా॥ మఱియును,

శ్లో॥ ఉత్సాహసంపన్నమదీర్ఘసూత్రం క్రియావిధిజ్ఞంవిషయేష్వసక్తం। శూరంకృతజ్ఞందృఢనిశ్చయంచలక్ష్మీస్స్వయంవాంఛతివాసహేతోః॥

టీ॥ ఉత్సాహసంపన్నమ్= ఉత్సాహసంపదకలవాఁడును. అదీర్ఘసూత్రమ్= శీఘ్రముగాఁ జేయఁదగినకార్యమును చేయువాఁడును. క్రియావిధిజ్ఞమ్= క్రియలయొక్కవిధిని తెలిసికొనినవాఁడును. విషయేషు = విషయములయందు. అసక్తమ్=ఆసక్తిలేనివాఁడును. శూరమ్ శూరుఁడును. కృతజ్ఞమ్= చేసినమేలును మఱవనివాఁడును. దృఢనిశ్చయంచ = దృఢమైన నిశ్చయముకలవాఁడును. (అయిన) మానవుని. లక్ష్మీః=లక్ష్మీదేవి. వాసహేతోః= నివాసమునకుఁగాను. స్వయమ్= తానుగానే. వాంఛతి= కోరుచున్నది॥ తా॥ ఉత్సాహము కలవాఁడును, చేయఁదగినకార్యములను శీఘ్రముగాఁ జేయువాఁడును, కార్యములయొక్క విధులను చక్కఁగాఁ దెలిసినవాఁడును, విషయములయందాసక్తిలేనివాఁడును, శూరుఁడును, చేసినమేలును మఱవనివాఁడును, దృఢమైన నిశ్చయముకలవాఁడును, అయిన మానవుని నివాసముకొఱకుఁగా లక్ష్మీదేవి తనంతటఁదానేవచ్చి కోరుచున్నదని తాత్పర్యము॥ ఈవిధముగా



సకలగుణములును కల విక్రమార్కమహారాజు సర్వసంపదలతోడను నిండినవాఁడై సకల భూమండలమును పాలించుచు ఒక్కనాడు తనమనస్సునందిట్లని యాలోచించె. ఈసంసారము అనిత్యమైనది. ఎప్పుడు ఏమిసంభవించునో ఎవ్వరికిని తెలియదు. అందువలన సంపాదింపఁబడిన ధనము దానభోగాదుల కుపయోగింపనియెడల నిష్ఫలమగుచున్నది. కావున సంపాదించినధనమునకు సత్పాత్రయందు దానముచేయుటయే మొదటిఫలమైయున్నది. ఎవనికా ఫలముకలుగదో వానికి నాశమేకలుగును. మఱియును,

శ్లో॥ దానంభోగోనాశస్తిస్రో గతయోభవంతివిత్తస్య। యోనదదాతినభుంక్తే తస్యతృతీయాగతిర్భవత్యేవ॥

టీ॥ విత్తస్య= ధనమునకు. దానమ్= దానము. భోగః=భోగము. నాశః= నాశము (అని) గతయః= మార్గములు. తిస్రః= మూఁడు. భవంతి=అగుచున్నవి. యః=ఎవ్వఁడు. నదదాతి= ఈయఁడో. నభుంక్తే= అనుభవింపఁడో. తస్య= అతనియొక్క. విత్తస్య= ధనమునకు. తృతీయా= మూఁడవదైన. గతిః= గతి. భవత్యేవ= అగుచునేయున్నది॥ తా॥ దానము, భోగము, నాశము, అని ధనమునకు మూఁడుగతులు. ఎవ్వఁడు ధనమును పరులకీయఁడో. ఎవ్వఁడు అనుభవింపఁడో. అతనిధనమునకు మూఁడవగతియని తా॥ మఱియును,

శ్లో॥ దాతవ్యంభోక్తవ్యంసతివిభవేసంగ్రహోనకర్తవ్యః। పశ్యేహమధుకరాణాంసంచితమర్థంహరంతిలోకేన్యే॥

టీ॥ విభవేసతి= ఐశ్వర్యముకలుగుచునుండఁగా. దాతవ్యమ్= ఈయఁదగినది. భోక్తవ్యమ్= అనుభవింపఁదగినది. సంగ్రహః= సంగ్రహము. నకర్తవ్యః=చేయఁదగినదికాదు. పశ్య=చూడుము. ఇహ=ఇక్కడ. మధుకరాణామ్= తుమ్మెదలయొక్క. సంచితమ్= సంపాదింపఁబడిన. అర్థమ్=ధనమును. లోకే= లోకమునందు. అన్యే= ఇతరులు. హరంతి= హరించుచున్నారు॥ తా॥ ఐశ్వర్యము కలుగుచునుండఁగా అనుభవింపవలయును. పరులకు ఈయవలయును. మఱియు నోమిత్రుఁడా! చూడుము. తుమ్మెదలుచేర్చిపెట్టిన తేనెను ఇతరులనుభవించుచున్నారని తా॥ మఱియును,

శ్లో॥ అనుభవతదత్తవిత్తంమాన్యంమానయతసజ్జనంభజత। అతిపరుషపవనలులితాదీపశిఖేవాతిచంచలాలక్ష్మీః॥

టీ॥ దత్తవిత్తమ్= ఇయ్యఁబడినధనమును. అనుభవత= అనుభవింపుఁడు. మాన్యమ్= పూజింపఁదగినవానిని. మానయత= గౌరవింపుఁడు. సజ్జనమ్= సజ్జనుని. భజత=సేవింపుఁడు. లక్ష్మీః= సంపద. అతిపరుషపవనలులి

తా= మిగులఁగఠినమైన వాయువుచేత కదల్పఁబడిన. దీపశిఖేవ= దీపశిఖవలె. అతిచంచలా= మిగులఁజపలమైనది॥ తా॥ దేవునిచేత (లేక) ఇతరులచేత ఇయ్యఁబడినధనమును అనుభవింపుఁడు. పూజింపఁదగినవానిని పూజింపుఁడు. సజ్జనుని సేవింపుఁడు. సంపదమిగులఁగఠినమైనవాయువుచేత కదల్పఁబడిన దీపజ్వాలవలె మిగులఁ జపలమైనస్వభావముకలదని తా॥ మఱియును,

శ్లో॥ ఉపార్జితానాంవిత్తానాంత్యాగఏవహిరక్షణం । తటాకోదరసంస్థానాంపరీవాహఇవాంభసామ్॥

టీ॥ ఉపార్జితానామ్= సంపాదింపఁబడిన. విత్తానామ్=ధనములకు. త్యాగఏవహి= పరులకిచ్చుటయే. తటాకోదరసంస్థానామ్ = తటాకముయొక్కయుదరమునందున్న. అంభసామ్= ఉదకములకు. పరీవాహఇవ= ప్రవాహమువలె. రక్షణమ్= సంరక్షణము॥ తా॥ సంపాదింపఁబడిన ధనములకు పరులకిచ్చుటయే తటాకముయొక్క మధ్యయందున్న యుదకములకు ప్రవాహమువలె రక్షణమని తా॥ అను ప్రమాణవచనములనుపట్టి విచారించి సర్వధనమును దక్షిణగానిచ్చునట్టి యజ్ఞమును చేయుటకొఱకు యత్నించెను. అనంతరమందు శిల్పులచేత మిగుల మనోహరమైన యాగశాలను నిర్మింపఁజేసెను. మఱియును, సమస్తయజ్ఞసంభారములను సంపాదించె. అనంతరమందు దేవఋషి గంధర్వ సిద్ధాదులనుపిలిపించె. మఱియును, బ్రాహ్మణులును, రాజులును, బంధువులునువచ్చిరి. ఆసమయమునందు విక్రమార్కమహారాజు సముద్రుని పిలుచుటకు మరచిపోయి ఒకబ్రాహ్మణుని పిలిచి సముద్రుని పిలిచి రమ్మనిపెక్పె. అంత బ్రాహ్మణుఁడు సముద్ర తీరమునకుఁ బోయి గంధపుష్పాక్షతాదుల చేత సముద్రునిపూజించి యిట్లనియె. షడ్గుణైశ్వర్య సంపన్నుఁడవైన యోరత్నాకరుఁడా! విక్రమార్కమహారాజు యజ్ఞమునుచేయుఁగలఁడు. అందువలన నేను ఆరాజుచేత ప్రేరితుఁడనై నేను నిన్నుఁబిలుచుటకు వచ్చితినని చెప్పి జలమధ్యయందు పుష్పాంజలిని పెట్టి క్షణముసేపక్కడనుండె. ఆసమయమునందక్కడ నొక్కఁడును ప్రత్యుత్తరమును చెప్పకపోయె. అంతట నాబ్రాహ్మణుఁడు ఒడ్డునకువచ్చివచ్చినమార్గమును పట్టిపోయె. అట్లు బయలువెడలిపోవునట్టిసమయమునందు దేదీప్యమానమైన శరీరముకల యొకబ్రాహ్మణుఁడువచ్చి ఆబ్రాహ్మణునితో నిట్లనియె. ఓబ్రాహ్మణుఁడా! నీవు విక్రమార్కమహారాజుయొక్క అనుమతిచేత మమ్ములను పిలుచుటకు వచ్చితివి. ఆవిక్రమార్కమహారాజుచేత ఎటువంటిపూజ చేయఁబడినదో ఆపూజ మమ్ములనుపొందినదయ్యెను. తగిన



సమయమునందు దానమానాదులను చేయుటయే స్నేహితునియొక్క లక్షణము. మఱియును,

శ్లో॥ దదాతిప్రతిగృహ్ణాతిగుహ్యమాఖ్యాతిపృచ్ఛతి। భుఙ్క్తేభోజయతేచైవ షడ్విధంబంధులక్షణమ్॥

టీ॥ దదాతి= ఇచ్చుచున్నాఁడు. ప్రతిగృహ్ణాతి=గ్రహించుచున్నాఁడు. గుహ్యమ్= రహస్యమును. ఆఖ్యాతి=చెప్పుచున్నాఁడు. పృచ్ఛతి= అడుగుచున్నాఁడు. భుఙ్క్తే= భుజించుచున్నాఁడు. భోజయతే= భోజనమును చేయించుచున్నాఁడు. (ఇతి= ఇట్లని) బంధులక్షణమ్= బంధువులయొక్క లక్షణము. షడ్విధమ్= ఆఱువిధములయినది॥ తా॥ ఇచ్చుట, తీసికొనుట, రహస్యమును చెప్పుట, రహస్యమునుఅడుగుట, భుజించుట, భోజనమును పెట్టుట, అనునట్టిఆఱునుబంధులక్షణములని తా॥ మఱియును,

శ్లో॥ గిరౌమయూరాగగనేచ మేఘాలక్షాంతరేర్కస్స లిలేచపద్మం। లక్షద్వయేగ్లౌఃకుముదానిభూమౌయయోస్సుమైత్రీనతయోర్హిదూరమ్॥

టీ॥ గిరౌ= పర్వతమునందు. మయూరాః= నెమళ్లు. గగనేచ= ఆకాశమునందు. మేఘాః= మేఘములు. లక్షాంతరే= లక్షయోజనములయొక్క మధ్యమందు. అర్కః=సూర్యుఁడు. సలిలేచ=ఉదకమునందు. పద్మమ్=పద్మము. లక్షద్వయే= రెండులక్షలఆమడలయందు. గ్లౌః = చంద్రుఁడు. కుముదాని=కుముదములు. భూమౌ=భూమియందు. యయోస్సు= ఎవరికి. మైత్రీ= మిత్రత. భవతి=అగుచున్నదో. తయోః=ఆస్నేహితులకు. దూరమ్= దూరము. నహి=లేదుకదా॥ తా॥ పర్వతమునందు నెమళ్లుకలవు. మేఘములు ఆకాశమునందున్నవి. లక్షయోజనముల దూరమునందు సూర్యుఁడున్నాఁడు. పద్మములు సలిలములయందున్నవి. చంద్రుఁడు రెండులక్షలదూరమునందున్నాఁడు. కలువలు భూమియందున్నవి. ఇట్లు మిగుల దూరమునందున్నను పరస్పరమైత్రికలవి. కావున ఆలోచింపఁగా, పరస్పర స్నేహముకలవారు దూరమునందున్నను దూరమునందున్నవారివలెనుండక ఒకరికొకరు సంతోషమును కలుగఁజేసికొందురని తా॥ అను ప్రమాణవచనములననుసరించి ఆలోచింపఁగా, నేను రావలసినపనిలేదు. నావలన అతనికేమికార్యము కావలయునో ఆకార్యమును ఇక్కడనేయుండిచేయుదును. మఱియును, నీకిప్పుడు అమూల్యములగు నాలుగురత్నములను ఇచ్చెదను. ఈరత్నములను తీసికొనిపోయి ఆవిక్రమార్కమహారాజునకివ్వుము. ఆరత్నములయొక్క మాహాత్మ్యమును చెప్పెదను. వినుము. ఈనాలుగురత్నములలో ఒకటి ఏమడుగు

సమునుకోరినను ఈయఁగలదు. రెండవరత్నము అమృతమువంటి భక్ష్యభోజ్యాదుల నొసంగును. మూఁడవరత్నము హస్త్యశ్వరథపదాదులతోఁగూడుకొనిన బలమునిచ్చును. నాల్గవరత్నము దివ్యములయిన వస్త్రాభరణాదుల నొసంగును. ఇట్లు నాలుగురత్నములయొక్కయు మాహాత్మ్యమును చెప్పి ఆరత్నములనిచ్చి సముద్రుఁడు అంతర్ధానమును పొందె. అనంతరమందు బ్రాహ్మణుఁడు ఆరత్నములను తీసికొని మిగుల నాలస్యముగ ఉజ్జయినీపట్టణమునకుఁబోయె. ఆబ్రాహ్మణుఁడు ఉజ్జయినీపట్టణమునకు వచ్చు లోపల విక్రమార్కమహారాజు యజ్ఞమును సమాప్తిఁబొందించి అవభృథస్నానమునుచేసి సకల జనులను పరిపూర్ణమైన మనోరథములను కలవారినిగాఁజేసె. ఆసమయమునందాబ్రాహ్మణుఁడువచ్చి ఆరత్నములను విక్రమార్కమహారాజునకిచ్చి ఆరత్నములయొక్క గుణములనన్నింటిని చెప్పె. ఆవృత్తాంతమును సర్వమునువిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! నీవు యజ్ఞదక్షిణకాలము నతిక్రమించివచ్చితివి. ఇప్పుడు నాయొద్దనున్న ధనమును సర్వమును యాచకులకిచ్చి నేనురిక్తుఁడనైయుంటిని. కాఁబట్టినీకీరత్నములలో నేరత్నమునందు అభిలాషకలదో ఆరత్నమునుతీసికొనుమనినవిని ఆబ్రాహ్మణుఁ డిట్లనియె. ఓవిక్రమార్కమహారాజా! నేను నాగృహమునకుఁబోయి నాభార్యను, నాపుత్రుని, నాకోడలిని, అడిగి మావారికందఱికిని యేరత్నమునందు ఇష్టముకలిగియుండునో ఆరత్నమును గ్రహించెద ననినవిని విక్రమార్కమహారాజు నీయిష్టానుసారముగఁ జేయుమనియె. అంతట ఆబ్రాహ్మణుఁడు తనయింటికిఁబోయి ఆవృత్తాంతమును సర్వమును వారికిఁ దెలియఁజేసె. ఆవృత్తాంతమును సర్వమునువిని అతనిపుత్రుఁడిట్లనియె. నాయనా! చతురంగబలమును ఇచ్చునట్టి రత్నమునుమనముతీసికొందము. అట్లయ్యెనేని మనకు రాజ్యమువచ్చుననినవిని ఆబ్రాహ్మణోత్తముఁ డిట్లనియె. తండ్రీ! పుత్రుఁడా! బుద్ధిమంతుఁడగువాఁడు రాజ్యమును కోరఁగూడదు. మఱియును,

శ్లో॥ రామప్రవ్రజనం బలేర్నియమనం పాండోస్సుతానాం వనం।
వృష్ణీనాంనిధనంనలస్య విపదంభీష్మస్యశస్త్రస్థితిం। విష్ణోర్వామనతాం తథా
ర్జునదశాంసం చిత్యలంకేశ్వరం। దృష్ట్వారాజ్యవిడంబనాదు పగతందుఃఖన
తద్వాంఛయేత్॥

టీ॥ రామప్రవ్రజనమ్= రామునియొక్క వనవాసమును. బలేః= బలిచక్రవర్తియొక్క. నియమనమ్= నియమమును. పాండోః= పాండుమహా



రాజుయొక్క. సుతానామ్= పుత్రులయొక్క. వనమ్= వనమును. వృష్ణీనామ్= వృష్ణివంశపురాజులయొక్క. నిధనమ్= మరణమును. నలస్య= నలమహారాజుయొక్క. విపదమ్=ఆపదను. భీష్మస్య=భీష్మునియొక్క. శస్త్రస్థితమ్= శస్త్రములయొక్కస్థితిని. తథా= ఆప్రకారముగా. అర్జునదశామ్= కార్తవీర్యార్జునునియొక్కదశను. లంకేశ్వరమ్= రావణాసురుని. సంచింత్య= ఆలోచించి. రాజ్యవిడంబనాత్= రాజ్యమును అనుకరించుటవలన. ఉపగతమ్= వచ్చిన. దుఃఖమ్= దుఃఖమును. దృష్ట్వా= చూచి. తత్ =ఆరాజ్యమును. న వాంఛయేత్= కోరఁగూడదు॥ తా॥ శ్రీరామునకుఁ గలిగిన వనవాసమును, బలిచక్రవర్తికిఁ గలిగిన బంధనమును, పాండవులకు సంభవించిన వనవాసాదికమును, వృష్ణివంశపురాజులయొక్క మరణమును, నలమహారాజుయొక్క ఆపదను, భీష్ముఁడు అంపశయ్యమీదపరుండుటను, విష్ణుదేవుఁడు పొట్టివాఁడగుటను, కార్తవీర్యార్జునునియొక్క దుర్దశను, రావణాసురునకు సంభవించినఆపదను, ఆలోచించి రాజ్యమునందలి ఆశచేతఁగదా మిగుల గొప్పవారికిఁగూడ సంభవించిన ఆపదలనుచూచి బుద్ధిమంతుఁడగువాఁడు రాజ్యమునుకోరఁగూడదని తా॥ కాఁబట్టి, ఓపుత్రుఁడా! మనము రాజ్యమునిచ్చెడురత్నమును కోరక ఏరత్నమువలన ధనముకలుగునో ఆరత్నమును తీసికొందమనియె. మఱియును, ధనముచేత సర్వమును సంపాదించుకొనవచ్చును. మఱియును,

శ్లో॥ నతదస్తీజగత్యస్మిన్న యదర్థేనసిధ్యతి। నిశ్చిత్యమతిమాన్లోకేధ
నమేకంప్రసాధయేత్॥

టీ॥ అర్థేన= ధనముచేత. యత్= ఏకార్యము. నసిద్ధ్యతి= సిద్ధింపదో. తత్= అటువంటికార్యము. అస్మిన్= ఈ. జగతి=లోకమునందు. నాస్తి= లేదు. (ఇతి=ఇట్లని) మతిమాన్=బుద్ధిమంతుఁడు. నిశ్చిత్య=నిశ్చయించి. లోకే=లోకమునందు. ఏకమ్= ఒక్క. ధనమ్=ధనమును. ప్రసాధయేత్= సంపాదింపవలయును॥ తా॥ ధనముచేత సంపాదింపఁదగనిది లోకమునందేదియును లేదు. కాఁబట్టి బుద్ధిమంతుఁడగువాఁడు ఈవిషయమును చక్కఁగ నాలోచించి యీలోకమునందు ధనమునొక్కదానినే సంపాదింపవలయునని తాత్పర్యము॥ అనునట్టి ప్రమాణవచనములచేత పుత్రునకు ధనమునిచ్చునట్టి రత్నము శ్రేష్ఠమైనదని బోధించె. ఆసమయమునందు ఆబ్రాహ్మణునిభార్యయిట్లనియె. ఓమనోహరుఁడా! షడ్రసోపేతమగు నన్నాదికమునిచ్చునట్టి రత్నమును మనము తీసికొందము. మఱియును, సకల ప్రాణులకును అన్నమే

కదా జీవాధారమైయున్నది? మఱియును,

శ్లో॥ అన్నంవిధాత్రావిహితంమర్త్యానాంజీవధారణం। తదనాదృత్యమతిమాన్ప్రార్థయేన్నతుకించన॥

టీ॥ మర్త్యానామ్= మనుష్యులకు. జీవధారణమ్= జీవధారణమునుగా. అన్నమ్= అన్నము. విధాత్రా= బ్రహ్మదేవునిచేత. విహితమ్= నిర్మింపఁబడినది. (తస్మాత్= అందువలన) మతిమాన్=బుద్ధిమంతుఁడు. తత్=ఆయన్నమును. అనాదృత్య= అనాదరణముచేసి. కించన=ఒకానొకదానిని. న ప్రార్థయేత్= ప్రార్థింపఁగూడదు॥ తా॥ బ్రహ్మదేవుఁడు అన్నమును సకల జంతువులకును ప్రాణాధారమునుగా సృజించె. కాఁబట్టి బుద్ధిమంతుఁడగువాఁడు అన్నమును అనాదరముచేసి యితరమైనదానిని దేనినికోరఁగూడదనితా॥ అను వచనానుసారముగ అన్నమునిచ్చునట్టి రత్నముకోరఁదగినదనియె. ఆసమయమునందు కోడలిట్లనియె. ఓమామా! వస్త్రాలంకారాదికమునిచ్చునట్టి రత్నమును మనము తీసికొందము. మఱియును,

శ్లో॥ భూషణైర్భూషయేదంగం యథావిభవసారతః। శుచిసౌభాగ్యసిద్ధ్యర్థ మాయుష్యస్యాభివృద్ధయే॥

టీ॥ యథావిభవసారతః= ఐశ్వర్యానుసారముగ. శుచిసౌభాగ్యసిద్ధ్యర్థమ్= పరిశుద్ధతయును, సౌభాగ్యమును, సిద్ధించుటకొఱకును. ఆయుష్యస్య= ఆయుష్యముయొక్క. అభివృద్ధయే= అభివృద్ధికొఱకును. భూషణైః= ఆభరణములచేత. అంగమ్= శరీరమును. భూషయేత్= అలంకరింపవలయును॥ తా॥ ఐశ్వర్యానుసారముగా పరిశుద్ధతయును, సౌభాగ్యమును, ఆయుష్యమును వృద్ధినిపొందుటకొఱకు సకలాభరణములచేతను శరీరమును అలంకరింపవలయుననితా॥ మఱియును,

శ్లో॥ సుహృదానందనంముఖ్య ముత్సవేషువిభూషణమ్। రత్నాది దేవతాతుష్టిర్భూషణస్యవిధారణాత్॥

టీ॥ రత్నాది= రత్నముమొదలుగాఁగల. విభూషణమ్= సొమ్ము. ఉత్సవేషు= ఉత్సవకాలములయందు. ముఖ్యమ్= ముఖ్యమునుగా. సుహృదానందనమ్= స్నేహితులకు సంతోషమును కలుగఁజేయునట్టిది. భూషణస్య= ఆభరణముయొక్క. ధారణాత్= ధారణమువలన. దేవతాతుష్టిః= దేవతాదులకు సంతోషము. భవతి= అగుచున్నది॥ తా॥ ఉత్సవకాలములయందు రత్నము మొదలుగాఁగల ఆభరణములు స్నేహితులకు సంతోషమును కలుగఁజేయును. మఱియును, ఆభరణములను పెట్టుటవలన దేవతాదులకుఁ



గూడ సంతోషము కలుగుచున్నదని తాత్పర్యము॥ అను వచనానుసారముగ ఆబ్రాహ్మణునికోడలు వస్త్రాభరణాదులనిచ్చునట్టి రత్నమునుతీసికొందమనియె. ఈవిధముగా ఆనలుగురికిని నాలుగు విధములగు తలంపులు కలిగియుండె. అంతట నాబ్రాహ్మణుఁడు విక్రమార్కమహారాజునొద్దకువచ్చి తవనలుగురి యభిప్రాయములను తెలియఁజేసె. ఆవృత్తాంతమును సర్వమునువిని విక్రమార్కమహారాజు ఆబ్రాహ్మణునకు ఆనాలుగురత్నములను ఇచ్చెనని యీకథనుచెప్పి ఆసాలభంజిక భోజమహారాజుతో నిట్లనియె. ఓభోజమహారాజా! మానవులకు ఔదార్యము సహజగుణముకాని ఒకరివలన వచ్చునట్టి గుణముకాదు. మఱియును,

శ్లో॥ చంపకేషుసువర్ణత్వంకాంతిర్ముక్తాఫలేషుచ। యథేక్షుదండే మాధుర్యమౌదార్యంసహజంతథా॥

టీ॥ చంపకేషు= సంపెగలయందు. సువర్ణత్వమ్= మంచివర్ణముకలుగుటయును. ముక్తాఫలేషుచ= ముక్తాఫలములయందు. కాంతిః= కాంతియును. యథా=ఏప్రకారముగా. ఇక్షుదండే= ఇక్షుదండమునందు. మాధుర్యమ్=మాధుర్యము. భవతి= అగుచున్నదో. తథా=ఆప్రకారముగా. ఔదార్యమ్= ఔదార్యము. సహజమ్= స్వభావసిద్ధమైనగుణము. భవతి= అగుచున్నది॥ తా॥ సంపెగలయందు మంచివర్ణము, ముత్యములయందుకాంతియును, చెఱుకుగడలయందు మాధుర్యమునునవి యెట్లు సహజగుణములయియున్నవో అటులనే ఔదార్యముకూడ సహజగుణమనితా॥ అను ప్రమాణానుసారముగ ఔదార్యము సహజగుణమేకాని ఒకరివలన వచ్చునట్టిది కాదు. మఱియు నోభోజమహారాజా! నీయందు ఈవిధమైన ఔదార్యము కలిగియుండెనేని ఈసింహాసనమునం దెక్కుమనినవిని ఆభోజమహారాజూరకుండె.

ఇట్లని విక్రమార్కుని చరిత్రమునందలి మూడవ ఉపాఖ్యానము ముగిసెను.

## (*) నాలుగవచరిత్రము. (*)

అంతట మఱియొకనాఁడు భోజమహారాజు సుముహూర్తమును విచారించుకొని సింహాసనమునెక్కుటకొఱకు రాఁగానే నాలుగవ సాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! నీకు విక్రమార్కునకుఁగల ఔదార్యాదిగుణములు కలిగియుండెనేని నీవు ఈసింహాసనము నెక్కుమనినవినిభోజమహారాజిట్లనియె. ఓసాలభంజికా! ఆవిక్రమార్కునియొక్క ఔదార్యా

ది గుణములను తెలియఁజేయుమనిన సాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కమహారాజు రాజ్యమును చేయుచుండఁగా ఉజ్జయినీపట్టణమునందు ఒకబ్రాహ్మణుఁడుండెను. ఆబ్రాహ్మణుఁడు సకల విద్యావిచక్షణుఁడును, సకల గుణాలంకృతుఁడును, శ్రేష్ఠుఁడైన పుత్రుఁడు లేనివాఁడును అయియుండెను. అంతట ఒకనాడు ఆబ్రాహ్మణునిభార్య యిట్లనియె. ఓప్రాణనాథుఁడా! పుత్రుఁడు లేకపోయెనేని గృహస్థునకు గతిలేదని పురాణవేత్తలు చెప్పుచున్నారు. మఱియును,

శ్లో॥ అపుత్రస్యగతిర్నాస్తి స్వర్గోనైవచనైవచ । తస్మాత్పుత్రముఖందృష్ట్వా భవేత్పశ్చాద్ధితాపసః॥

టీ॥ అపుత్రస్య= పుత్రుఁడులేనివానికి. గతిః=సద్గతి. నాస్తి=లేదు. స్వర్గశ్చ= స్వర్గమును. నైవనైవచ= లేదులేదు. తస్మాత్= అందువలన. పుత్రముఖమ్= పుత్రునియొక్క-ముఖమును. దృష్ట్వా= చూచి. పశ్చాత్= అనంతరమందు. తాపసః= తాపసుఁడు. భవేత్=అగును॥ తా॥ పుత్రుఁడులేని గృహస్థునకు సద్గతిలేదు. మఱియును, స్వర్గముకూడ లేదులేదు. కావున పుత్రముఖమును చూచినపిమ్మట తపోవనమునకుఁబోవలసినదని తా॥ మఱియును,

శ్లో॥ శర్వరీదీపకశ్చంద్రః ప్రభాతోద్దీపకోరవిః। త్రైలోక్యదీపకోధర్మస్సుపుత్రఃకులదీపకః॥

టీ॥ చంద్రః= చంద్రుఁడు. శర్వరీదీపకః = రాత్రినిప్రకాశింపఁజేయువాఁడు. రవిః= సూర్యుఁడు. ప్రభాతోద్దీపకః= ప్రాతఃకాలమును ప్రకాశింపఁజేయువాఁడు. ధర్మః=ధర్మము. త్రైలోక్యదీపకః= ముల్లోకములను ప్రకాశింపఁజేయును. సుపుత్రః= మంచిపుత్రుఁడు. కులదీపకః= కులమును ప్రకాశింపఁజేయువాఁడు॥ తా॥ చంద్రుఁడు రాత్రిని ప్రకాశింపజేయువాఁడు. సూర్యుఁడు పగటిని ప్రకాశింపఁజేయువాఁడు. ధర్మము ముల్లోకములను ప్రకాశింపఁజేయునదియగును. సత్పుత్రుఁడు కులమును ప్రకాశింపఁజేయువాఁడగునని తా॥ మఱియును,

శ్లో॥ నాగోభాతిమదేనఖంజలధరైః పూర్ణేందునాశర్వరీ శీలేనప్రమదాజలేనతురగోనిత్యోత్సవైర్మందిరం। వాణీవ్యాకరణేన హంసమిథునైర్నద్యస్సభాపండితైస్సత్పుత్రేణకులంనృపేణ వసుధా లోకత్రయంభానునా॥

టీ॥ నాగః= ఏనుఁగు. మదేన= మదముచేత. భాతి= ప్రకాశించుచున్నది. ఖమ్= ఆకాశము. జలధరైః= మేఘములచేత. భాతి= ప్రకాశించుచు



న్నది. పూర్ణేందునా= పూర్ణచంద్రునిచేత. శర్వరీ=రాత్రి. భాతి= ప్రకాశించుచున్నది. శీలేన= సత్స్వభావముచేత. ప్రమదా=ఆడుది. భాతి= ప్రకాశించుచున్నది. జలేన=వేగముచేత. తురగః=గుఱ్ఱము. భాతి=ప్రకాశించుచున్నది. నిత్యోత్సవైః= సర్వకాలములయందును. ఉత్సవైః=ఉత్సవములచేత. మందిరమ్= గృహము. భాతి=ప్రకాశించుచున్నది. వ్యాకరణేన= వ్యాకరణముచేత. వాణీ=వాక్కు. భాతి=ప్రకాశించుచున్నది. హంసమిథునైః= హంసములయొక్క- జంటలచేత. నద్యః=నదులు. భాంతి= ప్రకాశించుచున్నవి. పండితైః= పండితులచేత. సభా=సభ. భాతి=ప్రకాశించుచున్నది. సత్పుత్రేణ= సత్పుత్రునిచేత. కులమ్=కులము. భాతి=ప్రకాశించుచున్నది. నృపేణ=రాజుచేత. వసుధా=భూమి. భాతి=ప్రకాశించుచున్నది. భానునా= సూర్యునిచేత. లోకత్రయమ్= ముల్లోకసముదాయమును. భాతి = ప్రకాశించుచున్నది॥ తా॥ ఏనుగు మదముచేతను, ఆకాశము మేఘములచేతను, పూర్ణచంద్రునిచేత రాత్రియును, సత్స్వభావముచేత ఆడుదియును, వేగముచేత గుఱ్ఱమును, ఎడతెగనియుత్సవములచేత గృహమును, వ్యాకరణముచేత వాక్కును, హంసమిథునములచేత నదులును, పండితులచేత సభయును, సుపుత్రునిచేత కులమును, రాజుచేత భూమియును, సూర్యునిచేత ముల్లోకములును ప్రకాశించుచున్నవని తా॥ అను ప్రమాణవచనములనుపట్టి ఆలోచింపఁగా పుత్రునిచేత సద్గతులు కలుగునని తోఁచుచున్నదనినవిని ఆబ్రాహ్మణుఁడిట్లనియె. ఓ ప్రియురాలా! నీవు సత్యమునే చెప్పితివి. అయినను మనమేమిచేయవచ్చును. ప్రయత్నములేక ద్రవ్యమును, గురుశుశ్రూషను చేయక విద్యయును, పరమేశ్వరానుగ్రహమును సంపాదించుకొనక సంతానమునుపొందుట శక్యముకాదు. మఱియును,

శ్లో॥ నిరంతరంసుఖాపేక్షా హృదయేయదివర్తతే। కృత్వాభావం దృఢంనిత్యం భవానీవల్లభంభజేత్॥

టీ॥ నిరంతరమ్= సర్వకాలములయందును. సుఖాపేక్షా= సుఖమునందుకోరిక. హృదయే= హృదయమునందు. వర్తతేయది= ఉన్నయెడల. దృఢమ్=దృఢమైన. భావమ్=భావమును. కృత్వా=చేసి. నిత్యమ్=సర్వకాలములయందును. భవానీవల్లభమ్=పరమేశ్వరుని. భజేత్= సేవింపవలయును॥ తా॥ సర్వకాలములయందును సుఖముకావలయునని హృదయమునందు కోరికకలిగియుండెనేని భావమును దృఢముగాఁజేసి సర్వకాలములయందును పరమేశ్వరుని సేవింపవలయునని తా॥ అనునట్టి వాక్యమును విని ఆబ్రాహ్మణునిభార్య యి

ట్లనియె. ఓమనోనాయకుఁడా! నీవు సర్వమును తెలిసినవాఁడవుకదా? పరమేశ్వరుని అనుగ్రహమును సంపాదించుకొనుటకేల ప్రయత్నమును చేయవనినవిని ఆబ్రాహ్మణుఁ డిట్లనియె. ఓప్రియురాలా! నీవు యుక్తమైనమాటను చెప్పితివి. మఱియును,

శ్లో॥ యుక్తియుక్తముపాదేయం వచనంబాలకాదపి। విదుషాతు సదాగ్రాహ్యం వృద్ధాదపినదుర్వచః॥

టీ॥ యుక్తియుక్తమ్= యుక్తితోఁగూడుకొనిన. వచనమ్ = వాక్యము. బాలకాదపి= బాలకునివలనఁగూడ. ఉపాదేయమ్= గ్రహింపఁదగినది. సదా= సర్వకాలములయందును. దుర్వచః= దుష్టవాక్యమును. విదుషాతు= విద్వాంసునిచేతనైనను. వృద్ధాదపి= వృద్ధునివలననైనను. నగ్రాహ్యమ్= గ్రహింపఁగూడదు॥ తా॥ యుక్తియుక్తమైన మాటను బాలుఁడు చెప్పినను వినవలయును. మఱియును, దుర్వచనమును విద్వాంసుఁడు చెప్పినను, వృద్ధుఁడు చెప్పినను వినఁగూడదని తాత్పర్యము॥ అనిచెప్పి ఆబ్రాహ్మణుఁడు పరమేశ్వరానుగ్రహముకొఱకు రుద్రానువాకములచేత స్నానమునుచేసె. అట్లు చేయుచుండఁగా ఒకనాటిరాత్రియందు స్వప్నమునందు జటామకుటములను ధరించినవాఁడును, పార్వతీదేవిచేత ఆలింగనముచేయఁబడిన శరీరముయొక్క వామభాగముకలవాఁడును, చంద్రుఁడు శిరోభూషణముగాఁగలవాఁడును, అయిన పరమేశ్వరుఁడు కన్నులకగపడి యిట్లనియె. ఓరీవత్సా! ప్రదోషవ్రతమును ఆచరింపుము. ఆవ్రతముచేత నీకు పుత్రుఁడుపుట్టుననియె. ఆవచనమును విని ఆబ్రాహ్మణుఁడు మేలుకొని మిగుల సంభ్రమముకలవాఁడై తనదుస్స్వప్నవృత్తాంతమును సర్వమును వృద్ధులకు తెలియఁజేసె. అంతట నావృద్ధులందఱును నిట్లనిరి. నాయనా! నీకుఁగలిగిన స్వప్నమునందలి వృత్తాంతమంతయును, యథార్థమైనది. మఱియును,

శ్లో॥ దేవోద్విజోగురుర్వాపి పితరోలింగినస్తథా। యద్వదంతివచస్స్వప్నేతత్తథైవవినిర్దిశేత్॥

టీ॥ దేవః= దేవుఁడు. ద్విజః= బ్రాహ్మణుఁడు. గురుర్వాపి= గురువును. పితరః= తల్లిదండ్రులును. లింగినః= లింగధారులును. తథా=ఆప్రకారముగా. యత్= ఏ. వచః=వాక్యమును. వదంతి=చెప్పుచున్నారో. తత్= ఆవాక్యమును. తథైవ= ఆప్రకారముగానే. వినిర్దిశేత్= నిర్దేశముచేయవలయును॥ తా॥ స్వప్నమునందు దేవుఁడును, బ్రాహ్మణుఁడును, గురుఁడును, తల్లిదండ్రులును, లింగధారులును, ఏమాటనుచెప్పుచున్నారో ఆవాక్య



మువాస్తవముగ జరుగునని తాత్పర్యము॥ అను ప్రమాణాను సారముగ నీవిప్పుడు స్వప్నమునందుఁ బరమేశ్వరుఁడు చెప్పినవిధముగ నీవివ్రతమును అనుష్ఠించినయెడల సర్వాత్మనా నీకు పుత్రుఁడుకలుగునని పెద్దలుచెప్పిన స్వప్నఫలమునువిని ఆబ్రాహ్మణుఁడు మార్గశిర్షశుద్ధత్రయోదశీ శనివాసరమునందు కల్పోక్తప్రకారముచేత ప్రదోషవ్రతమును అనుష్ఠించె. అవ్విధముగ ఆవ్రతము అనుష్ఠింపఁబడిన వెంటనే పరమేశ్వరుఁడు ప్రసన్నుఁడై ఆబ్రాహ్మణునకు పుత్రుఁడుకలుగునట్లువరమిచ్చి అంతర్ధానమునుపొందె. అంతటఁ గొన్నిదినములకు ఆబ్రాహ్మణునకు పుత్రుఁడుకలిగె. పిమ్మట ఆ బ్రాహ్మణుఁడు తనపుత్రునకు జాతకర్మమును చేసి పదిరెండవ దినమునందు దేవదత్తుఁడని నామకరణమునుచేసె. అంతటఁ గొన్నిదినములకు అన్నప్రాశన చౌలాది కర్మములను తగిన కాలములయందుఁజేసె. మఱియును, వేదవేదాంగములను సంపూర్ణముగఁ జదివించె. అనంతరమందు పదునాఱవ వర్షమునందు గోదానాదికమునుచేసి మిగుల రూపలావణ్యాదులు కలిగిన యొకకన్యను తెచ్చి వివాహమునుచేసె. అనంతరమందు ఆపుత్రునకు సరియగు జీవనమునుకల్పించి తాను తీర్థయాత్రలకుఁ బోవఁదలఁచి పుత్రునితో నిట్లనియె. నాయనా! నేను నీకొకవిషయము నుపదేశించెదను. ఈలోకమునందును పరలోకమునందును నీకు మేలునుకలుగఁజేయునట్టి విషయము నుపదేశించెదననవిని ధన్యుఁడనైతిని. సావధానుఁడనైయుండెదననినవిని అతనితండ్రి మరల నిట్లనియె. ఓబిడ్డా! అత్యధికమైన కష్టదశను పొందినప్పటికిని స్వధర్మాచారమును పరిత్యజించి ఇతరులతోఁగూడ వివాదమును చేయకుము. సర్వభూతములయందును దయను అవలంబింపుము. పరమేశ్వరునియందు భక్తినవలంబింపుము. పరస్త్రీలనుచూడకుము. బలవంతులతోవిరోధమును పెట్టికొనకుము. నీమర్మమును తెలిసినవారిని అనుసరించి సంచరింపుము. ప్రస్తావమునకుఁ దగిన మాటలను చెప్పుము. నీకుఁగల ధనముననుసరించి ధనమును వ్యయముచేయుము. సజ్జనులను ఆశ్రయింపుము. దుర్జనులతో సహవాసమునుచేయక దుర్జనులను పరిహరింపుము. స్త్రీలతో రహస్యములయిన సంగతులను చెప్పకుమని మఱియు ననేకములగు నీతివిషయములనుబోధించె. ఇవ్విధముగ అనేకసంగతులను బోధించి ఆబ్రాహ్మణుఁడువారాణసీపట్టణమునకుఁ బోయె. అనంతరమందు దేవదత్తుఁడు తండ్రిచెప్పినబాప్పున ప్రవర్తించుచు ఆపట్టణమునందు సుఖముగనివసించియుండె. అట్లుండి యొకనాఁడు స్నానముకొఱకు సమిత్తులనుతీసికొనివచ్చుటకు మహారణ్యమునకుపోయి సమిత్తులను ఛే

దిందుచుండె. ఆసమయమునందు విక్రమార్కమహారాజు వేటకొఱకు అరణ్యమునందుఁ బ్రవేశించి మిగుల గొప్పదగు నొక్కయడవిపందిని వెంటనంటి పగుగెత్తుచుపోయి అక్కడ సమిత్తులను ఛేదించుచున్న దేవదత్తునిఁజూచి యిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! నేను వేటనిమిత్తముగవచ్చి యీ యరణ్యమునందుఁ బ్రవేశించితిని. నగరమార్గ మేదియో తెలియకున్నది. కావున నాకు నగరమార్గమును చూపఁగలవా? అనియె. అంతట నాదేవదత్తుఁడు ఆరాజును వెంటఁబెట్టుకొనివచ్చి నగరమునందుఁ బ్రవేశపెట్టె. అనంతరమందు విక్రమార్క మహారాజు దేవదత్తుని అనేక విధముల సమ్మానమును చేసి యొక రాజకార్యమునందు ప్రవేశపెట్టె. ఇవ్విధముగ రాజకీయోద్యోగమును చేయుచుండఁగా చిరకాలము గతించె. అట్లుండఁగా ఒకనాఁడు విక్రమార్కమహారాజుసభలోపల నిట్లనియె. ఓసభికులారా! ఈదేవదత్తుఁడు నాకు అత్యధికమైన యుపకారమును చేసె. నేను ఈయుపకారమునుండి యెప్పుడు తరింపఁగలను. ఈబ్రాహ్మణోత్తముఁడు మిగుల గొప్పదగు నరణ్యమునుండి నగరమునకుఁదీసికొనివచ్చి ప్రవేశపెట్టెననినవిని ఆసభయందున్నవారిలో నొకఁడిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! ఈవిక్రమార్కమహారాజు ఉపకారమును ఎన్నటికిని మరచిపోఁడు. మఱియును,

శ్లో॥ ప్రథమవయసిపీతంతోయ మల్పంస్మరంతశ్శిరసి నిహితభారా నారికేళానరాణాం। సలిలమమృతకల్పం దద్యురాజీవితాంతం నహికృతముపకారంసాధవోవిస్మరంతి॥

టీ॥ నారికేళాః= నారికేళవృక్షములు. ప్రథమవయసి = బాల్యమునందు. పీతమ్= పానముచేయఁబడిన. అల్పమ్=స్వల్పమైన. తోయమ్ = ఉదకమును. స్మరంతః= స్మరించుచున్నవై. శిరసి= శిరస్సునందు. నిహితభారాః= ఉంచఁబడిన భారముకలవై. నరాణామ్=మనుష్యులకు. ఆజీవితాంతమ్= జీవితకాలముపఱకును. అమృతకల్పమ్= అమృతముతోసమానమైన. సలిలమ్=ఉదకమును. దద్యుః=ఇచ్చును. తథాహి= అట్లుఇచ్చుట యుచితమేకదా? సాధవః=సజ్జనులు. కృతమ్=చేయఁబడిన. ఉపకారమ్= ఉపకారమును. నవిస్మరంతి= మరచిపోరు॥ తా॥ నారికేళవృక్షములు బాల్యమునందు మానవులచేత నియ్యఁబడిన స్వల్పమైనయుదకమును పానముచేసినవగుచు పెద్దవైన పిమ్మట శిరస్సునందు భారమునువహించినవై మానవులకు తాము బ్రతికియున్నంతకాలమును అమృతముతో సమానమైన యుదకము నిచ్చుచున్నవి. కావున ఆలోచింపఁగా సజ్జనులు ఎన్నటికిని చేసినమేలును మఱచిపోవు వారుకారని తాత్పర్యము॥ అని చెప్పిరి. అట్లుసభికులును, విక్రమార్కమహారాజును చెప్పినవాక్యములనువిని ఆదేవదత్తుఁడను బ్రాహ్మణుఁడు తనమనస్సునందిట్లని యాలోచించె. అహా ఇదియేమివిచిత్రముగనున్నది. ఈ విక్రమార్కమహారాజు ఈ విధముగాఁ జెప్పుచున్నాఁడు. నేనిరాజున కేమియుపకారమును చేసితిని. ఇది నిజముగనుండునా? అసత్యముగనుండునా? ఇతనియొక్క నమ్మకమును చూతము. అని ఆలోచించి రాజపుత్రుని అపహరించి తనగృహమునందు దాచిపెట్టి పుత్రునియొక్క కంఠాభరణములలో నొకదానిని తనభృత్యునిచేతికిచ్చి అంగడివీధికిఁదీసికొనిపోయి అమ్ముకొనిరమ్మనియె. ఆసమయమునందు రాజకుమారునిఎవ్వఁడో అపహరించుకొనిపోయి ఆభరణములమీది అపేక్షచేసి చంపెనని పట్టణమునందు అంతటను అధికమైన కోలాహలము కలిగె. అవ్వృత్తాంతమునువిని విక్రమార్కమహారాజు తనకుమారునివెదకి పట్టుకొనిరండని అనేకులకు నధికారులనుపంపె. అంతట రాజాధికారులందఱును పట్టణమునందంతటను వెదకుచుండఁగా ఒకఅంగడిలో రాజపుత్రునికంఠాభరణమును అమ్ముటకు తీసికొనివచ్చి చేతియందుఁబెట్టుకొనియున్న దేవదత్తుని భృత్యునిఁజూచిరి. అటుపిమ్మట ఆయాభరణము రాజకుమారునిదని నిశ్చయించి ఆదేవదత్తునియొక్క భృత్యునిపెడకెక్కలువిరిచికట్టి విక్రమార్కమహారాజునొద్దకుఁదీసికొనివచ్చిరి. ఆసమయమునందు విక్రమార్కమహారాజు వానితోనిట్లనియె. ఓరీ! భృత్యుఁడా! పాపిష్ఠుఁడా! ఈయాభరణము నీచేతికెట్లువచ్చెనని నవాఁడిట్లనియె. అయ్యా! రాజోత్తమా! నేను దేవదత్తునియొక్క భృత్యుఁడను. దేవదత్తుఁడు ఈయాభరణమును అంగడివీధియందు అమ్మి ద్రవ్యమునుతీసికొనిరమ్మనిపంపెననినవిని విక్రమార్కమహారాజు దేవదత్తునిపిలిచి యిట్లనియె. ఓదేవదత్తుఁడా! ఈయాభరణమునునీచేతికెవ్వరిచ్చిరనినవిని దేవదత్తుఁడిట్లనియె. ఓరాజోత్తమా! నేనీధనమునందాశకలవాఁడనై నీకుమారునిచంపి సకలాభరణములను తీసికొని ఆయాభరణములలో నొకయాభరణమును విక్రయించుటకు పంపితిని. కాఁబట్టి ఓరాజోత్తమా! నీకిప్పుడు ఏమిచేయవలయునని యిష్టముకలదో ఆపనినిచేయుము. నాకర్మవశమువలన నాకిటువంటి బుద్ధిపుట్టినదనిచెప్పి యేమియునుచెప్పక యూరకుండెననినవిని ఆవిక్రమార్కమహారాజు ప్రతిక్రియను ఏమియును చేయఁజాలక యూరకుండె. ఆసమయమునందొకసభ్యుఁడిట్లనియె. అహా! ఇదియేమి విచిత్రముగనున్నది. ఈబ్రాహ్మణుఁడు వేదవేదాంగములనుచదివినవాఁడు. ఇటువంటివానికి ఇట్టి పాపమును చేయుటకెట్లుబుద్ధిపుట్టెనని. ఆసమయమునందు మఱియొక సభ్

కుండిరేమో. ఆహా! ఇదియేమివిచిత్రముగనున్నది. పూర్వజన్మకర్మముచేత ప్రేరితుఁడగుటచేత ఇతనికిటువంటి దుర్బుద్ధిపుట్టెను. మఱియును,

శ్లో॥ కింకింకరోతి న ప్రాజ్ఞః ప్రేర్యమాణస్స్వకర్మభిః। ప్రాగేవహి మనుష్యాణాం బుద్ధిః కర్మానుసారిణీ॥

టీ॥ స్వకర్మభిః= తనయొక్క పూర్వజన్మకర్మములచేత. ప్రేర్యమాణః= ప్రేరణముచేయఁబడిన. ప్రాజ్ఞః= పండితుఁడు. కింకిమ్ = ఏయేకర్మమును. నకరోతి= చేయఁడు. మనుష్యాణామ్= మనుష్యులయొక్క. బుద్ధిః = బుద్ధి. ప్రాగేవ=ముందుగానే. కర్మానుసారిణీ= కర్మమును అనుసరించినది. భవతి= అగుచున్నది॥ తా॥ మానవుఁడు తనదు పూర్వజన్మమునందలి కర్మముచేత ప్రేరేపింపఁబడినవాఁడై సకలకార్యములను చేయుచుండును. మానవుల యొక్క బుద్ధి కర్మము ననుసరించియుండునని తా॥ అనునట్టి శ్లోకార్థమును చెప్పె. మఱియును, ఆసమయమునందు, మఱికొందఱిట్లనిరి. ఓరాజోత్తమా! ఈబ్రాహ్మణుఁడు బాలఘాతకుఁడు. అంతియగాక స్వర్ణస్తేయి (బంగారమును దొంగిలించినవాఁడు.) కాఁబట్టి చంద్రశూలముచేత చంపఁదగినవాఁడనిరి. ఆసమయమునందు మంత్రులిట్లనిరి. ఓరాజోత్తమా! ఈబ్రాహ్మణుని నువ్వుగింజలంత తునకలుగాఁజేసిచంపి ఇతనిమాంసమును పక్షులకుబలియియ్యవలయుననిరి. ఆవిధముగా అందఱును చెప్పిన మాటలనువిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓసభ్యులారా! ఈబ్రాహ్మణుఁడు నన్నాశ్రయించి జీవించుచున్నవాఁడు. అదియునుగాక ఈబ్రాహ్మణుఁడు మహారణ్యమునందుఁ జిక్కుపడియున్న నాకు నగరమార్గమునుచూపి యుపకారమును జేసినవాఁడు. కాఁబట్టి, ఇతనియందు గుణదోషవిచారణను చేయరాదు. మఱియును,

శ్లో॥ చంద్రః క్షయీ ప్రకృతివక్రతనుః కలంకీ దోషాకరస్స్ఫురతి మిత్రవిపత్తికాలే। మూర్ధ్నా తథాపి సతతం ధ్రియతే హరేణ నైవాశ్రితేషు మహతాంగుణదోషచింతా॥

టీ॥ చంద్రః= చంద్రుఁడు. క్షయీ=క్షయించునట్టి స్వభావముకలవాఁడు (క్షయరోగముకలవాఁడు) ప్రకృతివక్రతనుః= స్వభావముచేత నేకుటిలమైనశరీరముకలవాఁడు. కలంకీ= కళంకముకలవాఁడు. (పాపముకలవాఁడు) దోషాకరః= రాత్రినికలుగఁజేయువాఁడు. (పాపములకు నివాసస్థానమైనవాఁడు) మిత్రవిపత్తికాలే= సూర్యాస్తమయకాలమునందు (స్నేహితునకుఆపద వచ్చుకాలమునందు) స్ఫురతి= ప్రకాశించుచున్నాఁడు. తథాపి= అయినప్పటికిని. హరేణ= పరమశివునిచేత. సతతమ్= సర్వకాలములయందును. మూ



ర్ధ్నా= శిరస్సుచేత. ధ్రియతే=ధరింపఁబడుచున్నాఁడు. తేన=అందుచేత. మహతామ్= గొప్పవారికి. ఆశ్రితేషు=ఆశ్రితజనులయందు. గుణదోషచింతా= గుణదోషవిచారము. నైవకర్తవ్యా=చేయఁదగినదికాదు॥ తా॥ చంద్రుఁడు క్షయించునట్టివాఁడు.(క్షయరోగముకలవాఁడు.) స్వభావముచేతనే వంకరయగు శరీరముకలవాఁడును, కళంకముకలవాఁడును, దోషాకరుఁడును, మిత్రునియొక్క విపత్కాలమునందు (సూర్యాస్తమయకాలమునందు) వృద్ధిఁబొందువాఁడును, అయిన చంద్రుఁడు పరమశివునిచేత శిరస్సునందు ధరింపఁబడుచున్నాఁడు. కాఁబట్టి, విచారింపఁగా మహాత్ములకు ఆశ్రితజనులయందు గుణదోషవిచారణలేదని తా॥ మఱియును,

శ్లో॥ ఉపకారిషు యస్సాధుస్సాధుత్వే తస్య కో గుణః। అపకారిషు యస్సాధుస్స సాధుస్సద్భిరుచ్యతే॥

టీ॥ యః=ఎవ్వఁడు. ఉపకారిషు=ఉపకారులయందు. సాధుః=సత్స్వభావముకలవాఁడో. తస్య= అతనియొక్క. సాధుత్వే=సాధుత్వమునందు. గుణః=గుణము. కః=ఏమిటి. యః=ఎవ్వఁడు. అపకారిషు= అపకారముకలవారియందు. సాధుః=సత్స్వభావముకలవాఁడో. సః=అట్టివాఁడు. సాధుః= సజ్జనుఁడు. ఇతి=ఇట్లని. సద్భిః=సత్పురుషులచేత. ఉచ్యతే= చెప్పఁబడుచున్నాఁడు॥ తా॥ ఉపకారులకుపకారమును చేయువాఁడు సజ్జనుఁడని చెప్పుటయందు లాభమేమియులేదు. ఏమియును లేదనుట. మఱియును, వాఁడు సజ్జనుఁడునుకాఁడనుట. మఱియును, అపకారమును చేయువారికి ఉపకారమును చేయువాఁడు సజ్జనుఁడని సత్పురుషులచేత చెప్పఁబడుచున్నాఁడని తాత్పర్యము॥ అని చెప్పి విక్రమార్కమహారాజు దేవదత్తుఁజూచి ఓస్నేహితుఁడా! కొంచెమైనను భయమునుపొందకుము. నాపుత్రుఁడు పూర్వజన్మమునందుఁ జేయఁబడిన పాపకర్మవశముచేత చంపఁబడెను. నీవేమిచేసితివి. పూర్వజన్మమునందలి కర్మఫలమును అతిక్రమించుటకెవ్వఁడునుసమర్థుఁడు లేఁడు. మఱియును,

శ్లో॥ మాతాలక్ష్మీః పితా విష్ణుస్స్వయంచ విషమాయుధః। తథాపి శంభునా దగ్ధః ప్రాక్కృతం కేన లంఘ్యతే॥

టీ॥ మాతా=తల్లి. లక్ష్మీః=లక్ష్మీదేవి. పితా=తండ్రి. విష్ణుః= విష్ణుదేవుఁడు. స్వయంచ=తాను. విషమాయుధః= వ్యత్యయములైన ఆయుధములుకలవాఁడు. తథాపి= అయినప్పటికిని. శంభునా=శివునిచేత. దగ్ధః=తగులఁబెట్టఁబడెను. ప్రాక్కృతమ్=పూర్వజన్మమునందలికర్మము. కేన=ఎవ్వనిచేత. లంఘ్యతే= అతిక్రమింపఁబడుచున్నది॥ తా॥ లక్ష్మీదేవితల్లి విష్ణుదేవుఁడుతండ్రి

తానువిషమాయుఁడెను. ఇట్టివాఁడైనప్పటికిని మన్మథుఁడు పరమశివునిచేత దగ్ధముచేయఁబడెను. కాఁబట్టి, ఇఁకను జన్మాంతరమునందలి కర్మము ఎవ్వనిచేత అతిక్రమింపఁబడుచున్నది. ఎవ్వనిచేతను అతిక్రమింపఁ జేయఁబడలేదని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ నాజన్మాంతరకర్మానుసారముగ నాపుత్రుఁడు మరణమునుపొందె. నీవు మిగులగొప్పదయిన యరణ్యమునందు దారితెలియక వ్యసనమునుపొందుచున్న నన్నుపట్టణములోనికిఁ దీసికొనివచ్చితివి. కాఁబట్టి, అనేకవేల ప్రత్యుపకారములను చేసినను నీయుపకారముయొక్క ఋణమును తీర్చికొనఁజాలనని చెప్పి ఆదేవదత్తుని సూరార్చి అనేకములయిన వస్త్రాభరణాదులనిచ్చి యింటికిఁబంపెను. అంతట దేవదత్తుఁడు పరమానందభరితుఁడై గృహమునకుఁబోయి ఆరాజకుమారునితీసికొనివచ్చి రాజునకిచ్చె. అప్పుడు విక్రమార్కమహారాజు మిగుల విస్మయముకలవాఁడై యిట్లనియె. ఓదేవదత్తుఁడా! ఇదియేమనిన దేవదత్తుఁడిట్లనియె. ఓరాజోత్తమా! వినుము. నీవు అనేకపర్యాయములు సభలోపల దేవదత్తుఁడు చేసినయుపకారముయొక్క ఋణమును ఎట్లు తీర్పఁగలనని చెప్పుచు వచ్చితివి. అందువలన నీచిత్తమును పరీక్షించుటకొఱకు నేనిట్లుచేసితిని. నీకుఁగల విశ్వాసమునుచూచితిని. నేనుచేసినతప్పును మన్నింపుమనినవిని విక్రమార్కమహారాజు ఇట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! ఎవ్వఁడుచేసినయుపకారమును మరచిపోవునో వాఁడుకృతఘ్నుఁడనినవిని ఆదేవదత్తుఁడిట్లనియె. ఓరాజోత్తమా! నీవు కారణములేకయే సకలలోకములకును ఉపకారమునుచేయుచున్నావు. అందువలన నీవొక్కఁడవేసుజనుఁడవు. మఱియును,

శ్లో॥ తేసుజనాస్తేధన్యాస్తే కృతినస్తేహిసుకృతినోలోకే। యేకారణంవినాపిచపరహితకరణాయహంతజీవంతి॥

టీ॥ యే=ఎవ్వరు. కారణంవినాపి=కారణములేకయే. పరహితకరణాయ=పరులకుహితమునుచేయుటకొఱకే. జీవంతి=జీవించుచున్నారో. తే=అటువంటివారు. సుజనాః=సుజనులు. తే=వారు. ధన్యాః=కృతార్థులు. తే=వారు. కృతినః=నేర్పరులు. తే=వారు. సుకృతినః=పుణ్యాత్ములు॥ తా॥ లోకములో ఏమానవులు కారణములేకనే యుపకారమునుచేయుచున్నారో అటువంటిమానవులు సుజనులనియును, ధన్యులనియును, నేర్పరులనియును, పుణ్యాత్ములనియును, చెప్పఁబడుచున్నారని తాత్పర్యము॥ అనిచెప్పి విక్రమార్కమహారాజును మఱియు ననేకవిధములస్తోత్రమునుచేసి ఆదేవదత్తుఁడు విక్రమార్కునియొక్క అనుమతినిపొంది యింటికేఁబోయెనని యీకథనుచెప్పి



ఆసాలభంజిక భోజమహారాజుతో మరలనిట్లనియెం. ఓభోజమహారాజా! నీయందు ఇటువంటి ఔదార్యములేదు. కాఁబట్టి నీవీసింహాసనము నెక్కఁదగవనినవిని భోజమహారాజు ఏమియును పలుకక మఱల నెప్పటియట్ల తనగృహమునకుఁబోయెను.

ఇట్లు విక్రమార్కచరిత్రయందలి నాలుగవయుపాఖ్యానము ముగిసెను.

---

## (*) అయిదవచరిత్రము. (*)

అంతట మరల నొకనాఁడు భోజమహారాజు సుముహూర్తమును విచారించుకొనివచ్చి ఆసింహాసనముమీద అడుగునుపెట్టఁబోఁగానే అయిదవసాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కమహారాజుతప్పఁ దక్కినవారెవ్వరును ఈసింహాసనముమీఁదఁగూర్చుండఁదగదు. విక్రమార్కమహారాజునకు నీవు సమానుఁడవైనయెడల ఈసింహాసనముమీద నెక్కుము. విక్రమార్కమహారాజుయొక్క ఔదార్యాది గుణములను చెప్పెదను. వినుము. విక్రమార్కమహారాజు రాజ్యమును పాలించుచుండఁగా, ఒకనాఁడు ఒకరత్నములవర్తకుఁడువచ్చి వెలలేనిరత్నమును విక్రమార్కునిచేతికిచ్చె. అంతట నావిక్రమార్కమహారాజు దేదీప్యమానమైన ఆరత్నమునుతీసికొని రత్నపరీక్షకులనుపిలిపించి యిట్లనియె. ఓరత్నపరీక్షకులారా! ఈరత్నమెంతవెలకలదిఅగునో నిశ్చయించిచెప్పుడనియె. అప్పుడు ఆరత్నపరీక్షకులు ఆరత్నమును చక్కఁగాఁ బరిశీలించిచూచి యిట్లనిరి. ఓరాజోత్తమా! ఈరత్నము వెలలేనిదైయున్నది. దీనివెలయింతయని నిర్ణయించిచెప్పువారికొఱకు నెవ్వరును లేరనివిని ఆవిక్రమార్కమహారాజు ఆరత్నముదెచ్చిన వర్తకునకు భూరిసంఖ్యకలద్రవ్యమునిచ్చి యిట్లనియె. ఓవర్తకుఁడా! నీవద్దనున్నది యీరత్నమొక్కటియేనా? ఇంకను ననేకములగు రత్నములుకలవా? అనిన ఆవర్తకుఁడిట్లనియె. ఓరాజోత్తమా! ఇప్పుడు నాయొద్దనున్నరత్నమిదియొక్కటియే. ఇంటియందు ఇటువంటిరత్నములు ఇంకనుపదికలవు. తమకుచూడవలయునని కోరికయున్నయెడల పంపెదననియె. అంతట నావిక్రమార్కమహారాజు ఆరత్నములలో ఒక్కొకదానికిని నాలుగువేలవరహాలను వెలనుగానిర్ణయించి ఆద్రవ్యమును సర్వమునుఇచ్చి అతనితోఁగూడ నొకభృత్యునిఁబంపనిశ్చయించి యెనిమిదిదినములలోపల రమ్మనిఆజ్ఞాపించె. ఆమాటనువిని భృత్యుఁడు తమయాజ్ఞను శిరసావహించితినని చెప్పి అతిశీఘ్రముగ బయలువెడలిపోయె. పోయిఆరత్నములనుతీసికొని మరలివచ్చుచుండఁగా, మార్గమధ్యమందు అత్యధికమైన వర్షము

కలిగె. ఆవర్షముచేత మార్గమధ్యమునందున్న యొకనది రెండుదరులంగూడను నిండవచ్చుచున్న ప్రవాహముకలదయ్యె. అంతట నాభృత్యుఁడు ఆనదిని దాటుటకు తగినసామర్థ్యము లేనివాఁడై యొకనావికునిపిలిచి యిట్లనియె. ఓనావికుఁడా! నేను విక్రమార్కమహారాజుయొక్క ఆజ్ఞానుసారముగ నేనురత్నములనుతీసికొనిపోవుచున్నాను. ఎనిమిది దినములలోపల రమ్మని ఆరాజేంద్రుఁడు ఆజ్ఞాపించె. కావున అవశ్యముగఁ బోవలసియున్నది. శీఘ్రముగ ఈనదిని దాటింపుమనిన నావికుఁడిట్లనియె. ఓభృత్యజనోత్తమా! ఇప్పుడు ఈనదిమితిమీఱి సంచరించుచున్నది. దీనినెట్లుదాటవచ్చును. మఱియును, అదియునుగాక బుద్ధిమంతుఁడగువాఁడు మహానదిని దాటఁగూడదు. మఱియును,

శ్లో॥ మహానదీప్రతరణం మహాపురుషనిగ్రహం। మహాజనవిరోధంచ దూరతః పరివర్జయేత్॥

టీ॥ మహానదీప్రతరణమ్= నిండుగాఁబ్రవహించుచున్న యేటిని దాటుటను. మహాపురుషనిగ్రహమ్= మహాపురుషులను నిగ్రహించుటను. మహాజనవిరోధంచ = మహాజనులతో విరోధమును. దూరతః= దూరముగా. పరివర్జయేత్= విడువవలయును॥ తా॥ అత్యధికముగాఁ బ్రవహించుచున్న నదిని దాటుటయును, మహాపురుషులను నిగ్రహించుటయును, మహాజనులతో విరోధమును పెట్టుకొనుటయును, ఎన్నటికిని పనికిరావని తా॥ మఱియును,

శ్లో॥ చరిత్రే యోషితాం పూర్ణసరిత్తారే నృపాదరే। సర్పమైత్రే వణిగ్వాక్యే విశ్వాసం నైవకారయేత్॥

టీ॥ యోషితామ్= స్త్రీలయొక్క. చరిత్రే= చరిత్రయందును. పూర్ణసరిత్తారే= పూర్ణమైననదిని దాటుటయందును. నృపాదరే= రాజుయొక్క ఆదరమునందును. సర్పమైత్రే= సర్పముయొక్క మిత్రత్వమునందును. వణిగ్వాక్యే= వర్తకునివాక్యమునందును. విశ్వాసమ్= నమ్మకమును. నైవకారయేత్= చేయఁగూడదు॥ తా॥ స్త్రీలయొక్క చరిత్రయందును, పూర్ణమైననదినిదాటుటయందును, రాజుయొక్క ఆదరమునందును, సర్పముయొక్క మిత్రత్వమునందును, వర్తకునివాక్యమునందును విశ్వాసము చేయఁగూడదని తా॥ అనుప్రమాణానుసారముగ నిండుప్రవాహముకల నదిని దాటుటయుచితముకాదనినవిని ఆరాజభృత్యుఁడిట్లనియె. ఓనావికుఁడా! ఓకర్ణధారుఁడా! నీవు చెప్పినమాటలు నిజమైనవే. అయినను నాకు మిగుల గొప్పదగు కార్యముకలిగియున్నదనిన కర్ణధారుఁడిట్లనియె. ఓభృత్యుఁడా! ఆకార్యమేమియనిన భృత్యుఁడిట్లనియె. ఓ నావికుఁడా! నేను ఇప్పుడే ఈరత్నములను తీసికొని విక్రమార్క



మహారాజుయొక్క పాదమూలమునకుఁ బోవలయును. రాజాజ్ఞను అతిక్రమింపవలసివచ్చునేమో నాకుమిగులభయము కలిగియున్నదనిన నావికుఁడు మరల నిట్లనియె. ఓభృత్యుఁడా! ఆరత్నములలో అయిదురత్నములనూ నాకిచ్చితివేని నేను ఈనదినిదాటింతుననినవిని ఆభృత్యుఁడు అటులనేయిచ్చెదనని చెప్పి ఆరత్నములనిచ్చె. అంతట నావికుఁడు తగినమనుష్యులను సహాయము చేసికొని ఆనదిని దాటించె. అంతట అతివేగముగ నారాజభృత్యుఁడు ఉజ్జయినీపట్టణమునకువచ్చి విక్రమార్కునకు నమస్కారమునుచేసి ఆనైదురత్నములను సమర్పించె. ఆరత్నములనుతీసికొని విక్రమార్కమహారాజు ఓరీ భృత్యుఁడా! మిగిలినరత్నములైదును ఏవియనఁ భృత్యుఁడిట్లనియె. ఓరాజోత్తమా! నేను ఆఋత్తునిచేతనియ్యఁబడినరత్నములనుతీసికొని వచ్చుచుండఁగా మార్గమధ్యయం దొకనదినిండుప్రవాహముకలదై మహావేగముతో వచ్చుచుండె. అందువలన దేవరవారియాజ్ఞానుసారముగ ఎనిమిదిదినములలోపల రాఁజాలనని నావికునిపిలిచి నదినిదాటింపుమని యడుగఁగా వాఁడుఅయిదురత్నములనిచ్చినయెడల దాటింతుననియె. అంతట వానికైదురత్నములనిచ్చినదిని దాటివచ్చి తమయాజ్ఞానుసారముగ వచ్చితిని. మఱియును, రాజాజ్ఞను దాటఁగూడదనితలఁచి యిట్లుచేసితిని. మఱియును,

శ్లో॥ ఆజ్ఞాభంగో నరేంద్రాణాం విప్రాణాం మానఖండనం। పృథక్ఛయ్యా చ నారీణామశస్త్రవధ ఉచ్యతే॥

టీ॥ నరేంద్రాణామ్= రాజులకు. ఆజ్ఞాభంగః=ఆజ్ఞను దాటుటయును. విప్రాణామ్= బ్రాహ్మణులకు. మానఖండనమ్= మానమునుఖండించుటయును. నారీణామ్=స్త్రీలకు. పృథక్ఛయ్యాచ=వేఱుగుశయ్యయును. అశస్త్రవధః= శస్త్రరహితమైనవధ. ఇతి=ఇట్లని. ఉచ్యతే= చెప్పఁబడుచున్నది॥ తా॥ రాజులకు ఆజ్ఞాభంగమును, బ్రాహ్మణులకు మానభంగమును, స్త్రీలకు పృథక్ఛయ్యయును, శస్త్రరహితమైన వధయని చెప్పఁబడుచున్నదని తా॥ అనుప్రమాణానుసారముగ రాజులకు ఆజ్ఞాభంగము అయ్యెనేని శిరశ్ఛేదముచేసినట్లు అగుననితలఁచి ఆరత్నములను ఇచ్చితినని చెప్పి అంతటితో నూరకుండె. ఆమాటలనువిని విక్రమార్కమహారాజు అధికముగా సంతోషమునుచెంది మిగిలినరత్నములను ఆభృత్యునకిచ్చి యింటికిఁబొమ్మనెనని యీకథనుచెప్పి ఆసాలభంజిక మరల నిట్లనియె. ఓరాజోత్తమా! నీకిటువంటియౌదార్యముండినయెడల ఈసింహాసనముమీద నెక్కవలసినదే కాని లేనియెడల ఎక్కఁగూడదనియె. ఈకథనువిని భోజమహారాజు ఏమియును పలుకక మునుపటివలెనిం

టికిఁబోయె.

ఇట్లని విక్రమార్కచరిత్రయందలి అయిదవయుపాఖ్యానము ముగిసెను.

---

## —— (*) ఆఱవచరిత్రము. (*) ——

మరల నొకనాఁడు భోజమహారాజు శుభకరమైన ముహూర్తమునందు సింహాసనమునెక్కుటకువచ్చె. అట్లువచ్చి సింహాసనమునెక్కఁబోవుచుండఁగా ఆఱవసాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కమహారాజునకుఁగల ఔదార్యాది గుణములుకలవాఁడుమాత్రమే యీసింహాసనము నెక్కఁదగును కాని ఇతరుఁడెక్కఁదగదనినవిని భోజమహారాజు విక్రమార్కమహారాజుయొక్క ఔదార్యాదిగుణములను తెలియఁజేయుమనిన విని ఆఱవసాలభంజిక మరలనిట్లనియె. ఓరాజోత్తమా! విక్రమార్కమహారాజు యొక్కయౌదార్యాది గుణములను తెలియఁజేసెదను. వినుము. విక్రమార్కమహారాజు రాజ్యమునుచేయుచుండఁగా ఒకనాడు వసంతోత్సవమునందు సమస్తమైన అంతఃపురస్త్రీలతోఁ గూడుకొనినవాఁడై క్రీడకొఱకు శృంగారవనమునందుఁ బ్రవేశించె. ఆశృంగారవనమునందు॥

శ్లో॥ మాకందేషు నవోదయేషు ముదితామాధ్వీరసా స్వాదినో ఝుంకారైకపరాయణావిరహిణాంమానచ్ఛిదోబంభరాః। హృష్యత్పల్లవతల్లజాంకురలవా స్వాదోన్మిషత్పంచమా భూపాలంరతివిభ్రమా కులతరం భూయోవితేనుఃపికాః॥

టీ॥ నవోదయేషు= నూతనముగా అభ్యుదయమునుపొందిన. మాకందేషు= మామిడిచెట్లయందు. ముదితాః= సంతోషమునుపొందినవియును. రసాస్వాదినః= రసాస్వాదముకలవియును. ఝుంకారైకపరాయణాః= ఝుంకారమునందు ముఖ్యమైనయాశకలవియును. విరహిణామ్ = విరహులయొక్క. మానచ్ఛిదః= మానమును పోఁగొట్టునట్టివియును. (అయిన) బంభరాః = తుమ్మెదలును. హృష్యత్ = వికసించుచున్న. పల్లవతల్లజ= శ్రేష్ఠములయినచిగుళ్ళయొక్క. అంకుర = అంకురములయొక్క. లవ=లేశములయొక్క. ఆస్వాద = ఆస్వాదముచేత. ఉన్మిషత్ = ప్రకాశించుచున్న. పంచమాః= పంచమస్వరములుకల. పికాః=కోవెలలు. భూయః=మాటిమాటికిని. భూపాలమ్=విక్రమార్కమహారాజును. రతివిభ్రమాకులతరమ్= సంభోగవిభ్రమమునందు మిగులవ్యాకులమైనవానినిగాను. వితేనుః = చేసినవాయెను॥ తా॥ నూతనముగా చిగిర్చిన మామిడిచెట్లయందు సంతోషించినవి



యును, మకరందరసమును అనుభవించినవియును, ఝుంకారములను చేయుచున్నవియును, విరహులయొక్కమానమునుపోఁగొట్టునట్టివియును, అయిన తుమ్మెదలును, వికసించుచున్న శ్రేష్ఠములయిన చిగురుటాకులయొక్క లేశములయొక్క ఆస్వాదముచేత అభివృద్ధినిచెందుచున్న పంచమస్వరములుకల కోవెలలు విక్రమార్కమహారాజును సంభోగవిభ్రమముచేత ఆకులమైనవానినిగాఁజేసెనని తా॥ మఱియును,

శ్లో॥ మందేన చందనమహీధరమారుతేనవ్యానర్తితా నవలతాఃకుసుమావతంసాః। జహ్రుర్దృశౌచహృదయంచ నరేశ్వరస్యఘ్రాణంచ భృంగనినదైర్మధురైశ్శ్రవశ్చ॥

టీ॥ మందేన= మందగమనముకల. చందనమహీధరమారుతేన= చందనపర్వతముమీదుగ వచ్చుచున్నవాయువుచేత. వ్యానర్తితాః = కదల్పఁబడినవియును. కుసుమావతంసాః= పుష్పములుశిరోభూషణముగాఁ గలవియును. (అయిన) లతాః=లతలు. నరేశ్వరస్య= విక్రమార్కమహారాజుయొక్క. దృశౌచ= దృక్కులను. హృదయంచ= హృదయమును. ఘ్రాణంచ= ఘ్రాణమును అపహరించుచున్నవి. మధురైః=మనోహరములయిన. భృంగనినదైః= తుమ్మెదలయొక్క ధ్వనులచేత. శ్రవశ్చ=చెవులను. జహ్రుః = అపహరించెను॥ తా॥ మిగుల మెల్లగవచ్చునట్టిదియును, మలయపర్వతముమీదుగవచ్చునట్టిదియును, అయిన వాయువుచేత వసంతఋతువు విక్రమార్కమహారాజుయొక్క దృక్కులను, హృదయమును, ముక్కును, హరించె. మనోహరములయిన తుమ్మెదలయొక్క ధ్వనులచేత చెవులను హరించెనని తాత్పర్యము॥ ఇట్లు వసంతఋతువు మిగుల మనోహరమై ప్రకాశించుచుండె. మఱియును, నానావిధము లయిన వృక్షములచేత ప్రకాశించుచున్నయుద్యాన వనమునందు విక్రమార్కమహారాజు అధికమైన సంభోగేచ్ఛకలవాఁడై యొకానొకప్పుడు దిగుడుబావులయందును, ఒకానొకప్పుడు పుష్పములచేత వ్యాప్తములయిన పొదరిండ్లయందును, ఒకానొకప్పుడు వృక్షములయందును, ఒకానొకప్పుడు చంద్రకాంతమణిమయములయిన మేడలయందును, అంతఃపురస్త్రీలతోఁగూడ కొంతకాలమునుగడిపె. అట్లుండఁగా, ఆయుద్యానవనమునందు ఒకానొక బ్రహ్మచారి యొకానొక వృక్షమూలమునందు తపస్సునుచేయుచు అచ్చోటునకువచ్చిన విక్రమార్కమహారాజునుచూచి తనమనస్సునందిట్లని యాలోచించె. తపస్సును చేయుచున్న నాచేత నాజన్మము వ్యర్థముచేయఁబడెను. స్వప్నమునందుఁగూడఁ

గొంచెమైనను సుఖమును అనుభవించినవాఁడనుగాను. బ్రతికియున్నంతవఱకును కష్టముచేత కాలమునుగడిపి చచ్చినపిమ్మట నెప్పుడో సుఖమును అనుభవించెదనని యోచించుట పిచ్చితనమువలెఁ గనఁబడుచున్నది. మఱియును, విషయసుఖమంతయును దుఃఖముతోఁగూడుకొన్నదని తలఁచి యెన్నఁడో నాశములేనిసుఖమువచ్చునని తపస్సును చేయవలసినదని తలఁచుట మూర్ఖపద్ధతియే కాని యుచితమైనపద్ధతి కాదు. మఱియును,

శ్లో॥ త్యాజ్యంసుఖం విషయసంగమ జన్మపుంసాం దుఃఖోపసృష్ట మితిమూర్ఖవిచారణైషా। వ్రీహీనపాస్యచ సితోత్తమతండులాఢ్యాన్కః కాంక్షతే తుషకణాన్మతిమాన్ధరిత్రీ॥

టీ॥ విషయాసంగమజన్మ = విషయసంగమమువలనఁబుట్టిన. సుఖమ్ = సుఖము. దుఃఖోపసృష్టమ్ = దుఃఖముతోఁగూడినది. తస్మాత్ = అందువలన. పుంసామ్ = పురుషులకు. త్యాజ్యమ్ = విడువఁదగినది. ఇతి = ఇట్లని. ఏషా = ఇది. మూర్ఖవిచారణా = మూర్ఖులతలంపు. మతిమాన్ = బుద్ధిమంతుఁడగువాఁడు. కః = ఎవ్వఁడు. సితోత్తమతండులాఢ్యాన్ = తెల్లనివియును, శ్రేష్ఠములయినవియును, అయినతండులములతోఁగూడుకొనిన. వ్రీహీన్ = ధాన్యములను. అపాస్య = వదలి. తుషకణాన్ = తుషకణములను. ధరిత్ర్యామ్ = భూమియందు. కాంక్షతే = కోరుచున్నాఁడు॥ తా॥ విషయసంగమమువలనఁ బుట్టినసుఖము దుఃఖముతోఁగూడుకొనినది కనుక విడువఁదగినదనుట మూర్ఖునితలంపుగాని యుత్తమమైనతలంపు కాదు. మఱియును, తెల్లనివియును, శ్రేష్ఠములయినవియును, అయిన ధాన్యమును వదలి బుద్ధిమంతుఁడగువాఁ డెవ్వఁడు తుషకణములను కోరుచున్నాఁడని తా॥ అను ప్రమాణానుసారముగ మిగులఁ గష్టమునైనను అవలంబించి సంసారసారభూతమైన స్త్రీసుఖమును అనుభవింపవలయును. మఱియును,

శ్లో॥ అసారభూతేసంసారే సారస్సారంగలోచనా। తదర్థంధనమిచ్ఛంతి తత్త్యాగేతుధనేనకిమ్॥

టీ॥ అసారభూతే = సారరహితమైన. సంసారే = సంసారమునందు. సారంగలోచనా = లేడినేత్రములవంటి నేత్రములుకలయాఁడుది. సారః = సారమైనది. తదర్థమ్ = ఆస్త్రీకొఱకు. ధనమ్ = ధనమును. ఇచ్ఛంతి = కోరుచున్నారు. తత్త్యాగేతు = ఆస్త్రీనివదలుటయందు. ధనేన = ధనముతో. కిమ్ = ఏమిప్రయోజనము॥ తా॥ సారరహితమైన సంసారమునందు ఆఁడుదిసారమైనది. కాఁబట్టి స్త్రీకొఱకుధనమునుకోరుచున్నారు. స్త్రీనివదలినయెడల ధనము



తోఁ బ్రయోజనమేమని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ విషయసుఖములలో నుత్తమమైన స్త్రీసుఖము ననుభవింపని వానిజన్మము నిరర్థకమైనదని ఆబ్రహ్మచారి తలఁచి తనమనస్సునందు మరల నిట్లని యోచించె. ఈ విక్రమార్కమహారాజు దైవయోగముచేత నిక్కడకువచ్చె. కాఁబట్టి యితనిని యాచించి సంసారసుఖమును పొందుదమని యాలోచించి విక్రమార్కమహారాజుయొక్క సమీపమునకువచ్చి యోరాజోత్తమా! చిరకాలము జీవించి యుండుమని యాశీర్వదించె. అంతట విక్రమార్కమహారాజు ఆబ్రహ్మచారిని యుచితాసనమునందుఁ గూర్చుండఁబెట్టి యిట్లనియె. ఓ బ్రాహ్మణోత్తమా! నీ వెక్కడనుండి యిచ్చోటునకు వచ్చితివనిన విని ఆబ్రహ్మచారి ఓరాజోత్తమా! నేనిక్కడనే జగదంబికకు పరిచర్యను చేయుచునుండువాఁడను. ఇక్కడ అంబికకు పరిచర్యను చేయుచుండఁగ నేబదిసంవత్సరములుగతించినవి. నేను బ్రహ్మచారిని. ఈరాత్రి నాల్గవయామమునందు స్వప్నమునందు జగదంబిక యిట్లనియె. ఓరీవత్సా! నేను ప్రసన్నురాలనయితిని. నీవిప్పుడు గృహస్థాశ్రమమును స్వీకరించి పుత్రునిఁగని పిమ్మట మోక్షమునందు మనస్సును పెట్టుము. అట్లుగాదేని నీకు గతికలుగ నేరదు. మఱియును,

శ్లో॥ ఋణానిత్రీణ్యపాకృత్యమనోమోక్షేనివేశయేత్। అనపాకృత్యమోక్షంతుసేవమానఃపతత్యధః॥

టీ॥ త్రీణి = మూఁడువిధములయిన. ఋణాని = ఋణములను. అపాకృత్య = తొలిగించి. మనః = మనస్సును. మోక్షే = మోక్షమునందు. నివేశయేత్ = ప్రవేశపెట్టవలయును. త్రీణి = మూఁడువిధములయిన. ఋణాని = ఋణములను. అనపాకృత్య = తిరస్కరింపక. మోక్షంతు = మోక్షమును. సేవమానః = సేవించుచున్నవాఁడు. అధఃపతతి = క్రిందఁబడుచున్నాఁడు॥ తా॥ దేవర్షిపితృఋణములను మూఁటిని తీర్పక మోక్షమునుకోరెనేని అధోలోకమును పొందునని తా॥ అను ప్రమాణానుసారముగ నీవు వివాహమును చేసికొనుమనియె. అంతట దానశౌండుఁడయిన విక్రమార్కమహారాజు శీఘ్రముగ నిక్కడకు రాఁగలఁడు. వచ్చినకోరికను నెరవేర్పఁగలఁడని చెప్పి అంతర్ధానమును పొందె. అంతట నేను మేలుకొని యిచ్చోటునకువచ్చియున్న నిన్నుఁజూచితినని కేవలముగ నసత్యవచనములను పలికె. ఆవచనములను విని విక్రమార్కమహారాజు తనమనస్సునం దిట్లని యాలోచించె. ఈబ్రహ్మచారి చెప్పినవచనము నిజముగనుండునా? దేవత స్వప్నమునందు ఈవిధముగఁ జెప్పియుండదు. ఈబ్రాహ్మణుఁడే లోభగుణమువలన ఈవిధముగాఁ జెప్పుచున్నాఁడు.

కానిమ్ము! ఈబ్రాహ్మణుఁడు మిగుల నార్తుఁడయినవానివలెఁ గనఁబడుచున్నాఁడు. కాఁబట్టి సర్వాత్మనాయితనికోర్కెనుదీర్చెదను. మఱియును,

శ్లో॥ దత్వార్థినే నృపోదానం శూన్యలింగం ప్రపూజ్యచ। పరిపాల్యాశ్రితాన్నిత్య మశ్వమేధఫలంలభేత్॥

టీ॥ నృపః-రాజు. అర్థినే=యాచకునికొఱకు. దానమ్= దానమును. దత్వా=ఇచ్చి. శూన్యలింగమ్= పూజారహితమైనలింగమును. ప్రపూజ్యచ= పూజించియును. నిత్యమ్= ఎల్లప్పుడును. ఆశ్రితాన్-ఆశ్రితజనులను. పరిపాల్యచ= పాలించియును. అశ్వమేధఫలమ్= అశ్వమేధయాగముయొక్క ఫలమును. లభేత్ = పొందును॥ తా॥ రాజుయాచకునికొఱకు దానముచేసియును, శూన్యమైనలింగమునకు పూజనుచేసియును, ఆశ్రితజనులను కాపాడియును, అశ్వమేధయాగమువలనఁ గలుగుఫలమునుపొందునని తాత్పర్యము॥ అనుప్రమాణానుసారముగ యాచకునికోర్కెనుతీర్చుట యుత్తమమనితలఁచి అక్కడ నొకపట్టణమునునిర్మించి ఆబ్రాహ్మణుని ఆపట్టణమునకధిపతినిగాఁజేసి నూర్గురువిలాసినీస్త్రీలను, అయిదునూరులగుఱ్ఱములను ఇరువదినాలుగురథములను నాలుగువేల సైన్యమును ఇచ్చె. మఱియును, ఆపట్టణమునకు చండికానగరమని పేరుపెట్టె. అంతట నాబ్రాహ్మణుఁడు సంపూర్ణమైనమనోరథముకలవాఁడై వివాహమునుచేసికొని ఆవిక్రమార్కమహారాజునకు అనేకవిధముల నాశీర్వచనములనుచేసె. అంతట విక్రమార్కమహారాజు తననగరమునకుఁబోయెనని యీకథను సాలభంజిక భోజమహారాజునకుఁ జెప్పె. ఈకథనువిని భోజమహారాజు విక్రమార్కునకుఁగల యౌదార్యము తనకు లేదనితలఁచి యేమియునుపలుకక మరల గృహమునకుపోయె.

ఇట్లని విక్రమార్కచరిత్రయందలి ఆఱవ ఉపాఖ్యానము ముగిసెను.

---

——(*) ఏడవచరిత్రము. (*)——

అంతట నొకనాఁడు భోజమహారాజు శుభముహూర్తమును విచారించుకొని తగిన సన్నాహముకలవాఁడై సింహాసనము నెక్కఁదలఁచివచ్చి సింహాసనముమీద నెక్కఁబోవుచుండఁగా, ఏడవసాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! నీకు విక్రమార్కునకుఁగల యౌదార్యాదిగుణములుకలిగియుండెనేని ఈసింహాసనము నెక్కవలసినదేకాని లేనియెడల ఎక్కఁగూడదనిపవిని భోజమహారాజిట్లనియె. ఓసాలభంజికా! విక్రమార్కునియొక్క యౌదార్యాదిగుణములను చెప్పుమనిన సాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కుని గుణములను వినవలయునని నీకు తలంపుకలదేని చెప్పెదను. వినుము. విక్రమార్కమహారాజు రాజ్యమును చేయుచుండఁగా లోకమునందు దుర్జనుఁడైన కంటకుఁడెవ్వఁడును లేడు. లోకములోని వారందఱును సదాచారసంపన్నులై యుండిరి. బ్రాహ్మణులందఱును వేదశాస్త్రాభ్యాసాది స్వధర్మములయందు ఆసక్తికలవారును, షట్కర్మనిరతులును, పరమేశ్వరునియందు భక్తికలవారునునైయుండిరి. మఱియును, సకల జనులును, దేహమునందు నిర్మమత్వమును, నిత్యానిత్య వస్తువిచారముకలవారును, పరలోకమునందు బుద్ధికలవారును, వాక్కునందు సత్యము కలవారును, ప్రాణులయందు దయకలవారును, పరమేశ్వరునియందు భక్తికలవారునునైయుండిరి. ఈవిధముగా అందఱును పవిత్రమైన అంతఃకరణముకలవారై విక్రమార్కమహారాజుయొక్క అనుగ్రహముచేత సుఖముగానుండిరి. ఇట్లుండఁగా ఆయుజ్జయినీనగరమునందు ధనదుఁడనుపేరుకల యొక వైశ్యుఁడు (కోమటి) ఉండెను. ఆకోమటికి అపరిమితమైన ధనముకలిగియుండె. మఱియును లోకములో దుర్లభములయిన వస్తువులన్నియును వానికిసులభములై యున్నవి. ఇట్లు సకల సంపదలతోడను కూడుకొనిన ఆకోమటికి ఒకనాఁడు సర్వసంపదలును నిత్యములుకావుకదా? అని తలంపుకలిగి యిట్లనియోచించె. ఆహా ఈసంసారము నిస్సారమైనది. సకల వస్తువులును అనిత్యములయినవి. మఱియును,

శ్లో॥ గగననగరకల్పస్సంగమోవల్లభానాం। జలదపటలతుల్యంయౌవనంవాధనంవా। స్వజనసుతశరీరాదీనివిద్యుచ్చలాని క్షణికమితిసమస్తం విద్ధి సంసారవృత్తమ్॥

టీ॥ వల్లభానామ్= స్త్రీలయొక్క. సంగమః=సాంగత్యము. గగననగరకల్పః= గంధర్వనగరముతో సమానమైనది. యౌవనంవా= యౌవనమైనను. ధనంవా= ధనమైనను. జలదపటలతుల్యమ్= మేఘపటలముతో సమానమైనది. స్వజనసుతశరీరాదీని= తమజనులయొక్కయు పుత్రులయొక్కయు, శరీరములు మొదలగునవి. విద్యుచ్చలాని=మెఱుపులతో సమానములయినవి. సమస్తమ్= సకలమైన. సంసారవృత్తమ్ = సంసారసమాచారము. క్షణికమితి= క్షణమాత్రముండునదియని. విద్ధి= తెలిసికొనుము॥ తా ॥ స్త్రీలయొక్క సాంగత్యము గంధర్వనగరముతో సమానమైనది. యౌవనధనములు మేఘపటలముతో సమానములయినవి. పుత్రమిత్రాదులయొక్క శరీరాదులు మెఱుపులతో సమానములయినవి. మఱియును, సంసార వృత్తాంతమంతయు

ను క్షణికమైనదని తెలిసికొనుమనితా॥ మఱియును,

శ్లో॥ శరణమశరణంవా బంధమూలంనరాణాంక్షణపరిచితదారాద్వారమాపద్గణానాం। విపరిమృశతపుత్రాశ్శాత్రవం సర్వమేతత్త్యజతభజతధర్మంనిర్మలంధర్మకామాః॥

టీ॥ హేపుత్రాః= ఓపుత్రులారా! శరణంవా= శరణమయినను. అశరణంవా= అశరణమయినను. నరాణామ్= మానవులకు. బంధమూలమ్= బంధమునకుకారణమయినది. క్షణపరిచితదారాః = క్షణమాత్రముపరిచయముకలభార్య. ఆపద్గణానామ్ = ఆపత్సముదాయములకు. ద్వారమ్= ద్వారము. విపరిమృశత= విచారింపుఁడు. ఏతత్= ఈ. సర్వమ్= సమస్తమును. శాత్రవమ్= శత్రుసంబంధమైనది. (తస్మాత్= అందువలన) ఏతత్= ఈ. సర్వమ్= సమస్తమును. విపరిమృశత = విచారింపుఁడు. ధర్మకామాః= ధర్మమునందు కోర్కెకల యోధులులారా! నిర్మలమ్= నిర్మలమైన. ధర్మమ్= ధర్మమును. భజత= సేవింపుఁడు॥ తా॥ ఓపుత్రులారా! శరణమైనను, అశరణమైనను మానవులకు బంధమూలమేకాని మఱియొకటికాదు. క్షణమాత్రముసేవు పరిచయముకలభార్య సకలమైన ఆపత్తులకును నివాసభూతమైనది. ఓపుత్రులారా! విచారింపుఁడు. సర్వమును శత్రురూపమైనదేకాని మఱియొక్కటికాదు. కాఁబట్టి మీరుచక్కఁగ విచారించి సర్వమును వదలుకొనుఁడు. ధర్మమును సేవింపుఁడని తాత్పర్యము॥ అనుశాస్త్రానుసారముగ ధర్మమునే ఆశ్రయింపవలసినదికాని యితరమును ఆశ్రయింపఁగూడదు. మఱియును,

శ్లో॥ ధర్మోరక్షతి రక్షితోనతుహతోహంతీ హసప్రాణినోహంతవ్యోనతుయస్సఏవశరణంసంసారిణాంసర్వదా। ధర్మఃప్రాపయతీహతత్పదమపిధ్యాయంతియంయోగినోనో ధర్మాత్సుహృదస్తినైవచ సుఖినోపండితోధార్మికాత్॥

టీ॥ ధర్మః= ధర్మము. రక్షితః= రక్షింపఁబడినదై. రక్షతి= రక్షించుచున్నది. హతః= చంపఁబడినదై. సః=ఆధర్మము. ఇహ= ఈలోకమునందు. ప్రాణినః= ప్రాణులను. నహంతి= చంపదు. యః=ఏధర్మము. నహంతవ్యః= చంపఁదగినదికాదో. సఏవ= ఆధర్మమే. సర్వదా = సర్వకాలములయందును. సంసారిణామ్= సంసారులకు. శరణమ్= రక్షకమైనది. ధర్మః=ధర్మము. ఇహ= ఈలోకమునందు. తత్పదమపి = ఆబ్రహ్మపదమునుకూడ. ప్రాపయతి= పొందించుచున్నది. యమ్=ఏధర్మమును. యోగినః= యోగులు. ధ్యాయంతి= ధ్యానమునుచేయుచున్నారో. తస్మాత్= అటువంటి. ధర్మాత్= ధర్మముకంటె. సుహృత్= స్నేహితుఁడు. నైవాస్తి= లేదు. ధార్మికాత్= ధార్మికునికంటె. సుఖీ= సుఖవంతుఁడును. పండితః= పండితుఁడును. నైవాస్తి= లేడు॥ తా॥ ధర్మము రక్షింపఁబడినదై రక్షించుచున్నది. ఆధర్మము కొట్టఁబడినదయ్యును ప్రాణులనుచంపదు. మఱియును, ఏధర్మముకొట్టఁదగినదికాదో ఆధర్మము సంసారులకు సర్వకాలములయందును సేవింపఁదగినది. మఱియును, ధర్మము ఈలోకమునందే బ్రహ్మపదమును పొందించుచున్నది. మఱియును, ఏధర్మమును యోగులు సేవించుచున్నారో అటువంటి ధర్మముకంటె స్నేహితుఁడులేడు. మఱియును, ధార్మికునికంటెసుఖవంతుఁడును పండితుఁడును లేడనితా॥ మఱియును,

శ్లో॥ ధర్మశ్శర్మభుజంగపుంగవపురీసారం విధాతుం క్షమోధర్మః ప్రాపితమర్త్యలోకవిపులప్రీతిస్తదాశంసినాం। ధర్మస్స్వర్నగరీనిరంతరసుధాస్వాదోదయస్యాస్పదంధర్మః కింనకరోతిముక్తివనితా సంభోగభాగ్యాంతరమ్॥

టీ॥ ధర్మః= ధర్మము. శర్మభుజంగపుంగవపురీసారమ్= సుఖకరమైన పాతాళలోకమునందలి సుఖసారమును. విధాతుమ్= చేయుటకొఱకు. క్షమః= తగినది. ధర్మః=ధర్మము. తదాశంసినామ్= ఆధర్మమునుసూచించువారలకు. ప్రాపితమర్త్యలోకవిపులప్రీతిః= పొందింపఁబడిన మానవలోకమునందలి విపులమైనప్రీతికలది. ధర్మః= ధర్మము. స్వర్నగరీనిరంతరసుధాస్వాదోదయస్య= స్వర్గపట్టణమునందలి ఎడతెగని అమృతాస్వాదముయొక్క అభ్యుదయమునకుఉనికిపట్టు. ధర్మ = ధర్మము. ముక్తివనితాసంభోగభాగ్యాంతరమ్= ముక్తికాంతయొక్క సంభోగమనియెడు మఱియొకభాగ్యమును. నకరోతికిమ్= చేయదాఏమి॥ తా॥ ధర్మముసుఖకరమైన పాతాళలోకమునందలి భోగవతీపట్టణమునందలి సుఖసారమును చేయుటయందు మిగుల సమర్థమైనది. మఱియును ధర్మము మానవలోకమునందలి సకల సుఖములను కలిగించుటయందు అధికమైన సామర్థ్యముకలది. మఱియును, ధర్మము స్వర్గపట్టణమునందలి నిరంతర సుధాస్వాదమును కలుగఁజేయును. మఱియును, ముక్తికాంతయొక్క సంభోగమనియెడు మఱియొక భాగ్యమును కలుగఁజేయునని తాత్పర్యము॥ అను ప్రమాణవచనముల ననుసరించి ధర్మసంగ్రహముకొఱకు ధనమునుసంపాదించి ఆధనమును సత్పాత్రయందు దానమును చేయువలయును. మఱియును, సత్పాత్రయందు సమర్పింపఁబడిన ధ

నముబహుగుణములుకలదియగును. మఱియును,

శ్లో॥ పాత్రవిశేషేన్యస్తం సౌగుణ్యంభజతివిత్తమతిదాతుః। జలమివసముద్రశుక్తౌముక్తాఫలతాంపయోదబృందస్య॥

టీ॥ పాత్రవిశేషే= సత్పాత్రయందు. న్యస్తమ్= ఉంచఁబడిన. విత్తమ్=ధనము. దాతుః=దాతకు. అతి= అధికమైన. సౌగుణ్యమ్= సుగుణత్వమును. పయోదబృందస్య= మేఘసముదాయముయొక్క. జలమ్= ఉదకము. సముద్రశుక్తౌ= సముద్రమునందలి ముత్యపుచిప్పయందు. ముక్తాఫలతామివ= ముత్యమునువలెనే. భజతి=పొందుచున్నది॥ తా॥ మేఘములోనియుదకము సముద్రమునందలి ముత్యపుచిప్పయందుఁబడి ముత్యమైనవిధముగ సత్పాత్రయందుంచఁబడిన ధనముకోటిగుణితమగుననితా॥ మఱియును,

శ్లో॥ న్యగ్రోధస్యయథాబీజం స్తోకంసుక్షేత్రభూమిగం। బహువిస్తీర్ణతాంయాతితద్వద్దానంసుపాత్రగమ్॥

టీ॥ న్యగ్రోధస్య= మఱ్ఱిచెట్టుయొక్క. బీజమ్= విత్తనము. స్తోకమ్= కొంచెమయ్యును. సుక్షేత్రగమ్= మంచిభూమినిపొందినదై. యథా= ఏప్రకారముగా. బహువిస్తీర్ణతామ్= మిగులవిస్తారత్వమును. యాతి= పొందుచున్నదో. తద్వత్= ఆప్రకారముగా. సుపాత్రగమ్= మంచిపాత్రనుపొందిన. దానమ్= దానము. బహువిస్తీర్ణతామ్= మిగులవిస్తారత్వమును. యాతి= పొందుచున్నది॥ తా॥ మఱ్ఱిచెట్టుయొక్కవిత్తనము స్వల్పమైనదయ్యును మంచిభూమినిపొందినదగుచు మిగుల విస్తారమైనదగునో అటులనే సత్పాత్రయందు ఈయఁబడినధనము కోటిగుణితమగునని తాత్పర్యము॥ అను ప్రమాణవచనములనుపట్టి చక్కఁగనాలోచించి అనేకులగు శ్రోత్రియులనుపిలిచి వారివలన దానకాండయందుఁ జెప్పఁబడిన సకలదానములనువిని తనధనమును సర్వమును సత్పాత్రలయందువినియోగింపఁజేసి పవిత్రమైన అంతఃకరణముకలవాఁడై మరలనిట్లనియాలోచించె. ఓహో నేను దానవ్రతాదికమును సర్వమును ఆచరించితిని. ద్వారవతీపురమునకుఁబోయి శ్రీకృష్ణుని జూచినయెడల ఈదానవ్రతాదికమంతయును సఫలమగును. కావున ద్వారవతీనగరమునకుఁబోయి శ్రీకృష్ణునిజూచెదనని యాలోచించి ద్వారవతీపట్టణమునకుఁ బోఁదలఁచి సముద్రతీరమునకుఁబోయెం. పోయి ఒకనావికునిపిలిచి పడవను నిర్ణయించుకొని తనవెంటవచ్చినభిక్షుకులను యోగులను పడవమీదనెక్కించి తానునుఎక్కి ధర్మములను తెలుపునట్టి కథలనువినుచుపోవుచుండె. అట్లుపోవుచుండఁగా, సముద్రమధ్యయందు మిగులవిశాలమైన యొకపర్వతమును



చూచె. మఱియు నాపర్వతమునందు మిగులగొప్పదగు నొకదేవాలయమునుచూచె. చూచినపిమ్మట ధనదుఁడనుపేరుకల వైశ్యుఁడు ఆదేవాలయములోనికిఁబోయి భువనేశ్వరియను దేవతను గంధపుష్పాక్షతాదులచేత పూజించి ఆదేవతకు నమస్కరించె. పిమ్మట ఆదేవతయొక్క వామభాగమునందు ఛేదింపఁబడియున్న స్త్రీపురుషులజంటనుచూచి ఆమధునకు ముందరిభాగమునందున్న గోడయందు నెత్తురుతో వ్రాయఁబడియున్న యక్షరములను చదివె. ఏమనిన పరోపకారమునందుండై పుణ్యముకలవాఁడును, ముప్పదిరెండులక్షణములతోఁ గూడుకొనినవాఁడును నగు నేమానవుఁడైనను తనకంఠరక్తముతో ఈభువనేశ్వరిని పూజించినయెడల ఈస్త్రీపురుషులు జీవింతురనివ్రాసియుండె. ఈవిషయమును సర్వమునుచదివి మిగుల నాశ్చర్యముకలవాఁడై మరల నోడనెక్కి ద్వారవతీపట్టణమునకుఁబోయి శ్రీకృష్ణుని నమస్కరించి యిట్లనిస్తోత్రముచేసె. ఎట్లనిన,

శ్లో॥ ఏకోపికృష్ణస్య సకృత్ప్రణామో దశాశ్వమేధావభృథేనతుల్యః। దశాశ్వమేధీపునరేతి జన్మకృష్ణప్రణామోన పునర్భవాయ॥

టీ॥ కృష్ణస్య= కృష్ణునియొక్క. సకృత్ప్రణామః = ఒక్కమాటుచేయఁబడినసమస్కారము. ఏకోపి= ఒక్కటియును. దశాశ్వమేధావభృథేన= పదియగు నశ్వమేధయాగములయందలి అవభృథస్నానముతో. తుల్యః= సమానమైనది. దశాశ్వమేధీ= పదియగునశ్వమేధయాగమును చేసినవాఁడు. పునః= మరల. జన్మ=జన్మమును. ఏతి=పొందుచున్నాఁడు. కృష్ణప్రణామః= కృష్ణునకునమస్కారమును చేసినవాఁడు. పునః= మరల. భవాయ= జన్మముకొఱకు. నభవతి= సమర్థుఁడుగాఁడు॥ తా॥ కృష్ణునకొకపర్యాయము నమస్కారమునుచేసినయెడల ఆనమస్కారము పదియగు నశ్వమేధయాగములయందలి యవభృథస్నానముతో సమానమైనది. పదియగు నశ్వమేధయాగములను చేసినవాఁడు పునర్జన్మమునుపొందునుగాని శ్రీకృష్ణునకు నమస్కారమునుచేసినవాఁడు పునర్జన్మమునుపొందఁడని తాత్పర్యము॥ అను ప్రమాణవచనములననుసరించి శ్రీకృష్ణుఁస్తోత్రముచేసి మఱియును, శ్రీకృష్ణునకు షోడశోపచారములచేత పూజనుచేసి తానుదెచ్చి నయపూర్వవస్తువులను శ్రీకృష్ణునకుసమర్పించి అక్కడ మూఁడుదినములుండి అచ్చోటునుండి బయలువెడలి కొన్నిదినములలోపల తనపట్టణమునకువచ్చె. అంతట శ్రీకృష్ణప్రసాదముచేత సకల బంధువులను సత్కరించె. అంతట,

శ్లో॥ రిక్తపాణిర్నపశ్యేత్తు రాజానందైవతంగురుం। నైమిత్తికంవి

శేషేణ సుహృదంఫలకాముకః॥

టీ॥ ఫలకాముకః= ఫలమునుకోరువాఁడు. రిక్తపాణిః = శూన్యమైనహస్తముకలవాఁడై. రాజానమ్= రాజును. దైవతమ్ = దేవతను. గురుమ్= గురువును. విశేషేణ=విశేషముగా. నైమిత్తికమ్=ఏదోయొకనిమిత్తమువలనవచ్చిన. సుహృదమ్=స్నేహితుని. నపశ్యేత్=చూడఁగూడదు॥ తా॥ ఫలమునుకోరువాఁడు రాజును, దేవతను, గురువును, మిత్రునిరిక్తహస్తుఁడైపోయిచూడఁగూడదని తా॥ మఱియును,

శ్లో॥ ఇష్టాంభార్యాంప్రియంమిత్రం పుత్రంచాపికనీయసం। రిక్తపాణిర్నపశ్యేత్తు తథానైమిత్తికంప్రభుమ్॥

టీ॥ ఇష్టామ్=ప్రియమైన. భార్యామ్=భార్యను. ప్రియమ్=ప్రియుఁడైన. మిత్రమ్=స్నేహితుని. కనీయసమ్=కనిష్ఠుఁడైన. పుత్రంచాపి=పుత్రుని. తథా=ఆప్రకారముగా. నైమిత్తికమ్=నిమిత్తవశముచేత చూడఁదగిన. ప్రభుమ్=ప్రభువును. రిక్తపాణిః=శూన్యహస్తుఁడై. నపశ్యేత్=చూడఁగూడదు॥ తా॥ ఇష్టురాలగుభార్యను, ప్రియుఁడగుస్నేహితుని, బాలుఁడగుపుత్రుని, రాజును, చూచుటకుఁబోవునపుడురిక్తహస్తుఁడై పోఁగూడదని తాత్పర్యము॥ అనుప్రమాణవచనములననుసరించి యాలోచించి ప్రాతఃకాలమునందుఒకానొకఅపూర్వవస్తువునుతీసికొని విక్రమార్కమహారాజును చూచుటకుఁబోయెను. పోయిమిగులవినయముతో శ్రీకృష్ణునిప్రసాదమునిచ్చి ఆవిక్రమార్కమహారాజుచేతనిర్దేశింపఁబడిన సింహాసనమునందుఁగూర్చుండె. అంతటవిక్రమార్కమహారాజు ఆధనదుఁడనువైశ్యుఁడుచేసిన తీర్థయాత్రలయందలివిశేషములనడుగుచు అపూర్వమైనవిశేషమేమైనఁగలదా? అనిఅడుగఁగానే ఆవైశ్యుఁడు మిగులఁగుతూహలముకలవాఁడై సముద్రమధ్యమునందలి పర్వతమునందున్నభువనేశ్వరివద్ద జరిగియున్నవిశేషమును తెలియఁజేసె. ఆవృత్తాంతమునువినినతోడనే విక్రమార్కమహారాజు ఆవైశ్యునితోఁగూడ ఆభువనేశ్వరీదేవాలయమునకుఁబోయి అక్కడనున్నమొండెములనుచూచి ఆయక్షరములనుచదివి ఖడ్గముచేత తనశిరస్సునుసరికి ఆభువనేశ్వరికి బలినియ్యఁదలఁచి కంఠమునందు ఖడ్గమునుపెట్టి తెగవ్రేయుటకుఁబ్రయత్నించె. ఆసమయమునందు ఆమొండెములురెండును అతికికొని జీవముకలవయ్యె. అంతలోదేవతవచ్చి ఆవిక్రమార్కమహారాజుయొక్క చేతియందున్నఖడ్గమునుతీసికొని యిట్లనియె. ఓరాజోత్తమా! నేనుప్రసన్నురాలనైతిని. వరమునుకోరుమనిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓదేవతా! నీవుప్రసన్నురాలవయినయెడల ఈ



దంపతులకు రాజ్యమునిమ్మనిన దేవతమిగులసంతోషముకలదై ఆదంపతులకు రాజ్యమునిచ్చె. అంతటవిక్రమార్కమహారాజు ధనదునితోఁగూడ ఉజ్జయినీపట్టణమునకుఁబోయెనని యీకథనుచెప్పి ఆసాలభంజిక మరలనిట్లనియె. ఓ భోజమహారాజా! నీయందిటువంటి సాహసాదిగుణములులేవు. కాఁబట్టినీవిసింహాసనముమీఁద నెక్కుటకుఁదగవనియె. ఈకథనువిని భోజమహారాజుఏమియునుపలుకకయెప్పటియట్ల తననగరునకుపోయె.

ఇట్లని విక్రమార్కచరిత్రయందలి యేడవకథ ముగిసెను.

---

(*) ఎనిమిదవచరిత్రము. (*)

మరలనొకనాఁడు భోజమహారాజు మునుపటివలెనే సుముహూర్తమునువిచారించుకొని ఆసింహాసనముమీఁద నెక్కుటకురాఁగా, ఎనిమిదవసాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! ఈసింహాసనముమీఁద విక్రమార్కమహారాజుతప్పఁ దక్కినవారెక్కఁదగదు. నీకువిక్రమార్కునియొక్క సుగుణములవంటి సుగుణములుకలిగియున్నయెడల ఈసింహాసనముమీఁదనెక్కవచ్చునేకాని లేనియెడలఎక్కఁగూడదనినవిని భోజమహారాజుసిగ్గుచేత శిరస్సునువంచుకొని యిట్లనియె. ఓసాలభంజికా! నీకుఁదెలిసినయెడల విక్రమార్కమహారాజుయొక్క ఔదార్యాదిగుణములను చెప్పుమనినవిని సాలభంజికయిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కునియొక్క యౌదార్యాదిగుణములనుచెప్పెదను. వినుము. విక్రమార్కమహారాజు రాజ్యమునుచేయుచున్నకాలమునందు చారులమూలకముగ నానావిధములయిన సంగతులనుతెలిసికొనుచు భూమినిపాలించుచుండె. మఱియును,

శ్లో॥ గావోగంధేనపశ్యంతి వేదేనైవద్విజాతయః। చారైఃపశ్యంతి రాజానశ్చక్షుర్భ్యామితరేజనాః॥

టీ॥ గావః=గోవులు. గంధేన=గంధముచేత. పశ్యంతి=చూచుచున్నవి. ద్విజాతయః=బ్రాహ్మణులు. వేదేనైవ=వేదముచేతనే. పశ్యంతి=చూచుచున్నారు. రాజానః=రాజులు. చారైః=చారులచేత. పశ్యంతి=చూచుచున్నారు. ఇతరే=ఇతరులయిన. జనాః=జనులు. చక్షుర్భ్యామ్=నేత్రములచేత. పశ్యంతి=చూచుచున్నారు॥ తా॥ గోవులుగంధముచేతచూచుచున్నవి. బ్రాహ్మణులు వేదముచేతచూచుచున్నారు. చారులచేత రాజులుచూచుచున్నారు. ఇతరులగువారు నేత్రములచేత చూచుచున్నారని తాత్పర్యము॥ అనుప్రమాణానుసారముగ విక్రమార్క మహారాజు చారులమూలకముగ సర్వమును తె

లిసికొనుచుండె. మఱియును, రాజగువాడు సకలజనులయొక్క స్థితిని చక్కఁగఁ దెలిసికొనవలయును. యాచకులను పూజింపవలయును. ప్రజలఁ జక్కఁగఁ బాలింపవలయును. దుష్టులను దండింపవలయును. న్యాయముగా ధనమును సంపాదింపవలయును. యాచకులయందు పక్షపాతము నవలంబింపవలయును. ఇవియే రాజునకు పంచమహాయజ్ఞములని చెప్పఁబడును. మఱియును,

శ్లో॥ దుష్టస్యదండ స్సుజనస్యపూజా న్యాయేనకోశస్యచసంప్రవృద్ధిః। సుపక్షపాతోఽర్థిషు రాజ్యరక్షా పంచైవయజ్ఞాః కథితానృపాణామ్॥

టీ॥ దుష్టస్య=దుష్టునకు. దండః=శిక్షయును. సుజనస్య=సుజనునకు. పూజాచ=పూజయును. న్యాయేన=న్యాయముచేత. కోశస్య=ధనాగారముయొక్క. సంప్రవృద్ధిః=వృద్ధియును. అర్థిషు=యాచకులయందు. పక్షపాతః=పక్షపాతమును. రాజ్యరక్షా=రాజ్యమును కాపాడుటయును. (అనునట్టి) పంచ=అయిదును. నృపాణామ్=రాజులకు. యజ్ఞాః=యజ్ఞములు. ఇతి= ఇట్లని. కథితాః=చెప్పఁబడినవి॥ తా॥ దుష్టునకు దండనయును, సుజనునకు పూజయును, న్యాయముగ ధనమును సంపాదించుటయును, యాచకులయందు పక్షపాతము కలిగియుండుటయును, రాజ్యమును చక్కఁగఁ గాపాడుటయును, అనునట్టివైదును రాజులకు యజ్ఞములని చెప్పఁబడినవని తాత్పర్యము॥ మఱియును.

శ్లో॥ కిందేవకార్యేణనరాధిపస్య కృత్వానిరోధంవిషయస్థితానాం। తదేవకార్యంజపయజ్ఞహోమా యేనద్విజానాంనపతంతిరాష్ట్రే॥

టీ॥ విషయస్థితానామ్=(తన) దేశమునందున్నవారలకు. నిరోధమ్=నిర్బంధమును. కృత్వా=చేసి. నరాధిపస్య=రాజునకు. దేవకార్యేణ=దేవకార్యముతో. కిమ్=ఏమిప్రయోజనము. యేన=ఎటువంటికార్యముచేత. రాష్ట్రే=దేశమునందు. ద్విజానామ్ = బ్రాహ్మణులయొక్క. జపయజ్ఞహోమాః=జపములు, యజ్ఞములు, హోమములు, అనునవి. నపతంతి=పడవో. తదేవ=ఆపనియే. కార్యమ్=చేయఁదగినది॥ తా ॥ దేశమునందలివారలకు నిర్బంధమును చేసి దేవకార్యములను చేయుటవలన రాజునకుఁ బ్రయోజనమేమి కలదు. ఏమియును లేదనుట. మఱియును, తనరాజ్యమునందు బ్రాహ్మణులయొక్క జపయజ్ఞహోమములు చెడిపోకుండునట్లు రాజ్యమును పాలించుచుండవలయునని తాత్పర్యము॥ అనుప్రమాణములననుసరించి విక్రమార్కమహారాజు రాజ్యమును చేయుచుండఁగా, ఒకనాఁడు చారులు భూమండలమునందంతటను తిరిగి రాజునొద్దకు వచ్చిరి. అంతట విశేషములనేమైనఁ జూచితిరా! అని విక్రమార్కమహారాజు అడుగఁగా చారులిట్లనిరి. ఓ రాజోత్తమా! కాశ్మీరదేశమునందు మహాద్రవ్యసంపన్నుఁడైనయొక వర్తకుఁడు గలఁడు. అతఁడు అధికమైన ధర్మబుద్ధి కలవాఁడై అయిదుకోసుల వెడల్పుగల యొక తటాకమును త్రవ్వించె. ఆతటాకమధ్యమునందొక బిలము కనఁబడె. ఆబిలమునందు నారాయణుఁడను దేవుఁడు పరుండియుండె. అంతట నావర్తకుఁడు ఆదేవునకు దేవాలయమును నిర్మించె. ఎంతచేసినను ఆచెరువులోనికి జలము రాలేదు. అంతట నావర్తకుఁడు జలము కలుగుటకొఱకు వరుణదేవునుద్దేశించి బ్రాహ్మణులచేత జపమును చేయించె. అదియును నిష్ఫలమయ్యె. అందువలన ఆవైశ్యుఁడు మిగుల ఖిన్నమైన మనస్సుకలవాఁడై తటాకతీరమునందుఁ గూర్చుండి అయ్యో నేనేమి చేయుదును. ఇంతప్రయత్నము చేసియును, ఈతటాకమునందు ఉదకమును చూడలేకపోతిమని మిగుల విచారమును పొందె. నాశ్రమమంతయును వ్యర్థమైనదయ్యె. నేనేమి చేయుదునని మిగుల విచారమును పొందుచుండె. అట్లుండఁగా ఆకాశమునుండి అశరీరవాణి యిట్లనియె. ఓ వైశ్యుఁడా! నీవేల విచారమును పొందెదవు. మహారాజలక్షణములు కల రాజుయొక్క కంఠరక్తమును ఈతటాకమున పోసినయెడల ఈచెరువునకుదకము వచ్చును. అట్లుగాదేని యీతటాకమునకు జలము రాదనియె. ఆమాటను విని ఆవర్తకుఁడు ఆచెరువుగట్టున నొక యన్నసత్రమును నిర్మించె. ఓ రాజా! ఆసత్రమునందు భుజించుటకు స్వదేశవాసులును పరదేశవాసులును అనేకులు వచ్చుచుఁబోవుచున్నారు. ఆసత్రమునందు పరదేశవాసులు వచ్చునపుడు ఆవర్తకుని భటులు ఎవ్వఁడైనను తనకంఠరక్తమును ఈచెరువునందుఁబోసినయెడల అతనికుటుంబస్థులకు నూరుబారువుల సువర్ణము ఈయఁబడునని చెప్పుచున్నారు. ఆమాటను వచ్చినవారందఱును వినుచుండిరిగాని యొకఁడును అటువంటి సాహసమును చేసినవాఁడు గాఁడు. ఈవిచిత్రమైన సంగతిని చూచివచ్చితిమని చారులు చెప్పిరి. ఆమాటను విని విక్రమార్కమహారాజు ఆచెరువునొద్దకుఁ బోయి ఆబిలమునందు శయనించియున్న నారాయణదేవునకు నమస్కారమును చేసి మిగుల మనోహరమును, మిగుల విశాలమును, అయినయా తటాకమును చూచి మిగుల నాశ్చర్యము కలవాఁడై తనమనస్సునందిట్లని యాలోచించె. నేను నాకంఠరక్తముచేత ఈతటాకమును తడిపెదను. ఇట్లు చేసితినేని యీతటాకమునందు సంపూర్ణముగ నీళ్ళు వచ్చును. ఇందువలన సకలభూతములకును ఉపకారమును చేసినవాఁడనగుదును. ఈనాశరీరము నూఱు సంవత్సరములకైనను నాశమును పొందునేకాని స్థిరముగనుండదు. కాఁబట్టి శరీరమునందు మమత్వమును పెట్టఁగూడదు. మఱియును, పరోపకారము

కొఱకు శరీరముకూడ నిచ్చియ్యఁదగినదేకదా?

శ్లో॥ శతమపిశరదాంవైజీవితంధారయిత్వా శయనమధిశయానస్సర్వధానాశమేతి। సులభవిపదిదేహేసూరిలోకైకనింద్యే నవిదధతిమమత్వం ముక్తికాంతోత్సుకాస్తే॥

టీ॥ శరదామ్= సంవత్సరములయొక్క. శతమపి= నూరును. జీవితమ్= జీవనమును. ధారయిత్వా=ధరించి. శయనమ్= శయ్యను. అధిశయానోపి= అధిష్ఠించినప్పటికిని. సర్వధా= సర్వప్రకారములచేతను. నాశమ్= నాశమును. ఏతి= పొందుచున్నాఁడు. సులభవిపది = సులభమైనఆపదకలదియును. (సులభముగా ఆపదలనుపొందునట్టిదియును.) సూరిలోకైకనింద్యే= విద్వజ్జనులచేత ముఖ్యముగా నిందింపఁదగినదియును. (అయిన) దేహే= దేహమునందు. ముక్తికాంతోత్సుకాః = ముక్తికాంతయందు ప్రియముకల. తే=ఆమనుష్యులు. మమత్వమ్= మమత్వమును. నవిదధతి= చేయరు॥

తా॥ నూరుసంవత్సరములు జీవించియున్నను, సుఖముగా శయ్యయందుఁ బరుండియున్నను, సర్వవిధములచేతను ఆలోచించిచూడఁగా మానవుఁడు నాశమునుపొందుచున్నాఁడు. కాఁబట్టి ముక్తికాంతయందు ప్రియముకల విద్వాంసులు సులభముగా ఆపదలను పొందునట్టిదియును, విద్వాంసులచేత నిందింపఁదగినదియును, అయిన శరీరమునందు మమత్వమును పెట్టరని తా॥ మఱియును,

శ్లో॥ సర్వదైవరుజాక్రాంతం సర్వదైవాశుచేర్గృహం। సర్వదావిపదంప్రాప్తంమర్త్యానాం దేహపంజరమ్॥

టీ॥ మర్త్యానామ్= మానవులయొక్క. దేహపంజరమ్= దేహము. సర్వదైవ= సర్వకాలములయందును. రుజా= రోగముచేత. ఆక్రాంతమ్=ఆక్రమింపఁబడినది. సర్వదైవ= ఎప్పుడును. అశుచేః= అపరిశుద్ధతకు. గృహమ్= నివాసము. సర్వదా= సర్వకాలములయందును. విపదమ్= ఆపదను. ప్రాప్తమ్= పొందునది॥ తా॥ మానవులయొక్క పంజరమువంటి దేహము సర్వప్రకారములయందును వ్యాధులచేత ఆక్రమింపఁబడియున్నది. మఱియును సర్వకాలములయందును అపరిశుద్ధతకు నివాసస్థానమైయున్నది. మఱియును, సర్వకాలములయందును ఆపదను పొందునట్టిదని తా॥ అనుప్రమాణవచనములనుపట్టిఆలోచించి అఖిలమునందువ్యాపించియున్న నారాయణునకు పూజానమస్కారాదులనుచేసి యిట్లనియె. ఓదేవోత్తమా! నీవు ముప్పదిరెండగు రాజలక్షణములుకలవానియొక్క కంఠరక్తమునుగోరుచున్నావుకదా? అట్లయినయెడల నాకంఠరక్తముచేత తృప్తినొందినవాఁడవై యీతటాకమును జలముచేత నిండింపఁజేయుమనిచెప్పి ఖడ్గమును కంఠమునందుఁబెట్టుకొని తెగవేసికొనుటకుయత్నించె. ఆసమయమునందు నారాయణుఁడు ప్రసన్నుఁడై యోవీరుఁడా! నీకునేనుప్రసన్నుఁడనైతిని. నీవిట్టిసాహసమును చేయకుము. వరమునుకోరుము? అనినవిని విక్రమార్కమహారాజు ఓదేవోత్తమా! నీవు ప్రసన్నుఁడవైనయెడల ఈతటాకమునుఉదకముచేత నిండింపుమనియె. ఆవచనమువిని నారాయణదేవుఁ డిట్లనియె. ఓదేవోత్తమా! నీవిక్కడనుండియొడ్డునకుఁబొమ్ము. నీవు ఒడ్డునకుఁబోవునంతలో ఈతటాకము దివ్యోదకముచేత నిండుననియె. ఆమాటనువిని విక్రమార్కమహారాజు మిగుల శీఘ్రముగ తటాకతీరమునకువచ్చె. అంతలోపల ఆతటాకము జలముచేత పరిపూర్ణమయ్యె. ఆసమయమునందు ఆవణిజుఁడువచ్చి అనేకవిధముల విక్రమార్కునిస్తోత్రముచేసి నూరుబారువుల బంగారమునిచ్చె. విక్రమార్కమహారాజు ఆబంగారమునుతీసికొని వివాహార్థియును, దరిద్రుఁడును, అయిన బ్రాహ్మణునకిచ్చి తననగరమునకుఁబోయెనని యీకథనుచెప్పి సాలభంజిక భోజమహారాజుతో నిట్లనియె. ఓ భోజమహారాజా! నీయందు ఇటువంటి యౌదార్యాదిగుణములున్నయెడల ఈసింహాసనమునందెక్కుమనినవిని భోజమహారాజు ఏమియునుపలుకక సుముహూర్తము మించిపోవుటచేత నెప్పటియట్ల గృహమునకుపోయె.

ఇట్లని విక్రమార్క చరిత్రయందలి ఎనిమిదవ ఉపాఖ్యానము ముగిసెను.

---

## (*) తొమ్మిదవచరిత్రము. (*)

అంతట మరల నొకనాడు భోజమహారాజు సుముహూర్తమును విచారించుకొనిపరివారజనముతోఁగూడ సింహాసనమునెక్కుటకువచ్చె. అట్లువచ్చి మునుపటివలెనే సింహాసనమునెక్కుటకుద్యమించె. ఆసమయమునందు తొమ్మిదవసాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! నీవు సింహాసనమునెక్కుటకు త్వరపడుచున్నావు. విక్రమార్కునకుఁగల యౌదార్యాదిగుణములు గలిగియున్నయెడల ఈసింహాసనముమీద నెక్కుము. లేనియెడల నూరకుండుమనినవిని భోజమహారాజిట్లనియె. ఓసాలభంజికా! ఇతరులచేత పొందశక్యముగాని విక్రమార్కమహారాజుయొక్క గుణములను చెప్పుమనిన సాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కమహారాజు రాజ్యమునుచేయుచుండఁగా భట్టిమంత్రియును, గోవిందుఁడు ఉపమంత్రియు

ను, చంద్రుఁడు సేనాపతియును, అయియుండిరి. వారిలో సేనాపతికి కమలాకరుఁడను పుత్రుఁడుకలిగియుండెను. వాఁడుతండ్రియొక్క అనుగ్రహమువలన దినదినమందును కంఠమువఱకును భుజించుచు వస్త్రభూషణతాంబూలాదికముచేత శరీరమును అలంకరించి విషయసుఖమును అనుభవించుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు అతనితండ్రి దుర్వృత్తుఁడైనకుమారునిపిలిచి యిట్లనియెను. ఓరీ కమలాకరుఁడా! నీవు బ్రాహ్మణజన్మమునుపొందియును ఈ విధముగ నున్నావు. స్వేచ్ఛావృత్తిచేత ఈయాత్మ నానాయోనులయందు జన్మమును పొందుచున్నాఁడు. ఒకానొకనాఁడు పుణ్యవశమువలన మనుష్యయోనియందు ప్రవేశించుచున్నాఁడు. ఆమానవజన్మమునందు గొప్పదగు పుణ్యవశముచేత బ్రాహ్మణకులమునందు జన్మముకలుగును. ఇటువంటి బ్రాహ్మణజన్మమును పొందియును దుర్వృత్తి కలవాఁడవైతివి. సర్వకాలములయందును వెలుపటనే తిరుగుచున్నావు. భోజనకాలమునందుమాత్రము గృహమునకు వచ్చుచున్నావు. ఇవ్విధముగ అనుచితకృత్యములనుఅధికముగఁజేయుచున్నావు. మఱియును, విచారింపఁగా నీకిదివిద్యాభ్యాసకాలమైయున్నది. ఈకాలమునందు విద్యాభ్యాసమును చేయకపోతివేని భవిష్యత్కాలమునందు మిగులవ్యసనముకలవాఁడవగుదువు. మఱియును,

శ్లో॥ యేబాలభావేనపఠంతి విద్యాంకామాతురా యౌవననష్టచిత్తాః। తేవృద్ధభావేపరిభూయమానాదహంతిగాత్రం శిశిరేయథాబ్జమ్॥

టీ॥ యే-ఎవరు. బాలభావే- బాలభావమునందు. విద్యామ్=విద్యను. నపఠంతి=పఠింపరో. తే=వారు. కామాతురాః= కామముచేత పీడితులై. యౌవననష్టచిత్తాః= యౌవనకాలమునందు నష్టమైన మనస్సుకలవారు. భవంతి= అగుచున్నారు. తే=వారు. వృద్ధభావే= ముసలితనమునందు. పరిభూయమానాః= అవమానింపఁబడినవారై. శిశిరే= శిశిరర్తువునందు. అబ్జం యథా= కమలమునువలెనే. గాత్రమ్= శరీరమును. దహంతి=కాల్చుచున్నారు॥ తా॥ లోకములో ఎవ్వరు బాల్యమునందు విద్యనుజదువరో అట్టివారు కామాతురులై యౌవనకాలమునందు నష్టమైనచిత్తముకలవారగుదురు. మఱియు నట్టివారు ముసలితనమునందు పరాభవింపఁబడినవారై శిశిరకాలమునందలి పద్మమునువలెనే శరీరమును కాల్చివేయుదురని తా॥ మఱియును,

శ్లో॥ యేషాంనవిద్యానతపోనదానం నచాపిశీలంనగుణోనధర్మః। తేమర్త్యలోకే భువిభారభూతామనుష్యరూపాఃపశవశ్చరంతి॥

టీ॥ యేషామ్= ఎవరికి. విద్యా=విద్య. నాస్తి=లేదో. యేషామ్= ఎవరికి. తపః=తపస్సు. నాస్తి=లేదో. యేషామ్=ఎవరికి. దానమ్= దానము. నాస్తి=లేదో. శీలంచాపి= మంచిస్వభావమును. నాస్తి=లేదో. గుణాః=సద్గుణములు. నసంతి=లేవో. ధర్మః=ధర్మము. నాస్తి=లేదో. తే=వారు. మర్త్యలోకే= మానవలోకమునందు. భువి=భూమియందు. భారభూతాః= భారప్రాయులును. మనుష్యరూపాః= మానవరూపమునుధరించిన. పశవః=పశువులును. భూత్వా=అయి. చరంతి= సంచరించుచున్నారు॥ తా॥ లోకములో ఎవరికి విద్యాదానతపస్సులును, సత్స్వభావసద్గుణధర్మములును లేవో అటువంటివారు భూలోకమునందు భారప్రాయులును, మానవరూపమును ధరించినవారును అగు పశువులై సంచరించుచున్నారనితాత్పర్యము॥ మఱియును, ఈలోకమునందు పురుషునకువిద్యకంటె నధికమైన భూషణమేదియును లేదు. మఱియును,

శ్లో॥ విద్యానామనరస్య రూపమధికం ప్రచ్ఛన్నగుప్తం ధనంవిద్యా భోగకరీయశస్సుఖకరీవిద్యాగురూణాంగురుః। విద్యాబంధుజనోవిదేశగమనే విద్యాపరాదేవతా విద్యారాజసుపూజితానహి ధనంవిద్యా గురూణాం గురుః॥

టీ॥ విద్యానామ= విద్యయనునది. నరస్య=మానవునకు. అధికమ్=అధికమైన. రూపమ్=రూపము. ప్రచ్ఛన్నగుప్తమ్= రహస్యముగా దాచఁబడిన. ధనమ్=ధనము. విద్యా=విద్య. భోగకరీ=భోగమునుకలుగఁజేయునట్టిది. యశస్సుఖకరీ= కీర్తినిసుఖమును చేయునట్టిది. విద్యా= విద్య. గురూణామ్= గురువులకు. గురుః=గురువు. విద్యా=విద్య. విదేశగమనే= పరదేశసంచారమునందు. బంధుజనః=చుట్టము. విద్యా=విద్య. పరా= సర్వోత్తమమైన. దేవతా= దేవత. విద్యా=విద్య. రాజసుపూజితా=రాజుచేతచక్కఁగాఁబూజింపఁబడినది. ధనమ్=ధనము. ఏతాదృశమ్=ఇటువంటిది. నహి=కాదు. విద్యావిహీనః= విద్యాశూన్యుఁడు. పశుః=పశువు॥ తా॥ విద్యయనునది మానవునకు అధికమైనరూపమును కలుగఁజేయునట్టిది. విద్యరహస్యముగాదాచఁబడినధనము. విద్యభోగమును కలుగఁజేయునట్టిది. విద్యకీర్తిని సుఖమును కలుగఁజేయునట్టిది. విద్యగురువులకుఁగూడగురువు. విద్యయితరదేశ సంచారమునందు బంధుజనము. విద్యయనునదిమోక్షమునిచ్చునట్టిదేవత. విద్యరాజుచేత చక్కఁగాఁ బూజింపఁబడినది. విద్యకుధనముసాటియైనదికాదు. విద్యలేనివాఁడు పశువుతో సమానుఁడనితా॥ మఱియును,

శ్లో॥ కింకులేనవిశాలేన విద్యాహీనస్యదేహినః। అకులీనోపివిద్యా

వాన్దైవైరపిహిపూజ్యతే॥

టీ॥ విద్యాహీనస్య= విద్యాహీనుఁడయిన. దేహినః= దేహికి (మానవునకు) విశాలేన= విస్తారమైన. కులేన= కులముతో. కిమ్= ఏమిప్రయోజనము. విద్యావాన్= విద్యకలవాఁడు. అకులీనోపి = కులరహితుఁడైనప్పటికిని. దైవైరపి= దేవతలచేతఁగూడ. పూజ్యతేహి= పూజింపఁబడుచున్నాఁడుగదా॥ తా॥ విద్యాహీనుఁడైన మానవునకు మిగుల నధికమైనకులముతోఁ బ్రయోజనమేమి? విద్యావంతుఁడు కులరహితుఁడైనప్పటికిని దేవతలచేతఁగూడఁ బూజింపఁబడుచున్నాఁడుగదా? అని తాత్పర్యము॥ అను ప్రమాణవచనములనుపట్టి యాలోచింపఁగా విద్యకంటె నధికమైనదియేదియును లేదు. మఱియు నో బిడ్డా! నేను ఎంతవఱకు జీవించియుందునో అంతవఱకును నీవు విద్యాభ్యాసమును చేయవలయును. ఇట్లుగాదేని నీకు విద్య రానేరదు. విద్యను అభ్యసించితివేని నేను మరణమును పొందినను నీకు విద్యయే బంధుకృత్యమును నెరవేర్పఁగలదు. మఱియును,

శ్లో॥ మాతేవ రక్షతి పితేవ హితే నియుంక్తే కాంతేవ చాభిరమయత్యపనీయ ఖేదం। కీర్తించ దిక్షు వితనోతి తనోతి విత్తం కిం కిం న సాధయతి కల్పలతేవ విద్యా॥

టీ॥ విద్యా=విద్య. మాతేవ=తల్లివలెనే. రక్షతి=రక్షించుచున్నది. పితేవ=తండ్రివలెనే. హితే=హితమునందు. నియుంక్తే=నియోగించుచున్నది. కాంతేవ=ప్రియురాలివలెనే. ఖేదమ్=దుఃఖమును. అపనీయ=పోఁగొట్టి. అభిరమయతి=క్రీడింపఁజేయుచున్నది. కీర్తించ=కీర్తిని. దిక్షు=దిక్కులయందు. వితనోతి=వృద్ధిఁజేయుచున్నది. విత్తమ్=ధనమును. తనోతి=అధికముగాఁ జేయుచున్నది. విద్యా=విద్య. కల్పలతేవ=కల్పలతవలెనే. కింకిమ్=దేనిదేనిని. న సాధయతి=సాధింపదు॥ తా॥ విద్య తల్లివలెనే రక్షించుచున్నది. తండ్రివలెనే హితమునందు నియోగించుచున్నది. దుఃఖమును పోఁగొట్టి భార్యవలెనే క్రీడింపఁజేయుచున్నది. సకలదిక్కులయందును కీర్తిని వృద్ధిని పొందించుచున్నది. ధనమును అధికముగాఁ గలుగఁజేయుచున్నది. విద్య కల్పలతవలె దేనిదేని సంపాదింపదని తాత్పర్యము॥ ఈవిధముగా చెప్పుచున్న తండ్రియొక్క మాటలను విని కమలాకరుఁడు పశ్చాత్తాపపరిభూతుఁడై యిట్లని తలఁచె. నేను సర్వజ్ఞుఁడను అగువఱకును నాతండ్రియొక్క ముఖమును చూడనని ప్రతిజ్ఞను చేసికొని కాశ్మీరదేశమునకు పోయె. పోయి ఆకాశ్మీరదేశమునందు మిగులఁ బ్రసిద్ధుఁడును, చంద్రమౌళిభట్టుఁడను పేరుకలవాఁడును, అగు నుపాధ్యాయుని యొద్దకుఁబో



యి సవినయముగ నమస్కరించి యిట్లనియె. ఓ పండితోత్తమా! స్వామీ! నేను పరమమూఢుఁడను. మీవద్ద విద్యాభ్యాసమును చేయుటకొఱకు విచ్చేసితిని. కాఁబట్టి నాయందు అనుగ్రహము కలవాఁడవగుము. నేను అమితముగా తెలిసినవాఁడను ఎట్లు అగుదునో ఆవిధముగా నాకు విద్యను చెప్పుమని ఆపండితోత్తముని పాదములయందుఁబడి మాటిమాటికిని నమస్కారములను చేసె. అంతట నా చంద్రమౌళి భట్టుఁడను పేరుగలవాఁడు ఆతనిని శిష్యునిగా అంగీకరించె. అదిమొదలుకొని కమలాకరుఁడు గురువునకు శుశ్రూషను చేయుచు చదువుచుండె. మఱియును,

శ్లో॥ గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన వా। అథవా విద్యయా విద్యా చతుర్థం నోపలభ్యతే॥

టీ॥ విద్యా=చదువు. గురుశుశ్రూషయా వా=గురుశుశ్రూషచేతనైనను. పుష్కలేన=సమృద్ధమైన. ధనేన వా=ధనముచేతనైనను. అథవా=అట్లుగాదేని. విద్యయా వా=విద్యచేతనైనను. లభ్యతే=పొందఁబడుచున్నది. చతుర్థమ్=నాల్గవయుపాయము. నోపలభ్యతే=పొందఁబడుచుండలేదు॥ తా॥ గురుశుశ్రూషచేతనైనను, సమృద్ధమైనధనముచేతనైనను, విద్యచేతనైనను విద్యను సంపాదింపవలసినదేకాని విద్యను పొందుటకు నాల్గవసాధనమేదియును లేదని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ ఆకమలాకరుఁడు గురువునకధికముగా శుశ్రూషను చేయుచుండె. ఇవ్విధముగా ఆకమలాకరుఁడు చిరకాలము గురువునకు శుశ్రూషను చేయుచుండె. అట్లుండఁగా నొకనాఁడు గురువు అతనియందు అపరిమితమైనదయకలవాఁడై సిద్ధసారస్వతమంత్రము నుపదేశించె. ఆమంత్రోపదేశముచేత కమలాకరుఁడు సర్వజ్ఞుఁడై తనను కృతార్థునిగాఁ దలఁచి గురువునకు ప్రదక్షిణ నమస్కారములను చేసి గురువుయొక్క ఆజ్ఞను పొంది తండ్రిని చూచుటయందు కోర్కెకలవాఁడై తనదేశమునకు వచ్చు మార్గమధ్యమందు కాంచియను పేరుగల పట్టణమునకుఁ బోయె. ఆ పట్టణమునందు లోకోత్తరసౌందర్యముకలదియును, నరమోహినియను పేరు కలదియును, అగు నొక నారీమణి కలదు. ఆయూడు దానిని చూచువాఁడు కామజ్వరపీడితుఁడై మిక్కిలి యున్మాదమును పొందును. ఎవ్వఁడైనను దానితో సుఖింపవలయునని యెడు కోర్కెకలవాఁడై దానిశయ్యయందుఁ బరుండెనేని వింధ్యాచలవాసియగు నొక రాక్షసుఁడు వచ్చి ఆపురుషుని రక్తమును సర్వమును పానముచేసిపోవును. ఈవృత్తాంతమును సర్వమును విని కమలాకరుఁడు మిగుల నాశ్చర్యముకలవాఁడై తననగరమునకు వచ్చె. అట్లు వచ్చినకుమారుని చూచి

తండ్రియగువాఁడు పరమానందమును పొందె. ఆమరువాఁడు కమలాకరుఁడు తండ్రితోఁగూడ విక్రమార్కమహారాజును చూచుటకుఁబోయె.

శ్లో॥ పాదపంకజసంలీనా మధుపాళీర్మనోహరాః। యోబిభర్తి విధేరాత్మా సతనోతు సుమంగళమ్॥

టీ॥ విధేః=దైవముయొక్క. యః=ఏ ఆత్మా=దేహము. పాదపంకజసంలీనాః=పద్మములవంటి పాదములయందు అణఁగియున్నవియును. మనోహరాః=మనోహరములును. (అయిన) మధుపాళీః=తుమ్మెదలయొక్క సముదాయములను. (లేక) దేవతలయొక్క సముదాయములను. బిభర్తి=భరించుచున్నదో. సః=అటువంటి దేహము. సుమంగళమ్=మంచిశుభమును. తనోతు=చేయుఁగాత. తా॥ భగవంతునియొక్క యేశరీరము పాదపద్మములయందు అణఁగియున్నవియును, మనోహరములయినవియును, అయినతుమ్మెదలయొక్క సముదాయములను (లేక) దేవతలయొక్క సముదాయములను భరించుచున్నదో. అటువంటి దేవునియొక్క శరీరము సర్వోత్తమమైన మంగళమును చేయుఁగాత అని తాత్పర్యము॥ అనునట్టిపద్యముచేత విక్రమార్కమహారాజునకు ఆశీర్వచనమును చేసె. పిమ్మట విక్రమార్కునియొక్క యనుమతిచేత తగినసింహాసనమునందుఁ గూర్చుండి తనయొక్క విద్యాసామర్థ్యమును సర్వమును చూపె. పిమ్మట విక్రమార్కమహారాజు పరమానందమును పొంది వస్త్రాభరణాదులచేత ఆకమలాకరుని సత్కరించి యిట్లనియె. ఓకమలాకరుఁడా! నీవు ఏయే దేశములయందు సంచరించితివి. ఏమేమివిశేషములను చూచితివనిన కమలాకరుఁ డిట్లనియె. ఓరాజోత్తమా! నేను అనేకములగు దేశములయందు సంచరించితిని. ఈదేశమునకు వచ్చునపుడు కాంచీనగరమునం దొకయద్భుతమును చూచితినని ఆకాంచీనగరమునందలి యద్భుతవృత్తాంతమును చెప్పె. ఆమాటనువిని విక్రమార్కమహారాజు కమలాకరునితోఁగూడ కాంచీనగరమునకుఁబోయె. అట్లుపోయి నరమోహినియొక్క అద్భుతమైన రూపమును చూచి మిగుల నాశ్చర్యముకలవాఁడై దానిగృహమునందుఁ బ్రవేశించె. అంతట నానరమోహిని ఆవిక్రమార్క కమలాకరులను చక్కఁగఁ బూజింపఁగా వారు సంతుష్టచిత్తములు కలవారైరి. అప్పుడు ఆనరమోహిని యిట్లనియె. ఓరాజోత్తమా! నేను ధన్యురాలనయితిని. తాము వచ్చుటచేత నాగృహము పవిత్రమైనదయ్యెను. ఇప్పుడు తాము షడ్రసోపేతముగు నన్నమును భుజించి నన్నుఁ గృతార్థురాలినిగాఁ జేయవలయునని కోరుచున్నాననిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓనారీమణీ! ఇప్పుడే నేను భోజనము చేసివచ్చితిని. నీయుపచారవచనములచేతనే సంతోషమును పొందితినని చెప్పి ఆనరమోహిని ఇచ్చిన తాంబూలమును మాత్రము గ్రహించె. అంతటఁ గొంతసేపటికి జాము ప్రొద్దుపోయె. ఆసమయమునందు నరమోహినియును నిద్రనుపొందె. ఆరాత్రి రెండవజామునందు రాక్షసుఁడు వచ్చి మంచముమీఁద నొంటరిగాఁ బవ్వళించియున్న యానరమోహినినిఁ జూచి మరలిపోవుచుండె. ఆసమయమునందు విక్రమార్కమహారాజు ఆరాక్షసుని శిఖను పట్టుకొని అతనికంఠమును ఖడ్గముచేత ఛేదించె. అప్పటికోలాహలధ్వనినివిని నరమోహిని మేల్కాంచి చంపఁబడియున్న రాక్షసునిఁ జూచి అధికమైనసంతోషముకలదై విక్రమహారాజును అనేకవిధముల స్తోత్రమును చేసి యిట్లనియె. ఓరాజోత్తమా! నీయనుగ్రహమువలన నేను కృతార్థురాలనయితిని. ఇదిమొదలుకొని నాకు రాక్షసబాధ నివర్తించిపోయినది. తాముచేసిన యుపకారమువలన నేను తరించినదాననైతిని. కాఁబట్టి నేను తమతోఁగూడ వచ్చెదను. అట్లుకాదేని తామేవిధముగఁ జెప్పెదరో ఆవిధముగ నడుచుకొనియెదననినవిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓనారీమణీ! నీవు నేను చెప్పినట్లు చేయఁదలఁచినయెడల ఈకమలాకరుని సేవింపుమనిన ఆనరమోహిని కమలాకరుని సేవించె. అంతట విక్రమార్కమహారాజు ఉజ్జయినీపట్టణమునకుఁ బోయెనని యీకథను చెప్పి సాలభంజిక యిట్లనియె. ఓరాజోత్తమా! నీయందు ఇటువంటి యౌదార్యమును పరోపకారబుద్ధియును కలిగియున్నయెడల ఈసింహాసనమునందుఁ గూర్చుండుమనినవిని భోజమహారాజు ఏమియును పలుకక యెప్పటివలె గృహమునకుఁబోయె.



ఇట్లని విక్రమార్కచరిత్రమునందలి తొమ్మిదవయుపాఖ్యానము ముగిసెను.

---

## (*) పదియవచరిత్రము. (*)

మరలనొకనాఁడు భోజమహారాజు సుముహూర్తమును విచారించుకొని పరివారజనముతోఁగూడవచ్చి మునుపటివలెనే సింహాసనము నెక్కఁబోయె. ఆసమయమునందు పదియవసాలభంజిక యిట్లనియె. ఓరాజోత్తమా! విక్రమార్కునకుఁగల యౌదార్యాదిగుణములుకలవాఁడై యీసింహాసనము నెక్కవలసినవాఁడు గాని లేనివాఁడు ఈసింహాసనము నెక్కఁదగఁడనిన విని భోజమహారాజు విక్రమార్కునియొక్క యౌదార్యాదిగుణములను చెప్పుమనిన సాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కమహారాజు ఈసింహాసనముమీఁదఁ గూర్చుండి భూమిని పరిపాలించుచుండఁగా ఒక

యోగి యుజ్జయినీపట్టణమునకువచ్చె. అతఁడు వేదవేదాంగాది సకలవిద్యల యందును అధికమైన నేర్పుకలవాఁడైయుండె. విశేషముగఁజెప్పనేల. అతనితో సమానుఁడెవ్వఁడును లేఁడు. అతఁడుసాక్షాత్తుగా సర్వజ్ఞుఁడనియే చెప్పఁదగినవాఁడు. అట్లుండఁగా నొకనాడు విక్రమార్కమహారాజు అతనియొక్క ప్రసిద్ధినివిని అతనినిపిలిచికొనిరమ్మని త్రివిక్రముఁడను పురోహితునిబంపె. అంతటనాపురోహితుఁడు ఆమహామహునిసమీపమునకుఁబోయి నమస్కరించి యిట్లనియె. ఓస్వామీ! నిన్ను విక్రమార్కమహారాజు పిలుచుచున్నాడు. కావునఅచ్చోటునకు దయచేయుమనిన ఆయోగియిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! మాకు రాజదర్శనమువలనఫలమేమి? మఱియును,

శ్లో॥ ఆశీమహివయంభిక్షా మాశావాసావసీమహి। శయీమహీమహీపృష్ఠే కుర్వీమహికిమీశ్వరైః॥

టీ॥ వయమ్-మేము. భిక్షామ్-భిక్షను. ఆశీమహి-కోరుచున్నాము. ఆశావాసః=దిక్కులేవస్త్రములు గాఁగలవారమై. (అనఁగాదిగంబరులమై) వసీమహి=నివసించుచున్నాము. మహీపృష్ఠే=భూపృష్ఠమునందు. శయీమహి=శయనించుచున్నాము. ఈశ్వరైః=రాజులతో. కింకుర్వీమహి=ఏమిచేయుదుము॥ తా॥ మేము భిక్షను గోరుచున్నారము. దిగంబరులమై యున్నారము. భూమియందుఁబరుందుము. మాకు రాజులతోఁ బనియేమని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ నిస్స్పృహోనాధికారీస్యాన్నకామీమండనప్రియః। నవిదగ్ధః ప్రియంబ్రూయాత్స్ఫుటవక్తానవంచకః॥

టీ॥ నిస్స్పృహః= దేనియందునుకోరికలేనివాఁడు. అధికారీ= అధికారి. నస్యాత్= కానేరఁడు. కామీ= కాముకుఁడగువాఁడు. మండనప్రియః= అలంకారమునం దిష్టముకలవాఁడు గాఁడు. విదగ్ధః= నేర్పరియగువాఁడు. ప్రియమ్= ప్రియమును. నబ్రూయాత్= చెప్పఁడు. స్ఫుటవక్తా= స్ఫుటముగమాటలాడువాఁడు వంచకః= వంచకుఁడు. న= కాఁడు॥ తా॥ ఆశలేనివాఁడు అధికారికాఁడు. కాముకునకు అలంకారములతోఁ బనిలేదు. నేర్పరియగువాఁడు ప్రియవచనములను పలుకఁడు. స్ఫుటముగ మాటలాడువాఁడు వంచకుఁడుగాఁడనితాత్పర్యము॥ అను న్యాయానుసారముగ నేను రాజునువంచనచేయఁదలఁచి యిట్లుచెప్పినవాఁడనుగాను. నేను దిగంబరిని కనుక నాకెవ్వరితోడను పనిలేదనినవిని పురోహితుఁడు రాజుదగ్గరకుఁబోయి యావృత్తాంతమును సర్వమును తెలియఁజేసె. ఆసంగతులనువిని విక్రమార్కమహారాజు



ఆయోగినిచూచుటకు తానేవచ్చి నమస్కారమునుచేసి ఆయోగియొక్క యనుమతిచేతఁగూర్చుండి ఆయోగితోఁగూడ నానావిధములగు వేదాంతవచనములను ప్రస్తావించుచు నొకప్పుడు సమయమునుకనిపట్టియిట్లనియె. ఓస్వామీ! నీకెన్నిసంవత్సరముల వయస్సుగతించినదనినవిని ఆయోగి యిట్లనియె. ఓరాజోత్తమా! నీవు ఈవిధముగనడుగనేల? నీతివేత్తయగుపురుషుఁడు తనదు జీవితకాలముయొక్క మితిని చెప్పికొనఁగూడదని నీవు వినియుండలేదా? మఱియును, యోగీశ్వరుఁడగువాఁడు కాలమునువంచించి చిరకాలము జీవించునని నీవెఱుఁగవా? అదియంతయును అటుండనిమ్ము? నీకుసాధించుటకు శక్తికలదేని నీకునొక్కమంత్రము నుపదేశించెదననినవిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓరాజోత్తమా! ఆమంత్రముచేత ఏమిలాభముకలుగునని న యోగియిట్లనియె. ఓరాజోత్తమా! ఈమంత్రమును శ్రద్ధాభక్తులతో జపించినయెడల జరామరణములులేనివాఁడవగుదువనిన రాజుఓస్వామీ! ఆమంత్రమునుపదేశింపుము. ఎన్నికష్టములనైననుపొంది ఆమంత్రమును జపించెదననియె. ఆమాటనువిని యోగీశ్వరుఁడు విక్రమార్కుని సమీపమునకుపిలిచి ఆమంత్రము నుపదేశించి యీమంత్రమును బ్రహ్మచర్యవ్రతము నవలంబించి ఒక్కసంవత్సరకాలము జపించి దూర్వాంకురములచేత హోమమునుచేయుము. అంతట పూర్ణాహుతిసమయమునందు హోమకుండమువలన నొక్కపురుషుఁడు ఫలమునుచేతియందుఁ బెట్టుకొని వచ్చును. ఆఫలమును భుజించితివేని జరామరణములు లేనివాఁడవును వజ్రమువంటి శరీరముకలవాఁడవును అగుదువనిచెప్పి రాజునకు మంత్రమునుపదేశించి ఆయోగి యథేచ్ఛముగఁబోయె. అంతట విక్రమార్కమహారాజు ఉజ్జయినీపట్టణమునకువచ్చి యొక్కసంవత్సరకాలము బ్రహ్మచర్యవ్రతముచేత ఆమంత్రమును జపించి దూర్వాంకురములచే హోమమును చేసి పూర్ణాహుతిని చేసె. ఆసమయమునం దొకదివ్యపురుషుఁడు హోమకుండమునుండి బయలువెడలివచ్చి దివ్యమైన యొకఫలమును రాజునకిచ్చె. రాజు ఆఫలమును గ్రహించి కృతార్థునిగాఁ దలఁచుచు పట్టణమునందుఁ బ్రవేశించి రాజమార్గమునందు వచ్చుచు కుష్ఠవ్యాధిచేత పీడనొందుచున్న యొకబ్రాహ్మణుని జూచె. ఆసమయమునందాబ్రాహ్మణుఁడు విక్రమార్క మహారాజునొద్దకువచ్చి దీనస్వరముతో నిట్లనియె. ఓరాజోత్తమా! రాజగువాఁడు లోకమునకుఁదల్లియును, తండ్రియునునై మెలంగవలయునుగదా? మఱియును,

శ్లో॥ రాజాబంధురబంధూనాం। రాజాచక్షురచక్షుషాం। రా

లేదు॥ తా॥ ద్రవ్యమునందు ఆశకలవారలకు వీఁడుగురువనియును, వీఁడుబంధువనియును, విచారములేదు. కోర్కెలచేత పీడింపఁబడుచున్నవారలకు భయము సిగ్గు అనునవిలేవు. విచారముచేత పీడింపఁబడుచున్న వారలకు సుఖమును నిద్దురయును లేదు. ఆకలిచేత పీడింపఁబడుచున్న వారలకు రుచియును, కాలనియమమును లేదని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ విక్రమార్కమహారాజు దివారాత్రములయందు నిద్దురలేనివాఁడై సర్వకాలములయందును రాజకార్యములను గురించి యోచించుచుండెను. మఱియును, ఆవిక్రమార్క మహారాజు శత్రురాజులను తనపాదపద్మములయందుఁబడి నమస్కారములను చేయువారలనుగాఁజేసి రాజ్యమంతయునుతనయాజ్ఞకులోఁబడియుండునట్లుగాఁజేసెను. మఱియును,

శ్లో॥ ఆజ్ఞామాత్రఫలంరాజ్యం బ్రహ్మచర్యఫలంతపః। జ్ఞానమాత్రఫలావిద్యా దత్తభుక్తఫలంధనమ్॥

టీ॥ రాజ్యమ్=రాజ్యము. ఆజ్ఞామాత్రఫలమ్=ఆజ్ఞామాత్రమే ఫలముగాఁగలది. తపః=తపస్సు. బ్రహ్మచర్యఫలమ్=బ్రహ్మచర్యమే ఫలముగాఁగలది. విద్యా=విద్య. జ్ఞానమాత్రఫలా=జ్ఞానమేఫలముగాఁగలది. ధనమ్=ధనము. దత్తభుక్తఫలమ్ = ఇచ్చుటయును, అనుభవించుటయును ఫలముగాఁగలది॥ తా॥ రాజ్యము ఆజ్ఞామాత్రమే ఫలముగాఁగలది. తపస్సుబ్రహ్మచర్యమే ఫలముగాఁగలది. విద్యజ్ఞానమాత్రమే ఫలముగాఁగలది. ధనముఇచ్చుటయును, అనుభవించుటయును అనునవి యేఫలముగాఁగలదని తాత్పర్యము ॥ అనుప్రమాణానుసారముగ రాజ్యమంతయును విక్రమార్కమహారాజుయొక్క ఆజ్ఞకు లోఁబడియుండెను. మఱియును, ఇట్లుండఁగా, విక్రమార్కమహారాజు ఒకనాఁడు రాజ్యభారమును మంత్రులయందుఁబెట్టి యోగివేషమునవలంబించి దేశాంతరమునకుఁబోయెను. పోయి యెక్కడతనమనస్సునకు ఇష్టముకలిగియుండెనో అక్కడఁగొన్నిదివసములునివసించియుండెను. మఱియును, ఎక్కడఆశ్చర్యకరములగు విషయములుకలవో అక్కడకొంచెముకాలము నివసించుచుండెను. ఈవిధముగా సంచరించుచుండఁగ నొకనాఁడు మహారణ్యమునందు సూర్యుఁడస్తమయమునుపొందెను. ఆసమయమునందు విక్రమార్కమహారాజు ఒకవృక్షమూలమునందు నివసించియుండెను. ఆవృక్షముమీద చిరంజీవియనుపేరుకల యొక్కపక్షి నివసించియుండెను. ఆపక్షికి అనేకులగుపుత్రులును పౌత్రులునుకలరు. వారందఱును ఆహారార్థముగ సకలదేశములకునుపోయి పొట్టనిండభుజించి సాయంకాలమున కొక్కటియును ఒక్కొక్కఫలము



ను తీసికొనివచ్చి ఆముసలిపక్షికిచ్చి దానితోఁగూడ అవియన్నియును సుఖముగనున్నవి. మఱియును,

శ్లో॥ వృద్ధౌచమాతాపితరౌ సాధ్వీభార్యాసుతశ్శిశుః। అప్యకార్యశతంకృత్వా భర్తవ్యామనురబ్రవీత్॥

టీ॥ వృద్ధౌ=వృద్ధులగు. మాతాపితరౌ=తల్లిదండ్రులను. సాధ్వీ=పతివ్రతయగు. భార్యా=భార్యయును. శిశుః=పసివాఁడగు. శిశుః=శిశువును. అకార్యశతమ్=నూరుఅకార్యములను. కృత్వాపి=చేసియును. భర్తవ్యా=భరింపఁదగినదని. మనుః=మనువు. అబ్రవీత్=పలికెను॥ తా॥ ముసలివారలగు తల్లిదండ్రులను, పతివ్రతయగుభార్యను, పసిదైనకుమారుని నూరుఅకార్యములను చేసియైనను జీవింపఁజేయవలయునని తాత్పర్యము॥ అనుప్రమాణానుసారముగ ఆపక్షులన్నియును, ఆముసలిపక్షిని పూజించుచుండెను. మఱియును, ఆనాటిరాత్రి ఆముసలిపక్షి దేశాంతరములకుఁబోయివచ్చిన తనవారలతో నిట్లనియెను. విక్రమార్కమహారాజు వృక్షమూలమునందుండి ఆమాటలనువినుటయందు ఇష్టముకలవాఁడైయుండెను. అంతట ఆచిరంజీవి యిట్లనియెను. ఓపుత్రులారా! మీరుసకలదిక్కులయందును తిరిగితిరిగదా? ఏవిచిత్రములను చూచితిరనిన పటుచంచువనుపేరుకల పక్షియిట్లనియెను. ఓతాతా! నేనేమియును, ఆశ్చర్యమును చూడలేదు. అయినప్పటికిని నేఁటిదినము నాకు అధికమైనదుఃఖము కలుగుచున్నదనిన చిరజీవియిట్లనియెను. నాయనా! ఆదుఃఖమేమియో తెలియఁజేయుమనిన పటుచంచువిట్లనియెను. తాతా! ఇప్పుడు చెప్పినమాత్రముచేత దుఃఖము శాంతినిపొందునా? ఏమి? పొందనేరదనిన చిరజీవియిట్లనియెను. ఓపుత్రుఁడా! స్నేహితునకు తనదుఃఖమును చెప్పుకొనవాఁడు సుఖవంతుఁడగుచున్నాఁడు. మఱియును,

శ్లో॥ సుహృదినిరంతరచిత్తే గుణవతిభృత్యేనువర్తినికళత్రే। స్వామినిసౌహృదచిత్తే నివేద్యదుఃఖం సుఖీభవత్యేవ॥

టీ॥ నిరంతరచిత్తే=గాఢమైనప్రియముకల మనస్సుకల. సుహృది=స్నేహితునియందును. గుణవతి=గుణవంతుఁడైన. భృత్యే=భృత్యునియందును. అనువర్తిని=అనుసరించి తిరుగునట్టి. కళత్రే=భార్యయందును. సౌహృదచిత్తే=ప్రియమైనచిత్తముకల. స్వామిని=ప్రభువునందును. దుఃఖమ్=దుఃఖమును. నివేద్య=తెలిపి. సుఖీ=సుఖముకలవాఁడు. భవేత్=అగును॥ తా॥ అతిగాఢమైనప్రియముతోఁగూడిన మనస్సుకల స్నేహితునియందును గుణవంతుఁడయిన భృత్యునియందును, సర్వకాలములయందును అనువర్తించుకొని తిరుగునటిభార్య

యందును, అతిప్రియమైనచిత్తముకల ప్రభువునందును, తనదుఃఖమును తెలియఁజేసినయెడల సుఖవంతుఁడగునని తాత్పర్యము ॥ అనుప్రమాణముచేతఁగూడ ఆలోచింపఁగా తనదుఃఖమును మిత్రాదులతో చెప్పుకొనినయెడల మేలుకలుగునని తోఁచుచున్నదనినవిని యాపటుచంచువు తనదుఃఖమును తెలియజేయఁదలంచి యిట్లనియె. ఓతాతా! చెప్పెదను. వినుము. ఉత్తరదేశమునందు శైవాలకమనుపేరుకల యొకపర్వతముకలదు. దానిసమీపమునందు పలాశనగరమనుపేరుకల యొకయగ్రహారముకలదు. మఱియును, ఆపర్వతమునందు ఒకరాక్షసుఁడు కలఁడు. వాఁడు ఆనగరమార్గమునుండి వచ్చుచున్నజనులను బలాత్కారముగా పట్టుకొనిపోయి పర్వతముమీద పెట్టుకొనిభక్షించును. ఇట్లుండగా నాయూరివారందఱును నొకయొడంబడికను చేసికొనిరి. ఎద్దియనిన వివరించిచెప్పెదను. వినుము. ఓరాక్షసోత్తమా! నగరమార్గమునుండి సమ్ముఖముగావచ్చుచున్న పురుషునిభక్షింపకుము. మేముదినదినమందును ఒక్కొక్కపురుషుఁడుచొప్పున ఆహారార్థముగ నీయొద్దకువచ్చుచున్నారము. కావునమామనవి నంగీకరింపుమని యాచించిరి. అంతట నారాక్షసుఁడు వారివిజ్ఞాపనమున కంగీకారమునుపొందెను. అదిమొదలుకొని ఆయూరివారందఱును ఇలువరుసక్రమముగ నొక్కొక్కరుగా పోవుచున్నారు. ఇట్లుండఁగా చిరకాలముగతించినది. రేపటిదినము పూర్వజన్మమునందు నాకుతండ్రియగు బ్రాహ్మణుఁడు పోవలసివచ్చినది. అతనికొకఁడెపుత్రుఁడు. ఆపుత్రునిపంపినయెడల అంతటితో వంశచ్ఛేదమగును. పోనిమ్ము! తానేపోయిన అప్పుడు అతనిభార్య శతవృద్ధురాలగుటచేత విధవకాఁగలదు. స్త్రీలకు వైధవ్యమువలన అధికమైనదుఃఖము కలుగును గదా! మఱియును,

శ్లో॥ పతిహీనాతుయానారీ కామంభవతుపుత్రిణీ। ధనధాన్యైస్సుపూర్ణాపివిధవేత్యుచ్యతేబుధైః॥

టీ॥ యా=ఏ. నారీ=స్త్రీ. కామమ్=అత్యంతమును. పుత్రిణీ=పుత్రులుకలది. భవతు=అగుఁగాత. ధనధాన్యైః=ధనములచేతను, ధాన్యములచేతను. సుపూర్ణాపి=మిగులపూర్ణురాలయినప్పటికిని. విధవేతి=విధవయని. బుధైః=విద్వాంసులచేత. ఉచ్యతే=చెప్పఁబడుచున్నది॥ తా॥ భర్తృహీనమైనయాఁడుది పుత్రులుకలదియైనఁగానిమ్ము! మఱియును ధనధాన్యములచేత నిండియున్నదైనను పూర్ణురాలయినప్పటికిని విధవయని విద్వాంసులచేత చెప్పఁబడుచున్నదని తాత్పర్యము॥ అనుప్రమాణానుసారముగ భర్తృహీనమైనయాఁడుది అత్యధికముగ నీచురాలనఁబడుచున్నది. ఈవిషయమంతయును



నామనస్సునకు మిగులదుఃఖము కలుగుచున్నదనినవిని ఆపక్షులన్నియును నిట్లనియె. ఓపటుచంచూ! సజ్జనులకు దుఃఖముకలుగుటచేత నీకుదుఃఖముకలుగుట యుచితమైయున్నది. మఱియును,

శ్లో॥ సుఖినిసుఖినస్సుహృది సుహృద్దుఃఖినిదుఃఖితస్సజ్జనోభవతి । ఉదయతిముదితఃకామంశశిని సముద్రోస్తమయతిక్షీణః॥

టీ॥ సుహృది=స్నేహితుఁడు. సుఖినిసతి=సుఖముగలవాఁడగుచునుండఁగా. సుహృత్=స్నేహితుఁడు. సుఖీ=సుఖముకలవాఁడు. భవతి=అగుచున్నాఁడు. దుఃఖి=దుఃఖముకలవాఁడు. భవతి=అగుచున్నాఁడు. శశిని=చంద్రుఁడు. ఉదయతిసతి=ఉదయించుచుండఁగా. సముద్రః=సముద్రుఁడు. ముదితః=సంతోషించినవాఁడు. భవతి=అగుచున్నాఁడు. శశిని=చంద్రుఁడు. అస్తమయతిసతి=అస్తమానమును పొందినవాఁడగుచునుండఁగా. క్షీణః=క్షీణించినవాఁడు. భవతి=అగుచున్నాఁడు॥ తా॥ సజ్జనుఁడయిన స్నేహితుఁడు సుఖముకలవాఁడగుచునుండఁగా సుఖముకలవాఁడగుచున్నాఁడు. మఱియును, దుఃఖముకలవాఁడగుచునుండఁగా దుఃఖముకలవాఁడగుచున్నాఁడు. ఇట్లగుటయుక్తమే! ఎట్లనిన;—చంద్రుఁడుదయించినవాఁడగుచునుండఁగా సముద్రుఁడు వృద్ధినిపొందుచున్నాఁడు. చంద్రుఁడు అస్తమయమును పొందినవాఁడగుచునుండఁగా సముద్రుఁడు క్షీణించుచున్నాఁడు కనుకనని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ క్షీరేణాత్మగతోదకాయహిగుణా దత్తాఃపురాతేఖిలాః క్షీరోత్తాపమవేక్ష్యతేనపయసా హ్యాత్మాకృశానౌహుతః। గంతుంపావకముద్గతంతదభవద్దృష్ట్వా స్వమిత్రాపదంయుక్తంతేనజలేన శామ్యతిసతాంవృత్తిఃపునస్త్వీదృశీ॥

టీ॥ క్షీరేణ=క్షీరముచేత. ఆత్మగతోదకాయ=తననుపొందిన యుదకముకొఱకు. పురా=ముందుగా. అఖిలాః=సమస్తములయిన. గుణాః=గుణములు. దత్తాః=ఇయ్యఁబడినవి. క్షీరోత్తాపమ్=క్షీరములయొక్క తాపమును. అవేక్ష్య=చూచి. తేన=ఆ. పయసా=ఉదకముచేత. ఆత్మా=తాను. కృశానౌ=అగ్నియందు. హుతః=హోమముచేయఁబడెను. మిత్రాపదమ్=మిత్రునియొక్క ఆపదను. దృష్ట్వా=చూచి. తత్=ఆక్షీరము. పావకమ్=అగ్నిహోత్రునిగుఱించి. గంతుమ్=పోవుటకొఱకు. ఉద్గతమ్=బయలువెడలినది. అభవత్=ఆయెను. యుక్తమ్=(అది) యుచితమే. తేన=ఆ. జలేన=ఉదకముచేత. శామ్యతి=శాంతినిపొందుచున్నది. సతామ్=సత్పురుషులయొక్క. వృత్తిఃపునస్తు=వృ

త్రిత్వమైతే. ఈదృశీ=ఇటువంటిది॥ తా॥ ఉదకము సమీపమునకు వచ్చినతోడనే క్షీరములు తమగుణములనన్నిటిని ఇచ్చె. అంతట నాక్షీరములనుతీసికొనిపోయి జనులు అగ్నిహోత్రమునందుఁ బెట్టిరి. అంతట క్షీరములయొక్క పరితాపమును చూచివచ్చినతోడనే తనగుణములనన్నిటిని ఇచ్చిన క్షీరములు పరితపించుటను చూచి అంతలి యుదకములన్నియును అగ్నియందు లీనమైపోయెను. (అనఁగా పాలనుకాచునపుడు దానిలోని యుదకములన్నియును ఇంకిపోవుననుట) అట్లు తనతో కలిసిమెలసియున్న స్నేహితుఁడు తనయొక్క పరితాపమును చూచి సహింపలేక ఇంకిపోవుటకు పరితాపమునుపొంది క్షీరములు అగ్నియందుఁ బడిపోవుటకు ప్రయత్నించినతోడనే బయలునున్న యుదకములువచ్చి ఇదిగో నేనున్నానని చెప్పి ఆక్షీరములయందుఁ బడఁగానే ఆక్షీరములు శాంతినిపొందెను. (అనఁగా పాలుపొంగునపుడు ఉదకమునుపోసిన యెడల పాలుపొంగక నిలిచిపోవుననుట) సత్పురుషులయొక్క వృత్తి కూడ నిటువంటిదేయని తా॥ అను ప్రమాణానుసారముగ సత్పురుషులగు స్నేహితులయొక్క దుఃఖమునకు నీవు పరితాపమునుపొందుట యుచితముగానే యున్నదని యాపక్షులన్నియును చెప్పె. ఇట్లు పలుకుచున్న పక్షులయొక్క సంభాషణములనువిని విక్రమార్కమహారాజు ఆపర్వతమునొద్దకుఁ బోయెను. పోయి యాపర్వతమునందలి వధ్యశిలనుచూచి దానికి సమీపమునందున్న మడుగునందు స్నానమునుచేసి ఆవధ్యశిలమీఁదఁ గూర్చుండెను. ఆసమయమునందు రాక్షసుఁడువచ్చి నవ్వుచున్నమోముకలరాజును చూచి మిగులనాశ్చర్యముకలవాఁడై యిట్లనియె. ఓమహాబలవంతుఁడా! నీవెవ్వఁడవు. నీవెక్కడనుండివచ్చితివి. ఇదివఱకు వచ్చినవారు ఈశిలమీఁదికి వచ్చినవెంటనే నన్నుఁజూడకయే మరణమును పొందుచుండురు. నీవు మహాధైర్యముకలవాఁడవును, నవ్వుచుండెడు ముఖముకలవాఁడవగుచున్నావు. మఱియును, లోకములో ఏమానవునకు మరణము సన్నిహితమగునో ఆమనుష్యుఁడు అధికముగా బాధనుచెందును. నీవు అధికమైన ముఖకాంతికలవాఁడవై యున్నాఁడవు. మఱియును, అధికముగా నవ్వుచున్నావు. నీవెవ్వఁడవో చెప్పుమనినవిని విక్రమార్క మహారాజిట్లనియె. ఓస్నేహితుఁడా! నీకీవిచారమంతయు నేలః? నేనెవ్వఁడనైననీకేలః? పరులనిమిత్తముగ నాశరీరము నీకిచ్చుచున్నాను. నీకేమియిష్టమో యాపనినిచేయుమనినవిని ఆరాక్షసుఁడు విక్రమార్కునియొక్క సౌజన్యమునుచూచి తనమనస్సునందిట్లనియాలోచించె. ఆహా ఇతను ఎంతసాధువనవచ్చును. ఆత్మసుఖమునుకోరక పరులదుఃఖమును సహింప



లేనివాఁడై తనశరీరమును విడిచిపెట్టుచున్నాఁడు. మఱియును,

శ్లో॥ త్యక్త్వాత్మసుఖభోగేచ్ఛాం సర్వసత్త్వసుఖైషిణః। భవంతిపరదుఃఖేన సాధవోఽత్యంతదుఃఖితాః॥

॥ సాధవః= సజ్జనులు. ఆత్మసుఖభోగేచ్ఛామ్ = ఆత్మసుఖములను కోరవలయుననియెడుకోర్కెను. త్యక్త్వా=విడిచి. సర్వసత్త్వసుఖైషిణః=సర్వజంతువులయొక్కయు సుఖమును కోరినవారై. పరదుఃఖేన = ఇతరులయొక్క దుఃఖముచేత. అత్యంతదుఃఖితాః= అత్యధికమైన దుఃఖముకలవారు. భవంతి= అగుచున్నారు॥ తా॥ సజ్జనులు తమయొక్క సుఖమునందలి యిచ్ఛనువిడిచిపెట్టి సకలజంతువులయొక్కయు సుఖములనుకోరినవారై ఇతరులయొక్క దుఃఖముచేత తాము దుఃఖముకలవారగుచున్నారని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ నాలోచించి రాజుతో నిట్లనియె. ఓమహాపురుషుఁడా! నీవేమినిమిత్తముగ పరులకొఱకు శరీరమునిచ్చుచున్నావు. ఆహేతువుచేత నీజన్మమేశ్లాఘ్యమైనది. మఱియును,

శ్లో॥ పశవోఽపిహిజీవంతి కేవలాత్మోదరంభరాః। తస్యైవజీవితం శ్లాఘ్యం యఃపరార్థం తుజీవతి॥

టీ॥ పశవోఽపిహి= పశువులును. కేవలాత్మోదరంభరాః = ముఖ్యముగా తమపొట్టమాత్రమునిండించుకొనునట్టివై. జీవంతి= జీవించుచున్నవి. యః=ఎవ్వఁడు. పరార్థమ్= ఇతరులకొఱకు. జీవతి= జీవించుచున్నాఁడో. తస్యైవ=వానియొక్కయే. జీవితమ్=జీవనము. శ్లాఘ్యమ్=కొనియాడఁదగినది॥

తా॥ పశువులు తమపొట్టమాత్రము నిండించుకొనుచుండలేదా? అందువలనఁ బ్రయోజనమేమి? లోకములో నెవ్వఁడు పరులకొఱకు జీవించుచున్నాఁడో. వానిజన్మమొక్కటియే శ్రేష్ఠమైనదని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ నీజన్మమొక్కటియే మిగుల శ్రేష్ఠమైనది. మఱియును, పరోపకారనిపుణులగువారికిదియొక చిత్రమైనపనికాదు. మఱియును,

శ్లో॥ కిమత్రచిత్రం యత్సంతః పరానుగ్రహతత్పరాః। నహిస్వదేహశైత్యార్థం జాయంతేచందనద్రుమాః॥

టీ॥ సంతః= సత్పురుషులు. పరానుగ్రహతత్పరాః= ఇతరులను అనుగ్రహించుటయందు ఆశకలవారు. ఇతియత్= ఈలాగని చెప్పుటయేదికలదో. అత్ర= ఈవిషయమునందు. కించిత్రమ్= ఏమిచిత్రము. చందనద్రుమాః= చందనవృక్షములు. స్వదేహశైత్యార్థమ్= తనదేహముచల్లఁబడుటకొఱకుఁగా. నజాయంతేహి= పుట్టుచుండలేదు కదా॥ తా॥ సత్పురుషులు పరానుగ్రహ

మునందు ఆసక్తికలవారనుట యేమికలదో అదియొక చిత్రముకాదు. మఱియును, చందనవృక్షములు తమదేహమును చల్లబరచుకొనుటకొఱకుంగా పుట్టుచుండలేదుగదా? అని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ పరోపకారనిపుణులగు తమవంటివారు పరులనిమిత్తముగ శరీరమునిచ్చుట యొకచిత్రముకాదు. ఓరాజోత్తమా! నీవు ఈవిధముగా పరోపకారనిపుణుఁడవై యుండుటచేత నీవు సకలసంపదలనుపొందుదువు. మఱియును,

శ్లో॥ పరోపకారవ్యాపారపరోయః పురుషోభువి। సంపదస్సమవాప్నోతి పరాదపిచయాఃపరాః॥

టీ॥ భువి= భూలోకమునందు. యః= ఏపురుషుఁడు. పరోపకారవ్యాపారపరః= పరులకు ఉపకారమునుచేయునట్టి వ్యాపారమునందు ఆసక్తికలవాఁడో. సః=అటువంటి. పురుషః=పురుషుఁడు. భువి = భూలోకమునందు. పరాదపి= సర్వోత్తమమైనదానికంటె. పరాః=గొప్పవియగు. సంపదః=సంపదలు. యాః=ఏవి. సంతి=కలవో. తాః=అటువంటిసంపదలను. సమవాప్నోతి= పొందుచున్నాఁడు॥ తా॥ లోకమునందు ఏపురుషుఁడు పరోపకారమునందు మిగులనాసక్తికలవాఁడైయుండునో, అటువంటి పురుషుఁడు సర్వోత్తమములయిన సంపదలను పొందుచున్నాఁడని తా॥ మఱియును,

శ్లో॥ పరోపకారనిరతాయే స్వర్గసుఖనిస్స్పృహాః। జగద్ధితాయజాయన్తే సాధవస్తేదృశాభువి॥

టీ॥ యే= ఏపురుషులు. పరోపకారనిరతాః = పరోపకారమునందాసక్తికలవారో. స్వర్గసుఖనిస్స్పృహాః= స్వర్గసుఖమునందాశలేనివారో. ఈదృశాః= ఇటువంటి. సాధవః= సజ్జనులు. భువి= భూమియందు. జగద్ధితాయ= లోకమునందు హితమును చేయుటకొఱకు. జనితాః=పుట్టిరి॥ తా॥ ఏపురుషులు పరోపకారమునందు అధికమైన యాశకలవారో ఏపురుషులు స్వర్గసుఖమునందుఁగూడ ఆశలేనివారో అటువంటిసాధువులు భూలోకమునందు పరులకు మేలునుచేయుటకొఱకుఁగా జన్మించిరని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ నీవంటివానిజన్మమే శ్రేష్ఠమైనదని తోఁచుచున్నదనిచెప్పి మఱియునిట్లనియె. ఓరాజోత్తమా! ఓస్నేహితుఁడా! నీవిషయమైనేను సంతోషమును పొందితిని. వరమునుకోరుమనిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓరాక్షసోత్తముఁడా! నీవు ప్రసన్నుఁడవైన నేఁడుమొదలుకొని మనుష్యభక్షణమును విడిచిపెట్టుము. మఱియును, ఈయూరనుండు బ్రాహ్మణులను జంపక విడిచిపెట్టుము. మఱియును సకలభూతములను నిన్నును



గానే తలఁపుము. మఱియును,

శ్లో॥ మరిష్యామీతియద్దుఃఖంపురుషస్యోపజాయతే। శక్యస్తేనానుమానేనపరోపిపరిరక్షితుమ్॥

టీ॥ పురుషస్య= పురుషునకు. మరిష్యామీతి= మరణమునుపొందఁగలను. ఇతి= ఇట్లని. యత్=ఏ. దుఃఖమ్=దుఃఖము. అస్తి=కలదో. తేన= అటువంటి. అనుమానేన= అనుమానముచేత. పరోపి = ఇతరుఁడును. పరిరక్షితుమ్= రక్షించుటకొఱకు. శక్యః=తగినవాఁడు॥ తా॥ మానవునకు మరణమును పొందఁగలనని యేదుఃఖముకలుగునో ఆదుఃఖముయొక్క అనుమానముచేత ఇతరుఁడు రక్షించుటకొఱకు తగినవాఁడని తా॥ మఱియును,

శ్లో॥ యథాచతేజీవితమాత్మనఃప్రియంతథాపరేషామపిజీవితంప్రియం। సంరక్ష్యతేజీవితమాత్మనోయథాతథాపరేషామపిరక్షజీవితమ్॥

టీ॥ యథా= ఏప్రకారము. తే=నీయొక్క. జీవితమ్= జీవనము. ఆత్మనః= తనకు. ప్రియమ్=ఇష్టమైనదో. తథా= ఆప్రకారముగా. పరేషామపి= ఇతరులయొక్కయు. జీవితమ్=జీవనము. ప్రియమ్= ఇష్టమైనది. భవితవ్యమ్=కాఁదగినది. ఆత్మనః= తనయొక్క. జీవితమ్=జీవనము. యథా=ఏప్రకారముగా. సంరక్ష్యతే= రక్షింపఁబడుచున్నదో. తథా= ఆప్రకారముగా. పరేషామపి= ఇతరులయొక్కయును. జీవితమ్= జీవనమును. రక్ష= రక్షింపుము॥ తా॥ నీజీవనము నీకేవిధముగా ప్రియమైనదో ఆవిధముగా ఇతరులయొక్క జీవనముగూడ ప్రియమైనదై యుండవలయును. మఱియును, నీజీవనమేవిధముగా కాపాడఁబడుచున్నదో ఆవిధముగా ఇతరులజీవనముకూడ రక్షింపఁదగినదైయున్నదని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ ఇతరులయొక్క జీవనమునుగూడ నీజీవనమువంటిదేయని తలఁపుమని రాజుచేత చెప్పఁబడినవిధమును సర్వమును తెలిసికొని ఆరాక్షసుఁడు అదిమొదలుకొని మానవులను చంపుటను విడిచిపెట్టె. అంతట విక్రమార్కమహారాజుకూడ కృతార్థుఁడనైతినని తలఁచుచు బ్రాహ్మణులకు నమస్కారమునుచేసి వారిచేత గౌరవింపఁబడినవాఁడై తనపట్టణమునకుఁబోయెనని యీకథను ఆసాలభంజిక చెప్పఁగావిని భోజమహారాజు లజ్జచేత శిరస్సును వంచుకొని మునుపటివలెనే యింటికేఁబోయె.

ఇట్లని విక్రమార్కచరిత్రమునందలి పదునొకండవ ఉపాఖ్యానము ముగిసెను.

——(*) పదిరెండవ చరిత్రము. (*)——

అంతట మరల నొకనాఁడు భోజమహారాజు సుముహూర్తమును విచారించుకొనివచ్చి సింహాసన మెక్కఁబోవుచుండఁగా పదిరెండవ సాలభంజిక యిట్లనియె. ఓ భోజమహారాజా! ముందుగా విక్రమార్కమహారాజుయొక్క యౌదార్యాది గుణములనువిని పిమ్మట అట్టి యౌదార్యాదిగుణములు నీ యందున్నయెడల ఈసింహాసనముమీఁద నెక్కుమనిన భోజమహారాజు ఆవిక్రమార్కునియొక్క శౌర్యధైర్యాది గుణములను చెప్పుమనిన సాలభంజిక యిట్లనియె. ఓ భోజమహారాజా! విక్రమార్క మహారాజు రాజ్యమును పాలించుచుండఁగా, అతనియొక్క పట్టణమునందు భద్రసేనుఁడను పేరుకల వర్తకుఁ డొకఁడుండెను. అతనికి పురందరుఁడను నామధేయముకల పుత్రుఁడొకఁడుకలఁడు. ఆభద్రసేనుఁడు అపరిమితమైన సంపదకలవాఁడైయుండెను. అట్టి సంపదకలవాఁడయ్యును వాఁడు ఒక్కకాసునైనను వ్యయమునుచేయనివాఁడై యుండెను. అంతట నతఁడు చిరకాలమునకు మరణమును పొందెను. అతని కుమారుఁడు తండ్రి మరణమును పొందినది మొదలుకొని తండ్రియొక్క సకల ధనమునుపొంది కాలోచితమైన త్యాగమును చేయుటకు ఉపక్రమించెను. ఇట్లు ప్రవర్తించిన పురందరునితో అతని స్నేహితుఁడగు కుబేరుఁడనుపేరుకల స్నేహితుఁ డిట్లనియె. ఓస్నేహితుఁడా! పురందరా! నీవు వర్తకుని పుత్రుఁడవయ్యును మహారాజకుమారునివలె వ్యయమును చేయుచున్నావు. ఇట్లు చేయుట వర్తకునియొక్క కులమునకుతగదు. వర్తకకుమారుఁడు సర్వకాలములయందును ద్రవ్యమును సంపాదింపవలసినదేకాని ద్రవ్యమును వ్యయముచేయఁగూడదు. సంపాదించి దాఁచిపెట్టిన ధనము ఒకానొకప్పుడు ఆపదవచ్చెనేని ఆయాపదను పోఁగొట్టును. మఱియును,

శ్లో॥ ఆపదర్థంధనంరక్షే ద్దారాన్రక్షేద్ధనైరపి । ఆత్మానంసతతం రక్షేద్దారైరపిధనైరపి॥

టీ॥ ఆపదర్థమ్= ఆపదకొఱకు. ధనమ్-ధనమును. రక్షేత్ = రక్షింపవలయును. ధనైరపి= ధనములచేతఁగూడ. దారాన్= భార్యలను. రక్షేత్= రక్షింపవలయును. దారైరపి= భార్యలచేతను. ధనైరపి= ధనములచేతను. సతతమ్= సర్వకాలములయందును. ఆత్మానమ్= ఆత్మను. రక్షేత్= రక్షింపవలయును॥ తా॥ ఆపదలువచ్చునని యెడుతలంపుతో ధనమును కాపాడవలయును. ధనములచేత భార్యను కాపాడవలయును. ధనములచేత



ను, భార్యచేతను, తనను సర్వకాలములయందును గాపాడవలయునని తాత్పర్యము॥ అను ప్రమాణవచనముల ననుసరించిచెప్పుచున్న కుబేరునిమాటను విని పురందరుఁడిట్లనియె. ఓస్నేహితుఁడా! దనముఁడా! సంపాదింపఁబడిన ధనము ఒకానొకప్పుడు వచ్చునట్టియాపదలను నివారించుకొనుట కుపయోగించునని చెప్పునట్టిమాట విచారశూన్యమైనది. ఎప్పుడు ఆపదలువచ్చునో అప్పుడు సంపాదించుకొనిన ధనముకూడ నశించును. అందువలన వివేకియగు పురుషుఁడు గతించినకార్యమునుగుఱించి కాని పోయినద్రవ్యమునుగుఱించి కాని విచారమును పొందఁగూడదు. మఱియును,

శ్లో॥ గతేశోకోనకర్తవ్యో భవిష్యన్నైవచింతయేత్। వర్తమానేషుకార్యేషు వర్తయంతివిచక్షణాః॥ 4782

టీ॥ గతే=గతించినకార్యవిషయమై. శోకః= దుఃఖము. నకర్తవ్యః= చేయఁదగినదికాదు. భవిష్యత్=రాఁబోవువిషయమును. నైవచింతయేత్=విచారింపఁగూడదు. విచక్షణాః=నేర్పరులు. వర్తమానేషు=జరుగుచున్న. కార్యేషు=కార్యములయందు. వర్తయంతి=ప్రవర్తించుచున్నారు॥ తా॥ గతించిన కార్యమువిషయమై దుఃఖమును పొందఁగూడదు. రాఁబోవుకార్యమును గుఱించి విచారింపఁగూడదు. బుద్ధిమంతులగువారు జరుగుచున్నకార్యములయందు మిగులజాగరూకతతో ప్రవర్తించుచున్నారని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ బుద్ధిమంతులగువారు గతించినకార్యములను గుఱించియును, రాఁబోవుకార్యములను గుఱించియును, ఆలోచింపక జరుగుచున్న కార్యములయందు మిగులజాగరూకతతో ప్రవర్తింపవలయును. మఱియును,

శ్లో॥ నహిభవతియన్నభావ్యం భవతిహిభావ్యం వినాపియత్నేన। కరతలగతమపినశ్యతి యస్యహి భవితవ్యతానాస్తి॥

టీ॥ యత్=ఏది. నభావ్యమ్= కాఁదగినదికాదో. తత్=అది. నభవతిహి=కాదుకదా? భావ్యమ్= కాఁదగినది. యత్నేనవినాపి = ప్రయత్నములేకయే. భవతి=అగుచున్నది. యస్య= దేనికి. భవితవ్యతా- కాఁదగుట. నాస్తి= లేదు. తత్=అది. కరతలగతమపి=కరతలమును పొందినప్పటికిని. నశ్యతి=నశించుచున్నది॥ తా॥ ఏకార్యము కాఁదగినదికావో అది అయియేతీరును. ఏకార్యము కాఁదగినదికాదో అదియెంతప్రయత్నముచేసినను సిద్ధింపదు. మఱియును, కానికార్యము చేతియందేయున్నప్పటికిని నాశమును పొందునని తాత్పర్యము॥ మఱియును, 4782

శ్లో॥ భవితవ్యంభవత్యేవ నారికేళఫలాంబువత్ । గంతవ్యంగచ్ఛతి

సదా గజభుక్తకపిత్థవత్॥

టీ॥ భవితవ్యమ్=కాఁదగినకార్యము. నారికేళఫలాంబువత్=కొబ్బరికాయలోనినీళ్ళవలె. భవత్యేవ=అగుచునేయున్నది. గంతవ్యమ్=పోఁదగినది. సదా=సర్వకాలములయందు. గజభుక్తకపిత్థవత్=ఏనుఁగుమ్రింగిన వెలగపండులోని గుజ్జువలె. గచ్ఛతి=పోవుచున్నది॥ తా॥ కాఁదగినకార్యము కొబ్బరికాయలోనికి నీళ్లువచ్చినట్లు అగుచునేయున్నది. కానికార్యము ఏనుగుమ్రింగిన వెలగపండులోని గుజ్జుపోయినట్లు చెడిపోవునని తాత్పర్యము॥ అనుప్రమాణమునననుసరించి ఆలోచింపఁగా మనప్రయత్నమువలన ఏకార్యమును కానేరదనివిని ధనదుఁడనువర్తకుఁడు ఏమియును పలుకఁజాలక యూరకుండెను. అనంతరమందు పురందరుఁడనువాఁడు పితృద్రవ్యమును సర్వమును వ్యయమును చేసె. అట్లు సకలధనమును పోఁగొట్టుకొనిన పురందరుని ఆసమయమునందు బంధుమిత్రాదులలో నెవ్వరును గౌరవింపకపోయిరి. మఱియును, అతనితోఁగూడ సంభాషణమునుకూడ చేయకపోయిరి. మఱియు నతనిచేతియందెంతవఱకు ధనముకలిగియుండెనో అంతవఱకును బంధుమిత్రాదులందఱును అతనితో సంభాషణాదికమును చేయుచుండిరి. అంతట ఆపురందరుఁడు ఇట్లు నిరూపించె. ఓహో ధనముకలవాఁడనై యున్నంతవఱకును నాతోనందఱును ప్రియముగ సంభాషణాదికమును చేయుచుండిరి. ఇప్పుడు నాతో నెవ్వఁడును ప్రియముగ సంభాషణాదికమును చేయుటలేదు. మఱియు నెవ్వనికిధనముకలిగియుండునో అతనికందఱును మిత్రులైయుందురనునట్టి నీతివచనము సత్యమయ్యేయున్నది. మఱియును,

శ్లో॥ యస్యార్థాస్తస్య మిత్రాణి యస్యార్థాస్తస్య బాంధవాః। యస్యార్థాస్స పుమాన్లోకే యస్యార్థాస్స చ పండితః॥

టీ॥ యస్య=ఎవనికి. అర్థాః=ద్రవ్యములు. సంతి=లేవో. తస్య=అతనికి. మిత్రాణి=మిత్రులు. సంతి=కలరు. యస్య=ఎవనికి. అర్థాః=ద్రవ్యములు. సంతి=కలవో. తస్య=అతనికి. బాంధవాః=బంధువులు. సంతి=కలరు. యస్య=ఎవనికి. అర్థాః=ద్రవ్యములు. సంతి=కలవో. సః=వాఁడె. లోకే=లోకమునందు. పుమాన్=పురుషుఁడు. యస్య=ఎవనికి. అర్థాః=ద్రవ్యములు. సంతి=కలవో. సచ=వాఁడే. పండితః=పండితుఁడు॥ తా॥ ఎవనికిధనములుకలవో అతనికిమిత్రులుకలరు. ఎవనికిద్రవ్యములుకలవో అతనికిబంధువులుకలరు. ఎవనికిధనములుండునో లోకమునందు వాఁడేపురుషుఁడు. ఎవ్వనికిద్రవ్యములుకలవో వాఁడేపండితుఁడని తాత్పర్యము॥ మఱియును,



శ్లో॥ పుంసిక్షీణధనేనబాంధవజనః పూర్వంయథావర్తతేస్థిత్యాకేవలయాస్థితః పరిజనస్స్వచ్ఛందతాంగచ్ఛతి। లోలత్వంసుహృదశ్చయాంతిబహుశఃకింవాపరైర్భాషణైర్భార్యాయా అపిభూతలేస్ఫుటమిహోనైవాదరస్తాదృశః॥

టీ॥ పుంసి=పురుషుఁడు. క్షీణధనే=క్షీణమైన ధనముకలవాఁడగుచునుండఁగా. బాంధవజనః=బంధుజనము. పూర్వంయథా=మునుపటివలెనే. నవర్తతే=ప్రవర్తించుటలేదు. కేవలయా=కేవలమైన. స్థిత్యా=స్థితిచేత. స్థితః=ఉన్న. పరిజనః=పరిజనము. స్వచ్ఛందతామ్=స్వేచ్ఛతను. గచ్ఛతి=పోవుచున్నది. సుహృదశ్చ=స్నేహితులును. లోలత్వమ్=చపలతను. యాంతి=పొందుచున్నారు. బహుశః=విశేషముగా. అపరైః=ఇతరములయిన. భాషణైః=సంభాషణములతో. కిమ్=ఏమిప్రయోజనము. భూతలే=భూలోకమునందు. భార్యాయా అపి=భార్యకుఁగూడ. తాదృశః=అటువంటి. (అనఁగా మునుపటివలె) ఆదరః=ఆదరము. స్ఫుటమ్=స్పష్టముగా. నైవాస్తి=లేదు॥ తా॥ పురుషుఁడు ధనహీనుఁడయ్యెనేని బంధుజనము మునుపటివలె సంభాషింపదు. మఱియును, కేవలమైనస్థితిలోనున్నయెడల పరిజనము తమయిష్టానుసారముగఁ బోవును. మఱియును, మిత్రులు చాపల్యమునుపొందుదురు. విశేషముగఁజెప్పనేల? భార్యకుఁగూడ మునుపటివలె ఆదరముకలిగియుండదని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ యస్యాస్తి విత్తం స నరః కులీనస్స పండితస్స శ్రుతవాన్విధిజ్ఞః। స ఏవ వక్తా స చ దర్శనీయస్సర్వే గుణాః కాంచనమాశ్రయంతి॥

టీ॥ యస్య=ఏపురుషునకు. విత్తమ్=ధనము. అస్తి=కలదో. సః=ఆ. నరః=నరుఁడు. కులీనః=కులవంతుఁడు. సః=వాఁడు. పండితః=పండితుఁడు. సః=వాఁడు. శ్రుతవాన్=అనేకవిషయములనువిన్నవాఁడు. సః=వాఁడు. విధిజ్ఞః=సకలవిధులను తెలిసినవాఁడు. సఏవ=వాఁడే. వక్తా=చక్కఁగమాటలాడువాఁడు. సచ=వాఁడె. దర్శనీయః=చూడఁదగినవాఁడు. సర్వే=సమస్తములయిన. గుణాః=గుణములు. కాంచనమ్=బంగారమును. ఆశ్రయంతి=ఆశ్రయించుచున్నవి॥ తా॥ ఏపురుషునకు ధనముకలదో ఆపురుషుఁడు అధికమైనకులమునందుఁ బుట్టినవాఁడనియును, పండితుఁడనియును, అనేకవిషయములను తెలిసినవాఁడనియును, సకలవిధులను తెలిసినవాఁడనియును, చక్కఁగమాటలాడనేర్చినవాఁడనియును, చూడఁదగినవాఁడనియును, చెప్పఁబడును. కాఁబట్టి ఆలోచింపఁగా సకలగుణములును బంగారము నాశ్రయించియున్నవని

తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ అపనయతోపి హి ధనినో బంధుసహస్రం భవేత్పదస్థస్య । భ్రష్టధనస్య హి సతతం బంధురపి ముఖం న దర్శయత్యేవ॥

టీ॥ పదస్థస్య=స్వస్థానమునందున్న. ధనినః=ధనవంతుఁడు. అపనయతోపి హి=నీతిరహితుఁడైనప్పటికిని. బంధుసహస్రమ్=వేయిమంది బంధువులు. భవేత్=అగును. భ్రష్టధనస్య=ధనరహితుఁడైనవానికి. బంధురపి=బంధువుకూడ. సతతమ్=సర్వకాలములయందును. ముఖమ్=ముఖమును. నదర్శయత్యేవ=చూపనే చూపఁడు॥ తా॥ సంపదకలవాఁడు స్వస్థానమునందుండఁగా నీతిలేనివాఁడయినను వేయిమంది బంధువులు చుట్టుకొని తిరుగుచుందురు. మఱియును, ధనహీనుఁడగువానికి సర్వకాలములయందును బంధువుకూడ ముఖమును చూపఁడని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ దారిద్ర్యాయ నమస్తుభ్యం సిద్ధోహం త్వత్ప్రసాదతః। సర్వం పశ్యామి దేవేశ నమాం పశ్యతి కశ్చన॥

టీ॥ దారిద్ర్యాయ=దరిద్రదేవతయైన. తుభ్యమ్=నీకొఱకు. నమః=నమస్కారము. త్వత్ప్రసాదతః=నీయనుగ్రహమువలన. అహమ్=నేను. సిద్ధః=సిద్ధుఁడను. అస్మి=అయితిని. హే దేవేశ=ఓ దేవోత్తమా! సర్వమ్=సమస్తమును. పశ్యామి=చూచుచున్నాను. మామ్=నన్నును. కశ్చన=ఒకఁడును. నపశ్యతి=చూచుచుండలేదు॥ తా॥ ఓదరిద్రదేవతా! నీకొఱకు నమస్కారమును చేయుచున్నాను. నీయనుగ్రహమువలన నేను సన్యుఁడనైతిని. ఓ దేవోత్తమా! నేను సర్వమును చూచుచున్నాఁడను. నన్నెవ్వరును చూచుచుండలేదని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ మృతో దరిద్రః పురుషః మృతో యాగస్త్వదక్షిణః। మృతమశ్రోత్రియే దానం మృతం మైథునమప్రజమ్॥

టీ॥ దరిద్రః=దరిద్రుఁడు. (అయిన) పురుషః=పురుషుఁడు. మృతః=మృతుఁడు. అదక్షిణః=దక్షిణలేని. యాగః=యజ్ఞము. మృతః=మరణమును పొందినది. అశ్రోత్రియే=శ్రోత్రియుఁడు కానివానియందు. దానమ్=దానము. మృతమ్=మరణమును పొందినది. అప్రజమ్=సంతానములేని. మైథునమ్=మైథునము. మృతమ్=మరణమును పొందినది॥ తా॥ దరిద్రుఁడగు మానవుఁడు మృతప్రాయుఁడు. దక్షిణలేని యాగము మృతప్రాయమైనది. శ్రోత్రియుఁడు కానివానియందలి దానము మృతప్రాయమైనది. సంతానములేని మైథునము మృతప్రాయమైనదని తాత్పర్యము॥ అనుప్రమాణవచనములనుపట్టి చక్కఁగా నా



లోచించి పురందరుఁడు సకలదేశములయందును తిరుగుచు హిమాచలమునకు సమీపమునందున్న పట్టణమునకుఁ బోయెను. ఆపట్టణమునకు సమీపమునందు మిగుల దుస్తరమైన వెదురుటడవియొకటియుండెను. ఆపురందరుఁడు సాయంకాలమునందా పట్టణమునఁ బ్రవేశించి యొకయింటియొక్క వాకిటితిన్నెయందు పరుండి నిద్రను పొందెను. ఆనాటి అర్ధరాత్రియందా యరణ్యమునందు రోదనమును చేయుచున్న యొకయాఁడుదానియొక్క రోదనధ్వని వినఁబడెను. ఆమహాధ్వనిని విని పురందరుఁడు ఇదియేమని యాలోచించుచుండెను. ఆసమయమునందు ఓమహాజనులారా! నన్ను రక్షింపుఁడు. ఒకరాక్షసుఁడు అనేకవిధములుగాఁ జంపుచున్నాఁడనునట్టి మాటలు వినఁబడియెను. అంతట ప్రాతఃకాలమునందు నిద్రను మేల్కాంచి ఆపురందరుఁడు మిగుల నాశ్చర్యము కలవాఁడగుచు ఆపట్టణమునందున్న వారలనడిగిన వారిట్లనిరి.

ఓపురుషోత్తమా! ఈవెదురుటడవియందు దినదినమందును రాత్రియందు రోదనధ్వని వినఁబడుచున్నది. అట్లు వినఁబడినను ఒక్కఁడైనను భయముచేత అచ్చోటునకుఁ బోఁడు. ఎవ్వఁడును విచారింపఁడు. అని ఆయూరివారు చెప్పిన వృత్తాంతమును విని ఆపట్టణమునుండి అక్కడక్కడఁ గొన్ని దినములు సంచరించి పిమ్మటఁ గొన్ని దినములకు ఉజ్జయినీపట్టణమునకు వచ్చి విక్రమార్కమహారాజును జూచిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓపురందరుఁడా! నీవు దేశాటనమును చేయుటకు మొదలుపెట్టి చిరకాలమయ్యెను గదా? ఇన్ని దినములు ఏయేదేశములయందు సంచరించితివి. ఎక్కడెక్కడ ఏమేమి విచిత్రములను చూచితివి. ఏమేమి విచిత్రవార్తలను వింటివని యడిగిన ఆపురందరుఁడు తాను విన్న వెదురువనవృత్తాంతమును సర్వమును తెలియఁజేసెను. ఆవృత్తాంతమును విని విక్రమార్కమహారాజు ఆపురందరునితోఁగూడ ఆపట్టణమునకుఁ బోయి అర్ధరాత్రియందు వేణువనమధ్యమునందు వినఁబడుచున్న రోదనధ్వనిని విని ఖడ్గమును చేతఁబూని తానొక్కఁడే ఆయరణ్యములోనికిఁ బోయెను. పోయి మిగుల దీనధ్వనితో ఏడ్చుచున్నదియును, దిక్కులేనిదియును, అయిన యాఁడుదానిని బాధించుచున్న రాక్షసునిఁ జూచెను. చూచి యిట్లనియె. ఓరీ! పాపిష్ఠుఁడా! దిక్కులేని యీయాఁడుదానిని ఎందుకు బాధించుచున్నావనిన విని యారాక్షసుఁ డిట్లనియె. ఓమానవుఁడా! నీకీవిచారమేల? నీవు వచ్చినమార్గమును పట్టిపొమ్ము? అట్లు కాదేని నీవు వ్యర్థముగానే మరణమును పొందుదువు. అని చెప్పగానే ఆయిద్దరికిని అధికమైన వివాదము కలిగెను. పిమ్మట రాజు ఖడ్గమును ఎత్తి రాక్షసుని కొట్టెను. అట్లు కొట్టినతోడనే మొదలంటనరికినవృక్ష

మువలె ఆరాక్షసుఁడు క్రిందఁబడి మరణమునుపొందెను. అంతట ఆయాఁడుది మిగుల సంతోషముకలదై మిగుల సంభ్రమముతోవచ్చి ఆరాజుయొక్క పాదములయందుఁబడి నమస్కారమునుచేసి యిట్లనియె. ఓమహాప్రభూ! నీయనుగ్రహమువలన నాకు శాపవిమోచనమయ్యె. ఇందువలన నేను అధికమైన దుఃఖమునుండి విముక్తురాలనైతిననినవిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓయంగనా! నీవెవతెవు. ఏమినిమిత్తముగ ఈపాపాత్ముఁడు పీడించెను. ఎన్నిదినములనుండి యిటువంటి యవస్థననుభవించుచున్నావనినవిని యాయంగన యిట్లనియె. ఓదేవా! నావృత్తాంతమునుమనవిచేసెదను. వినుము. ఈపట్టణమునందే మహాధనసంపన్నుఁడైన యొకబ్రాహ్మణుఁడు కలఁడు. నేనతనిభార్యను. అధికముగా వ్యభిచరించునట్టి స్వభావముకలదాననైయుంటిని. నాకు నాభర్తయందుఁ గొంచెమైనను ప్రియములేకయుండెను. అతనికిమాత్రము నాయందు మహానురాగము కలిగియుండెను. రూపలావణ్యసంపన్నురాలనైన నన్నుఅతనుమాటిమాటికిని పిలువఁబడినదాననైనను సంభోగమును పొందుట కిచ్చయింపకపోతిని. ఈవిధముగా నాభర్త మరణమును పొందువఱకును కామసంతప్తుఁడై దేహావసానసమయమునందు నన్నుశపించె. ఓసీదుష్టురాలా! నీవు నామరణముకొఱకు కారణురాలవైతివి. సర్వకాలములయందును నాకోర్కెలను భంగముచేయుదానవైతివి. కాఁబట్టి నివిట్టిపాపకార్యమునకు తగినఫలము ననుభవింపుము. వేణువనమధ్యమందు భయంకరుఁడగు రాక్షసుఁడు బలాత్కారముగ నిన్నుఁబట్టుకొని నీకిష్టములేకపోయినప్పటికిని సంభోగముకొఱకు పీడించుచుండుననిశపించె. అంతట నేను నాభర్తయొక్క పాదములయందుఁబడి యనేకవిధములఁ బ్రార్థించితిని. అట్లు ప్రార్థింపఁగానతఁడిట్లనియె. ఓసీపాపిష్ఠురాలా! పరోపకారమును చేయువాఁడును, మహాధైర్యసంపన్నుఁడును, అయిన యొకమహాపురుషుఁడువచ్చి యెప్పుడు ఆరాక్షసునిసంహరించునో అప్పుడు నీకు శాపవిమోచనమగునని చెప్పి నాభర్త మరణమునుపొందెను. అదిమొదలుకొని నేను ఈరాక్షసునివలన బాధనుపొందుచు దైవయోగముచేత నీవు వచ్చుట వలన శాపవిముక్తురాలనైతిని. ఇప్పుడు నాశరీరమునుండి ప్రాణములు పోవును. నాకు తొమ్మిదికుండల బంగారముకలదు. అదియంతయును వ్యర్థముగా పోవును. కాఁబట్టి నీవు ఆబంగారమును నీవు తీసికొమ్మని అధనమున్నచోటును తెలిపి ఆయాఁడుది ప్రాణములనువదలె. అంతట నావిక్రమార్కమహారాజు ఆతొమ్మిదికుండలబంగారమును పురందరునకిచ్చి వానితోఁగూడ మరల ఉజ్జ



యినీపట్టణమునకుఁబోయెనని యీకథనుచెప్పి ఆసాలభంజిక భోజమహారాజుతో నిట్లనె. ఓభోజమహారాజా! నీయందు ఇటువంటియౌదార్యాదిగుణములున్నయెడల నీవీసింహాసనముమీఁదఁ గూర్చుండుమనిన భోజమహారాజు ఏమియును పలుకక మునుపటివలెనే యింటికిపోయెను.

ఇట్లని విక్రమార్క చరిత్రయందలి పదిరెండవ ఉపాఖ్యానము ముగిసెను.

---

## ——(*) పదమూఁడవచరిత్రము. (*)——

అంతట మరల నొకనాడు భోజమహారాజు ఆసింహాసనముమీద నెక్కవలయునని మోదు తలంపుకలవాఁడై సుముహూర్తమును విచారించుకొని పరివారజనముతోఁగూడవచ్చి సింహాసనము నెక్కఁబోగా మునుపటివలెనే పదమూఁడవసాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! ముందుగా విక్రమార్కమహారాజుయొక్క యౌదార్యాదిగుణములనువిని పిమ్మట నీవీసింహాసనముమీద నెక్కుమనిన భోజమహారాజు విక్రమార్కునిగుణములను చెప్పుమనియె. అంతట నాపదమూఁడవసాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కమహారాజు రాజ్యమును చేయుచుండఁగా ఒక్కనాఁడు రాజ్యభారమును మంత్రియందుఁబెట్టి తాను మారువేషమును వేసికొని సకల దేశములయందును సంచరించుటకు భయలువెడలె. అట్లు బయలువెడలి ప్రతిపట్టణమునందును మూఁడేసిదినములు నివసించుచు పోవుచుండెను. అట్లుపోవుచుండఁగా నొకనాఁడు ఒకపట్టణమునకుఁబోయెను. అప్పుడు ఆపట్టణమునకు సమీపమున దొకనదికలదు. ఆనదియొక్క యొడ్డుననున్న దేవాలయమునందు సర్వజనులును ఒకానొకపౌరాణికునివలన పురాణమును వినుచుండిరి. ఆవృత్తాంతమునువిని విక్రమార్కమహారాజు ఆనదియందు స్నానమునుచేసి దేవాలయములోనికిఁబోయి దేవునకు నమస్కరించి మహాజనసమీపమునందు ఈక్రిందఁజెప్పఁబోవునట్టి శ్లోకములనువినియె. ఆశ్లోకము లెవ్వియనినః

శ్లో॥ అనిత్యానిశరీరాణి విభవో నైవశాశ్వతః। నిత్యంసన్నిహితోమృత్యుఃకర్తవ్యోధర్మసంగ్రహః॥

టీ॥ శరీరాణి= శరీరములు. అనిత్యాని=అనిత్యములయినవి. విభవః= ఐశ్వర్యము. నైవశాశ్వతః= శాశ్వతమైనదికాదు. మృత్యుః= చంపెడుదేవత. నిత్యమ్= సర్వకాలములయందును. సన్నిహితః= సమీపమునందున్నది. ధ

ర్మసంగ్రహః= ధర్మసంగ్రహము. కర్తవ్యః= చేయఁదగినది॥ తా ॥ శరీరము లు అనిత్యములు. ఐశ్వర్యము శాశ్వతమైనదికాదు. చంపెడుదేవత సర్వకాలములయందును సన్నిహితమైయున్నది. కాఁబట్టి ధర్మసంగ్రహమునుచేయవలయునని తా॥ మఱియును,

శ్లో॥ శ్రూయతాంధర్మసర్వస్వం యదుక్తంశాస్త్రకోటిభిః । పరోపకారఃపుణ్యాయపాపాయపరపీడనమ్॥

టీ॥ శాస్త్రకోటిభిః= అనేకకోటి శాస్త్రములచేత. ధర్మసర్వస్వమ్= ధర్మముయొక్క సారాలధనము. యత్= ఏది. ఉక్తమ్= చెప్పఁబడినదో. తత్=అది. శ్రూయతామ్= వినఁబడుఁగాక. పరోపకారః= పరులకుపకారమును చేయుట. పుణ్యాయ=పుణ్యముకొఱకు. భవతి= అగుచున్నది. పరపీడనమ్= పరులనుపీడించుట. పాపాయ= పాపముకొఱకు. భవతి=అగుచున్నది॥

తా॥ సకల శాస్త్రములచేతను చెప్పఁబడిన ధర్మమేదియో దానిని చెప్పెదను. వినుఁడు. పరులకుపకారముచేయుటవలన పుణ్యముకలుగునని యును, పరులకపకారమును చేయుటవలన పాపముకలుగుననియును, తా॥ మఱియును,

శ్లో॥ యోదుఃఖితానిభూతాని దృష్ట్వాభవతిదుఃఖితః। సుఖితానిసుఖీచాపిసధర్మాత్మేతిశ్రూయతే॥

టీ॥ యః=ఎవ్వఁడు. దుఃఖితాని=దుఃఖమునుచెందిన. భూతాని=భూతములను. దృష్ట్వా=చూచి. దుఃఖితః = దుఃఖముకలవాఁడు. భవతి=అగుచున్నాఁడో. సుఖితాని=సుఖముకలవారిని. దృష్ట్వా=చూచి. సుఖీచ=సుఖముకలవాఁడును. భవతి=అగుచున్నాఁడో. సః=వాఁడు. ధర్మాత్మా=ధర్మబుద్ధికలవాఁడు. ఇతి=ఇట్లని. శ్రూయతే=వినఁబడుచున్నాఁడు॥ తా॥ లోకములోని మానవుఁడు దుఃఖముకలవారలనుచూచి దుఃఖముకలవాఁడగుచున్నాఁడో సుఖముకలవారలనుచూచి సుఖముకలవాఁడగుచున్నాఁడో అటువంటివాఁడు ధర్మాత్ముఁడని వినఁబడుచున్నాఁడని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ నాతోభూయస్తతోధర్మఃకశ్చిదస్యాస్తిదేహినః। ప్రాణినాం భయభీతానామభయంయఃప్రయచ్ఛతి॥

టీ॥ యః=ఎవ్వఁడు. భయభీతానామ్ = భయముచేత భీతినొందిన. ప్రాణినామ్=ప్రాణులకు. అభయమ్=అభయమును. ప్రయచ్ఛతి=ఇచ్చుచున్నాఁడో. అస్య=ఈ. దేహినః=మానవునకు. అతః=ఇంతకంటె. భూయః= అధికమైన. ధర్మః=ధర్మము. కశ్చిత్=ఒకటియును. నాస్తి=లేదు॥ తా॥ ఎవ్వఁడు భయముచేత భీతులైనవారలకు అభయమునిచ్చుచున్నాఁడో అటువంటిమానవునకు ఇంతకంటె అధికమైనధర్మ మొక్కటియును లేదనితాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ వరమేకస్యసత్త్వస్య ప్రదానంజీవితస్యతు । నచవిప్రసహస్రేభ్యోగోసహస్రందినేదినే॥

టీ॥ దినేదినే=ప్రతిదినమునందును. విప్రసహస్రేభ్యః=అనేకవేలమంది బ్రాహ్మణులకొఱకు. గోసహస్రమ్=వేయిగోవులును. ప్రదానమ్=ఇచ్చుట. నవరమ్=శ్రేష్ఠమైనదికాదు. కింతు=ఇఁక నేమనిన. ఏకస్య=ఒక్కటైన. సత్త్వస్య=జంతువునకు. జీవితస్య=జీవితముయొక్క. ప్రదానమ్=ఇచ్చుట. వరమ్=శ్రేష్ఠమైనది॥ తా॥ ప్రతిదినమునందును అనేకవేలమంది బ్రాహ్మణులకు అనేకవేలగోవులను ఇచ్చుటకంటె ఒక్క-జంతువుయొక్క ప్రాణములను కాపాడుట శ్రేష్ఠమైనధర్మమని తాత్పర్యము. మఱియును,

శ్లో॥ అభయంసర్వభూతేభ్యో యోదదాతిదయాపరః । తస్యదేహవిముక్తస్య భయమేవనవిద్యతే॥

టీ॥ యః=ఏపురుషుఁడు. దయాపరః=దయకుఅధీనుఁడై. సర్వభూతేభ్యః=సకలభూతములకొఱకును. దదాతి=ఇచ్చుచున్నాఁడో. దేహవిముక్తస్య=మరణమునుపొందిన. తస్య=అతనికి. భయమేవ=నాశమే. నవిద్యతే=లేదు. తా॥ ఏపురుషుఁడు దయకలవాఁడై సకలభూతములకును అభయమునిచ్చునో అటువంటిపురుషునకెన్నటికిని నాశములేదని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ హేమధేనుధనాదీనాం దాతారస్సులభాభువి । దుర్లభఃపురుషోలోకే సర్వజీవదయాపరః॥

టీ॥ భువి=భూలోకమునందు. హేమధేనుధనాదీనామ్=హేమముయొక్కయు, గోవులయొక్కయు, ధనాదులయొక్కయు. దాతారః=దాతలు. సులభాః=సులభులు. లోకే=లోకమునందు. సర్వజీవదయాపరః=సకలజీవులయందునుదయకల. పురుషః=పురుషుఁడు. దుర్లభః=సులభుఁడుకాఁడు॥ తా॥ హేమమునుచేయువారును, గోవులను, ధనాదులను, దానముచేయువారును భూలోకమునందు సులభముగాదొరకుదురు. మఱియును, లోకమునందు సకలజీవులయందును దయాపరుఁడైనపురుషుఁడు దొరకుటదుర్లభమని తాత్పర్యము. మఱియును,

శ్లో॥ మహతామపియజ్ఞానాం కాలేనక్షీయతేఫలం। ఫలస్యాభయదానస్యకలాంనార్హంతిషోడశీమ్॥

టీ॥ మహతామ్=అధికములయిన. యజ్ఞానామపి=యజ్ఞములయొక్కయు. ఫలమ్=ఫలము. కాలేన=కొంతకాలముచేత. క్షీయతే=నశించిపోవుచున్నది. అభయదానస్య=అభయదానముయొక్క. ఫలస్య=ఫలమునకు. క్షయ ఏవ=నాశమే. నవిద్యతే=లేదు॥ తా॥ గొప్పవగుయజ్ఞములయొక్కయును ఫలము కొంతకాలమునకు నాశమునుపొందును. అభయదానమువలనఁ గలిగినఫలమునకు నాశమే లేదని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ దత్తమిష్టంతపస్తప్తం తీర్థయాత్రాశ్రుతంతథా। సర్వాణ్యభయదానస్య కలాంనార్హంతిషోడశీమ్॥

టీ॥ దత్తమ్=దానము. ఇష్టమ్=యాగము. తథా=అట్లు. తప్తమ్=చేయఁబడిన. తపః=తపస్సు. తీర్థయాత్రాశుభమ్=తీర్థయాత్రలు మొదలుగాఁగల శుభములు. సర్వాణి=సమస్తములును. అభయదానస్య = అభయదానముయొక్క. షోడశీమ్=పదునాఱవదైన. కలామ్=కలనుగూర్చి. నార్హంతి=తగవు॥ తా॥ దానము, యాగము, తపస్సు, తీర్థయాత్రలు మొదలగునవియన్నియును అభయదానముయొక్క పదునాఱవకలనుగూర్చి కూడఁదగవని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ చతుస్సాగరపర్యంతాం యోదద్యాద్వసుధామిమాం। యశ్చాభయంచభూతేభ్య స్తయోరభయదోధికః॥

టీ॥ చతుస్సాగరపర్యంతామ్ = నాలుగుసముద్రముల వఱకునుకల. ఇమామ్=ఈ. వసుధామ్=భూమిని. యః=ఎవ్వఁడు. దద్యాత్=ఇచ్చునో. యశ్చ=ఎవ్వఁడు. భూతేభ్యః=భూతములకొఱకు. అభయమ్=అభయమును. దద్యాత్=ఇచ్చునో. తయోః=ఆరెంటిలోపల. అభయదః = అభయదానము. అధికః=అధికమైనది॥ తా॥ నాలుగుసముద్రములవఱకునుకల భూమిని దానముచేయునో. ఎవ్వఁడు అభయదానమును చేయునో, ఆరెంటిలోపల అభయదానమధికమైనదని తా॥ మఱియును,

శ్లో॥ అధ్రువేణశరీరేణప్రతిక్షణవినాశినా। ధ్రువంయోనార్జయేద్ధర్మంసశోచ్యోమూఢచేతనః॥

టీ॥ యః=ఏపురుషుఁడు. అధ్రువేణ=ధ్రువముగానిదియును. ప్రతిక్షణవినాశినా=ప్రతిక్షణమునందును నశించునట్టిదియును. (అయిన) శరీరేణ=శరీరముచేత. ధ్రువమ్=శాశ్వతమైన. ధర్మమ్=ధర్మమును. నార్జయేత్=సంపాదింపకపోవునో. సః=అటువంటి. మూఢచేతనః=మూఢమైన చిత్తముకలవాఁడు. శోచ్యః=దుఃఖింపఁగలవాఁడు॥ తా॥ ఏపురుషుఁడు శాశ్వతమైనదికానిదియును, ప్రతిక్షణమునందును నశించునట్టిదియును, అయినశరీరముచేత ఏపురుషుఁడు శాశ్వతమైనధర్మమును సంపాదింపఁడో అటువంటిమూఢుఁడు దుఃఖింపఁదగినవాఁడని తాత్పర్యము॥ మఱియును,



శ్లో॥ యదిప్రాణ్యుపకారాయ దేహోయంనోపయుజ్యతే। తతఃకిమపకారోస్య ప్రత్యహంక్రియతేనృభిః॥

టీ॥ ప్రాణీ=మానవుఁడు. ఉపకారాయ=ఉపకారముకొఱకు. దేహమ్=శరీరమును. నోపయుజ్యత ఇతియత్=ఉపయోగింపఁడనుట యేదికలదో. తతః=అంతకంటె. అస్య=ఈమానవునకు. అపకారః=అపకారము. ప్రత్యహమ్=ప్రతిదినమునందును. నృభిః=మానవులచేత. క్రియతే=చేయఁబడుచున్నది॥ తా॥ లోకములో ఏమానవుఁడు ఉపకారముకొఱకు దేహమునుపయోగింపఁడో ఆమానవునకు రాజులు ప్రతిదినమునందును అపకారమును చేయుచుందురని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ ఏకతఃక్రతవస్సర్వే సమగ్రవరదక్షిణాః। ఏకతోభయభీతస్య ప్రాణినఃప్రాణరక్షణమ్॥

టీ॥ సమగ్రవరదక్షిణాః=సంపూర్ణములును శ్రేష్ఠములును, అయినదక్షిణలుకల. సర్వే=సమస్తములయిన. క్రతవః=క్రతువులు. ఏకతః=ఒకప్రక్కను. భయభీతస్య=భయముచేతభీతుఁడైన. ప్రాణినః=జంతువుయొక్క. ప్రాణరక్షణమ్=ప్రాణములనుకాపాడుట. ఏకతః=మఱియొక్కప్రక్క॥ తా॥ సంపూర్ణములును, శ్రేష్ఠములునుఅయిన సకలయాగములవలనఁగలిగిన పుణ్యమెంతకలదో అంతపుణ్యము భయముచేత భీతుఁడయినవానియొక్క ప్రాణములనుకాపాడుటవలనఁ గలుగునని తెలియవలయునని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ పరోపకారవ్యాపార పరోయఃపురుషోభువి। ససంపదంసమాప్నోతి పరాదపిచయాపరా॥

టీ॥ భువి=భూమియందు. యః=ఏ. పురుషః=పురుషుఁడు. పరోపకారవ్యాపారపరః=పరోపకారవ్యాపారమునందుఆసక్తికలవాఁడో. సః=అటువంటిపురుషుఁడు. పరాదపిచ=పరముకంటెను. పరా=అధికమైన. సంపత్=సంపద. యా=ఏది. అస్తి=కలదో. తామ్=అటువంటి. సంపదమ్=సంపదను. సమాప్నోతి=పొందుచున్నాఁడు॥ తా॥ భూలోకమునందు ఏపురుషుఁడు పరోపకారవ్యాపారమునందాసక్తికలవాఁడగునో అటువంటిపురుషుఁడు సర్వోత్తమమైన సంపదనుపొందుచున్నాఁడని తాత్పర్యము. అనుసక్తితాత్పర్యముల్లు

కల పురాణశ్లోకములను చదువుచున్నసమయమునందు ఒకబ్రాహ్మణుఁడు భార్యతోఁగూడ ఆనదిని దాఁటఁదలఁచినవాఁడై నదియందుదిగె. అంతట నానది మిగులలోఁతుకలదైయుండుటవలన దానియందు భార్యతోఁగూడ మునిగిహాహాకారమును జేయుచు పురాణశ్రవణమును జేయుచున్నవారల నుద్దేశించి కాపాడుఁడని మొఱలిడె. మఱియు నాబ్రాహ్మణుఁడిట్లనియె. ఓమహాజనులారా! రక్షింపుఁడు రక్షింపుఁడు. నేను వృద్ధబ్రాహ్మణుఁడను. ఈనదీప్రవాహమునందు భార్యతోఁగూడ మునిగి చచ్చిపోవుచున్నాను. మీలో నెవ్వఁడయిన పుణ్యాత్ముఁడున్న యెడల వచ్చి కాపాడుఁడని అతికరుణముగా నేడ్చుచుండె, ఆసమయమునందు అక్కడనున్నవారందఱును మిగులదయతోఁ జూచుచుండిరి కాని యొక్కఁడును అభయమునిచ్చుటకు శక్తిలేనివారై యుండిరి. అంతట విక్రమార్క మహారాజు భయమును పొందకయు భయమును పొందకయు అని చెప్పుచు ఆనదీమధ్యయందుఁ బ్రవేశించి ఆబ్రాహ్మణుని అతనిభార్యను ఒడ్డునకుఁ దీసికొనివచ్చె. కావున నోభోజరాజా! ఆసమయమునందు ఆబ్రాహ్మణుని యొక్క హృదయమునందు ఎటువంటి సంతోషము కలిగి యుండవచ్చునో నీవె ఆలోచింపుము. అంతట కొంత సేపటికి ఆబ్రాహ్మణుఁడు స్వస్థచిత్తుఁడయి ఆవిక్రమార్క మహారాజుతో నిట్లనియె. ఓమహాపురుషా! ఈశరీరము మొదట తల్లిదండ్రులవలన గలిగినది. అనంతరమందు ఈశరీరము గాయత్రిచేత రెండవజన్మమును పొందినది. ఇప్పుడు నీవలన మూడవ జన్మమును పొందినది. కాబట్టి ప్రాణదానమును చేసిన నీవంటి మహానుభావునకు నే నేమి ప్రత్యుపకారమును చేయఁగలను. నేను మరణమును పొందియుంటినేని వ్యర్థముగా ఈశరీరమును వదలియుందును. కాఁబట్టి నాశక్తికొలఁది యుపకారమును చేయుదును. గ్రహింపుము. గోదావరీనదియందు పదిరెండు సంవత్సరములు నామత్రయమంత్రమును జపించియుంటిని. అట్టి పుణ్యమును నీకు సమర్పించెదను. మఱియును, ఇతరములయిన కృచ్ఛ్రచాంద్రాయణాదికములవలనఁ గలిగిన పుణ్యమును కూడ నీకు సమర్పించెదనని చెప్పి ఆవిక్రమార్క మహారాజునకు ఆపుణ్యమును సర్వమును సమర్పించి ఆశీర్వచనము చేసి ఆబ్రాహ్మణుఁడు భార్యతోఁగూడ తనగ్రామమునకుఁ బోయె. ఆసమయమునందే భయంకరుఁడయిన యొక బ్రహ్మరాక్షసుఁడు ఆవిక్రమార్క మహారాజుయొక్క సమీపమునకు వచ్చె. అప్పుడందలి బ్రాహ్మణులందఱును మిగుల భ్రాంతులై ఆబ్రహ్మరాక్షసుని చూచిరి. అంతట విక్రమార్క మహారాజు ఆబ్రహ్మరాక్షసుని జూచి యిట్లనియె. ఓమహాపురుషుఁడా! నీ వెవ్వఁడవు. ఎక్కడనుండి వచ్చితివి. నీవసిన



విని ఆరాక్షసుఁడిట్లనియె. ఓపురుషోత్తమా ! నేనీపట్టణమునందే నివసించియున్న బ్రాహ్మణుఁడను. నేను దుష్ప్రతిగ్రహముచేత జీవించువాఁడను, దుర్వ్యాసనపరుఁడను, అయియుంటిని. మఱియును విద్యాగర్వమువలన పెద్దలనందఱిని దూషించుచుంటిని. అట్టి పాతకమువలన ఈచోటున కెదుటనున్న అశ్వత్థవృక్షమునందు బ్రహ్మరాక్షసుఁడనై పదివేలసంవత్సరములుగనుంటిని. ఇప్పుడు మీయిరువురియొక్కయు ప్రసంగమును విని వచ్చితిని. నీవు సకలప్రాణులకును భేదము నెంచక యుపకారమును చేయువాఁడవైన యెడల నాకుఁగూడ ఉపకారమును చేయవలయుననిన విని విక్రమార్క మహారాజు నే నేమి చేయవలయుననిన విని యాబ్రహ్మరాక్షసుఁ డిట్లనియె. ఓపురుషోత్తమా! ఇప్పుడు బ్రాహ్మణునిచేత నీకీయఁబడిన పుణ్యమేదికలదో ఆపుణ్యమును నాకిమ్ము? అట్లిచ్చితివేని నేనీపాతకమునుండి విముక్తుఁడ నగుదుననిన విక్రమార్క మహారాజు ఆపుణ్యమును సర్వమును ఇచ్చె. అంతట నాబ్రహ్మరాక్షసుఁడు ఆపుణ్యవశముచేత పాపకర్మమునుండి విముక్తుఁడై దివ్యరూపమును ధరించినవాఁడగుచు రాజును ప్రశంసించి స్వర్గమునకుఁ బోయె. అంతట విక్రమార్క మహారాజుకూడ అక్కడనున్న బ్రాహ్మణుల యనుమతమును పొంది తనపట్టణమునకుఁ బోయెనని సాలభంజిక యీకథను చెప్పె. ఈకథను విని భోజమహారాజుకూడ విఫలమైన మనోరథము కలవాఁడై మునుపటివలెనే పరివారజనముతోఁగూడ గృహమునకుఁ బోయె.

ఇట్లని విక్రమార్క చరిత్రయందలి పదునూఁడవ ఉపాఖ్యానము ముగిసెను.

---

## ——(*) పదునాల్గవ చరిత్రము. (*)——

మరల నొకనాడు భోజమహారాజు ఆసింహాసనము నెక్కవలయునని మొదు తలంపుకలవాఁడై సుముహూర్తమును విచారించుకొని పరివారజనముతోఁగూడ ఆసింహాసనమునొద్దకు నేగుదెంచి సింహాసనముమీద నెక్కుటకుద్యమించె. సమయమునందు పదునాల్గవ సాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! పొట్టివాఁడు పొడుగాటి వృక్షముకొననుండు ఫలమునకు చేయిచాచినట్లు నీవు ఈసింహాసనముమీద నెక్కుట కభిలషించుచున్నావు. నీయందు విక్రమార్కునియందుఁగల యౌదార్యాది గుణములు లేవు. విక్రమార్క మహారాజుయొక్క యౌదార్యాదిగుణములను చెప్పెదను. వినుము. ఒకనాఁడు విక్రమార్క మహారాజు భూలోకమునందు ఏమి ఆశ్చర్యముకలద

నియును, ఏమివృత్తాంతములుకలవనియును, ఏమేమి పుణ్యతీర్థములు కలవని
యును, ఎటువంటి దేవాలయములుకలవనియును, ఆలోచించి వానినన్నిటి
నిచూచుటకొఱకు మునివేషము నవలంబించి సకల దేశములయందును దిరు
గుచు ఒకనాడొకపట్టణమునకుఁబోయె. పోయి యాపట్టణమునకు సమీప
మునందున్న తపోవనమునుచూచె. దానియందొకనది ప్రవహించుచుం
డె. మఱియు నాతపోవనమునందు జగదంబికయొక్క గొప్పమేడయొక
టియుండె. వానినన్నిటినిచూచి విక్రమార్కమహారాజు ఆనదీజలమునందు
స్నానమునుచేసి ఆదేవతకు నమస్కారమునుచేసి యచ్చోటనుండి బయలు
వెడలి వచ్చుచు మార్గమధ్యయందు అవధూతవేషము నవలంబించియున్న
యొకయోగిని చూచె. అప్పుడు ఆయోగి పుంగవుఁడు విక్రమార్క మహా
రాజుతో నిట్లనియె. ఓపురుషోత్తమా! నీవెవ్వఁడవు, ఎక్కడనుండి వచ్చుచు
న్నావనిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓయోగివర్యా! నేను మార్గస్థుఁడ
డను. తీర్థయాత్రలయందాసక్తికలవాఁడనై చూచుచున్నాననినవిని యాయో
గిపుంగవుఁ డిట్లనియె. ఓపురుషోత్తమా! నీవు విక్రమార్కుఁడవుకావా? ఓ
కపర్యాయము నేను నిన్ను ఉజ్జయినీపట్టణమునందుఁ జూచితిని. అందువలన
నిన్ను నేనెఱుఁగుదును. నీవేమినిమిత్తముగ నిచ్చోటునకువచ్చితివనిన విక్రమా
ర్కమహారాజిట్లనియె. ఓయోగిపుంగవా! నాకు భూమియందుఁ దిరిగి అనే
కములగు విషయములను చూడవలయునని మిగులఁ గుతూహలము కలవాఁ
డనై బయలువెడలివచ్చితిని. వచ్చి అనేకములయిన విచిత్రములను చూచుచు
పుణ్యాత్ములయిన తమనుచూచితిననినవిని యాయోగిపుంగవుఁ డిట్లనియె.
ఓరాజోత్తమా! అటువంటిరాజ్యమును విడిచిపెట్టి దేశాంతరములయందు
ఎందుకు తిరుగుచున్నావు. మార్గమధ్యయందేమయిన వికృతికలిగెనేని యే
మిచేయుదువనినవిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓయోగిపుంగవా! రా
జ్యభారమును సర్వమును మంత్రిహస్తమునందుఁబెట్టివచ్చితిననినవిని ఆయో
గిపుంగవుఁ డిట్లనియె. ఓరాజోత్తమా! నీవు నీతిశాస్త్రమును చదివినవాఁడ
వయ్యును నీతిశాస్త్రమునకు విరుద్ధమగు కార్యమును చేసితివి. మఱియును,

శ్లో॥ నియోగిహస్తార్పితరాజ్య భారాస్తిష్ఠంతియేస్వైర విహారధీ
రాః । బిడాలబృందార్పిత దుగ్ధభాండాస్స్వ పంతితే మూఢధియః క్షి
తీంద్రాః॥

టీ॥ యే=ఏరాజులు. నియోగిహస్తార్పితరాజ్యభారాః = మంత్రుల
యొక్క హస్తమునందుంచఁబడిన రాజ్యభారముకలవారై. స్వైరవిహారధీ



రాస్సంతః= స్వేచ్ఛాసంచారమునందు ధైర్యముకలవారగుచు. తిష్ఠంతి= ఉ
న్నారో. తే=అటువంటి. మూఢధియః= మూఢబుద్ధికల. క్షితీంద్రాః= రాజు
లు. బిడాలబృందార్పితదుగ్ధభాండాః= పిల్లులగుంపునందు అర్పింపఁబడినపా
లకుండలుకలవారై. స్వపంతి= నిద్రనుపొందుచున్నారు॥ తా॥ లోకములో
ఏమూఢులు మంత్రులయందు రాజ్యభారమునుపెట్టి స్వేచ్ఛావిహారమును
చేయుచున్నారో అటువంటి మూఢరాజులు పిల్లులదగ్గఱ పాలకుండనుపెట్టి
నిద్రనుబొందుచున్నవారితో సమానులనఁబడుదురని తాత్పర్యము॥ అను ప్ర
మాణములననుసరించి రాజ్యముతమస్వాధీనమైయుండేనని తలఁచియూరకుండుట
యుచితముకాదు. మఱియును, తనయధీనమైన రాజ్యమునుకూడ మిగుల
దృఢముగానుండునట్లు చేసికొనవలయును. మఱియును,

శ్లో॥ కృషిర్విద్యావణిగ్భార్యా ధనంసామ్రాజ్యసంపదః । కర్త
వ్యంసుదృఢంసర్వంకృష్ణసర్పముఖంయథా॥

టీ॥ కృషిః= కృషియు. విద్యా=విద్యయు. వణిక్ = వర్తకము. భా
ర్యా= భార్యయు. సామ్రాజ్యసంపదః= రాజ్యసంపదలు. ధనమ్=ధనము.
(అనునట్టి) సర్వమ్= సమస్తమును. సుదృఢమ్= మిగులదృఢమైనదానినిగా. కృ
ష్ణసర్పముఖంయథా= కృష్ణసర్పముయొక్కముఖమువలెనే. కర్తవ్యమ్= చే
యఁదగినది॥ తా॥ కృషి, విద్య, వర్తకము, భార్య, ధనము, రాజ్యసంపద
లు, అనువానిని కృష్ణసర్పముయొక్క ముఖమును గట్టిగాఁగా పాడినట్లు కా
పాడవలసినదని తాత్పర్యము॥ అను ప్రమాణాను సారముగ తెలిసి సంచ
రింపవలయుననినవిని విక్రమార్కమహారా జిట్లనియె. ఓ మహాత్మా! ఈ
పురుషప్రయత్నమంతయును నిరర్థకమైనది. సర్వమునకును దైవమే కారణ
ము. రాజ్యము దృఢమైయున్నప్పటికిని సాధనసమృద్ధి కలిగియున్నప్పటికిని,
పౌరుషము కలిగియున్నను, దేవునియనుగ్రహము లేకపోయెనేని పరాభవ
మును పొందుచుండును. మఱియును,

శ్లో॥ నేతాయస్య బృహస్పతిః ప్రహరణంవజ్రం సురాస్సైనికా
స్స్వర్గో నిగ్రహదుర్గమఃఖలుహరేరైరావణోవారణః। ఇత్యాశ్చర్యబలాన్వి
తోపివలభిద్భగ్నః పరైస్సంగరే తద్వ్యక్తంననుదైవమేవ శరణంధిగ్ధిగ్వృథా
పౌరుషమ్॥

టీ॥ యస్య=ఏ. హరేః= దేవేంద్రునకు. బృహస్పతిః= బృహస్పతి. నే
తా= నాయకుఁడో. ప్రహరణమ్= ఆయుధము. వజ్రమ్= వజ్రాయుధమో.
సైనికాః= సేనలు. సురాః= దేవతలు. నిగ్రహదుర్గమః= నిగ్రహదుర్గమము.

స్వర్గః = స్వర్గము. ఐరావణః= ఐరావతమనియెడు పేరుకలది. వారణః=ఏనుఁగు. ఇతి=ఇట్లని. ఆశ్చర్యబలాన్వితః= ఆశ్చర్యకరమైనబలముతోఁగూడుకొనినవాఁడు. (అయిన) సః= అటువంటి. బలభిదః= దేవేంద్రుఁడును. పరైః= ఇతరులచేత. సంగరే= యుద్ధమునందు. భగ్నః= భంగమునుపొందినవాఁడు. ఆసీత్= ఆయెను. తత్= అది. యుక్తమ్=ఉచితమైనది. నను= ఓయీ. దైవమేవ= దైవమే. శరణమ్=గతికము. పౌరుషమ్ = పురుషప్రయత్నము. వృథా=వ్యర్థము. ధిగ్ధిక్=ఛీఛీ॥ తా॥ దేవేంద్రునకు నియామకుఁడు బృహస్పతి ఆయుధము వజ్రాయుధము. సైనికులు దేవతలు. దుర్గముస్వర్గము. ఐరావతముఏనుఁగు. ఇట్లు మిగుల నాశ్చర్యకరమైన బలముతోఁగూడుకొనినవాఁడయ్యును దేవేంద్రుఁడు యుద్ధమునందు భంగమునుపొందె. కాఁబట్టి ఆలోచింపఁగా దైవమేరక్షకుఁడు. పురుషప్రయత్నమువ్యర్థమని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ నైవాకృతిఃఫలతినైవకులం నశీలంవిద్యాపినైవనచయత్నకృతాపిసేవా। భాగ్యానిపూర్వతపసాకిలసంచితానికాలేఫలంతిపురుషస్యయథైవవృక్షాః॥

టీ॥ ఆకృతిః= ఆకారము. నైవఫలతి=ఫలింపదు. కులమ్ = వంశము. నైవఫలతి= ఫలింపదు. విద్యాపి= విద్యయును. నైవఫలతి= ఫలింపదు. శీలమ్= సత్స్వభావము. నైవఫలతి=ఫలింపదు. యత్నకృతా= ప్రయత్నముచేతచేయఁబడిన. సేవాపి=సేవయును. నైవఫలతి=ఫలింపదు. పురుషస్య= పురుషునియొక్క. పూర్వతపసా= పూర్వజన్మమునందలి తపస్సుచేత. సంచితాని= సంపాదింపఁబడిన. భాగ్యాని=భాగ్యములు. కాలే= తగినకాలమునందు. యథైవవృక్షాః= వృక్షములవలెనే. ఫలంతి=ఫలించుచున్నవి॥ తా॥ ఆకారము, వంశము, విద్య, ప్రయత్నపూర్వకముగఁ జేయఁబడిన విద్యయును, అనునవియేవియును, ఫలింపవు. పూర్వజన్మమునందుఁ జేయఁబడిన పుణ్యములు తగినకాలమునందు ఫలించుచున్నవనితా॥ మఱియును,

శ్లో॥ యేనాఖండలదంతి దంతముసలాన్యాకుంచితాన్యాహవేధారాయేనపినాకపాణిపరశోశ్చాకుంఠితాచాహతా। జాయాదాశరథేఃప్రభావవసతేస్సంక్లేశితాజానకీ దైత్యస్సోపిహతోవిధిస్సబలవాన్లోకైరలంఘ్యఃఖలు॥

టీ॥ యేన=ఏదైవముచేత. ఆఖండలదంతిదంతముసలాని= దేవేంద్రునియొక్క యేనుఁగుయొక్క ముసలములవంటి దంతములు. ఆహవే=యుద్ధమునందు. ఆకుంచితాని=సంకోచింపఁజేయఁబడినవో. యేన=ఏదైవముచేత. పినాకపాణిపరశోః=పరమశివునియొక్క చేతియందలి గండ్రగొడ్డలియొక్క. ధారా=ధార. ఆకుంఠితా=కుంఠనముచేయఁబడి. ఆహతా=కొట్టఁబడినదో. యేన=ఏదైవముచేత. ప్రభావవసతేః=ప్రభావమునకు నివాసస్థానమైన. దాశరథేః=శ్రీరామునియొక్క. జాయా=భార్య. (అయిన) జానకీ=సీతాదేవి. సంక్లేశితా=పీడింపఁబడినది. యేన=ఏదైవముచేత. సః=అటువంటి. దైత్యోపి=రాక్షసుఁడును. హతః=చంపఁబడెనో. తత్=అందువలన. బలవాన్=బలవంతుఁడైన. విధిః=దైవము. లోకైః=లోకములచేత. అలంఘ్యఃఖలు=అతిక్రమింపఁదగినది కాదుగదా॥ తా॥ దైవబలముచేత దేవేంద్రునియేనుఁగుయొక్క ముసలములవంటిదంతములు సంకుచితములుగాఁజేయఁబడినవి. పరమశివునియొక్క గండ్రగొడ్డలియొక్క ధారయును కుంఠితమయ్యె. ప్రభావమునకు నివాసస్థానమైన శ్రీరామునిభార్య అనేకవిధములైన యాపదలను పొందె. సకలలోకములను బాధించునట్టి రావణాసురుఁడు చంపఁబడియె. కాఁబట్టి బలవంతమైన దైవమును లోకములోనెవ్వరును అతిక్రమింపఁజాలరనితాత్పర్యము అనుప్రమాణానుసారముగ మానవయత్నమువలనఁ గాఁదగినకార్య మేదియును లేదని తోఁచుచున్నది. మఱియు నోయోగివర్యా! వృద్ధిక్షయములకు రెంటికిని దైవముకారణమని తోఁచుచున్నది. మఱియును,

శ్లో ॥ భగ్నాశస్యకరండపిండితతనోర్మ్లానేంద్రియస్యక్షుధా కృత్వాఖుర్వివరంస్వయం నిపతితోనక్తంముఖేభోగినః। తృప్తస్తత్పిశితేనసత్వరమసౌతేనైవయాతఃపథా స్వస్థాస్తిష్ఠతదైవమేవహికరం వృద్ధౌక్షయే కారణమ్॥

టీ॥ ఆఖుః=ఎలుక. వివరమ్=వివరమును. కృత్వా=చేసి. . . భగ్నాశస్య=భంగముచేయఁబడిన యాశకలదియును. కరండపిండితతనోః=బుట్టయందు పిండాకారముగాఁజేయఁబడిన శరీరముకలదియును. క్షుధా=ఆకలిచేత. మ్లానేంద్రియస్య=వాడిన యింద్రియములుకలదియును. (అయిన) భోగినః=సర్పముయొక్క. ముఖే=ముఖమునందు. స్వయమ్=తానుగా. నిపతితః=పడవేయఁబడెను. అసౌ=ఈసర్పము. తత్పిశితేన=ఆయెలుకయొక్కమాంసముచేత. తృప్తః=తృప్తినిపొందినదై. సత్వరమ్=శీఘ్రముగా. తేనైవపథా=ఆమార్గముచేతనే. యాతః=పోయెను. హేజనాః=ఓజనులారా! వృద్ధౌ=వృద్ధియందును. క్షయే=నాశమునందును. పరమ్=శ్రేష్ఠమైన. కారణమ్=కారణము. దైవమేవహి=దైవమేకదా॥ తస్మాత్=అందువలన. స్వస్థాః=స్వస్థచిత్తులై. తి

క్షత=ఉండుండు॥ తా॥ ఒకనాఁడు ఒకయెలుక ఒక పాములపెట్టెను చూచి దానియందు భక్ష్యము లుండునని యెడు తలంపుతో ఆపాములపెట్టెకు చిల్లినిపెట్టెను. అట్లుపెట్టినవెంటనే ఆపెట్టెయందు పిండాకారముగ చేయఁబడిన శరీరముకలదైయున్నదియును, భంగముచేయఁబడిన యాశకలదియును, ఆకలిచేత పీడింపఁబడుచున్న యింద్రియములుకలదియును, అయినపాము యొక్క ముఖమునందుఁబడి ఆయెలుక మరణమునుపొందెను. అంతటనాపాము ఆయెలుకయొక్క మాంసముచేత చక్కఁగా దృప్తిఁబొందినదై మిగులశీఘ్రముగా ఆకన్నమునుండి బయలువెడలిపోయెను. కాఁబట్టి ఓజనులారా! వృద్ధిక్షయములయందు ముఖ్యమైనకారణము దైవమేకాని మఱియొకటి కాదని తాత్పర్యము. మఱియును,

శ్లో॥ అరక్షితంతిష్ఠతిదైవరక్షితం సురక్షితందైవహతంవినశ్యతి। జీవేత్తథాంధోపివనేవిసర్జితః కృతప్రయత్నోపిగృహేనజీవతి॥

టీ॥ అరక్షితమ్=సంరక్షణచేయఁబడినది. దైవరక్షితమ్=దేవునిచేతరక్షింపఁబడినదగుచు. తిష్ఠతి=ఉన్నది. సురక్షితమ్=చక్కఁగాఁ గాపాడఁబడినది. దైవహతమ్=దేవునిచేతఁ గొట్టఁబడినదగుచు. వినశ్యతి=నశించుచున్నది. తథా=ఆప్రకారముగా. వనే=అరణ్యమునందు. విసర్జితః=విడిచిపెట్టఁబడిన. అంధోపి=గ్రుడ్డివాఁడుకూడ. జీవేత్=జీవించును. కృతప్రయత్నోపి=అధికముగాఁజేయఁబడిన ప్రయత్నముకలవాఁడైనప్పటికిని. గృహే=గృహమునందు. నజీవతి=జీవింపఁడు॥ తా॥ సంరక్షణలేకపోయినప్పటికిని దయివముచేతరక్షింపఁబడి సుఖముగానున్నాఁడు. చక్కఁగాఁ గాపాడఁబడుచున్నను దైవముచేత నశింపఁజేయఁబడుచున్నాఁడు. అరణ్యమునందు విడువఁబడిన గ్రుడ్డివాఁడుకూడజీవించును. మఱియును, మిగులఁబ్రయత్నపూర్వకముగ గృహమునందు జీవించుటలేదని తాత్పర్యము. అనుప్రమాణానుసారముగ సర్వమును దైవాయత్తమైయున్నది. మఱియునోయోగివర్యా! నామనవినివినుము. రాజశేఖరుఁడను పేరుగలరాజు ఒకఁడుండెను. అతఁడు ఒకానొకఁడు తనమనస్సునం దిట్లనియాలోచించెను. వృక్షమూలమునందు నివసించియున్న నాకు రాజ్యము నెవ్వఁడుకలఁడో వాఁడే రాజ్యమును చేయుఁగాక. ఇట్లనితలఁచి రాజ్యభారమును విడిచిపెట్టియుండఁగా దేవుఁడు తనంతటఁదానే శత్రువులనుజయించెను అనియెడుకథను కొందఱుపెద్దలు చెప్పుచున్నారనినవిని యాయోగిపుంగవుఁడు మిగులసంతోషించినవాఁడై ఆవిక్రమార్కమహారాజునకు ఒకకాశ్మీరలింగమునిచ్చి యిట్లనియె. ఓరాజేంద్రా! ఇదికాశ్మీరలింగ



ము. ఇదిచింతామణివలె కోరినవస్తువులనన్నిటిని ఇచ్చుచుండును. కాఁబట్టిదీనిని చక్కఁగఁబూజింపుమనినవిని యావిక్రమార్కమహారాజు ఆయోగీశ్వరునకునమస్కరించి యాలింగమునుతీసికొని తనపట్టణమునకువచ్చుచుండెను. అట్లువచ్చుచు మార్గమధ్యమునం దొకబ్రాహ్మణునిచూచెను. ఆబ్రాహ్మణుఁడు రాజునుచూచి.

శ్లో॥ పాతువోగిరిజామాతా యస్యద్వాదశలోచనః। తథైవగిరిజామాతా ద్వాదశార్ధార్ధలోచనః॥

టీ॥ యస్య=ఎవనికి. గిరిజా=పార్వతీదేవి. మాతా=తల్లియో. సః=అటువంటి. ద్వాదశలోచనః=పదిరెండునేత్రములుకల కుమారస్వామియును. తథైవ=ఆప్రకారముగానే. గిరిజామాతా=హిమవంతునకల్లుఁడును. ద్వాదశార్ధార్ధలోచనః=త్రినేత్రుఁడును. (అయిన) పరమశివుఁడును. వః=మిమ్ములను. పాతు=రక్షించుఁగాక॥ తా॥ పార్వతీదేవి తల్లిగాఁగలవాఁడును, పదిరెండగు నేత్రములుకలవాఁడును, అయిన కుమారస్వామియును, హిమవంతునకల్లుఁడును, త్రినేత్రుఁడును, అయిన పరమశివుఁడును, మిమ్ములను గాపాడుదురుగాక అనితాత్పర్యము. అనునట్టి శ్లోకమును జెప్పి యాశీర్వచనమునుచేసి యిట్లనియె. ఓరాజోత్తమా! నాచేత చిరకాలమునుండి పూజింపఁబడిన శివలింగము నెవ్వఁడో అపహరించెను. అందువలన నాలుగుమూడుదినములనుంచి భోజనమునువదలి యుపవాసమును చేయుచున్నాఁడను. నేనులింగమునుపూజింపక భక్షించువాఁడనుకాను. కాఁబట్టి నీవు ఈలింగమునిచ్చితివేని నేనుపూజనుచేసికొని కృతార్థుఁడనయ్యెదననినవిని యావిక్రమార్కమహారాజు ఆశివలింగమును ఆబ్రాహ్మణునకిచ్చి తనయింటికిఁబోయెనని యీకథనుచెప్పినవిని భోజరాజు నేనీసింహాసనమునకు తగినవాఁడనుకానని చెప్పుచు పరివారజనముతోఁగూడ పోయెను.

ఇట్లని విక్రమార్కచరిత్రమునందలి పదునాల్గవఉపాఖ్యానము ముగిసెను.

---

## (*) పదునైదవచరిత్రము. (*)

అంతట మరలనొకనాఁడు భోజమహారాజు మునుపటివలెనే సింహాసనము నెక్కఁదలఁచి సుముహూర్తమును విచారించుకొనివచ్చి సింహాసనము మీఁద నెక్కఁబోవుచుండఁగా పదునైదవ సాలభంజికనవ్వి భోజమహారాజుతో నిట్లనియె. ఓభోజమహారాజా! మరలనెందుకువచ్చితివి? ఆవిక్రమార్కమహారాజుయొక్క అత్యధికమైన యౌదార్యమును చెప్పెదను. వినుము.

విక్రమార్కమహారాజు రాజ్యమునుచేయుచుండఁగా అతనికి వసుమిత్రుఁడను నొకబ్రాహ్మణోత్తముఁడు పురోహితుఁడైయుండె. అతఁడు అత్యధికమైన రూపముకలవాఁడును, సకలవిద్యలను చదివినవాఁడును, రాజునకు మిగులనిష్టుఁడునునైయుండె. అతనిమనస్సునం దొకనాడు గంగాస్నానముతప్ప మఱియొకటి యేదియును పాపములను పోఁగొట్టఁజాలదను తలంపుకలిగె. మఱియును,

శ్లో॥ తీర్థాభిషేకాన్నాన్యత్తు విద్యతేపావనంపరం। తపసాబ్రహ్మచర్యేణ యజ్ఞైస్త్యాగేనవాపునః॥

టీ॥ తీర్థాభిషేకాత్= పుణ్యతీర్థములయందు అభిషేకమును చేయుటకంటె. అన్యత్=ఇతరమైనది. పరమ్=శ్రేష్ఠమైనదియును. (అయిన) పావనమ్=పవిత్రకరమైనది. నవిద్యతే=లేదు. (అపిచ=ఇంతయుగాక) తపసా=తపస్సుచేతను. బ్రహ్మచర్యేణ=బ్రహ్మచర్యముచేతను. యజ్ఞైః=యజ్ఞములచేతను. త్యాగేనవా=త్యాగముచేతనైనను. పవిత్రతా=పరిశుద్ధకరమైనది. నవిద్యతే=లేదు॥ తా॥ పుణ్యతీర్థములయందు స్నానముకంటె శ్రేష్ఠమైనదియును, పవిత్రకరమైనదియును, అయినది మఱియొక్కటి యేదియునులేదు. మఱియును, తపస్సుచేతను, బ్రహ్మచర్యముచేతను, యజ్ఞములచేతను, దానముచేతను, పుణ్యతీర్థస్నానముచేత కలిగినట్లు పవిత్రతకలుగదని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ గతింనలభతేజంతు ర్గంగాంసంసేవితుంవ్రజేత్।స్నాతానాం శుచిభిస్తోయై ర్గాంగేయైర్నియతాత్మనాం। పుష్టిర్భవేత్తదాపుంసాం నానాక్రతుశతైరపి। అపహృత్యతపస్తీవ్రం యథాయాత్యుదయంరవిః॥

టీ॥ జంతుః=జంతువు. గంగామ్=గంగానదిని. సంసేవితుమ్=సేవించుటకొఱకు. వ్రజేత్=పోవలయును. నోచేత్=పోకపోయినయెడల. గతిమ్=సద్గతిని. నలభతే=పొందఁడు. శుచిభిః=పరిశుద్ధములును. గాంగేయైః=గంగాసంబంధములును. (అయిన) తోయైః=ఉదకములచేత. స్నాతానామ్=స్నానమునుచేసిన. పుంసామ్=పురుషులకు. తదా=అప్పుడు. పుష్టిః బలము. భవేత్=అగును. నానాక్రతుశతైరపి=అనేకవిధములయిన క్రతువులచేతఁగూడ. పుష్టిః=బలము. భవేత్=అగును. రవిః=సూర్యుఁడు. తీవ్రమ్=దట్టమైన. తమః=చీకటిని. అపహృత్య=పోఁగొట్టి. యథా=ఏప్రకారముగా. యాతి=పోవుచున్నాఁడో. గంగాజలాప్లుతః=గంగోదకముచేత స్నానముచేసినవాఁడు. తథా=ఆప్రకారముగా. పాపాని = పాపములను. అపహృత్య = పోఁగొట్టి.



భాతి= ప్రకాశించుచున్నాఁడు॥ తా॥ ప్రతిమానవుఁడును గంగానదిని సేవించుటకొఱకు పోవలయును. అట్లుకాదేని సద్గతినిపొందఁడు. పరిశుద్ధములయిన గంగోదకములచేత స్నానముచేసిన పురుషులకు మిగులబలము కలుగును. మఱియును, అనేకవిధములును, అనేకనూరులును, అయిన క్రతువులచేతఁగూడ గంగోదకములచేత పరిశుద్ధతనుపొందినవిధముగ బరిశుద్ధతనుపొందఁడు. మఱియును, సూర్యుఁడు గాఢమైనచీకటిని అపహరించిపోవుచున్న విధముగ గంగోదకములచేత స్నానమునుచేసినవాఁడు సకలపాపములను నశింపఁజేసి పుణ్యలోకమునకుఁబోవునని తా॥ మఱియును,

శ్లో॥ అగ్నింప్రాప్యయథాసద్య స్తూలరాశిర్వినశ్యతి। తథాగంగాజలేనైవసర్వపాపంవినశ్యతి॥

టీ॥ అగ్నిమ్= అగ్నిహోత్రుని. ప్రాప్య=పొంది. తూలరాశిః=దూదిరాశి. యథా=ఏవిధముగా. వినశ్యతి=నశించుచున్నదో. తథా=ఆవిధముగా. గంగాజలేనైవ= గంగోదకముచేతనే. సర్వపాపమ్=సకలపాపసముదాయము. వినశ్యతి= నశించుచున్నది॥ తా॥ అగ్నిహోత్రునియందుఁ బ్రవేశించిన వెంటనే దూదిరాశి యేవిధముగానశించిపోవుచున్నదో ఆవిధముగా గంగోదకముచేత సర్వపాపమును నశించుచున్నదని తా॥ మఱియును,

శ్లో॥ చాంద్రాయణసహస్రైర్యః కుర్యాత్కాయశోషణం। పిబేద్యశ్చాపిగంగాంభస్సమౌసత్యముభావపి॥

టీ॥ యః= ఏపురుషుఁడు. చాంద్రాయణసహస్రైః= వేయిచాంద్రాయణములచేత. కాయశోషణమ్= కాయశుద్ధిని. కుర్యాత్= చేయునో. యశ్చాపి= ఎవ్వఁడు. గంగాంభః=గంగోదకమును. పిబేత్= పానమునుచేయునో. ఉభావపి= ఇరువురును. సమౌ=సమానములు. సత్యమ్= యథార్థము॥

తా॥ లోకములో ఏపురుషుఁడు వేయిచాంద్రాయణములచేత కాయశుద్ధినిచేయునో, ఏపురుషుఁడు గంగోదకమును పానముచేయునో, ఆయిరువురును సమానులు. యథార్థమని తా॥ మఱియును,

శ్లో॥ యస్తుసూర్యాంశుసంతప్తో గాంగేయంసలిలంపిబేత్। విధియుక్తంచపీత్వాపి సర్వపాపాత్ప్రముచ్యతే॥

టీ॥ సూర్యాంశుసంతప్తః= సూర్యకిరణములచేత తపింపఁజేయఁబడినవాఁడై. యః=ఎవ్వఁడు. గాంగేయమ్=గంగాసంబంధమైన. సలిలమ్= ఉదకమును. పిబేత్= పానమునుచేయునో. విధియుక్తంచ= విధియుక్తమైనదానిని. పీత్వాపి= పానముచేసియును. సర్వపాపాత్= సకలపాపములనుండి

యును. ప్రముచ్యతే=విడువఁబడుచున్నాఁడు॥ తా॥ లోకములో నీమానవుఁడు సూర్యకిరణములచేత తపింపఁజేయఁబడినవాఁడై గంగాసంబంధమైన యుదకమును పానముచేయునో శాస్త్రోక్తప్రకారముగ స్నానాదులను జేయునో అట్టివాఁడు సకల పాపములనుండియును విడువఁబడుచున్నాఁడని తా॥ మఱియును,

శ్లో॥ భూతానామపిసర్వేషాం దుఃఖోపహతచేతసాం । గతిమన్వేషమాణానాం నాస్తిగంగాసమాగతిః॥

టీ॥ దుఃఖోపహతచేతసామ్= దుఃఖముచేతఁ గొట్టఁబడిన చిత్తము కలవియును. గతిమ్= సద్గతిని. అన్వేషమాణానామ్ = వెదకుచున్నవియును. (అయిన) సర్వేషామ్=సమస్తములయిన. భూతానామ్=భూతములకు. గంగాసమా= గంగతోసమానమైన. గతిః=సద్గతి. నాస్తి=లేదు॥ తా॥ దుఃఖముచేతఁ గొట్టఁబడిన చిత్తముకలవియును, సద్గతిని వెదకుచున్నవియును, అయిన సకల భూతములకును గంగతో సమానమైన గతిలేదని తా॥ మఱియును,

శ్లో॥ మహద్భిరశుభైర్గ్రస్తాన్భూతాంశ్చప్రసభేనసా । ఉద్ధృత్యనరకాద్ఘోరాద్గంగారక్షతిసేవనాత్॥

టీ॥ మహద్భిః= అత్యధికములయిన. అశుభైః= అశుభములచేత. గ్రస్తాన్= వ్యాప్తములయిన. భూతాన్=భూతములను. సా=ప్రసిద్ధమైన. గంగా= గంగానది. ప్రసభేన=బలాత్కారముగా. ఉద్ధృత్య=లేవనెత్తి. సేవనాత్= సేవించుటవలన. రక్షతి=రక్షించుచున్నది॥ తా॥ అత్యధికములయిన యశుభములచేత వ్యాప్తములయిన భూతములను ప్రసిద్ధమైనగంగానది బలాత్కారముగా నరకములనుండి లేవఁదీసి సేవించువారలను కాపాడుచున్నదని తా॥ మఱియును,

శ్లో॥ సప్తపూర్వాన్సప్తపరాన్పితౄంస్తేభ్యశ్చయేపరే। పరంతారయతేగంగా దృష్టాపీతావగాహితా॥

టీ॥ గంగా=గంగానది. దృష్టా=చూడఁబడినదియును. పీతా= పానముచేయఁబడినదియును. అవగాహితా= స్నానముచేయఁబడినదియును. (అగుచు) పూర్వాన్=మునుపటివారలను. సప్త=ఏడ్గురిని. పరాన్=పిమ్మటివారలను. సప్త=ఏడ్గురిని. తేభ్యః=ఆపదునలుగురికంటె. పరే= ఇతరులు. యే=ఎవరు. సంతి=కలరో. తాంశ్చ=వారలను. పరమ్= అత్యంతమును. తారయతే= తరింపఁజేయుచున్నది॥ తా॥ గంగానది చూడఁబడినదియును, పానము



చేయఁబడినదియును, స్నానముచేయఁబడినదియును, అగుచు తనకుమునుపటివారలనేడ్గురిని తనకు పిమ్మటివారలనేడ్గురిని, మఱియు నితరులును అతిశీఘ్రముగఁ దరింపఁజేయుచున్నదని తా॥ మఱియును,

శ్లో॥ దర్శనాత్స్పర్శనాద్ధ్యానాత్తథాగంగేతికీర్తనాత్ । పునాతిపురుషంపుణ్యాశతశోథసహస్రశః॥

టీ॥ పుణ్యా= పావనమైనగంగానది. దర్శనాత్=చూచుటవలనను. స్పర్శనాత్= స్పృశించుటవలనను. ధ్యానాత్= ధ్యానముచేయుటవలనను. తథా=ఆప్రకారముగా. గంగేతి=గంగాఅని. కీర్తనాత్= కీర్తించుటవలనను. శతశః= నూరువిధములుగాను. అథ=లేక. సహస్రశః=వేయివిధములుగాను. పురుషమ్=పురుషుని. పునాతి= పవిత్రునిగాఁజేయుచున్నది॥ తా॥ పావనమైన గంగదర్శనమువలనను, స్పృశించుటవలనను, గంగాఅని కీర్తించుటవలనను పురుషుని పవిత్రునిగాఁ జేయుచున్నదని తా॥ మఱియును,

శ్లో॥ తేజాత్యంధేషుజాత్యంధామృగేషుచమృగాస్స్మృతాః। సమర్థాయేనపశ్యంతి గంగాంపాపప్రణాశినీమ్॥

టీ॥ సమర్థాః= సమర్థులయిన. యే=ఎవరు. గంగామ్=గంగానదిని. నపశ్యంతి=చూడరో. తే=వారు. జాత్యంధేషు= జాత్యంధులయందు. జాత్యంధాః=జాత్యంధులు. మృగేషు=మృగములయందు. మృగాః=మృగములు. స్మృతాః=చెప్పఁబడినవి॥ తా॥ లోకములో సమర్థులయిన యేపురుషులు గంగానదినిచూడరో వారుజాత్యంధులలోపల జాత్యంధులు. మృగములలోపల మృగములుఅని తాత్పర్యము॥ అను ప్రమాణవచనముల ననుసరించి కాశీపట్టణమునకుఁబోయెను. పోయి గంగానదియందు శాస్త్రోక్తప్రకారముగ స్నానమునుచేసి తనపట్టణమునకు అభిముఖుఁడైపోయెను. అట్లు పోవుచు మార్గమధ్యమునం దొకపట్టణమునుచూచెను. ఆపట్టణమునందు శాపముచేత దగ్ధురాలయిన యొకదేవాంగనరాజ్యమును చేయుచుండెను. అదిభర్తలేనిదైయుండెను. ఆపట్టణమునందు లక్ష్మీనారాయణునియొక్క దేవాలయ మొకటికలదు. ఆదేవాలయముయొక్క గోపురాగ్రమునందు చిరకాలమునుండి యొకతైలకటాహమునందలి తైలము తపింపఁజేయఁబడుచుండెను. దానియందుఁ గాచిలియుంచఁబడిన పురుషులు పరదేశవాసులు వచ్చునపుడు ఈవిధముగాఁజెప్పుచుందురు. బలాధికుఁడైన పురుషుఁడెవ్వఁడైనను ధైర్యముతో ఈకటాహమును దుముకఁబడెనేని అతనియొక్క కంఠమునందు మాలికను అర్పింపఁగలదనిచెప్పుచుందురు. ఈవృత్తాంతమును వసుమిత్రుండను బ్రాహ్మణుఁడు ఆవిషయము

ను సర్వమును తెలిసికొని తనపట్టణమునకుఁ బోయెను. వచ్చిబంధువులతోఁగూడ ప్రాతఃకాలమునందు రాజమందిరమునకుఁబోయి విక్రమార్కమహారాజునుచూచి విక్రమార్కమహారాజునకు గంగోదకమును విశ్వేశ్వరప్రసాదమునుఇచ్చి కూర్చుండెను. ఆసమయమునందు విక్రమార్కమహారాజిట్లనియె. ఓవసుమిత్రుఁడా! దైవయోగముచేత నిన్ను చిరకాలమునకుఁజూచితిని. పుణ్యకరమైన తీర్థయాత్ర చక్కఁగా నెరవేర్పఁబడినదా? ఆయాదేశములయందుఏమేమివిచిత్రములనుచూచితివిఅనినవినివసుమిత్రుడు సురాంగనాతప్తతైలవృత్తాంతమును చెప్పె. ఆవృత్తాంతమును విని విక్రమార్కమహారాజు ఆబ్రాహ్మణునితోఁగూడ ఆచోటునకుఁబోయి ఆనదియందు స్నానమునుచేసి లక్ష్మీనారాయణునకు నమస్కారమునుచేసి తప్తతైలమధ్యమందుఁబడియె. ఆసమయమునందక్కడనున్న జనులు అత్యధికమైన కోలాహలధ్వనిచేసిరి. అప్పుడు రాజు యొకపిండాకారమయ్యె. ఆవృత్తాంతమును విని మన్మథసంజీవినియనునట్టి యాయాడుది అమృతముతో సమానమయిన మాంసపిండమున కభిషేకమునుచేసె. అంతట విక్రమార్కమహారాజుదివ్యరూపముసుధరించినవాఁడై బాలుఁడయ్యె. అనంతరమందు మన్మథసంజీవిని పుష్పమాలికను రాజుయొక్క కంఠమునందుంచుటకువచ్చె. ఆసమయమునందు విక్రమార్కమహారాజిట్లనియె. ఓమంగళప్రదురాలా! నీవు నాదానవైతివి. కాఁబట్టి నామనస్సున కనువర్తింపుమనినవిని మన్మథసంజీవిని రాజోత్తమా! తమయభిప్రాయమును తెలియఁజేయుఁడనియె. ఓమంగళప్రదురాలా! నీవు నాయిష్టమును నెరవేర్పఁదలఁచితివేని చెప్పెదను. వినుము. నాపురోహితుండైన యీబ్రాహ్మణునివరింపుమనినవిని మన్మథసంజీవిని మహాసంతోషమని చెప్పుచు ఆబ్రాహ్మణునియొక్క కంఠమునం దాపుష్పమాలికనువైచె. అంతట విక్రమార్కమహారాజు ఆయిరువురికిని వివాహమునుచేసి ఆరాజ్యమునకు అతనినిప్రభువునుగాఁజేసి తనపట్టణమునకుఁబోయెనని యీకథనుచెప్పి యాసాలభంజిక భోజమహారాజుతో మరలనిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కమహారాజుయొక్క యౌదార్యమును వింటివికదా? ఇంక విస్మాట నీయిష్టానుసారముగఁ జేయుమనినవిని భోజమహారాజు సిగ్గుచేతతల వంచుకొని యేమియును చెప్పఁజాలకపోయెను.

ఇట్లని విక్రమార్క చరిత్రయందలి పదునైదవ ఉపాఖ్యానము ముగిసెను.

---



## (*) పదునాఱవచరిత్రము. (*)

అంతట భోజమహారాజు మరల సింహాసనము నెక్కఁదలఁచి మునుపటివలె సుముహూర్తమును విచారించుకొనివచ్చె. ఆసమయమునందు పదునాఱవపాంచాలిక యిట్లనియె. ఓరాజోత్తమా! సింహాసనముమీదనెక్కకుము. విక్రమార్కమహారాజుయొక్క యౌదార్యమునువిని విస్మాట నీయందును అట్టిగుణములు కలిగియున్నయెడల ఎక్కుమనియిట్లనియె. విక్రమార్కమహారాజు ఒకనాడు దిగ్విజయమును చేయవలయునని యెడు తలంపుతో సర్వసన్నాహములుకలవాఁడై బయలువెడలి దశదిక్కులయందును దిరిగి సకలరాజులను తనపాదపద్మములయందుఁ బడినవారినిగాఁజేసి ఆరాజులచేత సమర్పింపఁబడిన రథగజతురగపదాతులను తీసికొనివచ్చుచుండె. అట్లు వచ్చుచుండఁగా, ముఖ్యుఁడగుదైవజ్ఞుఁడతనితో నిట్లనియె. ఓరాజోత్తమా! నాలుగుదినములదనుకమనము నగరమునందు ప్రవేశింపఁగూడదనినవిని విక్రమార్కమహారాజు ఉజ్జయినీపట్టణమునకు వెలుపటనున్న యుద్యానవనమునందు నివసింపఁదలఁచి తగిననివాసమును కలిగింపుమని మంత్రివరునితోఁజెప్పె. ఆసమయమునందు సుమంత్రుఁడను పేరుకల మంత్రిపుంగవుఁడు అతిశీఘ్రముగ తగిన నివాసస్థానమునుచేసె. ఆసమయమునందు వసంతఋతువు మెల్లగా ఉద్యానవనమునందుఁ బ్రవేశించె. అప్పుడు మంత్రిపుంగవుఁడు విక్రమార్కునితో నిట్లనియె. ఓరాజోత్తమా! ఇప్పుడు దైవయోగముచేత వసంతఋతువువచ్చెను. చూడుము. మఱియును,

శ్లో॥ వకుళా ముకుళాన్వహంతి సద్యస్సకలాశా భ్రమరీనినాదగీతాః। కమలాయతలోచనా వనాంతే విచరంతి ప్రమదాః ప్రసూనలోలాః॥

టీ॥ వకుళాః= పొగడచెట్లు. ముకుళాన్= ముకుళములను. వహంతి= వహించుచున్నవి. సద్యః= ఇప్పుడు. సకలాశాః= సకలదిక్కులును. భ్రమరీనినాదగీతాః= ఆడుతుమ్మెదలయొక్క గానములుకలవి. భవంతి=అగుచున్నవి. కమలాయతలోచనాః= పద్మములవలె విశాలములయిన నేత్రములుకల. ప్రమదాః= స్త్రీలు. వనాంతే=వనాంతమందు. ప్రసూనలోలాః= పుష్పములయందాసక్తికలవారై. విచరంతి= సంచరించుచున్నారు॥ తా॥ వకుళవృక్షములుముకుళములను వహించుచున్నవి. మఱియు నిప్పుడు సకలదిక్కులునుఆడుతుమ్మెదలయొక్క గానములతోఁ గూడుకొనినవి అగుచున్నవి. పద్మములవలె విశాలములయిన నేత్రములుకల స్త్రీలుపుష్పములయందాసక్తికలవారై సంచరించుచున్నారనితా॥ మఱియును,

శ్లో॥ మాకందనవ్యమకరందమహానురాగాదిందిందిరాః నిబిడయంతిస మంద్రనాదాః। మందానిలాశ్చవనితావదనారవిందామోదాపహారనిపుణాభువి వాంత్యజస్రమ్॥

టీ॥ మాకందనవ్యమకరందమహానురాగాత్ = మామిడిచెట్లయొక్క నూతనములైన మకరందమునందు అత్యధికమైన అనురాగమువలన. ఇందిందిరాః= తుమ్మెదలు. సమంద్రనాదాః= మంద్రములైన ధ్వనులుకలవై. నిబిడయంతి= దట్టములైనవగుచున్నవి. మందానిలాశ్చ= మందమారుతములు. వనితావదనారవిందామోదాపహారనిపుణాః = స్త్రీలయొక్క ముఖపద్మములయందలి పరిమళమును అపహరించుటయందు నేర్పుకలవై. భువి= భూమియందు. అజస్రమ్= సర్వకాలములయందును. వాంతి=విసరుచున్నవి॥ తా॥ తుమ్మెదలు మామిడిపువ్వులయందలి నూతనమకరందమునందు మహానురాగముకలిగియుండుటవలన మిగుల మనోహరములైన ధ్వనులుకలవై సంచరించుచున్నవి. మఱియును, ఈవనభూమియందు మందమారుతములు స్త్రీలయొక్క ముఖపద్మములయందలి పరిమళముతోఁ గూడుకొన్నవై సర్వకాలములయందును సంచరించుచున్నవని తా॥ మఱియును,

శ్లో॥ లతాంపుష్పవతీంస్పృష్ట్వా స్నాతోవిమలవారిషు। పునస్స్పర్శనశంకీవమందంచలతిమారుతః॥

టీ॥ మారుతః= వాయువు. పుష్పవతీమ్=పుష్పవతియైన. (లేక) రజస్వలాఅయిన. లతామ్=లతను. స్పృష్ట్వా=స్పృశించి. విమలవారిషు= నిర్మలోదకములయందు. స్నాతః= స్నానమును చేసినదై. పునః=మరల. స్పర్శనశంకీవ= తాకుటసంభవించుననిమోదు సందేహముకలదానివలె. మన్దమ్= మందముగా. చలతి=సంచరించుచున్నది॥ తా॥ లోకములో ఒకానొకపురుషుఁడు పుష్పవతియైన యాఁడుదానిని పొరఁబాటువలనఁదాకి నిర్మలములైన యుదకములయందు స్నానమునుచేసి మరల సందేహముకలవాఁడై తొలఁగితొలఁగి మెల్లమెల్లగాఁబోవునట్లు వాయువుపుష్పవంతియయిన లతను తాకి నిర్మలోదకములయందు స్నానమునుచేసి మరల తనుతాకవలసివచ్చునేమోయనిమోదు భయముచేత మెల్లమెల్లగాఁ బోవుచున్నది. అనఁగా, వాయువు శైత్యమాంద్యసౌరభ్యములుకలదై వీఁచుచున్నదని తాత్పర్యము॥ అని చెప్పుచున్న మంత్రిమాటలనువిని విక్రమార్కమహారాజు వసంతపూజాసామగ్రిని సంపాదించుటయందు నియోగించె. ఆనంతరమందు మంత్రిపుంగవుఁడు మిగుల మనోహరమైన మంటపమునునిర్మించి వేదశాస్త్ర పురాణములను తెలిసిన బ్రాహ్మణులను, నృత్యగీతవాద్యములయందు నిపుణతకల స్త్రీలనుపిలిపించెను. మఱియును, సభామధ్యయందు నవరత్నఖచితమైన సింహాసనమునందు లక్ష్మీనారాయణప్రతిమాద్వయమును ప్రతిష్ఠించి ఆదేవతాపూజకొఱకు కుంకుమకస్తూరీ కర్పూరచందనాదులను తీసికొనివచ్చి సర్వమును సన్నద్ధమును చేసితినని రాజుతోఁజెప్పె. అంతట విక్రమార్కమహారాజు ఆలక్ష్మీనారాయణదేవునకు పూజాదులనుచేసి బ్రాహ్మణులకు తగినట్లు పూజనుచేసి సమస్తజనులను తగినట్లు సత్కరించి నృత్యగీతవాద్యములచేత వినోదముగా కాలమును గడపుచు సుఖముగానివసించె. ఆసమయమునందు ఒకానొక వృద్ధబ్రాహ్మణుఁడు ఒకకన్యకను చేతఁబట్టుకొనివచ్చి రాజునుచూచి యిట్లనియె.



శ్లో॥ కల్యాణదాయి భవతోస్తుపినాకపాణేః పాణిగ్రహేభుజగకంకణభీషితాయాః। సంభ్రాంతదృష్టిసహసైవనమశ్శివాయేత్యుక్త్వార్థలజ్జితనతంముఖమంబికాయాః॥

టీ॥ హేరాజన్= ఓవిక్రమార్కమహారాజా! పినాకపాణేః=పరమశివునియొక్క. పాణిగ్రహే= పాణిగ్రహణమునందు. భుజగకంకణభీషితాయాః= సర్పకంకణములచేత భయమునుపొందిన. అంబికాయాః = పార్వతీదేవియొక్క. సంభ్రాంతదృష్టి= భయమునుపొందుచున్న చూపుకలదియును. సహసైవ= శీఘ్రముగా. నమశ్శివాయ= శివునికొఱకు నమస్కారము. ఇతి= ఇట్లని. ఉక్త్వా=పలికి. అర్థలజ్జితనతమ్= సిగ్గుచేతసగమువంపఁబడిన. ముఖమ్= ముఖము. భవతః=నీకు. కల్యాణదాయి=శుభములనిచ్చునది. అస్తు=అగుఁగాక॥ తా॥ ఓవిక్రమార్కమహారాజా! పరమశివునియొక్క పాణిగ్రహణకాలమునందు సర్పకంకణములచేత భయమునుపొందిన పార్వతీదేవియొక్క తొట్రుపడుచున్న చూపుకలదియును, నమశ్శివాయఅని చెప్పుటవలనఁ గలిగినసిగ్గుచేత వంపఁబడినదియును, అయినమోము మీకు మంగళములనిచ్చునది యగుఁగాతఅని తాత్పర్యము॥ అను శ్లోకమునుచెప్పి ఆశీర్వచనమునుచేసి రాజుచేత నియమింపఁబడిన చిత్రాసనమునందుఁగూర్చుండి యిట్లనియె. ఓరాజోత్తమా! ఒకవిజ్ఞాపనముకలదనిన విక్రమార్కమహారాజు నిస్సందేహముగాఁ జెప్పుమనినవిని యాబ్రాహ్మణుఁ డిట్లనియె. ఓరాజోత్తమా! నేను నదీవర్ధమానమనుపేరుకల పట్టణమునందు నివసించువాఁడను. నాకెనిమిదిమంది పుత్రులుపుట్టిరి. ఒక్కకుమార్తెయైనను పుట్టకపోయె. అనంతరమందు నేను భార్యతోఁగూడ జగదంబికయొక్క యెదుట ఈవిధముగా సంక

ల్పమును చేసితిని. ఓ దేవీ! నాకు కుమార్తె కలిగినయెడల నా పుత్రికకు నీపేరు నుపెట్టి దానియెత్తు బంగారమును వేదవేత్తయగు బ్రాహ్మణునకు దానము చేసెదనని సంకల్పించితిని. అంతటఁ గొన్నిదినములకు కన్నియ జనంచె. ఇప్పుడు ఈకన్యకకు పాణిగ్రహణసమయము అతిక్రమించినది. అందువలన దీనియెత్తు బంగారమును విక్రమార్కునికంటె నితరుఁ డెవ్వఁడును నీయజాలఁడని నీయొద్దకు వచ్చితిననిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓ బ్రాహ్మణోత్తమా! నీకెంతధనము కావలయునో అంతధనమును తీసికొమ్మని చెప్పి ధనాధికారిని పిలిచి యీబ్రాహ్మణునకు ఈకన్యక యెంతతూగునో అంతబంగారము నిమ్ము. మఱియును, ఎనిమిదికోట్ల వరహాల నిమ్మనియె. అంతట ధనాధికారి మహాప్రసాదమని చెప్పి ఆబ్రాహ్మణునకు రాజాజ్ఞానుసారముగ ధనమునిచ్చె. అంతట బ్రాహ్మణుఁడు అధికమైన సంతోషము కలవాఁడగుచు కన్యకతోఁగూడఁబోయె. పిమ్మట విక్రమార్కమహారాజు శుభముహూర్తమునందు ఇంటికిఁబోయెనని సాలభంజిక చెప్పినకథను విని భోజరాజు తనయందట్టిగుణములు లేవని తలఁచుచు దనయింటికిఁబోయె.

ఇట్లని విక్రమార్కచరిత్రయందలి పదునాఱవ ఉపాఖ్యానము ముగిసెను.



## (*) పదునేడవ చరిత్రము. (*)

అంతట మరల కొన్నిదినములు కడచిన పిమ్మట భోజమహారాజు సింహాసనము నెక్కఁదలఁచి సుముహూర్తమును విచారించుకొని పరివారజనముతోఁగూడవచ్చి సింహాసనము నెక్కఁదలఁచె. ఆసమయమునందు పదునేడవ సాలభంజిక యిట్లనియె. ఓ భోజమహారాజా! ఈసింహాసనమునందు నీవు కూర్చుండుటకు విక్రమార్కునియందుఁగల యౌదార్యాది గుణములు కలవాఁడు తగినవాఁడు అగును కాని యితరుఁడు అర్హుఁడు కాఁడనిన విని భోజమహారాజిట్లనియె. ఓ సాలభంజికా! ఆవిక్రమార్క మహారాజుయొక్క ఔదార్యాది వృత్తాంతమును చెప్పుమనిన విని సాలభంజిక యిట్లనియె. ఓ భోజమహారాజా! ఆవిక్రమార్కునియొక్క ఔదార్యమే త్రిభువనములయందు విస్తరించె. మఱియును, సకల జనులును ఆవిక్రమార్కమహారాజును స్తోత్రమును చేయుచుండిరి. మఱియును, యాచకులయొక్క స్వస్తివచనములు దాతలకు ప్రీతిని కల్పించుచున్నదిగాని శౌర్యాది గుణములు ప్రీతిని కల్పింపఁజాలవు. మఱియును,



శ్లో॥ యుధ్యంతి పక్షిపశవః పఠంతి శుకశారికాః । దదాతి కోపి దానం యస్స శూరస్స చ పండితః॥

టీ॥ పక్షిపశవః= పక్షులును పశువులును, యుధ్యంతి = యుద్ధమును చేయుచున్నవి. శుకశారికాః= చిలుకలును, గోరువంకలును. పఠంతి=పఠించుచున్నవి. కోపి=ఒకానొక. యః=ఎవ్వఁడు. దానమ్=దానమును. దదాతి=ఇచ్చుచున్నదో. సః=వాఁడు. శూరః=శూరుఁడు. పండితః = పండితుఁడు॥

తా॥ పక్షులును పశువులును యుద్ధమును చేయుచున్నవి. చిలుకలును, గోరువంకలును చదువుచున్నవి. అందువలనఁ బ్రయోజనమేమి? మఱియును, లోకములో నెవ్వఁడు దానమును చేయుచున్నాఁడో వాఁడే పండితుఁడు వాఁడే శూరుఁడు అని తా॥ మఱియును,

శ్లో॥ దాతౄణామేవ సుప్రీతిః స్వస్తివాచా యథార్థినః । సంప్రహర్షో న హి తథా రణదుందుభినిస్వనైః॥

టీ॥ అర్థినః=యాచకునియొక్క. స్వస్తివాచా = స్వస్తివచనములచేత. దాతౄణామేవ= దాతలకే. సుప్రీతిః=చక్కని ప్రీతి. యథా= ఏప్రకారముగా. భవతి=అగుచున్నదో. తథా=ఆప్రకారముగా. రణదుందుభినిస్వనైః= యుద్ధమునందలి జయభేరులయొక్క ధ్వనులచేత. సంప్రహర్షః = సంతోషము, నభవతిహి= కాదుకదా॥ తా॥ యాచకుఁడువచ్చి నీకు శుభమగుఁగాక అని చెప్పినయెడల దాతకు ఎంతసంతోషముకలుగునో ఆవిధముగా జయభేరులయొక్క ధ్వనులచేత సంతోషములేదని తాత్పర్యము॥ మఱియును, శౌర్యజ్ఞానానుష్ఠానాది గుణములు అందఱికిని కలిగియుండవచ్చునుగాని ఔదార్యము కలిగియుండుటమాత్రము దుర్లభము. మఱియును,

శ్లో॥ ఏవం త్యాగగుణశ్శ్లాఘ్యస్సర్వేషు గుణరాశిషు । త్యాగాజ్జగతి పూజ్యంతే పశుపాషాణపాదపాః॥

టీ॥ ఏవమ్= ఈప్రకారముగా. సర్వేషు= సమస్తములయిన. గుణరాశిషు= గుణసముదాయములయందు. త్యాగగుణః = త్యాగగుణము. శ్లాఘ్యః= కొనియాడఁదగినది. పశుపాషాణపాదపాః = పశువులు, పాషాణములు, వృక్షములు. త్యాగాత్=త్యాగమువలన. జగతి=లోకమునందు. పూజ్యంతే= పూజింపఁబడుచున్నవి॥ తా॥ సర్వగుణములయందును త్యాగగుణము మిగుల శ్రేష్ఠమైనది. కాఁబట్టి, పశువులు, పాషాణములు, వృక్షములు, ఆనసవికూడ త్యాగగుణము వలన పూజింపఁబడుచున్నవని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ త్యాగోగుణోగుణశతా దధికోమతో మే విద్యావిభూషయతి తంయదికింబ్రవీమి। శౌర్యంహినామయదితత్ర నమోస్తు తస్మై తచ్చత్రయం యది భవేదతిచిత్రమేతత్॥

టీ॥ త్యాగః= త్యాగమనియెడు. గుణః=గుణము. గుణశతాత్=నూఱు గుణములకంటె. అధికః=అధికమైనది. ఇతి=ఇట్లని. మే=నాకు. మతః=సమ్మతమైనది. తమ్= అటువంటి త్యాగగుణముకలవానిని. విద్యా=చదువు. విభూషయతియది= అలంకరించుచుండెనేని. కింబ్రవీమి=ఏమిచెప్పుదును. తత్ర= అటువంటి త్యాగగుణము, విద్యయు, అను రెండునుకలవానియందు. శౌర్యంనామ= శౌర్యమనియెడుగుణము. విద్యతేయది=కలిగియున్నయెడల. తస్మై= అతనికొఱకు. నమః=నమస్కారము. అస్తు=అగుగాక. తచ్చ= ఆ. త్రయమ్=మూడును. భవేద్యది=కలిగియున్నయెడల. ఏతత్=ఇది. అతిచిత్రమ్=మిగులచిత్రము॥ తా॥ త్యాగమనియెడుగుణమునూరుగుణములకంటెఅధికమైనది. త్యాగమనియెడు గుణముకలవానికి విద్యవచ్చియున్నయెడల ఆవిద్యఅలంకరింపజేయుననుటకు సందేహమేమియునులేదు. మఱియును, విద్యాత్యాగములురెండును కలవానికి శౌర్యమనియెడు గుణముకలిగియున్నయెడల అట్టివానికి నమస్కారమును జేసెదను. మఱియును, ఆమూడుగుణములును ఒకపురుషునియందే కలిగియున్నయెడల మిగుల నాశ్చర్యమనుటకు సందేహములేదని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ చెప్పఁబడిన నాలుగుగుణములును విక్రమార్కునియందుకలవు. అటువంటి విక్రమార్కునియొక్క సుగుణములను ఒకానొకపురుషుఁడు ఇతరరాజ్యమునందలి యొకరాజుముందర స్తోత్రముచేసె. ఆగుణములనువిని ఆరాజుఅధికముగాఅసూయకలవాఁడై ఆస్తోత్రపాఠకునితో నిట్లనియె. ఓస్తోత్రపాఠకుఁడా! స్తోత్రపాఠకులు ఏమినిమిత్తముగ విక్రమార్కమహారాజును ఈవిధముగా స్తోత్రమును జేయుచున్నారు. అటువంటిరాజు ఈభూలోకమునం దెవ్వఁడునులేఁడా? అనినవిని యాస్తోత్రపాఠకుఁ డిట్లనియె. ఓరాజోత్తమా! ధైర్యమునందును, త్యాగమునందును, పరోపకారమునందును, సాహసమునందును, దయయందును, ఆవిక్రమార్కునితో సమానుఁడెవ్వఁడునులేఁడు. మఱియును, పరోపకారమును చేయునప్పుడు ఆవిక్రమార్కమహారాజునకు స్వదేహమునందు మమత్వములేదనినవిని అప్పుడు ఆరాజు నేనుగూడ పరోపకారమును చేయఁగలనని తలఁచి మనస్సునందు ఆయభిప్రాయమునే పెట్టుకొని యొకయోగిపుంగవుని పిలిపించియిట్లనియె. ఓయోగిశ్రేష్ఠుఁడా! పరోపకారము



కొఱకు నాకుప్రీతి ప్రతిదినమందును వృద్ధిని పొందుచున్నది. కాఁబట్టి దానికిఁ దగిన యుపాయము ఏదేనికలదేని తెలియఁజేయుమనిన ఆయోగిపుంగవుఁడు అట్టియుపాయమేదియునునీకుదోచలేదా? అనినపినీయారాజుఅటువంటియుపాయముకలదేని చెప్పుము. చేసెదను. అనినవిని యాయోగిపుంగవుఁ డిట్లనియె. ఓరాజేంద్రా! కృష్ణచతుర్దశియందు చతుష్షష్టియోగినీచక్రమును పూజింపుము. మఱియును, ఆమంత్రదేవతయొక్క ముందర మంత్రమును జపించి పిమ్మట దశాంశహోమమును చేయుము. హోమావసానమునందు పూర్ణాహుతికొఱకు నీశరీరమునే సమర్పింపుము. అనంతరమందు యోగినీచక్రము ప్రసన్నముకాఁగలదు. అప్పుడు నీకేమికోరుదువో ఆకోర్కెలనన్నిం టిని ఈయఁగలదు. మఱియును, అప్పుడు నీకునిరుపమానమైనశరీరముకలుగఁగలదనినవిని ఆరాజు సర్వమును ఆవిధముగాచేసి పూర్ణాహుతి నిమిత్తము తానే అగ్నియందుఁబడె. ఆసమయమునందు యోగినీచక్రదేవత ప్రసన్నురాలై ఆరాజునకు నూతనమును దివ్యమును అయిన శరీరమునిచ్చి యిట్లనియె. ఓరాజోత్తమా! నీభక్తికి నేనుమెచ్చితిని. కావలసినవరమునుకోరుమనినవిని యారాజిట్లనియె. ఓదేవతా! నీవుప్రసన్నురాలవైనయెడల నాగృహమునందు ప్రతిదినమునందును ఏడుఘటముల సువర్ణముకలుగునట్లు చేయుమనినవిని యాదేవత ప్రతిదినమునందును నీశరీరమును అగ్నిహోత్రమునందుఁ బ్రవేశపెట్టినయెడల నీయభిలాషతీరుననియె. ఆమాట కారాజు అంగీకరించి అగ్నియందు ప్రతిదినమును శరీరమును హోమము చేయుచునుండె. ఇట్లు జరుగుచుండఁగా ఒకనాడు విక్రమార్కమహారాజు ఆవృత్తాంతమునువిని అచ్చోటికిఁబోయి పూర్ణాహుతి సమయమునందు తనశరీరమును అగ్నియందు సమర్పించె. అప్పుడు ఆయోగినీచక్రదేవత తనమనస్సునం దిట్లనితలఁచె. ఇతనిదేహము విచిత్రముగనున్నది. నేటిమాంసము మిగుల రుచికలదైయున్నది. ఇతనిహృదయము మిగుల సారముకలదానివలెఁ గనఁబడుచున్నదని తలఁచి ఆవిక్రమార్కమహారాజునకు మరల నూతనశరీరమునిచ్చి యిట్లనియె. ఓమహాపురుషుఁడా! నీవెవ్వఁడవు. నీవేమినిమిత్తముగ శరీరత్యాగమును చేసితివి? ఆవిషయము తెలియఁజేయుము. నీకోర్కెనుతీర్చెదననినవిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓదేవీ! నీవు ప్రసన్నురాలవైనయెడల ఈరాజు దినదినమందును మరణమును పొందుటవలన మహాకష్టమునుపొందుచున్నాఁడు. ఇట్టికష్టమును తొలఁగించి యితనిగృహమునందు సువర్ణఘటములు నంతియుండునట్లు చేయుమనినవిని యాయోగిని అటు

లనే చేసెదనని అంగీకారమును చేసి ఆరాజుయొక్క గృహమును అనేకసువర్ణఘటములు నిండియుండునట్లు చేసె. మరియును, ఆరాజునకు దినదినమందును మరణదుఃఖము లేకుండునట్లు చేసె. అంతట విక్రమార్కమహారాజు తన పట్టణమునకుఁ బోయెనని యీకథను చెప్పి సాలభంజిక భోజమహారాజుతో నిట్లనియె. ఓభోజమహారాజా! నీయందిట్టిసుగుణములు ఉన్నయెడల నీవీసింహాసనము నెక్కఁదగుదువనినవిని భోజమహారాజు సిగ్గుచేత తలనువంచుకొని మునుపటివలెనింటికిఁ బోయెను.

ఇట్లని విక్రమార్కచరిత్రమందలి పదునేడవ ఉపాఖ్యానము ముగిసెను.

---

## ——(*) పదునెనిమిదవచరిత్రము. (*)——

మరల నొకనాఁడు భోజమహారాజు సుముహూర్తమును విచారించుకొని పరివారజనముతోఁగూడ బయలుదేరి సింహాసనముమీఁదఁ గూర్చుండఁదలంచివచ్చె. వచ్చిసింహాసనముమీద నెక్కుటను ప్రయత్నించుచుండఁగా పదునెనిమిదవ సాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కమహారాజునకుఁగల యౌదార్యాది గుణములుకలవాఁడు మాత్రమే ఈసింహాసనముమీద నెక్కఁదగునుకాని ఇతరుఁ డెక్కఁదగఁడనిననిని భోజమహారాజు ఇట్లనియె. ఓసాలభంజికా! విక్రమార్కునియొక్క యౌదార్యాది గుణములను చెప్పుమనిన సాలభంజికయిట్లనియె. ఓరాజోత్తమా! విక్రమార్కునియొక్క గుణములను చెప్పెదను. వినుము. విక్రమార్కమహారాజు అణుమాత్రమయినను నీతిని అతిక్రమించువాఁడుగాఁడు. మణిపురమను పేరుకల పట్టణమునందు గోవిందశర్మయను పేరుకల బ్రాహ్మణుఁడు తనకుమారునికొఱకు నీతినిఉపదేశించె. నేనునువింటిని. ఆనీతిని నీకుపదేశింతును. వినుము. విద్వాంసుఁడగు పురుషుఁడు దుర్జనులతోఁగూడ సహవాసమును చేయఁగూడదు. దుర్జనసాంగత్యమువలన అనేకానర్థములు సంభవించును. మఱియును,

శ్లో॥ దుర్వృత్తసంగతిరనర్థ పరంపరాయా హేతుస్సతామధిగతంవచనీయమత్ర। లంకేశ్వరేహరతి దాశరథేః కళత్రంప్రాప్నోతిబంధమథదక్షిణసింధురాజః॥

టీ॥ దుర్వృత్తసంగతిః=దుర్జనసాంగత్యము. అనర్థపరంపరాయాః=అనేకములయినయనర్థములకు. హేతుః=కారణము. అత్ర=ఈదుర్జనసాంగ



త్యమునందు. సతామ్=సత్పురుషులకు. వచనీయమ్=నింద. అధిగతమ్=పొందఁబడినది. లంకేశ్వరే=రావణాసురుఁడు. దాశరథేః=శ్రీరామునియొక్క. కళత్రమ్=భార్యను. హరతిసతి=హరించుచుండఁగా. అథ=పిమ్మట. దక్షిణసింధురాజః=దక్షిణసముద్రుఁడు. బంధమ్=బంధమును. ప్రాప్నోతి=పొందుచున్నాఁడు॥ తా॥ దుర్జనసాంగత్యము అనేకానర్థములనుకలిగించుటకు కారణమైనది. కావున ఈవిషయమునందు సజ్జనులునిందనుపొందుదురు. మఱియును, శ్రీరామునిభార్యను రావణాసురుఁడు అపహరించుచుండఁగా అతనికిమిత్రుఁడైనదక్షిణసముద్రుఁడు బంధమునుపొందెనని తాత్పర్యము. అనుప్రమాణానుసారముగ దుర్జనసాంగత్యముకూడదనియును, సజ్జనసాంగత్యమును సర్వకాలములయందును చేయవలసినదనియును, తెలియవలయును. మఱియును, లోకమునందు సజ్జనసాంగత్యముకంటె అధికమైనది యేదియును లేదు. మఱియును,

శ్లో॥ కందళయత్యానందం నందయత్యనిలేందుచందనానిభృశం। మండయతిమందహాసం సంధత్తేసంపదోపిసత్సంగః॥

టీ॥ సత్సంగః=సజ్జనసాంగత్యము. ఆనందమ్=సంతోషమును. కందళయతి=అంకురింపఁజేయుచున్నది. భృశమ్=అత్యంతమును. అనిలేందుచందనాని=వాయువును, చంద్రుని, చందనములను. నందయతి=సంతోషింపఁజేయుచున్నది. మందహాసమ్=మందహాసమును. మండయతి=అలంకరింపఁజేయుచున్నది. సంపదోపి=సంపదలనుగూడ. సంధత్తే=కలుగఁజేయుచున్నది॥ తా॥ సజ్జనసాంగత్యము సంతోషమునుకలుగఁజేయుచున్నది. మఱియును, సజ్జనసాంగత్యమువలనవాయువు, చంద్రుఁడు, చందనము, అనువి సంతోషమునుపొందుచున్నవి. మందహాసమును అలంకరింపఁజేయుచున్నది. సంపదలనుకలుగఁజేయుచున్నదని తాత్పర్యము. అనుప్రమాణానుసారముగ సజ్జనసాంగత్యముమిక్కిలి శ్రేష్ఠమైనది. మఱియును, ఎట్టివానితోడను వైరమునవలంబింపఁగూడదు. ఇతరులకు సంతాపమునుచేయఁగూడదు. అపరాధములేనిసమయమునందు భృత్యులను దండింపఁగూడదు. మఱియును, మహాదోషమును పరిత్యజింపకూడదు. అట్లుగాక ఒకవేళవిడిచిపెట్టినయెడల శాశ్వతమైన నరకమునుపొందును. మఱియును,

శ్లో॥ ప్రజ్ఞాసంపాదనేదక్షాం వీరసూంప్రియవాదినీం। యోఽదృష్టదోషస్త్యజతిసోక్షయంనరకంవ్రజేత్॥

టీ॥ ప్రజ్ఞాసంపాదనే=ప్రజ్ఞనుసంపాదించుటయందు. దక్షామ్=సమర్థమైనదియును. వీరసూమ్=వీరుఁడగుపుత్రుని కనునట్టిదియును. ప్రియవాదినీ

మ్-ప్రియముగ మాటలాడునట్టిదియును. (అయిన) భార్యను. అదృష్టదోషః-చూడఁబడనిదోషముకల. యః-ఏపురుషుఁడు. త్యజతి-విడిచిపెట్టుచున్నాఁడో. సః-ఆపురుషుఁడు. అక్షయమ్-శాశ్వతమైన. నరకమ్-నరకమును. వ్రజేత్-పొందును॥ తా॥ ప్రజ్ఞాసంపాదనమునందు మిగులసమర్థురాలును, వీరుఁడగుపురుషుని కనునట్టిదియును, ప్రియముగ మాటలాడునట్టిదియును, అయిన భార్యయందు దోషమునుచూడకయే యేపురుషుఁడుపరిత్యజించునో ఆటువంటిపురుషుఁడు శాశ్వతమైననరకమును పొందునని తాత్పర్యము. అనుప్రమాణానుసారముగ నిర్నిమిత్తముగ భార్యను విడిచిపెట్టఁగూడదు. మఱియును, సంపద స్థిరముగానుండునని తలఁపఁగూడదు. సంపదలు మిగులచపలములయినవి. మఱియును,

శ్లో॥ అనుభవతదత్తవిత్తంమాన్యంమానయతసజ్జనంభజత। అతిపరుషపవనలులితా దీపశిఖేవాతిచంచలాలక్ష్మీః॥

టీ॥ దత్తవిత్తమ్-ఈయఁబడినధనమును. అనుభవత-అనుభవింపుఁడు. మాన్యమ్-పూజ్యుఁడగువానిని. మానయత-పూజింపుఁడు. సజ్జనమ్-సత్పురుషుని. భజత-సేవింపుఁడు. లక్ష్మీః-సంపద. అతిపరుషపవనలులితా-మిగులకఠినమైన వాయువుచేతకదల్పఁబడిన. దీపశిఖేవ-దీపజ్వాలవలెనే. అతిచంచలా-మిగులచపలమైనది॥ తా॥ ఈయఁబడినధనమును అనుభవింపుఁడు. పూజ్యుఁడగువానినిపూజింపుఁడు. సజ్జనునిసేవింపుఁడు. సంపదఅతికఠినమైనగాలిచేత చలింపఁజేయఁబడిన దీపజ్వాలవలె చపలమైనదని తాత్పర్యము. అనుప్రమాణానుసారముగ సంపదమిగులచపలమైనదని తెలియవలయును. మఱియును, స్త్రీలతో రహస్యమును చెప్పఁగూడదు. రాఁబోవుకార్యములను ఆలోచింపఁగూడదు. వైరముతోఁగూడ హితమునుఆలోచింపఁదగదు. దానాధ్యయనాదులనుచేయక దినములువ్యర్థముగఁగడపఁగూడదు. తల్లిదండ్రులను సేవింపవలయును. దొంగలతోఁగూడసల్లాపమునుచేయఁగూడదు. సర్వకాలములయందును పరుషవచనములను పలుకఁగూడదు. స్వల్పకార్యముకొఱకు అధికముగా వ్యయమునుచేయఁగూడదు. మఱియును,

శ్లో॥ నస్వల్పస్యకృతేభూరి నాశయేన్మతిమాన్నరః। ఏతదేవహి పాండిత్యం యత్స్వల్పాద్భూరిరక్షణమ్॥

టీ॥ స్వల్పస్యకృతే-అల్పకార్యముకొఱకు. మతిమాన్-బుద్ధిమంతుఁడైన. నరః-మానవుఁడు. భూరి-అధికముగా. ననాశయేత్-నశింపఁజేయఁగూడదు. స్వల్పాత్-అల్పద్రవ్యమువలన. భూరిరక్షణమ్-అధికమైన వస్తురక్షణ



మును. ననాశయేత్-నశింపఁజేయఁగూడదు. ఏతదేవహి-ఇదియే. పాండిత్యమ్-పాండిత్యము॥ తా॥ బుద్ధిమంతుఁడగువాఁడు అల్పకార్యముకొఱకు అధికముగాద్రవ్యమును నశింపఁజేయఁగూడదు. అధికమయినకార్యమునుస్వల్పప్రయత్నముతో రక్షింపకయుండఁగూడదని తాత్పర్యము. అనుప్రమాణానుసారముగ అయ్యైకార్యములకుతగినట్లు వ్యయాదికమునుచేయవలయును. అర్థులకు దానమునుచేయవలయును. ధర్మస్థానమునందు వ్యర్థములయినమాటలను చెప్పఁగూడదు. మనోవాక్కాయకర్మములచేత పరోపకారమునుచేయవలయును. లోకములోనెవ్వరు పరోపకారమునుచేయుదురో అట్టివారుసజ్జనులనఁబడుదురు. ఇదియంతయును సామాన్యముగా పురుషులకుపదేశింపఁబడిన నీతియనఁబడును. మఱియును, విక్రమార్కమహారాజు స్వభావముగానే సకలనీతిశాస్త్రమును తెలిసినవాఁడు. ఇట్లుండఁగానొకనాఁడు ఒకపరదేశి విక్రమార్కమహారాజునుజూచె. అప్పుడు విక్రమార్కుఁడిట్లనియె. ఓపూజ్యుఁడా! నీవేదేశమునందుండువాఁడవనినవిని యాపురుషుఁడిట్లనియె. ఓరాజోత్తమా! నేనుపరదేశిని. నాకొకచోటనునివాసములేదు. నేనొకచోటనివసించువాఁడనుగాను. సర్వకాలములయందును తిరుగుచునే కాలమునుగడపుచున్నానని వినివిక్రమార్కమహారాజిట్లనియె. ఓపురుషోత్తమా! నీవుసకలదేశములయందును తిరుగుచుంటివికదా? ఎక్కడెక్కడనయేదేశములయందు ఏవేమివిచిత్రములను చూచితివి? వానినిచెప్పుమనిన నాపురుషుఁడిట్లనియె. ఓరాజోత్తమా! ఉదయపర్వతమునందు మిగులగొప్పదయిన సూర్యాలయమొకటికలదు. మఱియునాపర్వతమునందు గంగయనుపేరుగల యొకనదికలదు. ఆగంగాప్రవాహమునుండి మిగులగొప్పదగు సువర్ణస్తంభము తూర్పుభాగమునందుదయించుచున్నది. సూర్యుఁడు ఆకాశమధ్యమందు ప్రవేశించునపుడు ఆస్తంభము సూర్యునిదగ్గరకుపోవును సూర్యుఁడు అస్తమయమునుపొందుచుండఁగా ఆస్తంభముకూడ క్రమముగాదిగి తానుగంగాప్రవాహమునందుమునుగుచున్నది. దినదినమును ఈవిధముగాజరుగుచున్నది. ఇటువంటివిచిత్రమునుచూచితిననివిని విక్రమార్కమహారాజు ఆపురుషునితోఁగూడబయలువెడలి ఆచోటునకుఁబోయి యారాత్రియంతయును, అక్కడసుఖముగానిద్రించె. అంతటమఱుదినప్రాతఃకాలమునందు శ్రేష్ఠమైనసింహాసనముతోఁగూడుకొనియున్నహేమస్తంభము ఆమడుగులోనుండి మెల్లమెల్లగాబయలువెడలె. ఆస్తంభమునందు విక్రమార్కమహారాజుకూర్చుండెను. అంతటఆస్తంభము సూర్యమండలముదగ్గరకు పోవునంతటిలో మిగులతీక్ష్ణములయిన సూర్యకిర

ణములచేత విక్రమార్కునిశరీరము తగులఁబెట్టఁబడెను. అట్లుమాంసపుముద్దవలెనున్నశరీరముకల యావిక్రమార్కమహారాజు సూర్యమండలమునుపొంది సూర్యదేవునిఇట్లనిస్తోత్రముచేసె.

శ్లో॥ నమస్సవిత్రేజగదేకచక్షుషే జగత్ప్రసూతి స్థితినాశహేతవే।
త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే విరించినారాయణశంకరాత్మనే॥

టీ॥ జగదేకచక్షుషే=లోకములకు ముఖ్యనేత్రమైనవాఁడును. జగత్ప్రసూతిస్థితినాశహేతవే=లోకములయొక్క యుత్పత్తిస్థితిలయములకు కారణమైనవాఁడును. త్రయీమయాయ=వేదత్రయస్వరూపుఁడును. త్రిగుణాత్మధారిణే=సత్త్వరజస్తమోగుణములను ధరించినవాఁడును. విరించినారాయణశంకరాత్మనే=బ్రహ్మవిష్ణుమహేశ్వరస్వరూపుఁడును. (అయిన) సవిత్రే=సూర్యునికొఱకు. నమః=నమస్కారము॥ తా॥ లోకములకుముఖ్యమైన నేత్రమువంటివాఁడును, లోకములయొక్క యుత్పత్తిస్థితిలయములకు కారణమైనవాఁడును, వేదత్రయస్వరూపుఁడును, సత్త్వరజస్తమోగుణములను ధరించినవాఁడును, బ్రహ్మవిష్ణుమహేశ్వరస్వరూపుఁడును, అయినసూర్యదేవునకు నమస్కారమని తాత్పర్యము అనునట్టివచనములచేత అనేకవిధములుగా స్తోత్రమునుచేసి పరమాత్ముఁడయిన సూర్యునకునమస్కరించెను. అనంతరమందు సూర్యుఁడు అమృతముచేత ఆతనినితడిపెను. విక్రమార్కరాజుయొక్కశరీరము వృద్ధిపొందెను. ఆసమయమునందు విక్రమార్కమహారాజిట్లనియె. నేనుధన్యుఁడనైతిననిన సూర్యుఁడిట్లనియె. ఓరాజా! నీవుఅత్యధికమైన బలముకలవాఁడవు. నాయొక్క యీమండలమును ఇతరులెవ్వరును పొందఁజాలరు. అందువలన నేనుప్రసన్నుఁడనైతిని. నీకభీష్టమయినవరమునిచ్చెదను. నీయభీష్టమయినవరమునుకోరుమనిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓదేవోత్తమా! ఇంతకంటె అధికమైనవరమేమికలదు. మహామునులకుఁగూడలభ్యముకాని నీదర్శనమును పొందితిని. నీయనుగ్రహమువలన నాకుసకలార్థములును సమకూరినవనియెంచుచున్నాను. ఆమాటలనువిని సూర్యదేవుఁడధికానందమునుపొంది తనసంబంధములయిన రెండురత్నకుండలములనిచ్చి యిట్లనియె. ఓరాజోత్తమా! ఈకుండలద్వయము దినదినమందును ఒకసువర్ణభారమును ఇచ్చుచున్నదనిచెప్పిపంపెను. అంతట విక్రమార్కమహారాజు ఆకుండలద్వయమునుగ్రహించి మరలసూర్యదేవునకునమస్కరించి ఆసువర్ణస్తంభమునుండిదిగి యుజ్జయినీపట్టణమునకుఁ బోవుచుండెను. అట్లుపోవుచుండఁగా, ఒకబ్రాహ్మణుఁడుమార్గమధ్యమునందుఁజూచి యిట్లనియె.



శ్లో॥ వేదాంతేషు యమాహురేకపురుషం వ్యాప్యస్థితంరోదసీయస్మిన్నీశ్వరఇత్యనన్యవిషయశ్శబ్దోయథార్థాక్షరః। అంతర్యశ్చముముక్షుభిర్నియమితప్రాణాదిభిర్మృగ్యతేసస్థాణుస్థిరభక్తియోగసులభో నిశ్శ్రేయసాయాస్తువః॥

టీ॥ వేదాంతేషు= వేదాంతములయందు. యమ్=ఏ. ఏకపురుషమ్=ఒక్కపురుషుని. రోదసీ= ద్యావాపృథువులను. వ్యాప్య = వ్యాపించి. స్థితమ్= ఉన్నవానినిగా. ఆహుః=చెప్పుచున్నారు. యస్మిన్=ఏ. ఈశ్వరే=ఈశ్వరునియందు. అనన్యవిషయః= అన్యవిషయముకాని. శబ్దః=శబ్దము. యథార్థాక్షరః= వాస్తవమైనఅక్షరములుకలదో. యః= ఏపురుషుఁడు. నియమితప్రాణాదిభిః= నియమింపఁబడినప్రాణాదులుకల. ముముక్షుభిః= మోక్షేచ్ఛకలవారిచేత. అంతః=లోపల. మృగ్యతే= వెదుకఁబడుచున్నాఁడో. స్థిరభక్తియోగసులభః= స్థిరమైనభక్తియోగముచేత సులభమైనవాఁడును. (అయిన) సః=ఆపురుషుఁడు. వః=మీకు. నిశ్శ్రేయసాయ=మోక్షముకొఱకు. అస్తు= అగుఁగాత॥ తా॥ వేదాంతములయందు ఏపురుషుని భూమ్యంతరిక్షములయందు వ్యాపించియున్నవానినిగాఁ జెప్పుచున్నారో. ఏయీశ్వరునియందు ప్రతిపాదింపఁబడుచున్న శబ్దము ఇతరులను బోధింపనిదగుచు యథార్థమైనఅక్షరములుకలదైయున్నదో. ఏపరమేశ్వరుఁడు నియమింపఁబడిన ప్రాణాదులుకల ముముక్షువులచేత లోపలవెదుకఁబడుచున్నాఁడో. స్థిరమైన భక్తియోగముచేత సులభుఁడైన అట్టివంటి పరమేశ్వరుఁడు మీకు శుభమునుకలుగఁజేయుటకొఱకు అగుఁగాతఅని తాత్పర్యము. అనువాక్యములచేత ఆశీర్వచనమునుచేసి యిట్లనియె. ఓరాజోత్తమా! నేను విశేషమైనకుటుంబముకలబ్రాహ్మణుఁడను. అదియునుగాక విశేషించి దరిద్రుఁడను. సర్వదేశములయందును భిక్షాటనమును చేయుచుందును. సకల[illegible]ములయందును భిక్షాటనమునుచేసినను పొట్టనిండుటలేదనినవిని విక్రమార్కమహారాజు తాను తెచ్చుచున్నయీరెండుకుండలములను ఆబ్రాహ్మణునకు సమర్పించి యిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! ఈకుండలద్వయము దినదినమందును ఒక్కొక్కభారపరిమాణముకల సువర్ణమునిచ్చును. అని రాజుచెప్పినమాటనువిని యాబ్రాహ్మణుఁడు పరమానందముకలవాఁడై విక్రమార్కమహారాజును అనేకవిధములుగా స్తోత్రమునుచేసి తనగృహమునకుఁబోయెను. అంతట విక్రమార్కమహారాజుకూడ ఉజ్జయినీపట్టణమునకు పోయెనని యీకథనుచెప్పఁగానే భోజమహారాజు ఏమియునుపలుకక మునుపటివలెనే గృహమునకుపోయెను.

ఇట్లని విక్రమార్కచరిత్రయందలి పదునెనిమిదవ ఉపాఖ్యానము ముగిసెను.

---

## —(*) పందొమ్మిదవచరిత్రము. (*)—

అంతట మరల నొకనాడు విక్రమార్కమహారాజు సింహాసనము నెక్కవలయునని యెడు తలంపుకలవాఁడై సుముహూర్తమును విచారించుకొని మునుపటివలెనే పరివారజనముతోఁ గూడవచ్చె. వచ్చి సింహాసనముమీఁద నెక్కఁబోవుచుండఁగా పందొమ్మిదవసాలభంజిక మునుపటిసాలభంజికలవలెనే నివారించి యిట్లనియె. ఓరాజోత్తమా! వినుము. విక్రమార్కమహారాజు ఈభూమిని సర్వమును పాలించుచుండఁగా సకల లోకములవారును పరమానందముకలవారై సంచరించుచుండిరి. మఱియును, బ్రాహ్మణులందఱును షట్కర్మనిరతులైయుండిరి. స్త్రీలందఱును పతివ్రతలై యుండిరి. పురుషులందఱును నూఱుసంవత్సరములు ఆయుష్యముకలవారైయుండిరి. వృక్షములు సర్వకాలములయందును ఫలకుసుమములతో నిండినవైయుండె. మేఘుఁడు తగినకాలమునందు వర్షించుచుండె. భూమి సర్వకాలములయందును సస్యసమృద్ధికలదైయుండె. ఎల్లవారికిని భూతములయందు దయకలిగియుండె. మఱియు నెల్లవారును పాపభీతియును, అతిథిసత్కారమును, గురుసేవయును, సత్పాత్రయందు దానమునుకలవారైయుండిరి. అట్లుండఁగా నొకనాఁడు విక్రమార్కమహారాజు సింహాసనాధిష్ఠితుఁడైయుండె. అప్పుడు పండితులందఱును శాస్త్రములను విచారించుచుండిరి. వందిమాగధులు అనేకవిధములగు పూర్వరాజచరిత్రములను చెప్పుచుండిరి. మల్లయుద్ధనిపుణులు తమభుజబలమును చూపిరి. మఱియును, సమానవయస్కులగు రాజకుమారులు మీసములను దువ్వుకొనుచు శరణాగతులను రక్షించువిషయమునందొకరినొకరు నవ్వుకొనుచుండిరి. మఱియును, కొందఱు పరలోకప్రీతిని కోరుచుండిరి. కొందఱు ధర్మసంగ్రహప్రాదుర్భావమునుగుఱించి చెప్పుచుండిరి. ఇవ్విధముగ నెల్లవారును ఆవిక్రమార్కమహారాజును సేవించుచుండిరి. అట్టిసమయమునందు వేటవలన జీవించునట్టి యొకపురుషుఁడువచ్చి విక్రమార్కమహారాజునకు నమస్కరించి మిగులవినయముతో నిట్లనియె. ఓరాజోత్తమా! అరణ్యమధ్యమునందు అంజనాచలముతో సమానమయిన యొక గొప్పవరాహము కొన్నిదినములనుండి సంచరించుచున్నది. అరణ్యమునందు సంచరించువారలుకూడ ఇటువంటిజంతువును వినియును, కనియును, ఉండ



లేదు. కాఁబట్టి ఈజంతువు తమవంటి రాజపురుషులచేత చూడఁదగినదైయున్నదనినవిని విక్రమార్కమహారాజు రాజకుమారులతోఁగూడ బయలువెడలి వనమునందుఁ బ్రవేశించి యొకనదిమధ్యయందున్న యొకపొదరింటియందు దాగుకొనియుండె. అట్లుండి యావరాహమునుచూచె. అనంతరమందావరాహము వేటగాండ్రయొక్క కోలాహలధ్వనినివిని గురుగురుధ్వని చేయుచు బయలువెడలె. పిమ్మట రాజకుమారులందఱును నేను నేననియెడుతలంపుతో వచ్చి తమహస్తకౌశలమును చూపుచు సకలాయుధములను ప్రయోగించిరి. ఆవరాహము ఆబాణములను లక్ష్యముచేయనిదగుచు శూరులందఱును చూచుచుండఁగా నొకపర్వతకందరమునందు ప్రవేశించె. అంతట విక్రమార్కమహారాజు దానివెంబడించిపోవుచు బయలున అశ్వమునుబంధించి తానుకూడ ఆబిలమునందుఁ బ్రవేశించె. అట్లుప్రవేశించి అతిగాఢమైన యంధకారమునందు అధికదూరముపోయి యొకచోట గొప్పప్రకాశము నొకదానిని చూచె. అనంతరమందు కొంచెముదూరముపోఁగానే సువర్ణప్రాకారముకలదియును, ఆకాశమును ఒరయుచున్నవియును, అయిన మేడలుకల యొకనగరమునుచూచె. ఆనగరము దేవతాయతనములచేతను, ఉపవనములచేతను, అలంకరింపఁబడియుండె. మఱియును, సమస్తవస్తువులతోడను నిండియున్నయంగళ్లుకలదియును, ధనికులచేత వ్యాప్తమైనదియును, నానావిధవిలాసినీసముదాయముతోఁగూడుకొనినదియును, అయి మిగులమనోహరముగానుండె. అనంతరమందు అతికష్టముగా నొకయంగళ్లమధ్యయందు పోవుచు మిగుల మనోహరములయిన శిఖరములుకలయొక రాజభవనమును చూచె. ఆభవనమునందు విరోచనుని కుమారుఁడగు బలిచక్రవర్తి రాజ్యమును చేయుచుండె. ఆసమయమునందు విక్రమార్కమహారాజు బలిచక్రవర్తియొద్దకుఁబోయె. పోయి యాసభయందుఁ బ్రవేశింపఁగానే సింహాసనమునందుఁగూర్చున్న బలిచక్రవర్తి దిగ్గనలేచి యావిక్రమార్కమహారాజును కౌఁగిలించుకొని భద్రాసనమునందుఁగూర్చుండఁబెట్టె. అనంతరమందా బలిచక్రవర్తి విక్రమార్కమహారాజుతో నిట్లనియె. ఓస్నేహితుఁడా! నీవేదేశమునందు నివసించువాఁడవు. నీపేరేమి? ఎట్టివారిచేతను పొందశక్యముకాని యిట్టిచోటునకెట్లువచ్చితివనినవిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓపురుషోత్తమా! నన్నువిక్రముఁడనిపిలుతురు. నేను ఉజ్జయినీపట్టణమునందు నివసించువాఁడను. నేనుమీదర్శనముకొఱకు ఒకానొక యడవిపందిని వెంటనంటి అతికష్టముగా ఇక్కడకువచ్చి ప్రవేశించితిననినవిని బలిచక్రవర్తి యిట్లనియె.

ఓ రాజోత్తమా! నేను ధన్యుఁడనైతిని. ఇప్పుడు నా మనోరథములన్నియును సఫలములాయెననిన విక్రమార్క మహారాజిట్లనియె. ఓ రాజోత్తమా! నీవు మిగుల పవిత్రమైన యంతఃకరణము కలవాఁడవు. నీ జీవితము సర్వవిధములచేతను కొనియాడఁదగినది. వైకుంఠనాయకుఁడగు నారాయణుఁడు సాక్షాత్తుగా నీ మార్గమును అవలంబించె. మఱియును, ఆ భగవంతునకు నీవు దానమును చేసితివి. నీకంటె మహనీయులగువారు మల్లోకములయందును నెకర్కుఁడుఁ గలరనిన బలిచక్రవర్తి యిట్లనియె. ఓ రాజోత్తమా! నీవు నాకు వాస్తవ స్నేహితుఁడవైన యెడల నా సంబంధమైన వస్తువును దేనినైన గ్రహింపుమనిన విక్రమార్కుఁడిట్లనియె. ఓ బలిచక్రవర్తీ! నేను నీ భగవదనుగ్రహమువలన పూర్ణకాముఁడనై యున్నాననిన బలిచక్రవర్తి యిట్లనియె. ఓ మిత్రుఁడా! ఈవిధముగాఁ జెప్పఁగూడదు. మఱియును,

శ్లో॥ దదాతి ప్రతిగృహ్ణాతి గుహ్యమాఖ్యాతి పృచ్ఛతి। భుఙ్క్తే భోజయతే చైవ షడ్విధం బంధులక్షణమ్॥

టీ॥ దదాతి = ఇచ్చుచున్నాఁడు. ప్రతిగృహ్ణాతి = గ్రహించుచున్నాఁడు. గుహ్యమ్ = రహస్యమును. ఆఖ్యాతి = చెప్పుచున్నాఁడు. పృచ్ఛతి = అడుగుచున్నాఁడు. భుఙ్క్తే = భుజించుచున్నాఁడు. భోజయతే = భుజింపఁజేయుచున్నాఁడు. బంధులక్షణమ్ = స్నేహలక్షణము. షడ్విధమ్ = ఆఱువిధములైనది॥ తా॥ ఇచ్చుచున్నాఁడు. గ్రహించుచున్నాఁడు. రహస్యమును చెప్పుచున్నాఁడు. రహస్యమును అడుగుచున్నాఁడు. తాను భుజించుచున్నాఁడు. భుజింపఁజేయుచున్నాఁడు. ఈయాఱును స్నేహలక్షణములని తాత్పర్యము. మఱియును,

శ్లో॥ పాపాన్నివారయతి యోజయతే హితాని గుహ్యం నిగూహతి గుణాన్ప్రకటీకరోతి। ఆపద్గతం చ న జహాతి దదాతి కాలే సన్మిత్రలక్షణమితి ప్రవదంతి సంతః॥

టీ॥ పాపాన్ = పాపములను. నివారయతి = నివర్తింపఁజేయుచున్నాఁడు. హితాని = హితములను. యోజయతే = సంధానము చేయుచున్నాఁడు. గుహ్యమ్ = దాఁచఁదగినదానిని. నిగూహతి = దాచుచున్నాఁడు. గుణాన్ = గుణములను. ప్రకటీకరోతి = ప్రకటించుచున్నాఁడు. ఆపద్గతంచ = ఆపత్తును పొందినవానిని. నజహాతి = విడువఁడు. కాలే = తగిన కాలమునందు. దదాతి = ఇచ్చుచున్నాఁడు. ఏతత్ = ఇది. సన్మిత్రలక్షణమితి = ఉత్తమస్నేహితునియొక్క లక్షణమని. సంతః = సత్పురుషులు. ప్రవదంతి = చెప్పుచున్నారు॥ తా॥ పాపములను నివర్తింపఁజేయుచున్నాఁడు. హితములను కలుగఁజేయుచున్నాఁడు. రహస్యమును దాచి



పెట్టుచున్నాఁడు. గుణములను ప్రకటించును. ఆపత్తును పొందియున్నను విడువఁడు. తగినకాలమునందు తగినవస్తువులనిచ్చుచున్నాఁడు. సజ్జనసాంగత్యలక్షణము ఇటువంటిదని సత్పురుషులు చెప్పుచున్నారని తాత్పర్యము. మఱియును,

శ్లో॥ నోపకారం వినా ప్రీతిః కస్యాపి భువి జాయతే। ఉపయాంతి చ దానేన యతో దేవా అభీష్టదాః॥

టీ॥ కస్యాపి = ఎవనికిని. ఉపకారం వినా = ఉపకారము లేక. ప్రీతిః = ప్రేమ. భువి = భూలోకమునందు. నజాయతే = పుట్టదు. యతః = ఏ హేతువువలన. దేవాశ్చ = దేవతలును. దానేన = దానముచేత. అభీష్టదాః = అభీష్టమును ఇచ్చువారై. ఉపయాంతి = సమీపించుచున్నారు॥ తా॥ లోకములో నెవ్వఁడును ఉపకారము లేకయే భూలోకమునందు ప్రీతికలవాఁడు గాఁడు. కారణమేమనిన — దేవతలుకూడ దానముతోఁగూడ కోర్కెలనిచ్చువారై సమీపించుచున్నారు కదా! అని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ తావత్ప్రీతిర్భవేల్లోకే యావద్దానం ప్రదీయతే। వత్సః క్షీరక్షయం దృష్ట్వా స్వయం త్యజతి మాతరమ్॥

టీ॥ యావత్ = ఎంతకాలము దనుక. దానమ్ = దానము. ప్రదీయతే = ఈయఁబడుచున్నదో. తావత్ = అంతకాలము వఱకును. ప్రీతిః = ప్రేమ. భవేత్ = అగును. వత్సః = దూడ. లేక బాలుడు. క్షీరక్షయమ్ = క్షీరములయొక్క నాశమును. దృష్ట్వా = చూచి. స్వయమ్ = తానుగానే. మాతరమ్ = తల్లిని. త్యజతి = విడుచుచున్నాఁడు (లేక విడుచుచున్నది)॥ తా॥ ఎంతకాలము దనుక దానము చేయఁబడుచుండునో అంతవఱకును లోకమునందు ప్రీతి కలిగియుండును. అదియుక్తమే కదా! ఎట్లనిన — లోకమునందుదూడ (లేక) పాలుత్రాగు పిల్లవాఁడు క్షీరములు నశించినతోడనె తల్లిని విడిచిపెట్టుట ప్రత్యక్షమగుచునే యున్నదికదా! అని తాత్పర్యము. మఱియును,

శ్లో॥ పుత్రాదపి ప్రియతమం నియమేన దానమ్యస్య పశోరపి వివేకవివర్జితస్య। దత్తే జలే తు సకలం ఖలు యేన దుగ్ధం నిత్యం దదాతి మహిషీ ససుతాపి వత్సమ్॥

టీ॥ వివేకవివర్జితస్య = వివేకశూన్యమైన. పశోరపి = పశువునకుఁగూడ. పుత్రాదపి = పుత్రునికంటెను. దానమ్ = దానము. నియమేన = నియమముచేత. ప్రియతమమ్ = మిగుల ప్రియమైనది. యేన = ఏ హేతువుచేత. జలే = ఉదకము. దత్తేసతి = ఈయఁబడినదగుచునుండఁగా. మహిషీ = ఎనుము. వత్సమ్ = దూడను.

వినివర్త్యంతోలఁగించి: సత్యమ్=సర్వకాలములయందును. నిఖిలమ్=సమస్తమైన. దుగ్ధమ్=క్షీరమును. దదాతి=ఇచ్చుచున్నది. తా॥ వివేకహీనమైనపశువునకుఁగూడ దానము నియమముగా పుత్రునికంటెను మిగులప్రియమైనదనితలఁచుచున్నాను. ఎందువలననగా;—ఉదకమును ఈయఁగానే (అనఁగా కుడితినీళ్ళనుపోయఁగానే) ఎనపగొడ్డు తనదూడనువిడిచిపెట్టి తన క్షీరములనన్నిటిని ఇచ్చుచున్నదని తాత్పర్యము॥ అప్రమాణములనుపట్టి ఆలోచింపుమని చెప్పి విక్రమార్కమహారాజునకొసఁగు రసమును, రసాయనమును, ఇచ్చె. అనంతరమందు విక్రమార్కమహారాజు ఆరెంటినితీసికొని ఆబలిచక్రవర్తియొక్క అనుమతినిపొంది ఆబిలమునుండిబయలువెడలివచ్చి మరలతనగృహమునకని తనపట్టణమునకుఁబోయెను. అంతట రాజవీధినివచ్చుచుండఁగా అధికమైనదుర్గతిచేత పీడింపఁబడుచున్నవాఁడును, పుత్రునితోఁగూడుకొనినవాఁడును, అయిన యొకబ్రాహ్మణుఁడువచ్చి యిట్లనియె. ఓరాజోత్తమా! నేనుఅధికమయినదారిద్ర్యముకలవాఁడను. కావున నిప్పుడునాకుటుంబపోషణకుఁ దగినధనము నిమ్ము. అధికమైనఆకలిచేత మేమందఱమును అధికముగా పీడింపఁబడుచున్నారమనినవిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! ఇప్పుడునాచేతియందు దేమియుధనములేదు. రసము రసాయనము అనునట్టిరెండు వస్తువులుకలవు. ఈరసమునుముట్టుకొనినతోడనే సప్తధాతువులును సువర్ణములునుకలుగుచున్నవి. ఈరసాయనమును సేవించుటచేత జరామరణవర్జితుఁడు కాఁగలఁడు. కాబట్టి, ఈరెంటిలోపల నీకిష్టమయినదానిని తీసికొనుమనిన ఆబ్రాహ్మణుఁడిట్లనియె. ఓరాజోత్తమా! జరామరణములులేకుండునట్లు చేయునట్టిరసమును ఇమ్మనియె. మఱియును, ఆసమయమునందు ఆబ్రాహ్మణునిపుత్రుఁడిట్లనియె. జరామరణములేని యీరసాయనమునుతిని జరామరణములులేకయుండినను మరలదారిద్ర్యమునేకదా అనుభవించుచుండవలయును. కాఁబట్టి అట్టిపదార్థమక్కఱలేదు. సప్తధాతువులను సువర్ణములుగఁజేయునట్టిదానిని గ్రహించినయెడల నుచితమని తోఁచుచున్నదనియె. ఆసమయమునందు విక్రమార్కమహారాజు ఆయిరువురియొక్కయు సంభాషణను విని ఆరసాయనరసములనురెంటిని ఇచ్చె. అంతటవయ్యిరువురును విక్రమార్కమహారాజును స్తోత్రముచేసి తమనివాసమునకుఁబోయిరి. అటుపిమ్మట విక్రమార్కమహారాజుకూడ తనగృహమునకుఁబోయెనని యీకథ చెప్పి యాసాలభంజిక భోజమహారాజుతో మరలనిట్లనియె. ఓరాజోత్తమా! ఇట్టిగుణములు నీయందుఁగలిగియున్నయెడల నీవీసింహాసనముమీఁద నెక్కుమనిన భో



జమహారాజేమియునుపలుకక పరివారజనముతోఁగూడ మునుపటివలెనే పోయెను.

ఇట్లని విక్రమార్కచరిత్రమందలి పందొమ్మిదవ ఉపాఖ్యానము ముగిసెను.

---

## ❋ ఇరువదవచరిత్రము. ❋

మరలనొకనాఁడు భోజమహారాజు సింహాసనమునెక్కుటకుఁదలఁచి మునుపటివలెనే సుముహూర్తమునువిచారించుకొని మంత్రులపురోహితాదులతోఁగూడవచ్చె. ఆసమయమునందు ఇరువదవసాలభంజిక యిట్లనియె. ఓరాజోత్తమా! విక్రమార్కమహారాజునందుఁగల యౌదార్యాదిగుణములెవ్వనియందుఁగలవో అట్టివాఁడు ఈసింహాసనమునందు కూర్చుండఁదగినవాఁడగునని విని భోజమహారాజు విక్రమార్కునియొక్క యౌదార్యాదిగుణములను జెప్పుమనినవిని యాసాలభంజికయిట్లనియె. ఓరాజోత్తమా! విక్రమార్కమహారాజు ఆఱుమాసములురాజ్యమునుచేసి ఆఱుమాసములుదేశాంతరములయందు సంచారమునుచేయుచుండును. ఇట్లుచేయుచు నొకనాఁడు నానాదేశములయందునుదిరిగి పద్మాలయమను పేరుగల నగరమునకుఁబోయెను. పోయి యానగరమునకు వెలుపలనున్నవాఁడై యానగరోపవనమునందు విమలోదకములు కలిగినటువంటి సరోవరమునుచూచి యాసరోవరమునందలి యుదకమును పానముచేసి యొకానొకతరుతలమునందు సుఖముగాఁబ్రవేశించె. అప్పుడక్కడకు అనేకులగు పరదేశులువచ్చియుండిరి. వారుయిట్లని పరస్పరమును సంభాషించుచుండిరి. ఓహో నేనుఅనేకములయిన దేశములయందు దిరుగుచుంటిని. అనేకములగుతీర్థములను సేవించితిని. అతిదుర్గములగు పర్వతములపైనెక్కితిని. మఱియునొకచోటునైనను మహాపురుషదర్శనము సంభవింపలేదు. మహాపురుషులుకలిగినచోట్లు లభ్యములగుటమిగులకష్టము. మార్గమధ్యమునందు అనేకములగువిఘ్నములువచ్చుచుండును. దేహమునకుఁగూడ ఒకానొకప్పుడు నాశముసంభవించును. దేహమునకునాశమువచ్చినట్టిప్రయత్నము ఏమిఫలముకొఱకుపనికివచ్చును. ఏమిఫలమునకును పనికిరాదు. కాబట్టి బుద్ధిమంతుఁడగువాఁడు అనేకములయినప్రయత్నములనుచేసియైనను శరీరమును కాపాడుకొనవలయును. మఱియును,

శ్లో॥ ఆపదర్థంధనంరక్షేద్దారాన్రక్షేద్ధనైరపి। ఆత్మానంసర్వదారక్షేద్దారైరపిధనైరపి॥

టీ॥ ఆపదర్థమ్=ఆపత్కాలముకొఱకు. ధనమ్=ధనమును. రక్షేత్=కాపాడవలయును. ధనైరపి=ధనములచేతఁగూడ. దారాన్=భార్యలను. రక్షేత్=రక్షింపవలయును. ధనైరపి=ధనములచేతను. దారైరపి=భార్యలచేతను. సర్వదా=సర్వకాలములయందును. ఆత్మానమ్=తనను. రక్షేత్=రక్షింపవలయును॥ తా॥ ఆపదలువచ్చినపుడు ఆపదలనుబోఁగొట్టుకొన వచ్చునని మెడుతలంపుతో ధనమునుకాపాడవలయును. అట్టిధనముచేత దారాపుత్రాదులను కాపాడవలయును. దారాపుత్రాదులచేతను, ధనములచేతను, ఆత్మను కాపాడవలయునని తాత్పర్యము॥ అనుప్రమాణానుసారముగ సర్వవిధములచేతను తనను కాపాడుకొనవలయును. మఱియును, సర్వధర్మములకును శరీరము మొదటిసాధనమై యున్నది. మఱియును,

శ్లో॥ అపిక్రియార్థంసులభంసమిత్కుశంజలాన్యపి స్నానవిధిక్షమాణితే। అపిస్వశక్త్యాతుతపఃప్రవర్తతే శరీరమాద్యంఖలుధర్మసాధనమ్॥

టీ॥ క్రియార్థమ్= యాగాదిక్రియలకొఱకు. సమిత్కుశమ్ = సమిత్తులయొక్కయు, దర్భలయొక్కయు సముదాయము. సులభమ్=సులభమైనది. తే=నీకు. జలాన్యపి=ఉదకములును. స్నానవిధిక్షమాణి= స్నానవిధికిఁదగినవై. సంతి=ఉన్నవి. స్వశక్త్యా= తనశక్తిచేత. తపః=తపస్సు. ప్రవర్తతే= ప్రవర్తించుచున్నది. తస్మాత్= అందువలన. శరీరమ్=దేహము. ఆద్యమ్=మొదటిదైన. ధర్మసాధనంఖలు= ధర్మసాధనముగదా॥ తా॥ సత్క్రియలకొఱకు సమిత్తులయొక్కయు, ధనములయొక్కయు, సముదాయము సులభముగ దొరకును. ఉదకములు స్నానవిధికిఁదగినవి. ఎన్నియున్నను తనశక్తిలేనియెడల తపస్సు ప్రవర్తింపదు. కాఁబట్టి శరీరము మొదటిధర్మసాధనమని తా॥ మఱియును,

శ్లో॥ పునర్జాయాపునర్విత్తం పునఃక్షేత్రం పునస్సుతాః। పునశ్శుభాశుభంకర్మశరీరంన పునఃపునః॥

టీ॥ పునః=మరల. జాయా= భార్యయును. పునః=మరల. విత్తమ్=ధనము. పునః=మరల. క్షేత్రమ్=భూమి. పునః=మరల. సుతాః=పుత్రులు. పునః=మరల. శుభాశుభమ్= శుభకరమును, అశుభకరమును. (అయిన) కర్మ=కర్మమును. సంభవతి= సంభవించుచున్నది. శరీరమ్= దేహము. పునఃపునః= మరలమరల. నసంభవతి= సంభవింపదు॥ తా॥ భార్యయును, ధనమును, క్షేత్రమును, పుత్రులును, శుభాశుభకర్మములును, మరలమరలసంభవించుచున్నవి. శరీరము మాత్రముమరలరాదని తాత్పర్యము॥ అనుప్రమా



ణానుసారముగ బుద్ధిమంతుఁడగువాఁడు సాహసమును చేయఁగూడదు. మఱియును,

శ్లో॥ అఫలానిదురంతాని సమవ్యయఫలానిచ। అశక్యానిచకార్యాణి నారభేతవిచక్షణః॥

టీ॥ విచక్షణః= బుద్ధిమంతుఁడగువాఁడు. అఫలాని= ఫలరహితములును. దురంతాని=దుఃఖముఅంతమునందుఁగలవియును. సమవ్యయఫలానిచ= సమములయిన ఆదాయవ్యయములు కలవియును. అశక్యాని=శక్యములుగానివియును. (అయిన) కార్యాణి=కార్యములను. నారభేత= ఆరంభింపఁగూడదు॥ తా॥ మిగుల బుద్ధిమంతుఁడగువాఁడు ఫలరహితములును, దుఃఖము అంతమునందుఁ గలవియును, సమములగు నాదాయవ్యయములు కలవియును, అశక్యములును, అయినకార్యములను ఆరంభింపఁగూడదు. మఱియును,

శ్లో॥ పర్వతంవిషమంఘోరంబహువ్యాఘ్రసమాకులం। నారోహతి నరఃప్రాప్తసంశయోహికదాచన॥

టీ॥ ప్రాప్తసంశయః= పొందఁబడినసంశయములుకల. నరః=మానవుఁడు. కదాచన= ఒకప్పుడును. విషమమ్= వ్యత్యస్తమును. ఘోరమ్= భయంకరమును. బహువ్యాఘ్రసమాకులమ్ = అనేకములయిన వ్యాఘ్రములతోఁగూడినదియును. (అయిన) పర్వతమ్= పర్వతమును. నారోహతి= ఎక్కఁగూడదు॥ తా॥ సంశయముకల మానవుఁడు ఎన్నటికిని, వ్యత్యస్తమైనదియును, మిగుల భయంకరమైనదియును, నానావిధములయిన వ్యాఘ్రములతోఁగూడుకొనినదియును, అయిన పర్వతమునెక్కఁగూడదనితాత్పర్యము. మఱియును, ఏకార్యము ముఖ్యముగా చేయఁదగినదైయున్నదో అట్టికార్యమును ఆలోచించియే చేయవలయును. మఱియును, ఏకార్యమునందు ఫలములేదో, ఏకార్యమునందు ఫలము స్వల్పమైయున్నదో అట్టికార్యమునందు శరీరమునకు నాశమేకలుగును కనుక దానినిచేయఁగూడదు. అని ఆపరదేసులలో నొక్కఁడు చెప్పుమాటలనువిని విక్రమార్కమహారాజు అతనియొద్దకుఁబోయి యిట్లనియె. ఓపరదేసులారా! ఎందుకు ఈవిధముగా మాటలాడెదరు. పురుషుఁడు సాహసమును పౌరుషమును చూపక పోయినయెడల ప్రతికార్యమును చెడిపోవును. మఱియును,

శ్లో॥ వస్తూనిదుర్లభాన్యపిలభ్యంతే వాంఛితానిసాహసికైః। సంజీవిన్యమృతాద్యాహనుమద్గరుడాదిభిర్హృతాహిఖలు॥

టీ॥ సాహసికైః= సాహసము నవలంబించువారలచేత. వాంఛితా

ని= కోరఁబడిన. వస్తూని=వస్తువులు. దుర్లభాన్యపి= దుర్లభములయినవయిన ను. లభ్యంతే= పొందఁబడుచున్నవి. సంజీవిన్యమృతాద్యాః = సంజీవిని, అమృతము, మొదలగునవి.హనుమద్గరుడాదిభిః= హనుమంతుఁడు గరుత్మంతుఁడు, మొదలగువారిచేత. హృతాహిఖలు = అపహరింపఁబడినవికదా॥ తా॥ సాహసము నవలంబించువారు కోరినవస్తువులు దుర్లభములయినవైనను సంపాదింపఁగలరు. హనుమంతుఁడు గరుత్మంతుఁడు మొదలగువారు సంజీవిని, అమృతము మొదలగువానిని సంపాదించిరఁతా॥ మఱియును,

శ్లో॥ విశతికదాచిద్గగనంఖాతాత్పాతాళతోపిజలమేతి। దైవమచిం త్యంబలవద్బలవానిహగణ్యఏవపౌరుషవాన్॥

టీ॥ దైవమ్ = దైవము. అచింత్యమ్= విచారింపనలవికాని. బలవత్= బలముకల. బలవాన్=బలవంతుఁడు. కదాచిత్= ఒకానొకప్పుడు. గగనమ్= ఆకాశమును. విశతి=ప్రవేశించుచున్నాఁడు. కదాచిత్=ఒకానొకప్పుడు. ఖాతాత్= బిలమునుండి. పాతాళతః= పాతాళలోకమునందలి. జలమ్= ఉదకమును. ఏతి=పొందుచున్నాఁడు. తస్మాత్=అందువలన. ఇహ=ఈ లోకమునందు. పౌరుషవాన్= పౌరుషముకలవాఁడు. గణ్యఏవహి=గణనచేయఁదగినవాఁడేకదా॥ తా॥ దైవము మిగుల బల్లముకలది. బలవంతుఁడగువాఁడు ఒకానొకప్పుడు ఆకాశమునందుఁ బ్రవేశించుచున్నాఁడు. ఒకానొకప్పుడు బలముద్వారా పాతాళమునందలి జలమును పొందుచున్నాఁడు. కాఁబట్టి ఈలోకమునందు పౌరుషవంతుఁడు గణనచేయఁదగినవాఁడని తా॥ మఱియును,

శ్లో॥ దురధిగమః పరభోగో యావత్పురుషేణ పౌరుషంనకృతం। హరతితులామధిరూఢో భాస్వానుద్యన్హిజలదపటలాని॥

టీ॥ యావత్= ఎంతపర్యంతము. పురుషేణ= పురుషునిచేత. పౌరుషమ్= పౌరుషము. నకృతమ్=చేయఁబడదో. తావత్= అంతపర్యంతమును. పరభోగః= సర్వోత్తమమైనభోగము. దురధిగమః = పొందశక్యమైనదికాదు. తులామ్= తులారాశిని.అధిరూఢః=అధిష్ఠించిన.భాస్వాన్=సూర్యుఁడు. ఉద్యన్=ఉదయించుచు. జలదపటలాని= మేఘపటలములను. హరతిహి=హరించుచున్నాడుకదా॥ తా॥ పురుషుఁడు ఎంతకాలముదనుక పౌరుషమునుచూపఁడో అంతపర్యంతమును సర్వోత్తమమైన భోగముపొంద శక్యమైనదికాదు. తులారాశిని అధిష్ఠించినసూర్యుఁడు ఉదయించుచునే మేఘసముదాయములను హరించుచున్నాఁడుకదాయని తాత్పర్యము॥ అను ప్రమాణవచనము



లనుపట్టి ఆలోచింపఁగా, పురుషప్రయత్నసాహసముల నవలంబింపని యెడల ఏకార్యమును లభ్యముకాదని విక్రమార్కుఁడు చెప్పిన వచనములనువిని యాపరదేశులందఱును నిట్లనిరి. ఓమహాపురుషుఁడా! నీవు ఈవిధముగా చెప్పుచున్నావుకదా? ఇప్పుడు మనచేతచేయఁదగినకార్యమేదియనిన విక్రమార్క-మహారాజు మరల నిట్లనియె. ఓజనోత్తములారా! మనమందఱమును ఇప్పుడు మహాపురుషదర్శనమును చేయవలయును. మఱియును, ఇక్కడనుండి పదిగెంౙామడదూరము పోయినయెడల అక్కడ మహారణ్యమధ్యమందు ఒక దుర్గమమైన పర్వతముకలదు. ఆపర్వతముమీద త్రికాలనాథుఁడను పేరుకల యోగిపుంగవుఁడు కలఁడు. అతఁడు సేవించినవారలకు వాంఛితార్థమునీయఁగలఁడు. నేను అక్కడకు పోవుచున్నాననినవిని యాపరదేసులందఱును నిట్లనిరి. ఓపురుషోత్తమా! నీవు పోవునెడల నీతోఁగూడ మేమందఱమును వచ్చెదమనిన విక్రమార్కుఁడు నిరాతంకముగ రండనియె. అంతట వారందఱును విక్రమార్క-మహారాజుతోఁగూడ బయలువెడలిపోవుచు మిగుల దుర్గమమైన యరణ్యమునుచూచి యిట్లనిరి. ఓమహాపురుషుఁడా ! పర్వతమెంత దూరమునందుఁ గలదనిన ఇక్కడకు ఎనిమిదామడదూరమునందున్నదనియె. ఆమాటనువిని యాపరదేసులందఱును మేము రాఁజాలము. మిగుల దూరముగనున్నది. మార్గముకూడ మిగుల విషమమైయున్నదనినవిని విక్రమార్క-మహారాజిట్లనియె. ఓవైదేశికులారా! ప్రయత్నమును చేయువారలకు దూరమేది? మఱియును,

శ్లో॥ నాత్యుచ్చంశిఖరంమేరో ర్నాతినీచంరసాతలం। వ్యవసాయప్రసక్తానాం నాతిపారోమహోదధిః॥

టీ॥ వ్యవసాయప్రసక్తానామ్ = వ్యవసాయమునందు ప్రవర్తించినవారలకు. మేరోః= మేరుపర్వతముయొక్క. శిఖరమ్= శిఖరము. నాత్యుచ్చమ్= మిగులపొడవైనదికాదు. రసాతలమ్= పాతాళలోకము. నాతినీచమ్= మిగులనీచమైనదికాదు. మహోదధిః= మహాసముద్రము. నాతినీచః= మిగులనీచమైనదికాదు॥ తా॥ ఉద్యమవంతులకు ప్రయత్నమును చేయువారలకు మేరుపర్వతముయొక్క శిఖరము మిగులపొడవైనదికాదు. పాతాళలోకము మిగులనీచమైనదికాదు. మహాసముద్రముదాట శక్యముకానిది కాదనితా ॥ మఱియును,

శ్లో॥ కోతిభారస్సమర్థానాం కఃపరఃప్రియవాదినాం। కోవిదేశస్సవిద్యానాం కిందూరం వ్యవసాయినామ్॥

టీ॥ సమర్థానామ్= సమర్థులగువారికి. అతిభారః= మిగుల భారమైన
ది. కః=ఏది. ప్రియవాదినామ్= ప్రియముగసంభాషించువారలకు. పరః=శత్రు
వు. కః=ఎవ్వఁడు. సమర్థానామ్= సమర్థులగువారికి. విదేశః= పరదేశము.
కః=ఏది? వ్యవసాయినామ్= ప్రయత్నమునుచేయువారలకు. దూరమ్= దూ
రము. కిమ్= ఏది॥ తా॥ సమర్థులగువారికి మిగులభారమైనదియేదికలదు? ఏ
దియును లేదనుట. ప్రియముగమాటలాడువారలకు శత్రుదెవ్వఁడుకలఁడు. స
మర్థులగువారికి పరదేశమేదికలదు. ప్రయత్నమును చేయువారలకు దూర
మేది? ఏదియును లేదని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ విడువక ప్ర
యత్నమును చేయువారలకు ఏదిదూరమునందుండుననియె. ఆమాటనువిని
యెల్లవారును అతనితోఁగూడబయలువెడలి మరల కొంతదూరముపోయిరి.
పోఁగాఁబోఁగా మార్గమునందు ముందర మిగుల భయంకరమైన వదనముక
లదియును, విషాగ్నినిగ్రక్కుచున్నదియును, మిగుల భయంకరమైనదియును,
అగు నొకసర్పము మార్గము నావరించుకొనియుండెను. ఆసర్పమునుచూచి
యెల్లవారును భయమునుపొందినవారై నలుదిక్కులకును పరుగిడిరి. ఆసమ
యమునందు విక్రమార్కమహారాజుమాత్రము కొంచెమైనను భయమును
పొందకపోవుచుండె. అప్పుడు ఆసర్పమువచ్చి విక్రమార్కునిచుట్టుకొని కఱ
చెను. అట్లు కరచుచున్న సర్పముచేత చుట్టఁబడిన శరీరముకలవాఁడును, విష
వేగమువలన మూర్ఛనుపొందినవాఁడును, అగుచు మిగులదుర్గమమైన యాప
ర్వతమునెక్కి త్రికాలనాథుఁడనుపేరుకల యోగినిచూచి నమస్కారమును
చేసె. యోగినిచూచుటతోడనే ఆసర్పము విక్రమార్క మహారాజును వదలి
తొలఁగిపోయెను. ఆసమయమునందు విక్రమార్కమహారాజు విషరహితుఁడ
య్యె. ఆసమయమునందు ఆయోగిపుంగవుఁ డిట్లనియె. ఓమహాపురుషుఁడా!
మిగుల ప్రమాదము కలదియును, మనుష్యసంచారము లేనిదియును, అయిన
యీప్రదేశమునకు మిగుల కష్టమునుపొంది వచ్చితివి. ఇచ్చోటున కేలవచ్చితి
వి? అనిననతఁడు ఓయోగిజనోత్తమా! నేను మిమ్ములను చూచుటకొఱకే వచ్చితినని
ననివిని యాయోగిపుంగవుఁడిట్లనియె. ఓరాజోత్తమా! అట్లయినయెడల మహా
కష్టము ననుభవించితివనిన విక్రమార్క మహారా జిట్లనియె. ఓ మునికు
లోత్తమా! కష్టమేమియును లేదు. మిమ్ములను చూచుటమాత్రముచేతనే స
కల కష్టములును నశించినవి. కష్టమనగా నెంతటిది. ఇప్పుడు నేను ధన్యుఁడనై
తిని. మహాపురుషుల సందర్శనము మిగుల దుర్లభమైనది. మఱియును,
శరీరేంద్రియములు ఎంతకాలముదనుక దృఢములై యుండునో అంతవఱకును



పుణ్యాత్ముఁడగుపురుషుఁడు ఆత్మహితమగు కార్యమును చేయవలయును. మ
ఱియును,

శ్లో॥ యావత్స్వస్థమిదంశరీరమరుజం యావజ్జరాదూరతో యావ
చ్చేంద్రియశక్తిరప్రతిహతా యావత్క్షయోనాయుషః। ఆత్మశ్రేయసితావ
దేవవిదుషా కార్యఃప్రయత్నోమహాన్ సందీప్తేభవనేతుకూపఖననం ప్రత్యు
ద్యమఃకీదృశః॥

టీ॥ ఇదమ్=ఈ. శరీరమ్=శరీరము. అరుజమ్ = రోగరహితమైనదై.
యావత్=ఎంతకాలము. స్వస్థమ్=సుఖస్థితికలదై. అస్తి=ఉన్నదో. యావత్=
ఎంతపర్యంతము. జరా=ముసలితనము. దూరతః=దూరముగా. వర్తతే=ప్ర
వర్తించుచున్నదో. యావత్=ఎంతపర్యంతము. ఇంద్రియశక్తిః=ఇంద్రియముల
సామర్థ్యము. అప్రతిహతా=అమోఘమైనది. భవతి=అగుచున్నదో. యావ
త్=ఎంతకాలము. ఆయుషః=ఆయుష్యముయొక్క. క్షయః=నాశము. నభవే
త్=కాదో. తావదేవ=అంతలోపల. విదుషా=విద్వాంసునిచేత. ఆత్మశ్రేయ
సి=తనయొక్కశ్రేయస్సునందు. ప్రయత్నః=ప్రయత్నము. కార్యః=చేయఁద
గినది. భవనే=గృహము. సందీప్తేసతి=మండుచుండఁగా. ప్రత్యుద్యమః=ప్ర
యత్నము. కీదృశః=ఎటువంటిది॥ తా॥ శరీరము స్వాస్థ్యమునుతప్పియుండక
మునుపును, ముసలితనము రాకమునుపును. ఇంద్రియశక్తి అమోఘమైయుం
డునపుడును, ఆయుష్యము క్షయింపకమునుపును, బుద్ధిమంతుఁడగువాఁడు త
నశ్రేయస్సుకొఱకు ప్రయత్నమును చేయవలయును. మఱియును, ఇట్లుగాక
ముసలితనము మొదలగునవివచ్చి పైఁబడినపిమ్మట శ్రేయస్సుకొఱకు ప్రయ
త్నమునుచేయువాఁడు అగ్నిహోత్రముచేత గృహముకాల్పఁబడుచుండఁగా
బావినిత్రవ్వుటకు యత్నించినవానితో సమానుఁడని తాత్పర్యము॥ అనివిక్రమా
ర్కుఁడుచెప్పఁగావిని యాయోగిపుంగవుఁడుప్రసన్నుఁడై అతనికొఱకు ఒకఘు
టికను, యోగదండమును, కంథనుఇచ్చి యిట్లనియె. ఓరాజోత్తమా! ఈఘు
టికచేత భూమియందు ఎన్నిరేఖలువ్రాయఁబడునో అన్నియామడలదూరము
క్షణములోపలఁ బోవచ్చును. ఈయోగదండమును దక్షిణహస్తముచేతపట్టు
కొని స్పృశించినయెడల మరణమునుపొందిన సైన్యమంతయును మరలజీవిం
చును. ఈయోగదండమును వామహస్తముచేతపట్టుకొని వైరిసైన్యమును
చూచినయెడల శత్రుసైన్యముసర్వమును నాశమునుపొందును. ఈకంథకోరి
నవస్తువులనన్నింటిని కలుగఁజేయునని చెప్పె. ఆవృత్తాంతమును సర్వమునువిని
యాయోగిపుంగవునకు నమస్కారమును చేసి యనుజ్ఞను పొంది తననగరమున

కు మరలివచ్చుచుండెను. అట్లువచ్చుచుండఁగా మార్గమధ్యమునం దొకరాజకుమారుఁడు అగ్నిమధ్యమునందు ప్రవర్తించుచు కష్టైలను బాగుచేసికొనుచుండెను. మఱియును అట్లుచేసికొనుచు మరణోన్ముఖుండైయుండెను. ఆసమయమునందు విక్రమార్కమహారాజిట్లనియె. ఓసౌమ్యుఁడా! ఏమి? ఈవిధముగాఁ జేయుచున్నావు. ఇట్లుచేయుటకు తగినకారణమును చెప్పుమనిన నారాజకుమారుఁడిట్లనియె. ఓపురుషోత్తమా! నేనొకరాజకుమారుఁడను. నారాజ్యమును దాయాదులపహరించిరి. అందువలన నేనుదరిద్రుఁడనైతిని. కాఁబట్టి నేనుమరణమునుపొందుటకు ఈకార్యమును చేయుచున్నాననినవిని విక్రమార్కమహారాజు అభయమునిచ్చి తనయొద్దనున్నఘుటికను, యోగదండమును, కంథను ఇచ్చి వానిగుణములనుచెప్పె. అనంతరమం దారాజకుమారుఁడు సంతుష్టమయినచిత్తముకలవాఁడై యావిక్రమార్కమహారాజునకు నమస్కరించి తన నగరమునకుఁబోయెను. అంతట విక్రమార్కమహారాజుకూడ తనపట్టణమునకుఁబోయెనని యీకథనుచెప్పి సాలభంజిక మరలనిట్లనియె. ఓరాజోత్తమా! నీయందిట్టిగుణములు కలిగియున్నయెడల ఈసింహాసనము నెక్కుమనినవిని భోజమహారాజు ఏమియునుపలుకక మునుపటివలెనేపోయెను.

ఇట్లని విక్రమార్కచరిత్రయందలి యిరువదవఉపాఖ్యానము ముగిసెను.

---

## (*) ఇరువదొకటిదవచరిత్రము. (*)

అంతట మరలనొకనాఁడు భోజమహారాజు సింహాసనమునెక్కఁదలఁచినవాఁడై సుముహూర్తమునువిచారించుకొని పరివారసమేతముగావచ్చె. వచ్చిమునుపటివలెనే సింహాసనమునెక్కఁబోయెను. ఆసమయమునందు ఇరువదొకటిదవగు సాలభంజికనివారించియిట్లనియె. ఓరాజోత్తమా! విక్రమార్కునియందుఁగల యౌదార్యాదిగుణములు కలవాఁడుమాత్రమే ఈసింహాసనమునెక్కఁదగునుకాని యితరుఁడెక్కఁదగఁడనిన భోజమహారాజు విక్రమార్కుని యౌదార్యాదిగుణములను చెప్పుమనిన నాసాలభంజికయిట్లనియె. ఓరాజోత్తమా! విక్రమార్కమహారాజు రాజ్యమునుచేయుచుండఁగా అతనికి బుద్ధిసింధువనుపేరుకల మంత్రిపుంగవుఁడొకఁడు కలిగియుండెను. ఆమంత్రిపుంగవునికుమారుఁడు అనర్గళుఁడనువాఁడు ఘృతోదనమునుభుజించికుమారవృత్తిచేత సంచరించుచుండెను. మఱియునుకొంచెమైనను విద్యాభ్యాసమును చేయకతిరుగుచుండెను. ఇట్లుండఁగానొకనాఁడు బాలునితండ్రియిట్లనియె. ఓరీ!



అనర్గళుఁడా! నీవునాయుదరమునుండజన్మించితివి. మిగులమత్తుఁడవైసంచరించుచున్నావు. కొంచెముగానైనను విద్యాభ్యాసమునుచేయవు మూర్ఖుఁడవైయున్నావు? వినుము.

శ్లో॥ అపుత్రస్యగృహంశూన్యం దేశశ్శూన్యోహ్యబాంధవః। మూర్ఖస్యహృదయంశూన్యం సర్వశూన్యాదరిద్రతా॥

టీ॥ అపుత్రస్య=పుత్రరహితునియొక్క. గృహమ్=గృహము. శూన్యమ్=శూన్యమైనది. అబాంధవః=బంధువులులేని. దేశః=దేశము. శూన్యః=శూన్యమైనది. మూర్ఖస్య=మూర్ఖునియొక్క. హృదయమ్=హృదయము. శూన్యమ్=శూన్యమైనది. దరిద్రతా=దారిద్ర్యము. సర్వశూన్యా=అన్నివిధములచేతను శూన్యమైనది॥ తా॥ పుత్రులులేనిగృహము సర్వశూన్యమైనది. బంధువులులేనిదేశము శూన్యమైనది. మూర్ఖునిహృదయము శూన్యమైనది. దారిద్ర్యము సర్వవిధములచేతను శూన్యమైనదని తాత్పర్యము॥ అనఃప్రమాణానుసారముగ మూర్ఖత్వము నిష్ప్రయోజనమయినదని తోఁచుచున్నది. మఱియును, నాకు నీవలనప్రయోజనమేమి? మఱియును,

శ్లో॥ కోర్థఃపుత్రేణజాతేన యోనవిద్వాన్నధార్మికః। తయాగవా కింక్రియతేయానదోగ్ధ్రీనగర్భిణీ॥

టీ॥ యః=ఏపుత్రుఁడు. విద్వాన్=విద్వాంసుఁడును. ధార్మికః=ధార్మికుఁడును. న=కాఁడో. తేన=అటువంటి. జాతేన=పుట్టిన. పుత్రేణ=పుత్రునితో. అర్థః=ప్రయోజనము. కః=ఏమి? యా=ఏగోవు. నదోగ్ధ్రీ=(పాలను) పిండదో. నగర్భిణీ=గర్భముకలదికాదో. తయా=అటువంటి. గవా=గోవుచేత. కింక్రియతే=ఏమిచేయఁబడుచున్నది॥ తా॥ ఈనకకట్టకయుండునట్టి గోవులవలన ప్రయోజనమేమియును ఎట్లులేదో అటులనే ధార్మికుఁడును, విద్వాంసుఁడునుకానిపుత్రునివలన ప్రయోజనమేమియును లేదనితాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ వరంగర్భస్రావో వరమృతుషునైవాభిగమనం వరంజాతః ప్రేతో వరమపిచకన్యైవజనితా। వరంవంధ్యాభార్యా వరమగృహవాసేసివసనం నచేద్విద్వాన్ కశ్చిద్ద్రవిణమదయుక్తోపితనయః॥

టీ॥ కశ్చిత్=ఒకానొకఁడైన. తనయః=కుమారుఁడు. ద్రవిణమదయుక్తోపి=ధనమదముతోఁ గూడుకొనియున్నవాఁడైనప్పటికిని. విద్వాన్=విద్వాంసుఁడు. నచేత్=కానియెడల. గర్భస్రావః=గర్భస్రావము. వరమ్=ఉత్తమము. ఋతుషు=ఋతుదినములయందు. నైవాభిగమనమ్=(భార్యను) పొంద

కపోవుట. వరమ్=శ్రేష్ఠము. జాతః=పుట్టినవాఁడు. ప్రేతశ్చేత్=మరణమును పొందినయెడల. వరమ్=మంచిది. కన్యైవ=కన్యయే. జనితా యది=పుట్టినయెడల. వరమ్=శ్రేష్ఠము. భార్యా=భార్య. వంధ్యా చేత్=గొడ్డురాలయినయెడల. వరమ్=శ్రేష్ఠము. అగృహవాసే=అరణ్యమునందు. వాసః=నివాసము. వరమ్=శ్రేష్ఠమైనది॥ తా॥ ధనమదములు కలవాఁడైనను కుమారుఁడు విద్వాంసుఁడు కాకుండెనేని అటువంటి పుత్రుఁడు కలుగుటకంటె గర్భస్రావము మిగుల శ్రేష్ఠము. అంతకంటె ఋతుదినములయందు భార్యను పొందకపోవుట యుత్తమము. అంతకంటె పుట్టఁగానే మరణమును పొందుట మంచిది. అంతకంటె నాఁడుబిడ్డ పుట్టుట యుత్తమము. అంతకంటె భార్య గొడ్డురాలగుట మంచిది. అంతకంటె తండ్రియగువాఁడు గృహస్థాశ్రమధర్మము నవలంబింపకుండుట యుత్తమమని తాత్పర్యము॥ అను ప్రమాణ వచనములను పట్టి ఆలోచింపగా నీవలన గొంచెమైనను ప్రయోజనము లేదనిన విని యాయనర్గళుఁడు పశ్చాత్తాపముచేత మిగులఁ బరితాపమును పొందినవాఁడై వైరాగ్యమును పొంది మఱియొక దేశమునకుఁ బోయెను. పోయి యాదేశాంతరమందు ఒకానొకయుపాధ్యాయుని యొద్దకుఁ బోయి చిరకాలము విద్యాభ్యాసమును చేసి మరల నిజనగరమునకు వచ్చుచుండెను. వచ్చునపుడు మార్గమధ్యమునం దొకదేవాలయమును చూచెను. ఆదేవాలయమునకు సమీపమునందు శ్రేష్ఠములగు పద్మములచేత నలంకరింపఁ బడినదియును, చక్రవాకద్వంద్వములచేత ప్రకాశింపఁజేయఁబడినదియును, నిర్మలోదకము కలదియును, అయిన యొకసరోవరముండెను. ఆసరోవరమునం దొకచోట నుదకము మిగుల తాపమును పొందుచుండెను. ఈవిషయమును సర్వమును చూచి ఆయనర్గళుఁడు ఆరాత్రి యక్కడనే నివసించెను. అంతఁ గొంతసేపటికి సూర్యాస్తమయమయ్యె. అనంతరమందు అర్ధరాత్రసమయమునందు ఆసంతప్తోదకమధ్యమునుండి యెనిమిదిమంది దివ్యాంగనలు బయలువెడలి వచ్చిరి. అంతనా యెనిమిదిమందియును దేవాలయములోనికిఁ బోయి యాదేవునకు ఆవాహనాది షోడశోపచారములను చేసి నృత్తగీతాదులచేత దేవునకు సంతోషమును కల్పించిరి. అనంతరమందా దేవుఁడు సంతోషమును పొంది వారలకనుగ్రహము నొసంగెను. ఈవిషయమును సర్వమును అనర్గళుఁడనువాఁడు చూచుచుండఁగా ప్రాతఃకాలమునందు పోవుసమయమున నాదివ్యాంగనలచేత చూడఁబడియెను. అప్పుడా స్త్రీలలో నొకర్తె యిట్లనియెను. ఓసౌమ్యుఁడా! నీవు మాతోఁగూడ రమ్ము? మాపట్టణమునకు పోదమనియెను. ఆమాటను విని ఆయనర్గళుఁడు దానితోఁగూడ పోవుచుండెను. అంతటఁ గొంతసేపటికి ఆతప్తోదకమ-



ధ్యమందా స్త్రీలు పోవుచుండఁగా తాను పోజాలక భయమును పొంది తిరిగి తననగరమునకు వచ్చి తండ్రి మొదలుగాఁగల బంధువులనందఱను చూచెను. పిమ్మట మఱుదినమునందు విక్రమార్కమహారాజు యొక్క దర్శనము కొఱకుఁ బోయి యారాజునకు నమస్కరించి చూచెను. అంతట నావిక్రమార్కమహారాజు అతని విద్యాదులకు సంతసిల్లి యిట్లనియెను. ఓయనర్గళుఁడా! ఇన్నిదినములు నీ వెక్కడ నివసించితివనిన విని యనర్గళుఁ డిట్లనియెను. ఓరాజోత్తమా! విద్యాభ్యాసము కొఱకు దేశాంతరమునకుఁ బోతిననిన విక్రమార్కమహారాజు ఏయే దేశమునందే యేమి విశేషములను చూచితివనియెను. అంతట నాయనర్గళుఁడు తాను మార్గమునందు చూచిన తప్తోదకసరస్సు యొక్క వృత్తాంతమును చెప్పె. ఆవృత్తాంతమును సర్వమును విని యాయనర్గళునితోఁగూడ అక్కడకుఁ బోయెను. అక్కడకు పోయిన కొంతసేపటికి సూర్యుఁడు అస్తమయమును పొందెను. అంతట నర్ధరాత్రసమయమునందు ఆయెనిమిదిమంది దివ్యస్త్రీలును ఆతప్తోదకసరస్సుననుండి బయలువెడలి వచ్చి యాదేవుని యొద్దకుఁ బోయి పూజాదికమును చేసి నృత్తగీతవాద్యాదులచేత ఆదేవునకు సంతోషమును కల్పించి ప్రాతఃకాలమునందు మరల పోవుచుండిరి. ఆసమయమునందా యెనిమిదిమందిలో నొకర్తె విక్రమార్కమహారాజును చూచి యిట్లనియెను. ఓసౌమ్యుఁడా! మాతోఁగూడ రమ్ము? మానగరమునకు పోదమనిన విక్రమార్కమహారాజు మంచిదనియెను. అంతట నాస్త్రీలందఱును ఆవేడినీళ్లమడుగునందు ప్రవేశించి పాతాళలోకమునందలి తమపట్టణమునకుఁ బోయిరి. విక్రమార్కమహారాజుకూడ వారలతోఁగూడ ఆవేడినీళ్లమడుగునందు ప్రవేశించి పాతాళలోకమునందలి వారలపట్టణమునకుఁ బోయెను. అనంతరమందు ఆస్త్రీలందఱును చూచి యోపురుషోత్తమా! నీసేవను చేసెదమని చెప్పిరి. ఆమాటను విని విక్రమార్కమహారాజిట్లనియెను. ఓకన్యకలారా! నాకంటె నితరుఁడగు రాజు లేఁడా? నేను ఈదేశమునందలి కుతూహలమును చూచుటకొఱకు వచ్చితిని కాని యిక్కడ నివసించుటకు వచ్చినవాఁడను కాననిన నాకన్యకలందఱును ఇట్లనిరి. ఓమహాపురుషా! మేమందఱమును ప్రసన్నుల మైతిమి. వరమును కోరుమనిన విక్రమార్కమహారాజిట్లనియెను. ఓకన్యకలారా! మీరలెవ్వరనిన నాకన్నియలిట్లనిరి. ఓరాజోత్తమా! మేము సర్వోత్తమమైన సిద్ధికలవారమనిన విని విక్రమార్కమహారాజిట్లనియెను. ఓకన్నియలారా! మీరు ప్రసన్నతను పొందినయెడల నాకెనిమిది విధములగు సిద్ధులను కలుగఁజేయుఁడనియెను. ఆవచనమును విని ఆయెనిమిదిమందియును, ఎనిమిదిరత్నములనిచ్చిరి. అనంతరమందు అష్ట

సిద్ధులను కలుగఁజేయునట్టి యెనిమిదివిధములగు రత్నములనుగ్రహించి యా తప్తోదకమునుండి బయలువెడలి తనపట్టణమునకు వచ్చుచుండె. అట్లు వచ్చుచుండఁగా, మార్గమధ్యమునం దొకబ్రాహ్మణుఁడువచ్చి,

శ్లో॥ ఉత్పన్నో నాభికమలే హరేర్యశ్చతురాననః । సపాతుసతతం యుష్మాన్వేదానామర్థపారగః॥

టీ॥ హరేః= నారాయణునియొక్క. నాభికమలే= నాభికమలమునందు. యః-ఏ. చతురాననః= బ్రహ్మదేవుఁడు. ఉత్పన్నః=పుట్టెనో. వేదానామ్= వేదములయొక్క. అర్థపారగః= అర్థముయొక్క అంతమును తెలిసికొనిన. సః=ఆబ్రహ్మదేవుఁడు. సతతమ్=సర్వకాలములయందును. యుష్మాన్= మిమ్ములను. పాతు=రక్షించుఁగాత॥ తా॥ నారాయణునియొక్క నాభికమలమునందుఁ బుట్టినవాఁడును, వేదములయొక్క అర్థమును సర్వమును తెలిసినవాఁడును, అయినచతురాననుఁడు సర్వకాలములయందును మీకుశుభములను కలుగఁజేయుఁగాత అని తాత్పర్యము॥ అను మంత్రమును చెప్పి యాశీర్వచనమును జేసి మఱియు నిట్లనియె.

శ్లో॥ శూరస్సురూపస్సుభగస్సుదృక్చ శాస్త్రార్థవిదాం వరిష్ఠః। అర్థం వినానైవకలాకలాపం ప్రాప్నోతి మర్త్యోఽత్ర మనుష్యలోకే॥

టీ॥ శూరః= శూరుఁడును. సురూపః=మంచిరూపముకలవాఁడును. సుభగః= సుభగుఁడును. సుదృక్చ=మంచి తెలివికలవాఁడును. శాస్త్రార్థవిదామ్= శాస్త్రార్థవేత్తలలోపల. వరిష్ఠః=ఉత్తముఁడును. (అయిన) మనుష్యః= మనుష్యుఁడు. అత్ర=ఈ. మనుష్యలోకే=మనుష్యలోకమునందు. అర్థంవినా= ద్రవ్యములేకయే. కలాకలాపమ్= విద్యాభూషణమును. నైవప్రాప్నోతి-పొందఁడు॥ తా॥ మనుష్యుఁడు శూరుఁడును, సుందరుఁడును, మంచి తెలివికలవాఁడును, శాస్త్రార్థములను తెలిసినవారలలో నుత్తముఁడును. అయినను ఈమానవలోకమునందు అర్థములేనిది కలాకలాపమును పొందఁజాలఁడని తా॥ మఱియును,

శ్లో॥ తానీంద్రియాణ్యవికలాని తదేవనామ సాబుద్ధిరప్రతిహతా వచనంతదేవ। అర్థోష్మణా విరహితః పురుషః క్షణేన సోఽప్యన్య ఏవ భవతీతి విచిత్రమేతత్॥

టీ॥ అవికలాని= వికలతనుపొందని. ఇంద్రియాణి= ఇంద్రియములు. తాని= అవియే. నామ=బుద్ధి. తదేవ=అదియే. అప్రతిహతా=అమోఘమైన. బుద్ధిః= బుద్ధి. సైవ=అదియే. వచనమ్=వాక్యము. తదేవ-అదియే. పురుషః=



పురుషుఁడు. అర్థోష్మణా= ధనమనియెడునుబ్బచేత. విరహితశ్చేత్ = శూన్యుఁడయ్యెనేని. క్షణేన=క్షణమాత్రముచేత. సోఽపి=ఆమనుష్యుఁడును. అన్య ఏవ= ఇతరుఁడే. భవతి=అగుచున్నాఁడు. ఇతి=ఇట్లని. ఏతత్= ఇది. విచిత్రమ్= విచిత్రము॥ తా॥ మునుపటి యింద్రియములే అయినను, మునుపటినామధేయమే అయినను, అమోఘమైనదే అయినను, పురుషుఁడు ధనహీనుఁడయ్యెనేని క్షణమాత్రములోపల ఇతరుఁడగుచున్నాఁడనుట మిగుల విచిత్రముగనున్నదని తాత్పర్యము॥ అను వచనములను చెప్పి మఱియు నిట్లనియె. ఓరాజోత్తమా! నేను మహాదారిద్ర్యముచేత పీడితుఁడనై అనేకులగు పుత్రపౌత్రాదులతోఁ గూడుకొనినవాఁడనైయున్నాను. అందువలన కుటుంబమును భరింపఁజాలక గంగాప్రవేశమును చేయుదమని తలఁచి పోవుచున్నాను. కాఁబట్టి యోరాజోత్తమా! నాదారిద్ర్యమును నివారింపుమనిన విక్రమార్కమహారాజు ఆమాటలనువిని ఆబ్రాహ్మణునకా యెనిమిదిరత్నములను ఇచ్చె. పిమ్మట తనపట్టణమునకుఁబోయెను. ఆబ్రాహ్మణుఁడును పరమానందమును పొంది తనగ్రామమునకుఁబోయెనని యీకథను చెప్పి యాసాలభంజిక మరల నిట్లనియె. ఓరాజోత్తమా! నీయందిట్టియౌదార్యాది గుణములు కలిగియున్న యెడల ఈసింహాసనముమీఁదఁగూర్చుండుమనినవిని భోజమహారాజేమియును పలుకక పరివారజనముతోఁగూడ మరలిపోయెను.

ఇట్లని విక్రమార్కచరిత్రయందలి ఇరువదొకటి ఉపాఖ్యానము ముగిసెను.

---

## ❋ ఇరువదిరెండవచరిత్రము. ❋

మరల నొకనాఁడు భోజమహారాజు సింహాసనమునెక్కఁదలఁచి పరివారజనముతోఁగూడవచ్చి సింహాసనమునెక్కుట కుద్యమించె. ఆసమయమునందు మఱియొకసాలభంజిక యిట్లనియె. ఓరాజోత్తమా! విక్రమార్కునియందుఁగల యౌదార్యాదిగుణములు నీయందున్నయెడల ఈసింహాసనముపై నెక్కుమనిన భోజమహారాజు విక్రమార్కునియొక్క యౌదార్యాది గుణములను చెప్పుమనినసాలభంజికయిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కమహారాజు రాజ్యమును చేయుచుండఁగా ఒకనాఁడు భూసంచారమును చేయుటకొఱకు బయలువెడలి నానాదేవాలయ తీర్థపర్వతాదికమును చూచి యొకానొకనాఁడు మహారత్నమయమైన ప్రాకారముచేత చుట్టఁబడినదియును, ఆకాశమును నొరయుచున్న మేడలచేత అలంకరింపఁబడినది

యును, హరిహరనాథుని యాలయముచేత పవిత్రమైనదిగాఁ జేయఁబడినది యును, అయిన యొకనగరమునుచూచె. చూచి యానగరమునందుఁ బ్రవేశించిన పిమ్మట ఆపట్టణమునకు సమీపమునందున్న నారాయణాలయములోనికిఁబోయి అక్కడనున్న సరోవరమునందు స్నానమునుచేసి యాదేవునకు నమస్కారమునుచేసి యిట్లనియె.

శ్లో॥ మయాజ్ఞాతంజగన్నాథ మౌనమేవ జగత్థ్సలే। కోజానాతిపరంబ్రహ్మ హరింవాచామగోచరమ్॥

టీ॥ హేజగన్నాథ= ఓజగన్నాథుఁడా! పరంబ్రహ్మ= పరబ్రహ్మస్వరూపుఁడవును. వాచామ్=వాక్కులకు. అగోచరమ్= గోచరుఁడవుకానివాఁడవును. హరిమ్= భక్తులపాపములను హరించువాఁడవును. (అయిన) నిన్నును. కః=ఎవ్వఁడు. జానాతి= తెలిసికొనుచున్నాఁడు. (ఎవ్వఁడును తెలియఁజాలఁడు.) తస్మాత్=అందువలన. జగత్థ్సలే= భూలోకమునందు. మౌనమ్=మౌనము. శ్రేష్ఠమ్= శ్రేష్ఠమైనది. ఇతి=ఇట్లని. మయా=నాచేత. జ్ఞాతమ్= తెలియఁబడినది॥ తా॥ ఓజగన్నాథుఁడా ! పరబ్రహ్మస్వరూపుఁడవును, వాక్కులకు అగోచరుఁడవును, భక్తులపాపములను హరించువాఁడవును, అయిన నిన్ను నెవ్వఁడు తెలియఁగలఁడు. ఎవ్వఁడును తెలియఁజాలఁడు. కాఁబట్టి భూలోకమునందు మౌనము నవలంబించుట యుచితమని తెలిసికొంటి ననితా॥ మఱియును,

శ్లో॥ నాన్యంవదామిన శృణోమినచింతయామి నాన్యంస్మరామిన భజామినచాశ్రయామి। ముక్త్వాత్వదీయ చరణాంబుజమాదరేణ శ్రీశ్రీనివాస పురుషోత్తమదేహిదాస్యమ్॥

టీ॥ శ్రీనివాస= సంపత్కరురాలయిన లక్ష్మీదేవికి నివాసభూతుఁడవును. పురుషోత్తమ=పురుషశ్రేష్ఠుఁడవును. (అయిన) ఓహరిహరనాథా! త్వదీయచరణాంబుజమ్= నీపాదపద్మములను. ముక్త్వా=వదలి. ఆదరేణ=ఆదరముచేత. అన్యమ్= ఇతరుని. నవదామి=చెప్పను. నశృణోమి= వినను. నచింతయామి = ఆలోచింపను. అన్యమ్=ఇతరుని. నస్మరామి= స్మరింపను. నభజామి=సేవింపను. నచాశ్రయామి=ఆశ్రయింపను. దాస్యమ్= దాస్యమును. దేహి=ఇమ్ము॥ తా॥ సంపత్కరురాలయిన లక్ష్మీదేవికి నివాసభూతుఁడవును, పురుషోత్తముఁడవును, అయినయోనారాయణా! నీపాదపద్మములను విడిచిపెట్టి ఆదరముచేత ఇతరునితో మాటలాడను. ఇతరునికథలను వినను. ఇతరులను గుఱించి యాలోచింపను. ఇతరులనుస్మరింపను. ఇతరులనుసేవించి



ఇతరులను ఆశ్రయింపను. కాఁబట్టినాకునీదాస్యమునిమ్మని తా॥ మఱియును,

శ్లో॥ కరచరణకృతంవా కర్మవాక్కాయజంవా శ్రవణనయనజంవా మానసంవాపరాధం। విహితమవిహితంవా సర్వమేతత్క్షమేథా జయజయకరుణాబ్ధే శ్రీపతేశ్రీముకుంద॥

టీ॥ కరుణాబ్ధే=దయకుసముద్రునివంటివాఁడవును. శ్రీపతే=లక్ష్మీదేవికి యజమానుఁడవును. (అయిన) హేముకుంద=ఓనారాయణుఁడా! కరచరణకృతంవా=కరచరణములచేత చేయఁబడిన. కర్మవా=కర్మమునైనను. వాక్కాయజమ్=వాక్కాయములవలనఁగలిగిన. కర్మవా=కర్మమునైనను. మానసమ్=మనోసంబంధమైన. అపరాధంవా=అపరాధమునైనను. విహితంవా=విహితకర్మమునైనను. అవిహితంవా=అవిహితమైనకర్మమునైనను. ఏతత్=ఈ. సర్వమ్=సమస్తమును. క్షమేథాః=క్షమింపుము. జయజయ = సర్వోత్తముఁడవై యుండుము॥ తా॥ కరుణకుసముద్రునివంటివాఁడవును, లక్ష్మీదేవికియజమానుఁడవును అయినయోముకుందా! కరచరణములచేత చేయఁబడినదియును, వాక్కాయములచేత చేయఁబడినదియును, శ్రవణనేత్రములవలన చేయఁబడినదియును, మనోజన్యమును అయిన యపరాధమును సర్వమునుక్షమింపుము. నీవుసర్వోత్తముఁడవుకనుక నీకునమస్కారమును చేసెదనని తాత్పర్యము. అనువచనము మొదలుగాఁగలవచనములచేత స్తోత్రమును జేసి యందలిరంగమంటపమునందు విశ్రమించె. అప్పుడచ్చోటననఁగా రాజునకుసమీపమునందొకబ్రాహ్మణుఁడుకూర్చుండె. ఆసమయమునందు విక్రమార్కమహారాజు ఆబ్రాహ్మణునితో నిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! నీవేదేశపువాఁడవనిన బ్రాహ్మణుఁడిట్లనియె. నేనొకబ్రాహ్మణుఁడను. తీర్థయాత్రను చేయుచున్నాను. నీవెక్కడనుండివచ్చితివి? ఎక్కడకుఁబోవుచున్నావు? అనినవిక్రమార్కమహారాజిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! నేనునునీవలె తీర్థయాత్రముగఁదిరుగు నట్టి యొకబ్రాహ్మణుఁడనినవిని యాబ్రాహ్మణుఁడు విక్రమార్కమహారాజును చక్కఁగగమనించిచూచి యిట్లనియె. ఓపురుషోత్తమ! నీవుసామాన్యబ్రాహ్మణుఁడవని తోఁచుచుండలేదు. మిగులఁ దేజోవంతుఁడవై కనఁబడుచున్నావు. నీయందు రాజలక్షణములన్నియును కనఁబడుచున్నవి. నీవురాజసింహాసనమునకుఁ దగినవాఁడవు. నీవేమినిమిత్తముగ భూమియందంతటనుపాదచారివై సంచరించుచున్నావు? ఇవ్విధముగనడుగనేల. దైవాజ్ఞనెవ్వఁడతిక్రమింపఁగలఁడు. లలాటమునందువ్రాసినవ్రాత నెవ్వఁడునుఅతిక్రమింపఁజాలఁడు. మఱియును,

శ్లో॥ త్రిలోకేశశ్శార్ఙ్గీ శబరశరలక్ష్యత్వమగమద్విధాతా లోకానామలభత శిరఃకృంతనవిధిం। ప్రయాతౌ తౌ రాహోర్దినకరశశాంకౌ కబళతాం ప్రభుర్నగ్నశ్శంభుశ్శిరసి లిఖితం లంఘయతి కః॥

టీ॥ త్రిలోకేశః=ముల్లోకములకును అధిపతియైన. శార్ఙ్గీ=కృష్ణుడు. శబరశరలక్ష్యత్వమ్=శబరుని బాణమునకు లక్ష్యమగుటను. అగమత్=పొందెను. లోకానామ్=లోకములకు. విధాతా=నిర్మాతయగు బ్రహ్మదేవుడు. శిరఃకృంతనవిధిమ్=శిరశ్ఛేదవిధిని. అలభత=పొందెను. తౌ=ప్రసిద్ధులయిన. దినకరశశాంకౌ=సూర్యచంద్రులు. రాహోః=రాహువునకు. కబళతామ్=కబళత్వమును. ప్రయాతౌ=పొందిరి. ప్రభుః=ప్రభుడు. (అయిన) శంభుః=శివుడు. నగ్నః=దిగంబరుడు. అభవత్=ఆయెను. శిరసి=శిరస్సునందు. లిఖితమ్=వ్రాయబడిన దానిని. కః=ఎవ్వడు. లంఘయతి=అతిక్రమించుచున్నాడు॥ తా॥ ముల్లోకములకును అధిపతియగు శ్రీకృష్ణుడు శబరుని బాణమునకు పాలయ్యె. లోకములను నిర్మించినట్టి బ్రహ్మదేవుడు శిరశ్ఛేదరూపమగు శిక్షను పొందె. ప్రసిద్ధులగు సూర్యచంద్రులు రాహువునకు కబళత్వమును పొందిరి. పరమేశ్వరుడగు శివుడు దిగంబరుడయ్యె. కాబట్టి నుదుటవ్రాతను ఎవ్వడు అతిక్రమింపగలడు. ఎవ్వడును అతిక్రమింపజాలడని తాత్పర్యము. మఱియును,

శ్లో॥ హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి। లలాటలిఖితా రేఖా పరిమార్ష్టుం న శక్యతే॥

టీ॥ హరిణాపి=విష్ణువుచేతనైనను. హరేణాపి=శివునిచేతనైనను. బ్రహ్మణాపి=బ్రహ్మదేవునిచేతనైనను. సురైరపి=దేవతలచేతనైనను. లలాటలిఖితా=లలాటమునందు వ్రాయబడిన. రేఖా=రేఖ. పరిమార్ష్టుమ్=తుడుచుటకొఱకు. నశక్యతే=శక్యముకాదు॥ తా॥ విష్ణుదేవుడయినను, పరమశివుడయినను, బ్రహ్మదేవుడైనను, నుదుటవ్రాసినవ్రాతను తుడిచివేయుటకొఱకు సమర్థులు కారని తాత్పర్యము॥ అని యాబ్రాహ్మణుడు చెప్పినమాటలను విని విక్రమార్కమహారాజు అంగీకరించి యిట్లనె.

శ్లో॥ యుక్తియుక్తముపాదేయం వచనం బాలకాదపి। విదుషామపి తత్త్యాజ్యమయుక్తం పద్మజన్మనా॥

టీ॥ బాలకాదపి=బాలునివలననైనను. యుక్తియుక్తమ్=యుక్తితోఁగూడుకొనిన. వచనమ్=వాక్యము. ఉపాదేయమ్=స్వీకరింపదగినది. పద్మజన్మనాపి=బ్రహ్మదేవునిచేతనైనను. అయుక్తమ్=అనుచితమైన. తత్=ఆవచనము. విదుషామ్=విద్వాంసులకు. త్యాజ్యమ్=విడువదగినది॥ తా॥ బాలుఁడు చె



ప్పినను యుక్తియుక్తముగనున్న యెడల అంగీకరింపదగినదే కాని విడువదగినది కాదు. బ్రహ్మదేవుడు చెప్పినను యుక్తియుక్తముగనుండని వాక్యమును విడువవలయునని తాత్పర్యము. అని చెప్పి యావిక్రమార్కమహారాజు మరల నిట్లనియె. ఓ బ్రాహ్మణోత్తమా! అధికముగా అలసినవానివలెఁ గనఁబడుచున్నావు. నీ వీవిధమైన శ్రమను పొందుటకు కారణమేమి? చెప్పుమనిన నా బ్రాహ్మణుఁ డిట్లనియె. ఓ పురుషోత్తమ! నాశ్రమకు తగిన కారణమును చెప్పెదను. నేను అధికమయిన కష్టమును పొందినవాఁడనైతిని. ఇక్కడకు అతిదూరమునందు నీలమను పేరుకల పర్వతము కలదు. అక్కడనొక్క చిన్న పాతాళబిలము కలదు. ఆబిలముయొక్క మధ్యమందు కామాక్షి యను పేరుకల దేవత నివసించియున్నది. మఱియు నాబిలముయొక్క మధ్యమం దొకరసకుంభము కలదు. ఆరసముచేత సకలధాతువులును సువర్ణత్వమును పొందుచున్నవి. నేను పదిరెండు సంవత్సరములు కామాక్షిమంత్రజపమును చేసితిని. అప్పటికిని బిలద్వారము తెరవఁబడలేదు. అందువలన మిగుల దుఃఖముకలవాఁడనైతిననిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓ బ్రాహ్మణోత్తమా! నాకాచోటును చూపుము. చూపినయెడల నేనేదైన యుపాయమును చేసెదననిన విని యాబ్రాహ్మణుఁడు విక్రమార్కమహారాజున కాస్థానమును చూపె. అంత నాదినము రాత్రి యాదేవత స్వప్నమునందు విక్రమార్కునకిట్లనియె. ఓ రాజోత్తమ! నీ వేమి నిమిత్తముగ నిక్కడకు వచ్చితివి. ముప్పదిరెండగు రాజలక్షణములుకల పురుషునియొక్క కంఠరక్తముచేత సేచనమును చేసినయెడల ఈబిలద్వారము తెరవఁబడుననిన విని విక్రమార్కమహారాజు తెలిసికొని బిలద్వారసమీపమునకు పోయి తనకంఠమును ఛేదించుటకొఱకు ప్రయత్నించె. అంతలోపల ఆదేవత ప్రసన్నురాలై యిట్లనియె. ఓ సాహసప్రియుఁడా! నేను నీకు ప్రసన్నురాలనైతిని. వరమును కోరుమనిన విని యావిక్రమమహారాజిట్లనియె. ఓ మహాదేవీ! నీవు ప్రసన్నురాలవైనయెడల ఈరసకుంభమును నాకిమ్ము? అనిన విని యాదేవత మంచిదనుచు నాబిలముయొక్క ద్వారమును తెరిచె. తెరిచిన వెంటనే యారాజోత్తముఁడు ఆరసకుంభమును బయలునకుఁ దీసి యాబ్రాహ్మణునకిచ్చె. అంతట నాబ్రాహ్మణుఁడు విక్రమార్కమహారాజును స్తోత్రముచేసి తననివాసమునకుఁ బోయె. అంతట విక్రమార్కమహారాజుకూడ తనపట్టణమునకుఁ బోయెనని యీకథను చెప్పి యాసాలభంజిక మరల నిట్లనియె. ఓ భోజమహారాజా! నీయందు ఇటువంటి యౌదార్యాదిగుణములు కలిగియున్నయెడల ఈ సింహాసనము నెక్కుము. లేనియెడల నూరకుండుమనిన విని భోజమహారాజు

మియును పలుకక తలవంచుకొని పరివారజనముతోఁగూడ మరలిపోయె.

ఇట్లు విక్రమార్క చరిత్రయందలి ఇరువదిరెండవ ఉపాఖ్యానము ముగిసెను.

---

## —— (*) ఇరువదిమూడవ చరిత్రము. (*) ——

మరలనొకనాఁడు భోజమహారాజు సింహాసనము నెక్కఁదలఁచినవాఁడై సుముహూర్తమును విచారించుకొని పరివారజనముతోఁగూడ బయలువెడలివచ్చె. వచ్చి సింహాసనము నెక్కఁబోవుచుండఁగా ఇరువదిమూఁడవ సాలభంజిక యిట్లనియె. ఓ రాజోత్తమా! నీకీ సింహాసనముమీఁద నెక్కవలయునని కోరిక యధికముగాఁ గలిగియున్నది. ఇట్లుండుట యుచితము కాదు. ఈసింహాసనముమీఁద విక్రమార్కమహారాజునకు సమానుఁడగువాఁడెక్కఁదగును గాని ఇతరుఁ డెక్కఁదగఁడు. ఆవిక్రమార్కమహారాజుయొక్క గుణములను జెప్పెదను. వినుము. విక్రమార్కమహారాజు రాజ్యమును చేయుచుండఁగా నొకప్పుడు భూమియందంతటను తిరిగి నిజనగరమునకు వచ్చె. ఆసమయమునందు నగరవాసులందఱును పరమానందమును పొందిరి. అంతట విక్రమార్కమహారాజు తనయొక్క శుద్ధాంతఃపురమునందుఁ బ్రవేశించి మధ్యాహ్నసమయమునందు సుగంధతైలాక్తుఁడై స్నానమును చేసి పిమ్మట వస్త్రాభరణాదులచేత నలంకరింపఁబడినవాఁడగు దేవుని బూజించి.

శ్లో॥ త్వమేవ మాతా చ పితా త్వమేవ త్వమేవ బంధుశ్చ గురుస్త్వమేవ। త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ త్వమేవ సర్వం మమ దేవ దేవ॥

టీ॥ దేవదేవ=ఓ దేవోత్తమా! త్వమేవ=నీవే. మాతా=తల్లివి. త్వమేవ=నీవే. పితా=తండ్రివి. త్వమేవ=నీవే. బంధుః=బంధువు. గురుశ్చ=గురువును. త్వమేవ=నీవే. విద్యా=విద్య. త్వమేవ=నీవే. ద్రవిణమ్=ధనము. త్వమేవ=నీవే. మమ=నాకు. సర్వమ్=సమస్తము॥ తా॥ ఓ దేవోత్తమా! మాకు తండ్రియును, తల్లియును, బంధువును, గురుఁడవును, విద్యయును, ధనమును, మఱియును, సర్వమును నీవేయని తాత్పర్యము. మఱియును,

శ్లో॥ నమో నమః కారణకారణాయ నారాయణాయామితవిక్రమాయ। శ్రీశార్ఙ్గచక్రాసిగదాధరాయ నమో నమస్తే పురుషోత్తమాయ॥

టీ॥ కారణకారణాయ=కారణమయినదానికి కారణుఁడవును. అమితవిక్రమాయ=అపరిమితమయిన పరాక్రమము కలవాఁడవును. శ్రీశార్ఙ్గచక్రాసిగదాధరాయ=లక్ష్మిని, ధనుస్సును, చక్రమును, ఖడ్గమును, గదను, ధరించిన



వాఁడవును. పురుషోత్తమాయ=పురుషశ్రేష్ఠుఁడవును. (అయిన) నారాయణాయ=నారాయణునికొఱకు. నమోనమః=నమస్కారము॥ తా॥ కారణమైన పదార్థమునకుఁగూడ కారణుఁడును, అపరిమితమైన పరాక్రమము కలవాఁడును, లక్ష్మిశార్ఙ్గచక్రాసిగదలను ధరించినవాఁడును, పురుషోత్తముఁడును, జగన్నివాసుఁడును, అయిన నారాయణునికొఱకు నమస్కారమును చేసెదనని తాత్పర్యము॥ అను మంత్రములచేత తనకులదేవతను స్తోత్రము చేసి సాష్టాంగనమస్కారము నాచరించి గోభూహిరణ్యాదిదానములను చేసి దీనులు అంధులు, గ్రుడ్డివారలు, కుంటివారలు, మొదలగువారికి, భూరిదక్షిణలనిచ్చి భోజనగృహమునందుఁ బ్రవేశించి బాలసువాసినీవృద్ధాదులకు సమగ్రముగ నన్నదానమును చేసె. అనంతరమందు ఆవిక్రమార్కమహారాజు బంధువులతోఁగూడ భోజనమును చేసె. ఇట్లు చేయుట యుచితమే కదా? మఱియును,

శ్లో॥ బాలాస్సువాసినీర్వృద్ధా గర్భిణ్యాతురకన్యకాః। సంభోజ్యాతిథివృద్ధాంశ్చ దంపత్యోశ్శేషభోజనమ్॥

టీ॥ బాలాః=బాలికలను. సువాసినీః=సువాసినీస్త్రీలను. వృద్ధాః=వృద్ధులను. గర్భిణ్యాతురకన్యకాః=గర్భిణీస్త్రీలను, రోగులను, కన్నియలను. అతిథివృద్ధాంశ్చ=అతిథులను, వృద్ధులను. సంభోజ్య=భోజనమును చేయించి. శేషభోజనమ్=మిగిలినయన్నము. దంపత్యోః=దంపతులకు. ఉచితమ్=తగినది. భవేత్=అగును॥ తా॥ బాలురను, వృద్ధులను, గర్భిణీస్త్రీలను, రోగులను, కన్నియలను, అతిథులను, వృద్ధులను, భుజింపఁజేసి మిగిలినయన్నమును దంపతులకుఁ బెట్టవలయునని తా॥ మఱియును,

శ్లో॥ ఏక ఏవ న భుంజీయాద్యదీచ్ఛేద్వృద్ధిమాత్మనః। ద్విత్రైస్తు బంధుభిస్సాకం భోజనం కారయేన్నరః॥

టీ॥ ఆత్మనః=తనకు. వృద్ధిమ్=అభివృద్ధిని. ఇచ్ఛేద్యది=కోరినయెడల. ఏక ఏవ=ఒక్కఁడే. న భుంజీయాత్=భోజనమును చేయఁగూడదు. నరః=మానవుఁడు. ద్విత్రైః=ఇద్దఱు ముగ్గురగు. బంధుభిస్సాకమ్=బంధువులతోఁగూడ. భోజనమ్=భోజనమును. కారయేత్=చేయవలసినది॥ తా॥ తనకు మేలు కలుగవలయునని యెడు తలంపుకలవాఁడు ఒక్కఁడే భోజనమును చేయఁగూడదు. మఱియేమనిన ఇద్దఱు ముగ్గురు బంధువులతోఁగూడ భోజనమును చేయవలయునని తా॥ మఱియును,

శ్లో॥ అభీష్టఫలసంసిద్ధిరిష్టకామ్యార్థసంపదః। ద్విత్రైస్తు బంధుభి

స్సాకంభోజనేనప్రజాయతే॥

టీ॥ అభీష్టఫలసంసిద్ధిః= ఇష్టఫలప్రాప్తియును. ఇష్టకామ్యార్థసంపదః= కోరినకోర్కెలును, సంపదలును, ద్విత్రైః= ఇద్దఱుముగ్గురగు. బంధుభిస్సాకమ్= బంధువులతోఁగూడ. భోజనేన=భోజనముచేత. ప్రజాయతే= కలుగుచున్నవి॥ తా॥ ఇష్టమైనఫలముయొక్క సిద్ధియును, ఇష్టకామ్యార్థసంపదలును, ఇద్దఱుముగ్గురుబంధువులతోఁగూడ భోజనముచేయుటచేత కలుగుచున్నవని తాత్పర్యము॥ అనునట్టి శాస్త్రానుసారముగ భోజనమును చేయుచుండెను. అనంతరమందు కొంతకాలముకొన్నియడుగులుతిరిగికూర్చుండెను. మఱియును,

శ్లో॥ భుక్త్వోపవిశతో మందం భుక్త్వాసంవిశతస్సుఖం। ఆయుష్యం
క్రమమాణస్యమృత్యుర్ధావతిధావతః॥

టీ॥ భుక్త్వా= భోజనమునుచేసి. మందమ్=మెల్లగా. ఉపవిశతః=కూర్చుండువానికిని. భుక్త్వా=భోజనమునుచేసి. సుఖమ్= సుఖమును. సంవిశతః= పొందుచున్నవానికిని. భుక్త్వా=భోజనమునుచేసి. క్రమమాణస్య = మెల్లగా సంచరించుచున్నవానికిని. ఆయుష్యమ్=ఆయుష్యమును. భవేత్=అగును. భుక్త్వా=భోజనమునుచేసి. ధావతః=పరుగెత్తుచున్నవానికి. మృత్యుః = మృత్యువు. ధావతి=పరుగెత్తుచున్నది॥ తా॥ భోజనమునుచేసినపిమ్మట మెల్లగాఁ గూర్చుండుటచేతను, భోజనానంతరమందు మెల్లగా సుఖమునుపొందువానికిని, భోజనానంతరమందు మెల్లమెల్లగా నడచువానికిని, ఆయుష్యమభివృద్ధిని పొందును. మఱియును, భోజనమునుచేసినవెంటనే పరుగెత్తువానికి మరణదేవతసమీపించివచ్చునని తా॥ మఱియును,

శ్లో॥ అత్యంబుపానాదతిమైథునాచ్చ దివాచసుప్తేర్నిశిజాగరాచ్చ।
నిరోధనాన్మూత్రపురీషయోశ్చషడ్భిర్నిదానైః ప్రభవంతిరోగాః॥

టీ॥ అత్యంబుపానాత్= అత్యధికముగా ఉదకమును పానమునుచేయుటవలనను. అతిసంగమాచ్చ= అత్యధికమయిన స్త్రీసంయోగమువలనను. దివాచ= పగటియందు. సుప్తేః=నిద్దురవలనను. నిశి= రాత్రియందు. జాగరాచ్చ= జాగరణమువలనను. మూత్రపురీషయోః= మూత్రపురీషములయొక్క. నిరోధనాత్= నిరోధమువలనను. షడ్భిః=ఈయాఱగు. నిదానైః=కారణములచేత. రోగాః=రోగములు. ప్రభవంతి=పుట్టుచున్నవి॥ తా॥ అత్యధికముగా ఉదకపానమును చేయుటవలనను, అత్యధికముగా స్త్రీసంయోగమును పొందుటవలనను, పగటియందు నిద్రించుటవలనను, రాత్రియందు మేలుకొనియుండుటవలనను, మూత్రపురీషములను నిర్బంధించుటవలనను, రోగములుకలుగునని తాత్పర్యము॥ అను శాస్త్రార్థమునెఱిఁగి యావిక్రమార్కమహారాజు సంచరించుచుండెను. మఱియు నావిక్రమార్కమహారాజు సమానవయోవిద్యావైభవములుకల స్నేహితులతోఁగూడ సంభాషించుచుండఁగా సూర్యాస్తమయమయ్యె. అంతట నావిక్రమార్కమహారాజు సాయంకాలమునందు చేయఁదగిన కర్మకలాపమును నెరవేర్చి భోజనమునుచేసి యనంతరమందు శయనగృహమునకుఁబోయెను. పోయిచంద్రకిరణములవలె తెల్లనిదగు వస్త్రముచేత వ్యాప్తమైనదియును, పరిమళించుచున్న పుష్పములచేత వ్యాప్తమైనదియును, నిగుడవిచిత్రమైన చాందినీకలదియును, అయినశయ్యయందుసుఖముగా పరుండెను. అంతట సూర్యోదయమునకు పూర్వమునందు తానుమహిషారూఢుఁడై దక్షిణదిక్కునకుపోవుచున్నట్లు కలఁగని త్రుళ్ళిపడి మేల్కాంచివిష్ణుదేవుస్మరించెను. అనంతరమందు సంధ్యావందనాది కర్మములనునెరవేర్చి సింహాసనమునందుఁగూర్చుండి బ్రాహ్మణులముందర తనస్వప్నమునందలి వృత్తాంతమును సర్వమును తెలియఁజేసెను. ఆవృత్తాంతమును సర్వమును చెప్పినవిని యాబ్రాహ్మణులలో సర్వజ్ఞభట్టుఁడను పేరుకల బ్రాహ్మణుఁ డిట్లనియె. ఓరాజోత్తమా! స్వప్నములు రెండువిధములు. అందుకొన్నిశుభాశుభఫలమునిచ్చుచున్నవి. కొన్నిఅశుభఫలము నిచ్చుచున్నవి. అందుశుభకరములయిన స్వప్నములెవ్వియనిన?

శ్లో॥ ఆరోహణం గోవృషకుంజరాణాం ప్రాసాద శైలాగ్రవనస్పతీనాం। విష్ఠానులేపోరుదితం నితాంతంశుభాన్యగమ్యాగమనంతథైవ॥

టీ॥ గోవృషకుంజరాణామ్= గోవులయొక్కయు, వృషభములయొక్కయు, ఏనుఁగులయొక్కయు. ప్రాసాదశైలాగ్రవనస్పతీనామ్= మేడలయొక్కయు, శైలాగ్రములయొక్కయు, వృక్షములయొక్కయు. ఆరోహణమ్= అధిష్ఠించుటయును. (అనఁగాఎక్కుటయును) విష్ఠానులేపః = అమేధ్యమును. శరీరమునందుపూసికొనుటయును. నితాంతమ్= ఎడతెగని. రుదితమ్= రోదనమును. అగమ్యాగమనమ్= పొందఁగూడని స్త్రీలనుపొందుటయును. (అనునవి) శుభాని= శుభకరములయినవి॥ తా॥ గోవులమీదను, వృషభములమీదను, ఏనుఁగులమీదను, మేడలమీదను, పర్వతాగ్రములమీదను, వృక్షములమీదను, ఎక్కినట్లును, అమేధ్యమును శరీరమునందు పూసికొనినట్లును, అధికముగా రోదనమును చేసినట్లును, పొందఁగూడని స్త్రీలనుపొందినట్లును, కలయందుతోచిన వెడల శుభములుకలుగునని తా॥ మఱియును,

శ్లో॥ ఆరోహణం కంటకవృక్ష వాహావైర్యుష్ట్రికాణామథదర్శనాని। కార్పాసతీవ్రోరగపోత్రిశాఖా మృగాదికానా మశుభానిలోకే॥

టీ॥ కంటక...కానామ్— కంటకవృక్ష= ముండ్లచెట్లయొక్కయు. వాహావైరి= మహిషములయొక్కయు. ఉష్ట్రికాణామ్= ఒంటెలయొక్కయు. ఆరోహణమ్= ఎక్కుటయును. అథ=లేక. ఏతేషామ్= వీనియొక్క. దర్శనాని= దర్శనములును. కార్పాస...కానామ్— కార్పాస=ప్రత్తి. తీవ్రోరగ=తీవ్రమైనసర్పము. పోత్రి=అడవిపంది. శాఖామృగ= వానరములు. అదికానామ్= మొదలగువానియొక్క. దర్శనాని= దర్శనములును. లోకే=లోకమునందు. అశుభాని= అశుభకరములు॥ తా॥ ముండ్లచెట్లు మహిషములు, ఒంటెలు, ప్రత్తి, తీవ్రసర్పము, అడవిపంది, వానరములు మొదలగువానిమీద ఎక్కినట్లుగాని, వీనినిచూచినట్లుకాని కలనుకనినయెడల అమంగళములు కలుగునని తా॥ మఱియును,

శ్లో॥ ఖరోష్ట్రమహిషవ్యాఘ్రాన్స్వప్నేయస్త్వధిరోహతి। షణ్మాసాభ్యంతరేతస్య మృత్యుర్భవతినిశ్చయః॥

టీ॥ యః=ఎవ్వఁడు. స్వప్నే=స్వప్నమునందు. ఖరోష్ట్రమహిషవ్యాఘ్రాన్= గాడిదెలను, ఒంటెలను, మహిషములను. వ్యాఘ్రములనుఅధిరోహతి= ఎక్కుచున్నాఁడో. తస్య= అట్టివానికి. షణ్మాసాభ్యంతరే= ఆఱుమాసములయొక్క మధ్యకాలమునందు. మరణమ్=మరణము. భవతి= అగుచున్నది. నిశ్చయః= యధార్థము॥ తా॥ లోకములోనే మానవుఁడు స్వప్నమునందు గాడిదెలను, ఒంటెలను, మహిషములను, వ్యాఘ్రములను, ఎక్కుచున్నాఁడో అట్టివాఁడు ఆఱుమాసముల కాలములోపల మరణమును పొందుచున్నాఁడని తా॥ మఱియును,

శ్లో॥ స్వప్నస్తుప్రథమేయామే సంవత్సరవిపాకభాక్। ద్వితీయేచాష్టభిర్మాసైస్త్రిభిర్మాసైస్తృతీయకే॥ అరుణోదయవేళాయాం దశాహేనఫలంభవేత్। గోవిసర్జనవేళాయాం సద్యస్స్వప్నఫలంభవేత్॥

టీ॥ ప్రథమే= మొదటిదైన. యామే=యామమునందు. స్వప్నస్తు=స్వప్నమైతే. సంవత్సరవిపాకభాక్= సంవత్సరమునకు ఫలమునుకలుగఁజేయునది. భవేత్=అగును. ద్వితీయే=రెండవయామమునందు. అష్టభిః= ఎనిమిదగు. మాసైః=మాసములచేత. ఫలతి= ఫలించుచున్నది. తృతీయకే=మూఁడవయామమునందు. త్రిభిః= మూఁడయిన. మాసైః= మాసములచేత. ఫలతి= ఫలించుచున్నది. అరుణోదయవేళాయామ్= అరుణోదయకాలమునందు. దశా



హేన= పదిదినములచేత. ఫలమ్= ఫలము. భవేత్= అగును. గోవిసర్జనవేళాయామ్= గోవులను విడిచిపెట్టు సమయమునందు. సద్యః, తత్క్షణమునందే. ఫలమ్= ఫలము. భవేత్=అగును॥ తా॥ మొదటియామమునందు కలిగినస్వప్నము సంవత్సరమునకు ఫలమును కలుగఁజేయును. రెండవయామమునందుఁగలిగినస్వప్నము ఎనిమిదిమాసములకు ఫలమునుకలుగఁజేయును. మూఁడవయామమునందుఁ గలిగినస్వప్నము మూఁడుమాసములకు ఫలమునుకలుగఁజేయును. అరుణోదయసమయమునందు అనఁగా నాల్గవయామమునందు పదిదినములకు ఫలముకలుగును. గోవిసర్జనవేళయందు తత్కాలమునందే ఫలమును కలుగఁజేయునని తాత్పర్యము॥ అను ప్రమాణవచనములను చెప్పి మఱియు నిట్లనియె. ఓరాజోత్తమా! ఈదుస్స్వప్నము నీకుఅరిష్టమునుకలుగఁజేయునదియైయున్నదనిన విని విక్రమార్కమహారాజిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! ఈదుస్స్వప్నమునకు ప్రాయశ్చిత్తమునేమియనినసర్వజ్ఞభట్టుఁడిట్లనియె. ఓరాజోత్తమా! స్నానమునుచేసివస్త్రాలంకారాదులచేత అలంకరింపఁబడినవాఁడవగుచు నేతియందు ముఖమునుచూచి యావస్త్రాదికమును బ్రాహ్మణునకీయవలయును. అట్లుచేసి మరలవస్త్రాదికమునుధరించి దేవునకభిషేకమును చేయించి నవరత్నములచేతను పూజించి బ్రాహ్మణులకు గోదానము మొదలుగాఁగల దశదానములను చేయవలయును. మఱియును, దీనాంధబధిరపంగువులకొఱకు భూరిదానమును చేయవలయును. అనంతరమందు బ్రాహ్మణాశీర్వాదమును పొందవలయును. ఇవ్విధముగఁ జేసినయెడల దుస్స్వప్నమువలనఁ గలిగెడు దుష్టఫలముకలుగకుండఁబోవుననినవిని విక్రమార్కమహారాజు ఆసర్వజ్ఞభట్టుఁడు చెప్పినవిధముగాఁజేసె. మఱియును, మూఁడుదినములవఱకును ధనాగారమునందలి ధనమును సర్వమును పంచిపెట్టె. మఱియును, యాచకులుకోరినవస్తువులనన్నింటిని ఇచ్చెనని యీకథనుచెప్పి యాసాలభంజిక యిట్లనియె. ఓరాజోత్తమా! నీయందు ఇటువంటియౌదార్యాదికమున్నయెడల ఈసింహాసనముమీద నెక్కుమనినవిని భోజమహారాజేమియును పలుకక నిజగృహమునకుఁబోయె.

ఇట్లని విక్రమార్కచరిత్రయందలి ఇరువదిమూఁడవ ఉపాఖ్యానము ముగిసెను.

---

—(*) ఇరువదినాల్గవచరిత్రము. (*)—

మరల నొకనాఁడు భోజమహారాజు ఆసింహాసనముమీద నెక్కఁదలఁ

చినవాఁడై సుముహూర్తమును విచారించుకొని పరివారజనముతోఁగూడవచ్చి యాసింహాసనముమీద నెక్కుటకుద్యమించె. ఆసమయమునందు మఱియొకసాలభంజిక యిట్లనియె. ఓరాజోత్తమా! ఈసింహాసనముమీద నెక్కుటకు విక్రమార్కునివంటివాఁడు తప్ప ఇతరుఁడుతగఁడనినవిని భోజమహారాజుమరల నిట్లనియె. ఓసాలభంజికా! విక్రమార్కునియొక్క గుణములను చెప్పుమనిన సాలభంజిక మరల నిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కుఁడు రాజ్యమును చేయుచుండఁగా పురందరపురియను పేరుకల యొకనగరము కలదు. ఆపట్టణమునందు మిగులధనికుఁడైన వర్తకుఁడొకఁడు కలఁడు. వానికి నలుగురుపుత్రులుకలరు. అంతటఁ గొంతకాలము కడచుచుండఁగా వృద్ధుఁడయిన యావైశ్యునకు మరణకాలముసమీపించె. అప్పుడు ఆవైశ్యుఁడు తననలుగురు పుత్రులనుపిలిచి యిట్లనియె. ఓపుత్రులారా! నేను మరణమును పొందినపిదప మీరునలుగురును మిత్రులైయుందురో యుండరోయని సందేహముకలిగియున్నది. నేను మరణమును పొందినపిమ్మట మీరునల్వురును విరోధమునుపొందుదురు. కాఁబట్టి నేనుబ్రదికియుండఁగానే మీకు జ్యేష్ఠానుక్రమముగా విభాగమును చేసియిచ్చెదను. నామంచముయొక్క క్రిందిభాగమునందు నాధనమును సర్వమును పెట్టితిని. కావున మీరు నలువురును జ్యేష్ఠానుక్రమముగ నాలుగు మంచపుకోళ్ళక్రిందనుకల ద్రవ్యమునుతీసికొనుఁడనిచెప్పి యతఁడుమరణమును పొందె. అనంతరమందు అతనిపుత్రులు నలువురును ఒకయాసముదినములు ఒక్కచోట నివాసమునుచేసిరి. పిమ్మట వారిభార్యలు మెల్లమెల్లగాకలహమునకుప్రారంభించిరి. ఆసమయమునందు జ్యేష్ఠుఁడిట్లనియె. మనమీవిధముగా కోలాహలమును చేయనేల? మననాయనగారే మనకు భాగనిర్ణయమును చేసె. కాఁబట్టి మంచముక్రిందనున్నద్రవ్యము మనమునలువురమునుతీసికొనిసుఖముగానుందము. ఆమాటనువిని యానల్వురును మంచిదనుచు ఆమంచముక్రిందద్రవ్విరి. ఆసమయమునందా నాలుగుకోళ్ళక్రిందను నాలుగు తామ్రసంపుటములు కనఁబడియె. ఆనాలుగుసంపుటములలో నొకదానియందు మన్నును, మఱియొకదానియందు బొగ్గులును, మఱియొకదానియందు ఎముకలును, మఱియొకదానియందు పలాలమును (నూర్చినగడ్డి) కలిగియుండె. ఈనాలుగు వస్తువులనుచూచి యానలువురును మిగుల నాశ్చర్యమునుపొందినవారై దమలోఁదామిట్లనిరి. ఆహా! ఇది మిగులవిచిత్రముగనున్నది. మనతండ్రిగారు మిగుల తెలివికలవాఁడగుటచేత ననేకవిధములగు వస్తువులను పంచియిచ్చె. ఈ నాలుగువస్తువులను మనతండ్రిగారు మనకు పంచియిచ్చుటకు తగినకారణము



తెలియకున్నదనియనుకొని యానలువురును రాజసభలోనికిఁబోయి యావృత్తాంతమును తెలియఁజేసిరి. ఆవృత్తాంతమునువిని యాసభలోని వారెవ్వరును దానియర్థమును తెలియఁజేయఁజాలకపోయిరి. అంతట నానలువురు ప్రతినగరమునకును బోవుచు అక్కడక్కడనున్న ప్రాజ్ఞులతో నావృత్తాంతమును తెలియఁజేసిరి. ఎవ్వఁడును ఆవిషయమునకు తగిన యభిప్రాయమును చెప్పక పోవుటచేత క్రమక్రమముగ నుజ్జయినీ పట్టణమునకుఁ బోయిరి. పోయి యావృత్తాంతమును విక్రమార్కుని సభలోనికిపోయి తెలియఁజేసిరి. విక్రమార్క మహారాజును దానియభిప్రాయము తెలియదనియె. అనంతరమం దానలువురును ప్రతిష్ఠానగరమునకుఁ బోయి అందలిజనులతో నావృత్తాంతమును తెలియఁజేసిరి. వారును దానియభిప్రాయమును తెలిసికొనలేక పోయిరి. పోయి యాపట్టణమునందున్న జనుల కావృత్తాంతమును తెలిపిరి. వారును దానియభిప్రాయమును తెలిసికొనలేక పోయిరి. ఆసమయమునందు కుంభకారుని గృహమునందున్న శాలివాహనుడనువాఁడీవృత్తాంతమును తెలిసికొని యచ్చోటునకు వచ్చి యందలి బ్రాహ్మణులతోడను, మహాజనులతోడను ఇట్లనియె. ఓమహాజనులారా! ఇక్కడదుర్బోధమైన విషయమేదికలదనిన విని వారందఱును ఈవిషయమునందు మాకు తాత్పర్యమేదియును తెలియలేదు. కాఁబట్టి ఈవిభాగక్రమము నీకు తెలిసిన యెడల చెప్పుమనిన శాలివాహనుఁ డిట్లనియె. ఓమహాజనులారా! ఈనల్వురును ఒకనికేపుత్రులు. కాఁబట్టి వీరితండ్రి యీనలుగురికిని తనచేత సంపాదింపఁబడిన ధనమును సర్వమును పంచియిచ్చె. ఎట్లనిన?— ఎవనిభాగములో మన్నువచ్చినదో వాఁడు తనచేత సంపాదింపఁబడిన భూమిని గ్రహింపవలసినదనియును, ఎవ్వనిభాగమునందు నూర్చినగడ్డివచ్చినదో వాఁడు ధాన్యమును సర్వమును గ్రహింపవలసినదనియును, ఎవ్వని భాగమునందు ఎముకలువచ్చినవో వాఁడు గోధనములనన్నిఁటిని గ్రహింపవలసినదనియును, ఎవ్వనిభాగమునందు బొగ్గులువచ్చినవో వాఁడు సువర్ణమును సర్వమును గ్రహింపవలసినదనియును, విభజించియిచ్చెననియె. అంతట నావైశ్యుని పుత్రులు మిగుల సంతోషమునుపొంది తమనగరమునకుఁ బోయిరి. ఈవృత్తాంతమును సర్వమును వినివిక్రమార్కమహారాజుఆశ్చర్యమునుపొందిప్రతిష్ఠానగరమునందలిమహాజనుల కిట్లని యొకయుత్తరమును వ్రాసె. ఎట్లనిన?— స్వస్తిశ్రీయజనయాజనాధ్యాపన దానప్రతిగ్రహ షట్కర్మనిరతులును, యమనియమాదిగుణగరిష్ఠులును, ప్రతిష్ఠానగరవాసులును, అయిన మహాజనులను ముందుగా

కుశలవార్తనడిగి విక్రమార్క మహారాజు విన్నవించునదియేమనినః- మీనగరమునందు వైశ్యపుత్రులకు నలువురికిని విభాగనిర్ణయమును చేసినవానిని నాయొద్దకుఁ బంపఁగోరుచున్నాఁడను. అనివిజ్ఞాపన పత్రికనువ్రాసి యాపత్రికను ప్రతిష్ఠానగరమునకుఁబంపెను. అంతనాపత్రికను చదువుకొని యానగరమునందలి మహాజనులు శాలివాహనుని పిలిపించి యిట్లనిరి. ఓశాలివాహనుఁడా! రాజాధిరాజమహారాజశ్రీ వీరప్రతాపశాలి ప్రత్యర్థిపృథ్వీపతి నమస్కృతచరణ సహస్రపత్ర శ్రీవిక్రమాదిత్య మహారాజు ఉజ్జయినీ నగరమందు నివసించువారలకు కల్పవృక్షమువంటివాఁడు. ఆమహారాజునిన్నుఁ పిలుచుచున్నాఁడు. కావున నీవు అచ్చోటునకుఁబొమ్మనినవిని శాలివాహనుఁ డిట్లనియె. ఓమహాజనులారా! విక్రమార్కుఁడన నెంతటివాఁడు. అతనిచేత పిలువఁబడినంత మాత్రముచేత నేను పోవువాఁడనుగాను. అతనికి నాతోడ ప్రయోజనమున్నయెడల వానినేయిక్కడకు రమ్మనుఁడనినవిని యామహాజనులందఱును ఈవిషయమును పత్రికాద్వారా తెలియఁజేసిరి. అనంతరమందు విక్రమార్క మహారాజు ఆపత్రికను చదువుకొని క్రోధోద్దీపితుఁడై పదునెనిమిది యక్షౌహిణుల సంఖ్యకల సైన్యముతోఁగూడ బయలువెడలి ప్రతిష్ఠానగరమునకువచ్చి దూతనుపంపెను. అంతనాదూతవచ్చి శాలివాహనునిచూచి యిట్లనియె. ఓశాలివాహనుఁడా! సకల రాజాధిరాజగు విక్రమార్క మహారాజు నిన్నును పిలుచుచున్నాఁడు. అతనిదర్శనముకొఱకు రమ్మనినవిని శాలివాహనుఁడిట్లనియె. ఓరీ! నేనొంటరిగావచ్చి విక్రమార్కునిచూడను. చతురంగబలముతోడనుకూడుకొనివచ్చి విక్రమార్కుని చూచెదననినవిని యావృత్తాంతమును మరల విక్రమార్క మహారాజునకుఁ జెప్పెను. అంతట విక్రమార్క మహారాజుసంగరరంగమునకుఁబోయెను. అప్పుడు శాలివాహనుఁడునుకుంభకారగృహమునందు మన్నుతో చేయఁబడియున్న చతురంగబలమును మంత్రముచేత జీవింపఁజేసి అట్టి చతురంగసైన్యముతోడను కూడుకొనినవాఁడై యుద్ధరంగమునకు బయలువెడలెను. ఆసమయమునందు॥

శ్లో॥ దిక్చక్రంచలితంభయాజ్జలనిధిర్జాతోభృశంవ్యాకులః పాతాళేచకితోభుజంగమపతిః పృథ్వీధరాఃకంపితాః। భ్రాంతాసాపృథివీమహావిషధరాఃక్ష్వేళంవమంత్యుత్కటం। ఏవంవృత్తమభూజ్జగజ్జనపతేస్సర్వంచ సైన్యనిర్గమే॥

టీ॥ దిక్చక్రమ్- దిక్కులసముదాయము. చలితమ్- చలింపఁజేయఁబడినది. భయాత్- భయమువలన. జలనిధిః- సముద్రుఁడు. భృశమ్- అత్యంతమును. వ్యాకులః-వ్యాకులమైనవాఁడు. జాతః-ఆయెను. పాతాళే - పాతాళలోకమునందు. భుజంగమపతిః- ఆదిశేషుఁడు. చకితః-భయమునుపొందినవాఁడు. ఆసీత్-ఆయెను. పృథ్వీధరాః-పర్వతములు. కంపితాః - కంపమునుపొందింపఁబడినవి. అభూవన్-అయినవాయెను. సా-ప్రసిద్ధమైన. పృథివీ-భూమి. భ్రాంతా-భ్రాంతమైనది. ఆసీత్-ఆయెను. మహావిషధరాః-అత్యధికములయిన సర్పములు. ఉత్కటమ్-అధికముగా. క్ష్వేళమ్-విషమును. వమంతి- క్రక్కుచున్నవి. జనపతేః- శాలివాహనునియొక్క. సైన్యనిర్గమే- సైన్యముయొక్క కదలికయందు. సర్వమ్- సమస్తమైన. జగత్-లోకము. ఏవమ్- ఈవిధముగా. అభూత్-ఆయెను॥ తా॥ ఆశాలివాహనునియొక్క సైన్యము బయలువెడలిన కాలమునందు దిక్కులయొక్క సముదాయమంతయును మిగుల భయమునుపొందెను. సముద్రుఁడు మిగులవ్యాకులమైనవాఁడయ్యె. పాతాళలోకమునందు ఆదిశేషుఁడు అధికముగా భయమునుపొందెను. పర్వతములన్నియును, భూమితోఁగూడ గడగడవణఁకెను. అత్యధికములయిన సర్పములు అధికముగావిషమును క్రక్కుచుండెను. లోకమంతయును, ఈవిధముగా మిగుల నల్లకల్లోలమయ్యెనని తా॥ మఱియును,

శ్లో॥ పవనగతిసమానై రశ్వయూథైరనంతైర్మదధరగజయూథైరాజతేసైన్యలక్ష్మీః। ధ్వజరుచిరపతాకైరావృతంఖం సమస్తం పటుపటహనినాదైఃపూర్యతేస్మత్రిలోకీ॥

టీ॥ పవనగతిసమానైః- వాయువేగముతో సమానమైనవేగముకలవియును. అనంతైః-అనేకములును. (అయిన) అశ్వయూథైః - అశ్వసముదాయములచేతను. అనంతైః- అనేకములయిన. మదధరగజయూథైః- మదమునుధరించిన యేనుఁగులయొక్క సముదాయములచేతను. సైన్యలక్ష్మీః- సైన్యసంపద. రాజతే-ప్రకాశించుచున్నది. ధ్వజరుచిరపతాకైః- ధ్వజములయొక్క సుందరములయిన టెక్కెములచేత. సమస్తమ్-సమస్తమైన. ఖమ్- ఆకాశము. ఆవృతమ్- ఆవరింపఁబడెను. త్రిలోకీ- లోకత్రయసముదాయము. పటుపటహనినాదైః- సమర్థములయిన తప్పెటలను నట్టివాద్యవిశేషములయొక్క ధ్వనులచేత. పూర్యతేస్మ- నిండింపఁజేయఁబడెను॥ తా॥ వాయువేగమువంటి వేగముకలవియును, అనేకములును, అయిన గుఱ్ఱములచేతను, మదమును స్రవింపఁజేయుచున్న అనేకములయిన యేనుఁగులచేతను, సైన్యసంపద ప్రకాశించుచున్నది. ధ్వజములయందలి మనోహరములయినపతాకములచేత ఆకాశమంతయును, వ్యాప్తమైనది. మిగుల సమర్థములయిన

తెప్పెటలచేత మహాదులోకములయొక్క సముదాయమును నిండింపఁబడుచున్నదని తా॥ మఱియును,

శ్లో॥ అశ్వాంఘ్య్రిత్థితరేణుభిర్బహుతరైర్వ్యాప్తం త్వశేషంనభశ్ఛత్రైరావృతమంతరాళమఖిలంవ్యాప్తావిశాలాధరా। నిర్ఘోషైరథజైస్తతః ప్రతిహతావాక్చాపినశ్రూయతేవీరాణాం నినదైఃప్రభూతభయదైర్యుక్తాప్రసన్నాచమూః॥

టీ॥ అశ్వాంఘ్య్రిత్థితరేణుభిః= గుఱ్ఱములయొక్క గిట్టలచేత ఎగురఁగొట్టఁబడిన పరాగములచేత. అశేషమ్= సమస్తమైన. నభః= ఆకాశము. వ్యాప్తమ్=వ్యాపింపఁబడినది. ఛత్రైః=గొడుగులచేత. అఖిలమ్= సమస్తమైన. అంతరాళమ్= మధ్యప్రదేశము. వ్యాప్తమ్= వ్యాపింపఁబడినది. అభూత్= ఆయెను. విశాలా= విపులమైన. ధరా చ=భూమియును. వ్యాప్తా= వ్యాపింపఁబడినది. ఆసీత్=ఆయెను. తతః=పిమ్మట. రథజైః= రథములవలనఁబుట్టిన. నిర్ఘోషైః= ధ్వనులచేత. ప్రతిహతా=కొట్టఁబడినదై. వాక్చాపి=వాక్కును.న శ్రూయతే= వినఁబడుటలేదు. ప్రభూతభయదైః= అధికమైన భయమును ఇచ్చునట్టి. వీరాణామ్=వీరులయొక్క. నినదైః= ధ్వనులతో. యుక్తా= కూడుకొనిన. చమూః=సైన్యము. ప్రసన్నా=ప్రసన్నమైనది॥ తా ॥ ఆసమయమునందు గుఱ్ఱములయొక్క గిట్టలనుండి లేవఁగొట్టఁబడిన పరాగములచేత సమస్తమైన యాకాశము వ్యాప్తమైనది. భూమ్యంతరిక్షములయొక్క మధ్యప్రదేశమంతయును ఛత్రములచేత వ్యాప్తమైనది. మఱియును, విపులమైన భూమియంతయును వ్యాపింపఁబడెను. రథధ్వనులచేత ఒకరిమాట యొకరికి వినఁబడుటలేదు. మఱియును, భయంకరములగు శూరులమాటలచేత సకలసైన్యమును ప్రసిద్ధమైనదై యుండెనని తాత్పర్యము॥ ఇవ్విధముగ నాసైన్యమంతయును మిగుల భయంకరమైనదైయుండె. అనంతరమందా రెండు తెగలవారికిని మిగుల భయంకరమైన యుద్ధమయ్యె. పిమ్మట విక్రమార్కునిచేత శాలివాహనుని సైన్యమంతయును క్రిందఁబడవేయఁబడె. అప్పుడు శాలివాహనుఁడు మిగుల వ్యసనమునుపొందినవాఁడై ఆపత్కాలమునందు నన్ను స్మరింపుమని తనతండ్రి యిచ్చినవరమును స్మరణకుఁ దెచ్చికొని తనతండ్రియగు నాగేంద్రుని స్మరించె. ఆసమయమునందు ఆదిశేషుఁడు సకల సర్పములను బంపె. అంత నాసర్పములన్నియును వచ్చిచూచినంతమాత్రముచేతనే విక్రమార్కునియొక్క సైన్యమంతయును క్రిందఁబడియె. అనంతరమందు విక్రమార్కుఁడొక్కఁడే బయలువెడలిపోయి తనసైన్యమును సర్వమును బ్రతికిం



చుటకొఱకు తీర్థోదకమునం దొక్కసంవత్సరకాలము వాసుకినిగుఱించి వ్రతము నవలంబించె. అనంతరమందు వాసుకి ప్రసన్నుఁడై యిట్లనియె. ఓరాజోత్తమా! నీతపస్సునకు సంతోషించితిని. వరమును కోరుమనిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓసర్పరాజమా! నీవు ప్రసన్నతను పొందినయెడల సర్పవిషవేగముచేత మూర్ఛనుపొందిన నాసైన్యమంతయును మరల లేచునటుల వరమునొసంగుమనినవిని యావాసుకి అటులనేచేసెదనని యమృతఘటము నిచ్చె. అంతట విక్రమార్కమహారాజు ఆయమృతఘటమును తీసికొని యతిశీఘ్రముగవచ్చుచుండె. అంతలోపల నొకబ్రాహ్మణుఁడు వచ్చి యిట్లనియె.

శ్లో॥ హరేర్లీలావరాహస్య దంష్ట్రాదండస్సపాతువః। హేమాద్రిఃకలశో యత్రధాత్రీచ్ఛత్రశ్రియందధౌ॥

టీ॥ లీలావరాహస్య= లీలావరాహరూపమును ధరించిన. హరేః= నారాయణునియొక్క. సః= ప్రసిద్ధమైన. దంష్ట్రాదండః= దంష్ట్రాదండము. వః=మిమ్ములను. పాతు=రక్షించుఁగాత. యత్ర=ఏదంష్ట్రాదండమునందు. హేమాద్రిః= మేరుపర్వతము. కలశః=కలశము. ఆసీత్= ఆయెనో. ధాత్రీ=భూమి. ఛత్రశ్రియమ్= ఛత్రముయొక్కసంపదను. దధౌ=ధరించెనో॥ తా॥ ఆదివరాహావతారము నవలంబించిన యేనారాయణునియొక్క దంష్ట్రాదండమునందు మేరుపర్వతము కలశమాయెనో, భూమిగొడుగైయుండెనో అటువంటి ఆదివరాహదేవునియొక్క దంష్ట్రాదండము మిమ్ములను రక్షించుఁగాత అని యాశీర్వదించి యిట్లనియె. ఓరాజోత్తమా! నీవు యాచకజనులకు చింతామణివంటివాఁడవు. మఱియును కోరినవస్తువులనన్నిటిని ఇచ్చువాఁడవు. కావున నాయభీష్టమును తీర్చుము. నాకిప్పుడు నీచేతనున్న అమృతకలశమునందు అధికమైన ప్రీతికలదు. కాఁబట్టి నాకీయమృతకలశమునిమ్మనిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! నీవెవ్వనిచేత పంపఁబడి యిక్కడకువచ్చితివి? నీవృత్తాంతమును ముందుగఁ జెప్పుమనిన నతఁడిట్లనియె. ఓరాజోత్తమా! నేను శాలివాహనునిచేతఁ బంపఁబడి వచ్చితిననిన విక్రమార్కమహారాజిట్లు యాలోచించె. నేను ముందుగా ఇతనికిచ్చెదనని చెప్పితిని. ఇప్పుడు ఈయకపోతినేని అపకీర్తినిపొందుదును. అందువలన సర్వవిధములచేతను ఈయవలసినదే కాని యీయకుండుట యుచితముకాదని యోచించుచుండఁగా నాబ్రాహ్మణుఁ డిట్లనియె. ఓరాజోత్తమా! నీవేమోవిచారించుచున్నావు. నీవు సజ్జనుఁడవు. సజ్జనుఁడు రెండుమాటలను చెప్పఁడుగదా! మఱియును,

శ్లో॥ ఉదయతియదిభానుః పశ్చిమేదిగ్విభాగే ప్రచలతియదిమేరుశ్శీతతాంయాతివహ్నిః। వికసతియదిపద్మం పర్వతాగ్రేశిలాయాంభవతితదనృతంవైభాషితం సజ్జనానామ్॥

టీ॥ భానుః= సూర్యుఁడు. పశ్చిమే=పడమటిదగు. దిగ్విభాగే = దిక్కుయొక్క భాగమునందు. ఉదయతియది= ఉదయించినట్లయినను. మేరుః= మేరుపర్వతము. ప్రచలతియది= చలించినను. వహ్నిః=అగ్నిహోత్రుఁడు. శీతతామ్= శీతత్వమును. యాతియది=పొందినను. పద్మమ్= పద్మము. పర్వతాగ్రే= పర్వతముయొక్క అగ్రభాగమునందలి. శిలాయామ్= శిలయందు. వికసతియది = వికసించినను. సజ్జనానామ్= సత్పురుషులకు. అనృతమ్=అసత్యమైన. తత్=ఆ. భాషితమ్= సంభాషణము. భవతి= అగుచున్నది॥ తా॥ సూర్యుఁడు పశ్చిమదిక్కునందు ఉదయించుటయును, మేరుపర్వతము కదలుటయును, అగ్నిహోత్రుఁడు చల్లఁదనమును పొందుటయును, పర్వతాగ్రమునందలి శిలయందు పద్మము వికసించుటయును, సంభవించినయెడల సత్పురుషులు అసత్యమును చెప్పుటసంభవించునని తా॥ మఱియును,

శ్లో॥ అద్యాపినోజ్ఝతిహరః కిలకాలకూటం కూర్మోబిభర్తిధరణీం ఖలుపృష్ఠభాగే। అంభోనిధిర్వహతిదుస్సహబాడబాగ్ని మంగీకృతంసుకృతినః పరిపాలయంతి॥

టీ॥ హరః=పరమశివుఁడు. అద్యాపి=ఇప్పటికిని. కాలకూటమ్=కాలకూటమును. నోజ్ఝతి=విడుచుచుండలేదు. కూర్మః=కూర్మరాజు. పృష్ఠభాగే=పృష్ఠభాగమునందు. అద్యాపి=ఇప్పటికిని. ధరణీమ్=భూమిని. నోజ్ఝతి=విడువఁడు. అంభోనిధిః=సముద్రుఁడు. దుస్సహబాడబాగ్నిమ్=సహింపఁగూడనిబాడబాగ్నిని. వహతి=వహించుచున్నాఁడు. తస్మాత్=అందువలన. సుకృతినః=పుణ్యాత్ములు. అంగీకృతమ్=అంగీకరింపఁబడినదానిని. పరిపాలయంతి=పరిపాలించుచున్నారు॥ తా॥ పరమశివుఁడుఇప్పటికిని కాలకూటమునువిడువఁడు. కూర్మరాజుఇప్పటికిని తనపృష్ఠభాగమునందు భూమినిభరించుచున్నాఁడు. సముద్రుఁడుసహింపశక్యముకాని బాడబాగ్నినివహించుచున్నాఁడు. కాబట్టిఆలోచింపఁగా పుణ్యాత్ములుఅంగీకరింపఁబడినదానిని పరిపాలించుచున్నారనితాత్పర్యము. అనియాబ్రాహ్మణుఁడుచెప్పినవాక్యములనువిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! నీవుయథార్థమును చెప్పితివి. కావున, ఈయమృతఘటమునుగ్రహింపుమని చెప్పి యాయమృతఘటమునిచ్చె. అంతటనాబ్రాహ్మణుఁడు పరమానందమును పొంది యావిక్రమార్కమహారాజు



సుస్తోత్రముచేసి తననివాసమునకుఁబోయె. పిమ్మట విక్రమార్కమహారాజుకూడ ఉజ్జయినీపట్టణమునకుఁబోయెనని యీకథను చెప్పి యాసాలభంజికమరలనిట్లనియె. ఓరాజోత్తమా! నీయందు ఇటువంటిగుణములు కలిగియున్నయెడల నీవీసింహాసనముమీదనెక్కుము. లేనియెడల ఊరకుండుమనినవిని భోజమహారాజుఏమియునుపలుకక తనగృహమునకుఁబోయె.

ఇట్లని విక్రమార్క చరిత్రయందలి ఇరువదినాల్గవ ఉపాఖ్యానము ముగిసెను.

---

## —(*) ఇరువదియైదవ చరిత్రము. (*)—

అంతట మరలనొకనాడు భోజమహారాజు సింహాసనమునెక్కవలయునని యెదుతలంపుకలవాఁడై మునుపటివలెనే సుముహూర్తమును విచారించుకొని పరివారజనముతోఁగూడనేగుదెంచె. వచ్చిసింహాసనమునెక్కఁబోవుచుండఁగా మఱియొకసాలభంజికయిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కునకుఁగలగుణములు నీకుఁగలిగియున్నయెడల ఈసింహాసనమునెక్కుము. లేనియెడల ఈసింహాసనమునెక్కుటకుఁ దగినవాఁడవుకావు. అనినవిని భోజమహారాజు విక్రమార్కునియం దెట్టిగుణములుకలవో చెప్పుమనిన మరలనాసాలభంజికయిట్లనియె. ఓరాజోత్తమా! విక్రమార్కమహారాజు రాజ్యమునుచేయుచుండఁగా ఒకనాఁడొకజ్యోతిష్కుఁడువచ్చి యిట్లనియె.

శ్లో॥ సూర్యశ్శౌర్యమథేందురింద్రపదవీంసన్మంగళంమంగళస్సద్బుద్ధించబుధోగురుశ్చగురుతాంశుక్రశ్శుభంశంశనిః। రాహుర్బాహుబలంకరోతుసతతంకేతుఃకులస్యోన్నతింనిత్యంభూతికరాభవంతుభవతస్సర్వేనుకూలాగ్రహాః॥

టీ॥ సూర్యః=సూర్యుఁడు. శౌర్యమ్=శౌర్యమును. అథ=పిమ్మట. ఇందుః=చంద్రుఁడు. ఇంద్రపదవీమ్=దేవేంద్రపదవిని. మంగళః=అంగారకుఁడు. సన్మంగళమ్=శ్రేష్ఠమైనశుభమును. బుధః=బుధుఁడు. సద్బుద్ధించ=యోగ్యమైనబుద్ధిని. గురుశ్చ=గురువు. గురుతామ్=గౌరవమును. శుక్రః=శుక్రుఁడు. శుభమ్=శుభమును. శనిః=శనైశ్చరుఁడు. శమ్=సుఖమును. రాహుః=రాహువు. బాహుబలమ్=భుజబలమును. కేతుః=కేతువు. కులస్య=కులముయొక్క. ఉన్నతిమ్=ఔన్నత్యమును. కరోతు=చేయుఁగాత. ఏవమ్=ఈవిధముగా. సర్వే=సమస్తమైన. గ్రహాః=గ్రహములు. భవతః=నీకు. అనుకూలాః=అనుకూలములయినవి. భవంతు=అగుఁగాక॥ తా॥ సూర్యుఁడుశౌర్యమును, చంద్రుఁడుఇంద్రపదవిని, అంగారకుఁడుశ్రేష్ఠమైనశుభమును, బుధుఁడుసర్వోత్తమముగబుద్ధి

ని, గురువుగౌరవమును, శుక్రుఁడుశుభమును, శనిసుఖమును, రాహువుదోహబలమును, కేతువుకులాభివృద్ధినిచేయుఁగాత. మఱియును, సకలగ్రహములును నీకుఅనుకూలములయినవై యుండుఁగాతయని తాత్పర్యము. అను శ్లోకముచేత ఆశీర్వచనమునుచేసి ఫలమంత్రాక్షతలనిచ్చి పంచాంగమునుచదివె. ఆపంచాంగమునువిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓదైవజ్ఞుఁడా! ఈసంవత్సరఫల మేవిధముగానుండుననిన నాజ్యోతిష్కుఁడిట్లనియె. ఓరాజోత్తమా! ఈసంవత్సరమునందు రాజుసూర్యుఁడు. మంత్రియంగారకుఁడు. ధాన్యాధిపతిశని. మఱియుశన్యంగారకులు రోహిణీశకటమును బ్రద్దలుచేసిపోవుదురు. అందువలన సర్వవిధములచేతను అనావృష్టిదోషముకలుగును. మఱియును,

శ్లో॥ అర్కసుతేనహిభగ్నే భౌమశ్శుక్రశ్చరోహిణీశకటె। ద్వాదశచాబ్దాన్నహినహి వర్షతివర్షాణివారిదోనియతమ్॥

టీ॥ భౌమః=అంగారకుఁడును. శుక్రశ్చ=శుక్రుఁడును. స్థితౌసతౌ=ఉన్నవారలగుచునుండఁగా. అర్కసుతేనహి=శనిచేత. రోహిణీశకటే=రోహిణీశకటము. భగ్నేసతి=భగ్నమయినదగుచునుండఁగా. ద్వాదశచాబ్దాత్=పదిరెండుసంవత్సరములవఱకును. వారిదః=మేఘుఁడు. వర్షాణి=వర్షములను. నవర్షతి=వర్షింపఁడు. నియతమ్=యథార్థము॥ తా॥ శనిచేతరోహిణిశకటముబ్రద్దలుచేయఁబడినయెడల పదిరెండుసంవత్సరములు మేఘుఁడువర్షింపఁడని తాత్పర్యము. మఱియును,

శ్లో॥ రోహిణీశకటమర్కసూనునాభిద్యతేరుధిరవాహినీసరిత్। కింబ్రవీమినహివారిసాగరే సర్వలోకఉపయాతిసంక్షయమ్॥

టీ॥ రోహిణీశకటమ్=రోహిణీశకటము. అర్కసూనునా=శనిచేత. భిద్యతేయది=బ్రద్దలుచేయఁబడినయెడల. రుధిరవాహినీ=నెత్తురునువహించునట్టి. సరిత్=నది. ప్రవహేత్=పుట్టును. కింబ్రవీమి=ఏమనిచెప్పుదును. సాగరే=సముద్రమునందు. వారి=ఉదకము. నహి=లేదు. సర్వలోకః=సమస్తలోకము. సంక్షయమ్=నాశమును. ఉపయాతి=పొందుచున్నది॥ తా॥ రోహిణీశకటమునుశనిబ్రద్దలుచేసినసంవత్సరమునందు రక్తప్రవాహముకలనదిపుట్టును. అనగాయుద్ధములుమెండుగజరుగును. మఱియునేమిచెప్పుదును. సముద్రమునందుకూడఉదకముండదు. సమస్తలోకమును నాశమునుపొందుచున్నదని తాత్పర్యము॥ మఱియును, మతాంతరమునందు,

శ్లో॥ యదాభినత్తిమందోయం రోహిణ్యాశ్శకటంతదా। వర్షాణిద్వాదశాత్యంతం వారివాహానవర్షతి॥



టీ॥ యదా=ఎప్పుడు. అయమ్=ఈ. మందః=శని. రోహిణ్యాః=రోహిణియొక్క. శకటమ్=శకటమును. భినత్తి=బ్రద్దలుచేయుచున్నాఁడో. తదా=అప్పుడు. వారివాహాః=మేఘుఁడు. ద్వాదశ=పదిరెండగు. వర్షాణి=వర్షములు. నవర్షతి=వర్షింపఁడు॥ తా॥ శనియేసంవత్సరమునందు రోహిణీశకటమునుబ్రద్దలుచేసిపోవునో ఆసంవత్సరమువచ్చినదిమొదలుకొనిపదిరెండుసంవత్సరములవఱకును మేఘుఁడువర్షింపఁడని తాత్పర్యము॥ అాజ్యోతిష్కుఁడుచెప్పినమాటనువిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓదైవజ్ఞుఁడా! ఈదుర్యోగమును శాంతింపఁజేయుటకు తగినయుపాయమును తెలియఁజేయుమనిననివిని దైవజ్ఞుఁడిట్లనియె. ఓరాజోత్తమా! నవగ్రహహోమాద్యనుష్ఠానమును చేసినయెడల వర్షముకురియుననిన విక్రమార్కమహారాజు శ్రోత్రియులను బ్రాహ్మణులనుపిలిచి వారలతో ఆవృత్తాంతమును సర్వమును తెలియఁజేసె. అంతటనాశ్రోత్రియులందఱును హోమమునుచేయుట కుపక్రమించిరి. ఉపక్రమించి హోమద్రవ్యములనన్నిటినిసంపాదించిరి. అనంతరమందుబ్రాహ్మణులందఱును కల్పోక్తప్రకారముచేత నవగ్రహహోమమునుచేసి పూర్ణాహుతినిచేసిరి. అనంతరమందు విక్రమార్కమహారాజు దివ్యవస్త్రాదికముచేత బ్రాహ్మణులనుసంతోషపఱచె. విస్మటభూరిదానముచేత దీనాంధబధిరులకు సంతోషముకల్పించె. అట్లుచేసినను ఆసంవత్సరమునందు వర్షములేకయుండె. అనంతరమందు అనావృష్టిదోషముచేత లోకమంతయును నానావిధములయిన కష్టములనుపొందుచుండె. ఆకష్టములనుచూచి విక్రమార్కమహారాజు అధికముగావ్యసనమునుపొంది యజ్ఞశాలయందుఁబ్రవేశించి యాలోచించుచుండె. అప్పుడు అశరీరవాణి యిట్లనియె. ఓరాజోత్తమా! నీకుపరోపకారమును చేయుటకొఱకు ఇష్టమున్నయెడల తగినయుపాయమునుచెప్పెదను. వినుము. నీగ్రామమునకుముందరనున్న దేవాలయమునందున్నదియును, ఆశనుపూరించునట్టిదియును, అయినదేవతకు ప్రీతికలుగునట్లుముప్పదిరెండు రాజలక్షణములుకల రాజుయొక్కకంఠరక్తముచేత బలినిఇచ్చినయెడల వర్షముకలుగును. అవగ్రహముకూడనశించును. అనినవిని విక్రమార్కమహారాజు ఆదేవాలయములోనికిపోయి యాదేవతకునమస్కరించి తనకంఠమునందుఖడ్గమునుంచె. ఆసమయమునందుఆదేవతఇట్లనియె. ఓరాజోత్తమా! నీధైర్యముచేత నేనుప్రసన్నురాలనైతిని. కావునవరమునుకోరుమనిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓదేవీ! నీవుప్రసన్నురాలవయినయెడల అనావృష్టిదోషమును పోఁగొట్టుమనిన ఆదేవత అటులనేచేసెదననియె. అ

నంతరమందావిధముగానే వర్షమునుకురిపించె. అంతటవిక్రమార్కమహారాజు తనగృహమునకుంబోయెనని యీకథనుచెప్పి యాసాలభంజికమరలనిట్లనియె. ఓరాజోత్తమా! ఇటువంటి సాహసాదిగుణములన్నియును నీయందున్నయెడల ఇటువంటిసింహాసనమునందుఁ గూర్చుండుమనినవిని భోజమహారాజుఏమియును పలుకకపోయెను.

ఇట్లని విక్రమార్క చరిత్రయందలి ఇరువదైదవ ఉపాఖ్యానము ముగిసెను.

---

## ——(*) ఇరువదిఆరవ చరిత్రము. (*)——

అంతట మరలనొకనాఁడు భోజమహారాజు ఆసింహాసనముమీద నెక్కవలయునని యెడు తలంపుకలవాఁడై సుముహూర్తమును విచారించుకొని పరివారజనముతోఁగూడవచ్చి యాసింహాసనముమీద నెక్కఁబోయెను. ఆసమయమునందు మఱియొకసాలభంజికయిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కునియందుఁగల సాహసాదిగుణములు నీయందున్నయెడల ఈసింహాసనముమీదనెక్కుమనిన భోజమహారాజు విక్రమార్కునిసాహసాదిగుణములనుచెప్పుమనియె. ఆమాటనువిని యాసాలభంజికయిట్లనియె. ఓరాజోత్తమా! విక్రమార్కునివంటివాఁడు ఈలోకమునందెవ్వఁడునులేడు. విక్రమార్కమహారాజు ఏవిధముగాఁజెప్పునో ఆవిధముగాఁజేయును. తనమనస్సునందేవిధముగాఁదలఁచునో ఆవిధముగాఁజెప్పును. అందువలనవిక్రమార్కమహారాజు సజ్జనుఁడనిచెప్పఁబడుచున్నాఁడు. మఱియును,

శ్లో॥ యథాచిత్తంతథావాక్చ యథావాక్చతథాక్రియా। చిత్తేవాచిక్రియాయాంచ సాధూనామేకరూపతా॥

టీ॥ చిత్తమ్=మనస్సు. యథా=ఏప్రకారముగానో. తథా= ఆప్రకారము. వాక్చ=వాక్కును. తథా=ఆప్రకారముగా. భవతి= అగుచున్నది. యథా= ఏప్రకారము.వాక్య=వాక్కో. తథా=ఆప్రకారముగా. క్రియాచ= క్రియయును. భవతి=అగుచున్నది. సాధూనామ్=సత్పురుషులకు. చిత్తే= చిత్తమునందును. వాచి=వాక్కునందును. క్రియాయాంచ= క్రియయందును. ఏకరూపతా=ఐక్యము. భవతి=అగుచున్నది॥ తా॥ చిత్తముఏవిధముగానుండునో వాక్కు ఆవిధముగానే యుండును. వాక్కుఏవిధముగానుండునో క్రియకూడఆవిధముగానే యుండును. మఱియును, సాధువులగువారికిమనోవాక్కర్మములుమూడును సమానములైయుండుననితా॥ మఱియును,



శ్లో॥ ఉపకర్తుంప్రియంవక్తుం కర్తుంస్నేహమకృత్రిమం। సజ్జనానాం స్వభావోయమిందోశ్శీతలతా గుణః॥

టీ॥ ఉపకర్తుమ్= ఉపకారమునుచేయుటకొఱకును. ప్రియమ్= ప్రియమైనమాటను. వక్తుమ్=చెప్పుటకొఱకును. అకృత్రిమమ్=కపటములేని. స్నేహమ్= స్నేహమును. కర్తుమ్=చేయుటకొఱకును. ఇందోః=చంద్రునకు. శీతలః= చల్లనిదైన. గుణోయథా=గుణమువలెనే. సజ్జనానామ్= సజ్జనులకు. అయమ్=ఇది. స్వభావః=స్వభావము॥ తా ॥ ఉపకారమును చేయుటకొఱకును, ప్రియమైనమాటను చెప్పుటకొఱకును, కృత్రిమముకాని స్నేహమునుచేయుటకొఱకును, చంద్రునకుచల్లనిగుణమువలెనే సజ్జనులకు ఇది స్వభావగుణమైయున్నదనితాత్పర్యము॥ అను శాస్త్రానుసారముగ విక్రమార్కమహారాజు మహాపురుషుఁడని చెప్పఁదగినవాఁడు. ఇట్లుండఁగా నొకనాఁడు దేవేంద్రుఁడు తనస్వర్గపట్టణమునందు సింహాసనము నలంకరించె. అనఁగా సింహాసనమునందుఁగూర్చుండె. ఆసమయమునందు పదునెనిమిదివేలమహర్షులును, ముప్పదిమూఁడుకోట్లదేవతలును, అష్టదిక్పాలురును, నలుబదితొమ్మిదిమరుద్గణములును, పన్నిద్దఱు నాదిత్యులును, చంద్రాంగారకాదిగ్రహములును, నారదుఁడు మొదలుగాఁగల దేవర్షులును, మేనకోర్వశీతిలోత్తమాది దేవవేశ్యలును, గంధర్వులును, ఆదేవేంద్రునిసేవించుచుండిరి. అప్పుడు నారదమహాముని భూలోకమునందు విక్రమార్కుఁడనురాజొకఁడుకలఁడనియును, అతనికిసమానుఁడగువాఁడు ముల్లోకములయందును, లేడనియును, చెప్పె. ఆవృత్తాంతమునువిని యాసభయంతయును మిగుల నాశ్చర్యమునుపొందె. ఆసమయమునందు కామధేనువునారదుఁడుచెప్పినమాటకుసందేహములేదు. మీరందఱును ఆశ్చర్యమునుపొందనేల? మఱియును,

శ్లో॥ దానేతపసిశౌర్యేచ విజ్ఞానేవినయేనయే। విస్మయోహినకర్తవ్యో బహురత్నావసుంధరా॥

టీ॥ దానే= దానమునందును. తపసి=తపస్సునందును. శౌర్యేచ=శౌర్యమునందును. విజ్ఞానే=విజ్ఞానమునందును. వినయే= వినయమునందును. నయే=నీతియందును. విస్మయః=ఆశ్చర్యము. నకర్తవ్యః=చేయఁదగినదికాదు.వసుంధరా= భూమి.బహురత్నా= అనేకరత్నములుకలది. మఱియును,

శ్లో॥ వాజివారణలోహానాం కాష్ఠపాషాణవాససాం । నారీపురుషతోయానా మంతరంమహదంతరమ్॥

వాజివారణలోహానామ్= గుఱ్ఱములకును, వానరములకును, కా

ష్ఠపాషాణవాససామ్ = కఱ్ఱలు, పాషాణములు, వస్త్రములు, అనువానికి
ని. నారీపురుషతోయానామ్ = స్త్రీలు, పురుషులు, ఉదకములు, అనువానికి.
అంతరా = మధ్యయందు. మహదంతరమ్ = మిగుల తారతమ్యము. అస్తి = కల
దు॥ తా॥ గుఱ్ఱములు, వానరములు, లోహములు, అనువానికిని, కాష్ఠము
లు, పాషాణములు, వస్త్రములుఅనువానికిని, స్త్రీలుపురుషులు, ఉదకము
లు, అనువానికిని, మిగుల నధికమైనతారతమ్యముకలదని తాత్పర్యము॥ అను
ప్రమాణవచనములను చెప్పినవిని దేవేంద్రుఁడు ఆకామధేనువుతో నిట్లనియె.
ఓకామధేనువా! నీవు మర్త్యలోకమునకుఁబోయి విక్రమార్కునియొక్క ప
రోపకార గుణములను నిశ్చయించి యావృత్తాంతమును నాకుఁ దెలియఁజే
యుమనియె. ఆమాటనువిని కామధేనువు విక్రమార్కునియొక్క గుణములను
పరీక్షించుటకొఱకు భూలోకమునకువచ్చి రాజువచ్చునట్టిమార్గమునందు దూ
ర్బలురాలగుచు మిగుల భయంకరమైన యొకబురదనేలయందుదిగఁబడియుం
డె. అంతటఁ గొంతసేపటికి విక్రమార్కమహారాజు ఆమార్గమునవచ్చుచు
బురదయందు దిగఁబడియున్న యాగోవునుచూచి మిగులపరితాపమునుపొం
దుచు అభిమానమునువదలి ప్రవేశింపసలవికాని యాబురదనేలయందుఁబ్రవే
శించి యాగోవునెత్తి శరీరమును సర్వమునుగడిగి లేతకసువును తెచ్చిపెట్టి
యాగోవుసకింపుగనుండునట్లు గోకుచుండె. ఆసమయమునందు కామధేను
వుతననిజరూపమునుచూపి ప్రసన్నురాలై యిట్లనియె. ఓరాజోత్తమా! నీకి
ష్టమైనవరమునుగోరుమనిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓకామధేనూత్త
మా! నీవు ప్రసన్నురాలవయినయెడల నీనిజరూపముతో సర్వకాలములయం
దును నాగృహమునందు నివసింపుమనినవిని యాకామధేనువు మంచిదనుచు
ఆవిక్రమార్క మహారాజునకు స్వాధీనురాలయియుండె. అట్లుండఁగానొక
నాఁడొకబ్రాహ్మణుఁడువచ్చి యిట్లనియె.

శ్లో॥ సానందంనందిహస్తాహతమురజరవాహూత కౌమారబర్హి
త్రాసాన్నాసాగ్రరంధ్రం విశతిఫణిపతౌ భోగసంకోచభాజి । గండోడ్డీనా
ళిమాలాముఖరితకకుభస్తాండవే శూలపాణేర్వైనాయక్య శ్చిరంవోవదనవి
ధుతయఃపాంతుఫీత్కారవత్యః॥

టీ॥ శూలపాణేః = పరమశివునియొక్క. తాండవే = తాండవమునం
దు. సానందమ్ = ఆనందముతోఁగూడుకొనినట్లుగాను. నంది... త్రాసాత్ —
నంది = నందికేశ్వరునియొక్క. హస్త = హస్తముచేత. ఆహత = కొట్టఁబడిన. ము
రజ = మద్దెలలయొక్క. రవ = ధ్వనులచేత. ఆహూత = పిలువఁబడిన. కౌమా



ర = కౌమారవయస్సుకల. బర్హి = నెమలివలన. త్రాసాత్ = భయమువలన.
నాసాగ్రరంధ్రమ్ = నాసాగ్రరంధ్రమును. ఫణిపతౌ = ఆదిశేషుఁడు. భోగ
సంకోచభాజి = పడగయొక్కసంకోచమునుపొందినవాఁడై. విశతిసతి = ప్రవేశిం
చుచుండఁగా. గండోడ్డీనాళిమాలాముఖరితకకుభః = గండస్థలమునుండియె
గురుచున్న తుమ్మెదలయొక్క మాలికలచేత శబ్దాయమానముచేయఁబడినది
క్కులు కలిగినటువంటివియును. ఫీత్కారవత్యః = ఫీత్కారములుకలవియు
ను. వైనాయక్యః = వినాయకుని సంబంధములయినవియును. (అయిన) వద
నవిధుతయః = ముఖములయొక్క ఝాడింపులు. చిరమ్ = చిరకాలము. వః =
మిమ్ములను. పాంతు = రక్షింతురుగాత॥ తా॥ పరమశివునియొక్క తాండవ
మునందు ఆనందముతోఁ గూడుకొనునట్లుగా నందికేశ్వరునియొక్క హస్త
ముచేత వాయింపఁబడిన మద్దెలయొక్క ధ్వనులచేత కొట్టఁబడినవయస్సుక
ల నెమలివలనిభయమువలన ఆదిశేషువు పడగయొక్క సంకోచమునుపొంది
న వాఁడగుచు ప్రవేశించినవాఁడగుచునుండఁగా గండస్థలమునుండి యెగురు
చున్న తుమ్మెదలయొక్క మాలికచేత శబ్దాయమానములయిన దిక్కులుకల
వియును, ఫీత్కారములు కలవియును, వినాయకుని సంబంధము లయినవి
యును, అయిన వదనముయొక్క ఝాడింపులు చిరకాలము మిమ్ములను ర
క్షించుఁగాతయని తాత్పర్యము॥ అను శ్లోకముచేత ఆశీర్వచనమును చేసి
యిట్లనియె.

శ్లో॥ రాజన్సర్వా నహంయాచే నమాంకశ్చనయాచతే । అహో
దైవవిపాకోయమీశ్వరాణామపీశ్వరః॥

టీ॥ రాజన్ = ఓరాజోత్తమా! అహమ్ = నేను. సర్వాన్ = సర్వజనుల
ను. యాచే = యాచించుచున్నాను. కశ్చన = ఒకానొకఁడును. మామ్ = నన్ను
ను. నయాచతే = యాచించుచుండలేదు. అహో = ఎంతయాశ్చర్యము. దైవ
విపాకః = దైవవిపాకము. ఈశ్వరాణామపి = ఈశ్వరులకును. ఈశ్వరః = ఈ
శ్వరుఁడు॥ తా॥ ఓరాజోత్తమా! నేను సర్వజనులను యాచించుచున్నాను.
నన్నెవ్వఁడును యాచించుటలేదు. ఆహా! దైవవిపాకము ఈశ్వరులకుఁగూ
డ ఈశ్వరుఁడని తాత్పర్యము॥ అనిచెప్పి మఱియు నిట్లనియె. మఱియును, ఎ
వ్వఁడు దారిద్ర్యముకలవాఁడైయుండునో అటువంటివానియొక్క గృహము
నందు సర్వమును శూన్యమైయుండుననిన విని విక్రమార్కమహారాజిట్లని
యె. ఓబ్రాహ్మణుఁడా! ఇప్పుడు నీవు దేనిని యాచించుచున్నావనినవిని
యాబ్రాహ్మణుఁ డిట్లనియె. ఓరాజోత్తమా! నీవు ఆశ్రితజనులకు కల్పవృ

క్షమువంటివాఁడవు. కావున యావజ్జీవమును నాకు దారిద్ర్యములేకయుండునట్లు చేయుమనిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! ఈధేనువుకోరినకోర్కెలనీయఁగలదు. కావున దీనిని గ్రహింపుమని యాకామధేనువు నిచ్చె. అంతట నాబ్రాహ్మణుఁడు ఆకామధేనువును గ్రహించి తనదు గృహమునకుఁ బోయె. విక్రమార్కమహారాజుకూడ తనపట్టణమునకు పోయెనని యీకథను చెప్పి యాసాలభంజిక మరల నిట్లనియె. ఓరాజోత్తమా! నీకీవిధముగా సాహసాదిగుణములు కలిగియున్నయెడల ఈసింహాసనముమీద నెక్కుము. లేనియెడల నూరకుండుమనిన భోజమహారాజేమియును పలుకకపోయె.

ఇట్లని విక్రమార్కచరిత్రయందలి యిరువదారవ ఉపాఖ్యానము ముగిసెను.

---

## (*) యిరువదియేడవ చరిత్రము. (*)

అంతట మరల నొకనాఁడు భోజమహారాజు సింహాసనముమీద నెక్కఁదలఁచి సుముహూర్తమును విచారించుకొని పరివారజనసమేతముగా వచ్చి సింహాసనము నెక్కఁబోవుచుండఁగా మఱియొకసాలభంజిక యిట్లనియె. ఓరాజోత్తమా! విక్రమార్కునకుఁగల శౌర్యధైర్యాది గుణములు కలిగియున్నయెడల నీవీసింహాసనముమీద నెక్కుము. లేనియెడల నీవూరకుండుమనిన భోజమహారాజు విక్రమార్కుని సాహసాది గుణములను చెప్పుమనిన మరల నాసాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కమహారాజు భూమిని పరిపాలించుచు నొకనాఁడు భూమియందుసంచారమును చేయుటకొఱకు తనపట్టణమునుండి బయలువెడలి యొకపట్టణమునకుఁ బోయె. ఆపట్టణమునందలి రాజులందఱును మిగుల ధార్మికులును, శ్రుతిస్మృతివిహితానుష్ఠానతత్పరులును, అయియుండిరి. మఱియును చాతుర్వర్ణ్యమును చక్కఁగఁ బరిపాలించిరి. మఱియును, సకలజనులును, సదాచారముకలవారును, అతిథిప్రియులును, దయాపరులును, అయియుండిరి. ఆనగరమునందు విక్రమార్కమహారాజు అయిదారు దినములు నివసింపఁదలఁచి మిగుల మనోహరమైన యొకదేవాలయములోనికిఁబోయి రంగమంటపమునందుఁ గూర్చుండె. అక్కడ కూర్చుండియుండఁగా, ఒకపురుషుఁడు రాజకుమారునివలె మిగుల మనోహరమైన రూపముకలవాఁడును, పట్టువస్త్రమును ధరించినవాఁడును, నానావిధములగు నలంకారములచేతను అలంకరిం



పఁబడినవాఁడును, కర్పూరము, కుంకుమము, అగురు, కస్తూరి, మొదలుగాఁగల సుగంధవస్తువులతోఁ గూడుకొనిన చందనముచేత పూయఁబడిన శరీరముకలవాఁడును, అయి వేశ్యాస్త్రీలతోఁగూడవచ్చి అనేకవిధములగు క్రీడాకథలను గానముచేసి కొంతకాలముకడపి మరలవారలతోఁగూడ బయలువెడలిపోయె. అప్పుడు విక్రమార్కమహారాజు వారలనుచూచి యిదియేమని విచారించుచుండె. అట్లుండఁగా మరునాడు ఆపురుషుఁడే ఏకాకియును, దీనవదనుఁడును, వస్త్రాదిరహితుఁడును కౌపీనమాత్రశేషుఁడునునైవచ్చె. వచ్చియారంగమంటపమునందుఁబడియె. అప్పుడువిక్రమార్కమహారాజు అతనిఁజూచియిట్లనియె. ఓపురుషుఁడా! నిన్నటిదినము నానావిధములయినయలంకారాదులతోఁగూడుకొనినవాఁడవై రాజకుమారునివలె వేశ్యాస్త్రీలతోఁగూడవచ్చితివి. ఈదినము ఈవిధముగావచ్చి కనఁబడుచున్నావు ఇట్లగుటకు కారణమేమనిన నాపురుషుఁడిట్లనియె. ఓమహాపురుషుఁడా! నేనేమనిచెప్పుదును. నేనునిన్నటిదినము నీవుచెప్పినవిధముగానేయుంటిని. దైవయోగమువలన ఈదినము ఇటువంటిస్థితినిపొందితిని. మఱియును,

శ్లో॥ యేవర్ధితాఃకరికపోలమదేనభృంగాఃప్రోత్ఫుల్లపంకజరజస్సురభీకృతాంగాః । తేసాంప్రతంప్రతిదినంగమయంతికాలం నింబేషుచార్కకుసుమేషుచదైవయోగాత్॥

టీ॥ యే-ఏ. భృంగాః=తుమ్మెదలు కరికపోలమదేన=ఏనుఁగులయొక్క గండస్థలములయందలిమదముచేత. వర్ధితాః=వృద్ధినిపొందింపఁబడినవో. యే-ఏ. భృంగాః=తుమ్మెదలు. ప్రోత్ఫుల్లపంకజరజస్సురభీకృతాంగాః = అధికముగావికసించిన పద్మములయందలిపరాగముచేత పరిమళింపఁజేయఁబడినయవయవములుకలవో. తే-అటువంటితుమ్మెదలు. సాంప్రతమ్=ఇప్పుడు. ప్రతిదినమ్=దినదినమందును. నింబేషు=వేపచెట్లయందును. అర్కకుసుమేషుచ=జిల్లేడుపువ్వులయందును. దైవయోగాత్=దైవయోగమువలన. కాలమ్=కాలమును. గమయంతి=కడపుచున్నవి॥ తా॥ మొదటఏనుఁగులయొక్క గండస్థలములయందలిమదముచేత వృద్ధినిపొందింపఁబడినవియును, అధికముగావికసించిన పద్మములయందలి పరాగముచేత పరిమళింపఁజేయఁబడిన యవయవములు కలవియును, అయినతుమ్మెదలు ఇప్పుడుదైవయోగమువలన వేపచెట్లయందును, జిల్లేడుచెట్లయందును, కాలమునుగడపుచున్నవని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ వికసితసహకారపుష్పవాటీ పరిమళకేళిపరాయణోహిభృం

గః॥ విలసతి మదతుందిలః పురా యస్స విధి బలాదధునైతి చాల్పవృక్షాన్॥

టీ॥ పురా-పూర్వమునందు. యః-ఏ. భృంగః-తుమ్మెద. వికసిత...రాయణః-వికసిత-వికసించిన. సహకార-తియ్యమామిడిచెట్లయొక్క. పుష్పవాటీ-పుష్పవాటికలయందలి. పరిమళ-పరిమళముచేత. కేళిపరాయణః-ఆటలయందుఁ బ్రియము కలదియును, మదతుందిలః-మదముచేత బలిసినదియును అయి. విలసతి-ప్రకాశించుచున్నదో. సః-అటువంటి తుమ్మెద. అధునా-ఇప్పుడు. విధిబలాత్-దైవబలమువలన. అల్పవృక్షాన్-స్వల్పములయిన వృక్షములను. ఏతి-పొందుచున్నది॥ తా॥ వికసించిన మామిడిపూలయొక్క వాటికయందు సంచరించునట్టిదియును, మదముచేత బలిసినదియును, అయిన తుమ్మెద ఇప్పుడు స్వల్పములయిన వృక్షములను ఆశ్రయించుచున్నది. దైవయోగమున కేమనవచ్చునని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ యే వర్ధితాః కనకపంకజరేణుమధ్యే మందాకినీవిమలతుంగతరంగమధ్యే । తే సాంప్రతం ప్రతిదినం ఖలు రాజహంసాః శైవాలజాలజటిలం జలమాశ్రయంతే॥

టీ॥ యే-ఏ. హంసాః-హంసలు. కనకపంకజరేణుమధ్యే-సువర్ణపద్మములయందలి పరాగముయొక్క మధ్యయందును. మందాకినీవిమలతుంగతరంగమధ్యే-మందాకినీనదియొక్క నిర్మలములయినవియును, ఉన్నతములును, (అయిన) తరంగములయొక్క మధ్యయందును. వర్ధితాః-వృద్ధినిపొందింపఁబడినవో. తే-అటువంటి. హంసాః-హంసలు. సాంప్రతమ్-ఇప్పుడు. ప్రతిదినమ్-దినదినమందును. శైవాలజాలజటిలమ్-నాచుయొక్క సముదాయముచేత వ్యాప్తమైనయుదకమును. ఆశ్రయంతే-ఆశ్రయించుచున్నవి॥ తా॥ మొట్టమొదట సువర్ణమయములయిన పద్మములయందలి పరాగముయొక్క మధ్యయందును, మందాకినీనదియొక్క యున్నతములయిన తరంగములయొక్క మధ్యయందును ఏహంసలు వృద్ధినిపొందింపఁబడినవో అటువంటి హంసలు ఇప్పుడు నాచుచేత వ్యాప్తమైనయుదకముయొక్క మధ్యయందుఁ దిరుగుచున్నవి. దైవయోగమున కేమి చేయవచ్చునని తాత్పర్యము. మఱియును,

శ్లో॥ వాతాందోళితపంకజచ్యుతరజః పింగాంగరాగోజ్జ్వలో యః శృణ్వన్కలకూజితం మధులిహాం సంజాతహర్షోత్సవః । కాంతాచంచుపుటావలంబితబిసగ్రాసగ్రహేప్యక్షమస్సోఽయం సంప్రతి హంసకో మరుగతః కష్టం తృణం యాచతే॥

టీ॥ యః-ఏహంస. వాతాందో...జ్జ్వలః-వాత-వాయువుచేత.



ఆందోళిత-ఉయ్యాలలూపఁబడిన. పంకజ-పద్మములనుండి. చ్యుత-జారిన. రజః-పరాగముచేత. పింగ-పచ్చనైన. అంగరాగ-అంగరాగముచేత. ఉజ్జ్వలః-ప్రకాశించుచున్నదై. మధులిహామ్-తుమ్మెదలయొక్క. కలకూజితమ్-అవ్యక్తమైనధ్వనిని. శృణ్వన్-వినినదగుచు. సంజాతహర్షోత్సవః-పుట్టినటువంటి సంతోషోత్సవము కలదగుచు. కాంతాచంచుపుటావలంబితబిసగ్రాసగ్రహే-ఆఁడుహంసలయొక్క ముక్కుపుటములచేత అవలంబింపఁబడిన తామరతూడులనియెడు గ్రాసముయొక్క గ్రహించుటయందుఁగూడ. అక్షమః-అసమర్థమైనది. ఆసీత్-ఆయెనో, సః-అటువంటి. అయమ్-ఈ. హంసకః-హంస. మరుగతః-మరుభూమినిపొందినదై. తృణమ్-తృణమును. యాచతే-యాచించుచున్నది. కష్టమ్-ఎంతకష్టము॥ తా॥ గాలిచేత ఉయ్యాలలూపఁబడిన పద్మములనుండి జారిన పరాగముచేత పచ్చనైనశరీరచ్ఛాయచేత ప్రకాశించుచున్నదియును. తుమ్మెదలయొక్క అవ్యక్తమధురమైనధ్వనిని వినుచున్నదియును, మిగులనధికమైన సంతోషోత్సవము కలదియును, అయి ప్రియురాలియొక్క ముక్కుచేత ఈయఁబడిన తామరతూడులను భుజించుటయందుఁగూడ అసమర్థమైన రాజహంసము ఇప్పుడు మరుభూమినిపొందినదై తృణమును కోరుచున్నది. అహా దైవయోగమున కేమనవచ్చునని తాత్పర్యము॥ అనుప్రమాణవచనములనుపట్టి ఆలోచింపఁగా కర్మముచేత కలిగిన జన్మమునందెవ్వఁడు కష్టమును పొందఁడు. సకలజనులును కష్టమును పొందుదురు. మఱియును,

శ్లో॥ బ్రహ్మా యేన కులాలవన్నియమితో బ్రహ్మాండభాండోదరే। విష్ణుర్యేన దశావతారవహనే క్షిప్తో మహాసంకటే । రుద్రో యేన కపాలపాణిపుటకే భిక్షాటనం సేవతే సూర్యో భ్రామ్యతి నిత్యమేవ గగనే తస్మై నమః కర్మణే॥

టీ॥ యేన-ఏకర్మముచేత. బ్రహ్మాండభాండోదరే-బ్రహ్మాండమనియెడు భాండముయొక్క మధ్యప్రదేశమునందు. కులాలవత్-కులాలునివలె. నిర్మితః-నిర్మింపఁబడెనో. యేన-ఏకర్మముచేత. విష్ణుః-విష్ణుదేవుఁడు. మహాసంకటే-అధికమయినవ్యసనమును కలుగఁజేయునట్టి. దశావతారవహనే-దశావతారములను వహించుటయందు. క్షిప్తః-విసరివేయఁబడెనో. యేన-ఏకర్మముచేత. రుద్రః-పరమశివుఁడు. కపాలపాణిపుటకే-కపాలమనియెడు పాణిపుటికయందు. భిక్షాటనమ్-భిక్షాటనమును. సేవతే-సేవించుచున్నాఁడో. యేన-ఏకర్మముచేత. సూర్యః-సూర్యుఁడు. నిత్యమేవ-సర్వకాలములయందును. గగనే-ఆకాశమునందు. భ్రామ్యతి-తిరుగుచున్నాఁడో. తస్మై-అటువంటి. కర్మణే-కర్మమునకొఱకు. నమః-నమస్కారము॥ తా॥ ఏకర్మముచేత బ్ర

హ్మాదేవుఁడు బ్రహ్మాండమని యెడు భాండముయొక్క మధ్యప్రదేశమునందు క్రోష్ఠరివానివలె నియమింపఁబడియుండెనో. ఏకర్మముచేత విష్ణుదేవుఁడు దశావతారములనవలంబించి మిగుల కష్టములను పొందుచున్నాఁడో. ఏకర్మముచేత పరమశివుఁడు కపాలమని యెడు ఘటికను హస్తమునందుఁ బెట్టుకొని భిక్షాటనమును సేవించుచున్నాఁడో. ఏకర్మముచేత సూర్యుఁడు సర్వకాలములయందును ఆకాశమునందుఁ దిరుగుచున్నాఁడో అటువంటి కర్మమునకొఱకు నమస్కారమును చేయుచున్నానని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ కర్మవశమువలన బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులే నానావిధములయినకష్టములను పొందఁగానే నెంతటివాఁడనని యాపురుషుఁడు చెప్పినమాటను విని విక్రమార్క మహారాజిట్లనియె. ఓపురుషోత్తమా! నీవెవ్వఁడవనిన నతఁడు నేనుకితవుఁడననిన నీవు జూదమాడఁగలవా అనిన నతఁడు జూదమునందు నేనే నిపుణుఁడను గాని నాకంటె నితరుఁడగువాఁ డెవ్వఁడును నిపుణుఁడు కాఁడు. మఱియును నేను వారిక్రీడను వరాహముష్టిని కూడ తెలిసినవాఁడను. అయినప్పటికిని నాకంటె దైవమే మిగులబలముకలదని తోఁచుచున్నది. మఱియును,

శ్లో॥ గజభుజంగవిహంగమబంధనం శశిదివాకరయోర్గ్రహపీడనం। మతిమతాంచ సమీక్ష్య దరిద్రతాం విధిరహో బలవానితి మే మతిః॥

టీ॥ గజభుజంగవిహంగమబంధనమ్=ఏనుఁగులకును, సర్పములకును, పక్షులకును, బంధనమును. శశిదివాకరయోః=చంద్రసూర్యులకు గ్రహబాధను. మతిమతామ్=బుద్ధిమంతులకు. దరిద్రతామ్=దారిద్ర్యమును. సమీక్ష్య=చూచి. విధిః=దేవుఁడు. బలవానితి=బలవంతుఁడని. మే=నాకు. మతిః=బుద్ధి. అహో=ఎంతఆశ్చర్యము॥ తా॥ ఏనుఁగులకును, సర్పములకును, బంధనమును, చంద్రసూర్యులకుఁ గలిగియున్న గ్రహబాధను, బుద్ధిమంతులయొక్క దారిద్ర్యమును చూచి దైవము మిగులబలవంతుఁడని తోఁచుచున్నదని తాత్పర్యము॥ అని చెప్పిన విని విక్రమార్క మహారాజిట్లనియె. ఓదేవదత్తుఁడా! నీవు మిగులబుద్ధిమంతునివలెఁ గనఁబడుచున్నావు. బుద్ధిమంతుఁడవయ్యును, పాపకర్మములలోనొకటియగు జూదమునందు బుద్ధికలవాఁడవైతివనిన విని యాదేవదత్తుఁడిట్లనియె. ఓపురుషోత్తమా! ప్రాజ్ఞుఁడగు పురుషుఁడు కర్మవశముచేత నేకార్యమును చేయఁడు. సర్వకార్యములను చేయును. మఱియును,

శ్లో॥ కింనకుర్యాన్నరః ప్రాజ్ఞః ప్రేర్యమాణస్స్వకర్మభిః। ప్రాగేవహి మనుష్యాణాం బుద్ధిః కర్మానుసారిణీ॥

టీ॥ స్వకర్మభిః=తనయొక్క కర్మములచేత. ప్రేర్యమాణః=ప్రేరేపింపఁబడిన. నరః=మానవుఁడు. ప్రాజ్ఞోపి=ప్రాజ్ఞుఁడయినను. కింనకుర్యాత్=ఏమి చేయఁడు. మనుష్యాణామ్=మనుష్యులయొక్క. బుద్ధిః=బుద్ధి. ప్రాగేవహి=ముందుగానే. కర్మానుసారిణీ=కర్మమును అనుసరించిపోవునట్టిది॥ తా॥ తనయొక్క పూర్వజన్మమునందలి కర్మములచేత ప్రేరేపింపఁబడిన మానవుఁడు మిగుల బుద్ధిమంతుఁడైనను కర్మానుసారముగఁ బ్రవర్తింపక యెట్లుపోవును. అదియునుగాక మనుష్యులయొక్క బుద్ధి పూర్వజన్మమునందలి కర్మానుసారముగఁ బోవునుగదా యని తాత్పర్యము॥ అను న్యాయమును చెప్పినవిని విక్రమార్క మహారాజిట్లనియె. ఓపురుషోత్తమా! ద్యూతము అనేకపాపములకు మొదటికారణము. మఱియును, సకల దుఃఖములకును నివాసస్థానము. మఱియును,

శ్లో॥ భవనమిదమకీర్తేశ్చోరవేశ్యాదిసద్మ వ్యసననిధిరుదగ్రాసన్నిధిః పాపబీజం। విషమనరకమార్గే ష్వగ్రయాయావమర్త్యః క ఇహ విశదబుద్ధిర్ద్యూతకార్యం కరోతి॥

టీ॥ ఇదమ్=ఈద్యూతము. అకీర్తేః=అపకీర్తికి. భవనమ్=నివాసస్థానము. చోరవేశ్యాదిసద్మ=చోరవేశ్యాదులకుపుట్టినయిల్లు. వ్యసననిధిః=వ్యసనమునకు సముద్రమువంటిది. ఉదగ్రాసన్నిధిః=మిగులభయంకరములయిన ఆపత్కార్యములకు స్థానము. పాపబీజమ్=పాపమునకు కారణము. విషమనరకమార్గేషు=వ్యత్యయములయిన నరకమార్గములయందు మొదటిది. ఏతత్=ఇటువంటి. ద్యూతకార్యమ్=ద్యూతకార్యమును. విశదబుద్ధిః=నిర్మలమైనబుద్ధికల. కః=ఏ. మర్త్యః=మర్త్యుఁడు. ఇహ=ఈలోకమునందు. కరోతి=చేయుచున్నాఁడు॥ తా॥ ఓపురుషోత్తమా! ఈద్యూతము అపకీర్తికిపుట్టినయిల్లు. దొంగలు వేశ్యలు మొదలుగాఁగలవారికి నివాసస్థానము. వ్యసనములకు సముద్రమువంటిది. మిగుల భయంకరములయిన ఆపత్కార్యములకు స్థానము. పాపములకు కారణమైనది. వ్యత్యయములయిన నరకమార్గములయందు మొదటిది. ఇటువంటి ద్యూతకార్యమును బుద్ధిమంతుఁడయిన యేమానవుఁడు చేయుచున్నాఁడు. ఎవ్వఁడును చేయఁడని తా॥ మఱియును,

శ్లో॥ ద్యూతమాంససురావేశ్యాఖేటచౌర్యపరాంగనాః। మహాపాపానిసప్తైవ వ్యసనానిత్యజేద్బుధః॥

టీ॥ ద్యూత...గనాః=ద్యూత=ద్యూతము. మాంస=మాంసము. సురా=కల్లు. వేశ్యా=వేశ్యాస్త్రీ. ఆఖేట=వేట. చౌర్య=దొంగతనము. పరాంగనాః=పరస్త్రీ. (అనునవి) ఏతాని=ఈ. సప్త=ఏడును. మహాపాపా

శ్చైవ-అధికములయిన పాపములే. ఏతాని= ఈ. వ్యసనాని= వ్యసనములను. బుధః=విద్వాంసుఁడు. త్యజేత్=విడువవలయును॥ తా॥ ద్యూతము, మాంసము, కల్లు, వేశ్య, వేట, దొంగతనము, పరస్త్రీలు, అను నేడును మహాపాపకార్యములు. కావున ఈయేటిని బుద్ధిమంతుఁడగువాఁడు విడువవలయునని తాత్పర్యము॥ మఱియును, లోకములో ఈయేడువిధములయిన వ్యసనములలో ఒకదానిచేతనే మానవుఁడు ముఖ్యముగా నశించిపోవును. ఒకదానిచేతనేకీడువాటిల్లుట వాస్తవమైయుండఁగా సప్తవ్యసనములును కలవాఁడు నశించునని చెప్పవలయునా? మఱియును,

శ్లో॥ ద్యూతాద్ధర్మసుతః పలాదిహ బకో మద్యాద్యదోర్నందనాః శక్రో జారతయా మృగాంతకతయా స బ్రహ్మదత్తో నృపః। చోరత్వాచ్చ యయాతిరన్యవనితాసంగాద్దశాస్యో మహానేకైకవ్యసనార్దితా యత ఇమే సర్వైర్న కో నశ్యతి॥

టీ॥ ద్యూతాత్= ద్యూతమువలన. ధర్మసుతః= ధర్మరాజు. పలాత్=మాంసమువలన. ఇహ= ఈలోకమువలన. బకః= బకాసురుఁడు. మద్యాత్=మద్యమువలన. యదోః= యదువుయొక్క. నందనాః= నందనులు. జారతయా= జారత్వముచేత. శక్రః= దేవేంద్రుఁడును. మృగాంతకతయా=మృగములయొక్క అంతకత్వముచేత. సః=ప్రసిద్ధుఁడును. బ్రహ్మదత్తః=బ్రహ్మదత్తుఁడనుపేరుకలవాఁడును. (అయిన) నృపః=రాజును. చోరత్వాత్=దొంగతనమువలన. యయాతిశ్చ= యయాతియును. అన్యవనితాసంగాత్ = పరస్త్రీసంయోగమువలన. మహాన్= గొప్పవాఁడగు. దశాస్యః=రావణాసురుఁడును. (అనువట్టి) ఇమే= వీరందఱును. యతః= ఏహేతువువలన. ఏకైకవ్యసనేన= ఒకొక్కదుఃఖముచేత. అర్దితాః=పీడింపఁబడిరో. తతః=ఆహేతువువలన. సర్వైః=సమస్తవ్యసనములచేతను. కః=ఎవ్వఁడు. ననశ్యతి= నశింపఁడు॥ తా॥ ద్యూతమువలన ధర్మరాజును, మాంసమువలన బకాసురుఁడును, మద్యమువలన యదునందనులును, జారత్వముచేత దేవేంద్రుఁడును, వేటచేత బ్రహ్మదత్తుఁడను రాజేన్ద్రుఁడును, దొంగతనమువలన యయాతియును, పరస్త్రీసంయోగమువలన రావణాసురుఁడును, నాశమునుపొందిరి. ఇటు ఒకొక్కదానిచేత ఒకొక్కఁడు మరణమును పొందఁగా అన్నియును కలవాఁడు నాశమును పొందుననుటయందు సందేహములేదని తాత్పర్యము॥ అను ప్రమాణవచనములనుపట్టి ఆలోచింపఁగా దుర్వ్యసనాసక్తుఁడు నశించునని తెలియుము. మఱియు నోమహీపోత్తమా! ఈన్యాయము



లను అనుసరించి సప్తవ్యసనములను పరిత్యజింపుమనిన దేవదత్తుఁ డిట్లనియె. ఓరాజోత్తమా! నాకిదియేజీవనాంశమై యున్నది. నేను దీనిని విడిచిపెట్టినయెడల నాకు జీవనాధారమేదియును లేకయున్నది. నేనేమిచేయుదును. నాకుధనార్జనోపాయమును మఱియొకదానిని చెప్పినయెడల నేనిద్యూతకర్మమును విడిచిపెట్టుదునని యె. ఆసమయమునందు ఇరువురు బ్రాహ్మణులు అచ్చోటునకువచ్చి యాదేవాలయమునం దొకచోటఁ గూర్చుండిరి. కూర్చుండి యొకరితో నొకరిట్లని యాలోచించుచుండిరి. ఆసమయమునందా యిరువురిలో నొకఁడిట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! నేను పిశాచలిపిని చదువుకొని యుంటిని. అందువలన నీదేవాలయములోని శిలయందున్న యక్షరములను చదివితిని. ఈదేవాలయముయొక్క యీశాన్యభాగమునందలి పుట్టయందు ధనరత్నాదులచేత నిండిన మూఁడుకలశములుకలవట. అవిబారెడు లోతుననున్నవట. ఆపుట్టయొక్క సమీపమునందు భైరవుని ప్రతిమయొక్కటి కలదు. ఆభైరవునికి కంఠరక్తముచేత తృప్తినిపొందించి ఆమూఁడుకలశములను గ్రహింపుమనియె. ఆసమయమునందు విక్రమార్కమహారాజు ఆవృత్తాంతమునువిని అచ్చోటునకుఁబోయి యాభైరవునకు తనకంఠరక్తముచేతఅభిషేకమును చేయుటకుద్యమించె. ఆసమయమునందు భైరవస్వామి ప్రసన్నుఁడై యిట్లనియె. ఓరాజోత్తమా! ప్రసన్నుఁడనైతిని. వరమును గోరుమనిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓదేవోత్తమా! నీవు ప్రసన్నుఁడవైనయెడల యీజూదరికి నవరత్నాదులచేత నిండింపఁబడిన మూఁడుఘటములను నిమ్మనినవిని యాభైరవుఁడు సంతోషించి యాధనమును సర్వమును ఆజూదరికిచ్చె. అంతట నాద్యూతకారుఁడా ధనమును సర్వమును గ్రహించి విక్రమార్కమహారాజును అనేకవిధముల స్తోత్రమునుచేసి తనయింటికిఁబోయె. అంతట విక్రమార్కుఁడును నిజనగరమునకుఁబోయెనని యీకథను చెప్పినవిని భోజమహారాజేమియునుపలుకక తనమందిరమునకు పరివారజనముతోఁ గూడఁబోయె.

ఇట్లు విక్రమార్క చరిత్రయందలి ఇరువదేడవ ఉపాఖ్యానము ముగిసెను.

——(*) ఇరువదియెనిమిదవ చరిత్రము. (*)——

అంతట మరల నొకనాఁడు భోజమహారాజు ఆసింహాసనముమీఁద నెక్కవలయునని వేడుక తలంపుకలవాఁడై సుముహూర్తమునువిచారించుకొని

మునుపటివలెనేవచ్చి యాసింహాసనము నెక్కఁబోవుచుండఁగా మఱియొక సాలభంజిక యిట్లనియె. ఓరాజోత్తమా! నీవు భూపాలుఁడవైనను విక్రమార్కునియందుఁగల సాహసాదిగుణములు నీయందులేవు కనుకనీవీసింహాసనముమీఁద గూర్చుండఁదగవనినవిని భోజమహారాజు విక్రమార్కునియొక్క సాహసాదిగుణములు చెప్పుమనఁగానే ఆయిరువదేనిమిదవసాలభంజిక యిట్లనియె. ఓరాజోత్తమా! విక్రమార్కమహారాజు రాజ్యముచేయుచున్న కాలమునందు ఒకనాఁడు భూమియందంతటను సంచరింపవలయునని యెడు తలంపుకలవాఁడై తనపట్టణమునుండి బయలువెడలి యొకపట్టణమునకుఁబోయెను. పోయి యాపట్టణమునకు సమీపమునందు నిర్మలోదకములుకల యొకనది ప్రవహించుచుండఁగా నక్కడఁగూర్చుండెను. మఱియు నానదీతీరమునందు అనేక విధములయిన పుష్పములచేత పరిమళించుచున్నదియును, నానావిధములయిన పక్షులయొక్క కూఁతలచేత మనోహరమైనదియును, అయిన యొకవనమునుచూచెను. ఆవనముయొక్క మధ్యయందు మిగుల మనోహరములయిన గోపురములచేత ప్రకాశించుచున్న యొకగోపురముండెను. ఆదేవాలయమునుకూడ చూచినపిమ్మట నానదియందు స్నానమును చేసి యాదేవాలయమును నలంకరించియున్న దేవునకు నమస్కారమును చేసియక్కడఁగూర్చుండెను. ఆసమయమునందు విదేశవాసులగు నల్గురుపురుషులువచ్చి యావిక్రమార్కునకు సమీపమునందుఁ గూర్చుండిరి. అప్పుడు విక్రమార్కమహారాజు వారలతోనిట్లనియె. ఓపురుషోత్తములారా! మీరెక్కడనుండి వచ్చుచున్నారు. ఎక్కడకుఁ బోవుచున్నారనిన వారలలోనొకఁడిట్లనియె. ఓరాజోత్తమా! మేము పూర్వదేశమునుండివచ్చుచున్నామనిన విక్రమార్కమహారాజు పూర్వదేశమునందే మేమివిచిత్రములను చూచితిరనిన వారలిట్లనిరి. ఓరాజోత్తమా! తూర్పుదేశమునందు అత్యాశ్చర్యమును చూచితిమి. మఱియును, మేము మాప్రాణములను చేతిలోఁ బెట్టుకొని వచ్చితిమనినవిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓపురుషోత్తములారా! ఆవిషయమును సర్వమును తెలియఁజేయుఁడనిన వారలిట్లనిరి. ఓరాజోత్తమా! తూర్పుదేశమునందు భేతాళమనియెడు పట్టణమొకటికలదు. ఆపట్టణమునందు రక్తపానమునం దభిలాషకల దేవతయొక్కటికలదు. ఆపట్టణమునందున్న జనులును, అందలిరాజును ప్రతిసంవత్సరమునందును తమమనోరథము పూర్తియగుటకొఱకు పురుషబలినిఇచ్చుచున్నారు. అట్లుండఁగా వారుబలినిచ్చుదినమునందు ఒకవేళపరదేశవాసి యెవ్వఁడైన వచ్చియున్నయెడల వానిని బలినిచ్చుచుందు



రు. మేము మాదురదృష్టవశమున ఆదినమునందక్కడకుఁబోతిమి. ఆసమయమునందు ఆపట్టణమునందలివారు మమ్ములనుబట్టి బలినిచ్చుటకుప్రయత్నించిరి. ఆవృత్తాంతమును కర్ణాకర్ణికగావిని మేముప్రాణత్రాణపరాయణులమై యేదోయొకవిధముగా పలాయనమునుపొందుటయే యుత్తమమనితలఁచి కొంపరుగెత్తివచ్చితిమని యాశ్చర్యకరమైన యావృత్తాంతమును సర్వమును చెప్పినవిని విక్రమార్కమహారాజు ఆనగరమునకుఁబోయెను. పోయి మిగులభయంకరమైన యాదేవాలయమునుచూచి యాదేవతకు నమస్కరించి యిట్లని స్తోత్రముచేసె.

శ్లో॥ బ్రాహ్మీవారిరుహేందుసౌమ్యవదనా మాహేశ్వరీలీలయా। కౌమారీరిపువర్గనాశనకరీ చక్రాయుధా వైష్ణవీ। వారాహీఘనఘోరఘుర్ఘురరవా హ్యైంద్రీచవజ్రాయుధా। చాముండాగణనాథరుద్రసహితా రక్షంతు మాంమాతరః॥

టీ॥ వారిరుహేందుసౌమ్యవదనా=పద్మమువలెను, చంద్రునివలెను, సౌమ్యమైనమోముకల. బ్రాహ్మీ=బ్రాహ్మియును. లీలయా=విలాసముతో. ఉపలక్షితా=కూడుకొనిన. మాహేశ్వరీ=మాహేశ్వరియును. రిపువర్గనాశనకరీ=రిపువర్గమునునశింపఁజేయునట్టి. కౌమారీ=కౌమారియును. చక్రాయుధా=చక్రమనియెడునాయుధముకల. వైష్ణవీచ=వైష్ణవియును. ఘనఘోరఘుర్ఘురరవా=అధికమైనదియును, భయంకరమైనదియును, అయినఘుర్ఘురధ్వనికలదియును. (అయిన) వారాహీ=వారాహియును. వజ్రాయుధా=వజ్రాయుధముకల. ఐంద్రీచ=ఇంద్రాణియును. గణనాథరుద్రసహితా=గణనాథునితోడను, రుద్రునితోడనుకూడుకొనిన. చాముండా=చాముండయును. (అనునట్టి) సప్తమాతరః=ఏడ్గురుతల్లులును. మాం=నన్ను. రక్షంతు=రక్షింతురుగాత॥ తా॥ పద్మమువలెనుచంద్రునివలెనుఆహ్లాదకరమైనమోముకలదియగుబ్రాహ్మియును, విలాసముతోఁగూడుకొనిన మాహేశ్వరియును, శత్రుసమూహమునునశింపఁజేయునట్టి కౌమారియును, చక్రాయుధమునుధరించిన వైష్ణవియును, అత్యధికమును, మిగులభయంకరమును, అయినగురగురధ్వనికల వారాహియును, వజ్రాయుధమునుధరించిన యింద్రాణియును, గణనాథరుద్రులతోఁగూడుకొనిన చాముండయును, అనునట్టిసప్తమాతృకలును నన్నురక్షించుఁగాతయనితాత్పర్యము. అనిస్తోత్రమునుచేసి యాదేవాలయమునందలి రంగమంటపమునందుఁగూర్చుండెను. ఆసమయమునందు ఒకపరదేశవాసిదీనవదనుఁడై యాపట్టణమునందలి మహాజనులచేత వాద్యపురస్సరముగాఁ దీసికొ

నిలఁబడిరి. అప్పుడు విక్రమార్కమహారాజు అతనినిచూచి తనమనస్సునందిట్లనియాలోచించె. ఓహో వీరందఱును ఈపురుషుని దేవతాబలినిమిత్తముగఁ దీసికొనివచ్చుచున్నారు. కావుననే యితఁడు దీనవదనుఁడైయున్నాఁడు. ఈసమయమునందు నాశరీరమునిచ్చి యితనిప్రాణములను గాపాడెదను. ఈశరీరము నూరుసంవత్సరములుండినను నశించిపోవునదియే కదా కాఁబట్టి నాశరీరమునిచ్చి ధర్మకీర్తులను సంపాదించెదను. మఱియును.

శ్లో॥ చలాలక్ష్మీశ్చలాః ప్రాణాశ్చలో దేహోపియౌవనం। చలాచలశ్చసంసారః కీర్తిర్ధర్మశ్చనిశ్చలః॥

టీ॥ లక్ష్మీః=లక్ష్మీదేవి. (అనఁగా, సంపద) చలా=చపలమైనది. ప్రాణాః=ప్రాణములు. చలాః=చపలములయినవి. దేహోపి=దేహమును. చలః=చపలమైనది. యౌవనంచ=యౌవనమును. చలమ్=చపలమైనది. సంసారః=సంసారము. చలః=చపలమైనది. కీర్తిః=కీర్తియును. ధర్మశ్చ=ధర్మమును, నిశ్చలః=నిశ్చలమైనవి॥ తా॥ సంపదయును, ప్రాణములును, శరీరమును, యౌవనమును, సంసారమును చపలములయినవి. కాఁబట్టి ఈశరీరమునువదలి స్థిరములగు ధర్మకీర్తులను సంపాదింతమని తాత్పర్యము. మఱియును,

శ్లో॥ అర్థాఃపారదచంచలాగిరినదీ వేగోపమంయౌవనం। మానుష్యంజలవీచిబిందుచపలం ఫేనోపమంజీవితం। ధర్మంయోనకరోతినిశ్చలమతిః స్వర్గార్గళోద్ఘాటనం। పశ్చాత్తాపయుతోజరాపరిణతః శోకాగ్నినా దహ్యతే॥

టీ॥ అర్థాః=ద్రవ్యములు. పారదచంచలాః=పాదరసమువలెచపలములయినవి. యౌవనమ్=యౌవనము. గిరినదీవేగోపమమ్=కొండకాలువయొక్క వేగముతోసామ్యముకలది. మానుష్యమ్=మనుష్యత్వము. జలవీచిబిందుచపలమ్=తరంగములవలెచపలమైనది. జీవితమ్=జీవితకాలము. ఫేనోపమమ్=నురుగుతోసమానమైనది. యః=ఎవ్వఁడు. నిశ్చలమతిః=నిశ్చలమైనబుద్ధికలవాఁడై. స్వర్గార్గళోద్ఘాటనమ్=స్వర్గముయొక్క కవాటమును బ్రద్దలుచేయునట్టి. ధర్మమ్=ధర్మమును. నకరోతి=చేయఁడో. సః=అటువంటివాఁడు. పశ్చాత్తాపయుతః=పశ్చాత్తాపముతోఁ గూడుకొనినవాఁడై. జరాపరిణతః=ముసలితనమునుపొందినవాఁడై. శోకాగ్నినా=దుఃఖమనియెడునగ్నిచేత. దహ్యతే=కాల్పఁబడుచున్నాఁడు॥ తా॥ ద్రవ్యములుపాదరసమువలెఁ జపలములయినవి. యౌవనము కొండకాలువయొక్క వేగముతోఁ బోల్పఁదగినది. మనుష్యత్వము తరంగప్రాయమైనది. జీవనకాలము నురుగుతోసమానమైనది. కాఁబట్టియే



యైనవాఁడు చపలములగువీనినమ్మి స్వర్గద్వారమును బ్రద్దలుచేయునట్టి ధర్మమునుచేయఁడో అట్టివాఁడు ముసలితనమునందు పశ్చాత్తాపముచేతదగ్ధుఁడై దుఃఖమనియెడునగ్నిచేత కాల్పఁబడుచున్నాఁడని తాత్పర్యము॥ అనుప్రమాణవచనములనుపట్టి ఆలోచించి యామహాజనులతోనిట్లనెను. ఓమహాజనులారా! ఇతఁడు మిగులదీనమైన మోముకలవాఁడు. ఇతనినేనిమిత్తముగ నెక్కడకుఁ దీసికొనిపోవుచున్నారనిన వారలుఇతనిని దేవతాబలినిమిత్తముగఁదీసికొనిపోవుచున్నామనిరి. అంతట నావిక్రమార్కమహారాజు మరలనిట్లనెను. ఓజనోత్తములారా! ఈదేవతకునరబలినిచ్చుటవలనఁ బ్రయోజన మేమనిన వారిట్లనిరి. ఈదేవతకు నరబలినిచ్చినయెడల ఈదేవతప్రసన్నురాలై మాకోర్కెలను నెఱవేర్చుననిన విక్రమార్కమహారాజు మరలనిట్లనెను. ఇతఁడు అల్పమైనశరీరముకలవాఁడు. అదియునుఁగాక అధికముగా భయమునుపొందియున్నవాఁడు. ఇతనిశరీరముచేత ఆదేవతకెంతమాత్రము తృప్తికలుగును? ఏమియును తృప్తికలుగఁజాలదు. కాఁబట్టి ఇతనినివిడిచిపెట్టుఁడు. నేనుఇతనినిమిత్తముగ నాశరీరమునిచ్చెదను. నేనుఅధికముగా బలిసియున్నాఁడను. నామాంసముచేతనీదేవత యితనిమాంసముకంటెనధికముగా సంతోషమునుపొందఁగలదనిచెప్పి యామానవునివిడిపించఁజేసి తానుమహాసంతోషముతో ఆదేవతయొద్దకుఁబోయి తనఖడ్గముచేత కంఠమును తెగవేయఁదలఁచి ఖడ్గమును కంఠమునందుఁబెట్టెను. ఆసమయమునందాదేవతసంతోషముచే ప్రసన్నురాలై అతనిచేతిలోనిఖడ్గమును తీసికొని యిట్లనెను. ఓపురుషోత్తమా! నీధైర్యమునకును, నీయౌదార్యమునకును సంతోషించితిని. నీకభీష్టమైనవరమును కోరుమనిన విక్రమార్కమహారాజిట్లనెను. ఓదేవీ! నీవుప్రసన్నురాలవైనయెడల ఇదిమొదలుకొని నరబలినిపొందక విడిచిపెట్టుమనినవిని యాదేవతనరబలిని విడిచిపెట్టితిననెను. ఆసమయమునందు మహాజనులందఱును నిట్లనిరి. ఓరాజోత్తమా! నీవునీసుఖమునందుఁ గొంచెమైనను అభిలాషలేనివాఁడవగుచు పరులనిమిత్తముగవృక్షమువలె మిగులదుఃఖము ననుభవించుచున్నావు. కావున నీయట్టిమహానుభావు డెందునులేఁడు. మఱియును,

శ్లో॥ స్వసుఖనిరభిలాషః ఖిద్యసేలోకహేతోః ప్రతిదినమథవా తేవృత్తిరేవంవిధైవ। అనుభవతిహిమూర్ధ్నా పాదపస్తీవ్రముష్ణం శమయతిపరితాపంఛాయయా స్వాశ్రితానామ్॥

టీ॥ స్వసుఖనిరభిలాషః = నీయొక్క సుఖమునందుఁ గోర్కెలేనివాఁడవు లోకహేతోః=లోకముకొఱకుగా. ప్రతిదినమ్=దినదినమందును. ఖిద్య

నస్స-ఖేదమునుపొందుచున్నావు. అథవా=అట్లుగాదేని. తే-నీయొక్క. వృత్తిః-జీవనము. ఏవంవిధైవ-ఇటువంటిదియే. పాదపః=వృక్షము. తీవ్రమ్-తీక్ష్ణమైన. ఉష్ణమ్-వేడిమిని. మూర్ధ్నా=శిరస్సుచేత. అనుభవతి=అనుభవించుచున్నది. ఛాయయా=నీడచేత. స్వాశ్రితానామ్=తనను ఆశ్రయించిన వారలయొక్క. పరితాపమ్=పరితాపమును. శమయతి=పోఁగొట్టుచున్నదికదా॥ తా॥ నీవులోకులకొఱకుఁగా ప్రతిదినమునందును ఖేదమునుపొందుచున్నావు. ఇవ్విధముగఁజెప్పనేల? నీయొక్క వృత్తియే ఇటువంటిది. వృక్షముతనయొక్క శిరస్సుచేత సూర్యకిరణములవలనఁగలిగిన వేడిమినిభరించుచు తననీడచేత తనను ఆశ్రయించినవారియొక్క పరితాపమును పోఁగొట్టుచున్నదని తాత్పర్యము॥ అనున్యాయానుసారముగ నీవును లోకులకొఱకు అధికములగుదుఃఖములను భరించుచున్నావు. కాఁబట్టి నీయట్టివారలెవ్వరును లేరని యావిక్రమార్కుని స్తోత్రముచేసి తమతమస్థానములకుఁబోయిరి. అంతట విక్రమార్క మహారాజు ఆదేవియొక్క అజ్ఞనుపొంది తనపట్టణమునకుఁబోయెనని యీకథనుచెప్పి యాసాలభంజిక మరలనిట్లనియె. ఓరాజోత్తమా! నీయందిట్టియౌదార్యాదిగుణములు కలిగియున్న యెడల నీవీసింహాసనముమీఁద నెక్కుమనినవిని భోజమహారాజేమియునుపలుకక మునుపటివలెనే పోయెను.

ఇట్లని విక్రమార్క చరిత్రయందలి ఇరువదెనిమిదవ ఉపాఖ్యానము ముగిసెను.

---

## (*) ఇరువదితొమ్మిదవ చరిత్రము (*)

అంతటమరలనొకనాఁడు భోజమహారాజు ఆసింహాసనమునెక్క దలచి సుముహూర్తమును విచారించుకొని పరివారజనసమేతముగా బయలువెడలి వచ్చి. వచ్చియాసింహాసనము నెక్కఁబోవుచుండఁగా మఱియొకసాలభంజిక యిట్లనియె. ఓరాజోత్తమా! విక్రమార్కునియందుగల శౌర్యాదిగుణములు నీయందున్నయెడల ఈసింహాసనముమీఁదగూర్చుండుము. లేనియెడల నూరకుండుమనిన భోజమహారాజు విక్రమార్కునివృత్తాంతమును చెప్పుమనిన ఆసాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్క మహారాజొకనాఁడు రాజకుమారులచేత సేవింపఁబడుచు సభయందుఁ గూర్చునియుండెను. ఆసమయమునందు ఒకానొకస్తుతిపాఠకుడువచ్చి నమస్కరించి.

శ్లో॥ యావద్వీచీతరంగాన్వహతిసురనదీజాహ్నవీ పుణ్యతోయం యావచ్చాకాశమార్గే తపతిదినకరోభాస్కరోలోకపాలః। యావద్వజ్రేంద్రనీలస్ఫటికమణిమయం విద్యతే మేరుశృంగం తావత్పుత్రైస్సభృత్యైః స్వజనపరివృతైర్భుంక్ష్వరాజ్యంనృపాల॥



టీ॥ సురనదీ=దేవనదియగు. జాహ్నవీ-గంగ. వీచీతరంగాన్-చిన్నవియును పెద్దవియును, అయినయలలను. పుణ్యతోయమ్-పావనమైనయుదకమును. యావత్=ఎంతపర్యంతము. వహతి=వహించుచుండునో. భాస్కరః=ప్రకాశించువాఁడును. లోకపాలః-లోకపాలుఁడును. (అయిన) దినకరః=సూర్యుఁడు. ఆకాశమార్గే=ఆకాశమార్గమునందు. యావత్=ఎంతపర్యంతము. తపతి=తపించుచున్నాఁడో. వజ్రేంద్రనీలస్ఫటికమణిమయమ్=వజ్రములయొక్కయు, ఇంద్రనీలమణులయొక్కయు, స్ఫటికమణులయొక్కయు, వికారమైన. మేరుశృంగమ్-మేరుపర్వతముయొక్క శిఖరము. యావత్=ఎంతపర్యంతము. విద్యతే-ఉన్నదో. తావత్=అంతపర్యంతమును. స్వజనపరివృతైః=స్వజనులతోగూడుకొనినవారును. సభృత్యైః=మనుమలతోఁగూడుకొనిన. వారు (అయిన) పుత్రైః=పుత్రులతోడను. హేనృపాల=ఓరాజా. రాజ్యమ్=రాజ్యమును. భుంక్ష్వ=అనుభవింపుము॥ తా॥ చిన్నవియును, పెద్దవియును, అయినతరంగములుకలదియును, దేవతలకునదియును, అయినగంగయెంతకాలము ప్రవహించుచున్నదో. పగటినిచేయువాఁడును, స్వయంప్రకాశమానుఁడును, లోకపాలుఁడును, అయినసూర్యదేవుఁడు ఎంతకాలము ఆకాశమార్గమునందుతపించుచున్నాఁడో. వజ్రములయొక్కయు, ఇంద్రనీలమణులయొక్కయు, స్ఫటికమణులయొక్కయు, వికారమైన మేరుపర్వతముయొక్క శిఖరము ఎంతకాలముండునో, అంతపర్యంతమును బంధుజనులతోడను, పౌత్రులతోడను, కూడుకొనినపుత్రులతోఁ గూడుకొనినవాఁడవై రాజ్యమునుఅనుభవింపుమని తాత్పర్యము॥ అనుశ్లోకమునుచెప్పి యాశీర్వచనమునుచేసి మఱియునిట్లనియె.

శ్లో॥ యథాతోయంసమాకాంక్షన్ మయూరోగ్రీష్మపీడితః। నిరీక్షతేఘజీమూతం తథాహంతవదర్శనమ్॥

టీ॥ మయూరః=నెమలి. గ్రీష్మపీడితః=గ్రీష్మఋతువుచేతపీడింపఁబడినదై. తోయమ్=ఉదకమును. సమాకాంక్షన్=కోరుచున్నదగుచు. అథ-పిమ్మట. జీమూతమ్=మేఘమును. యథా=ఏప్రకారముగా. నిరీక్షతే=చూచుచున్నదో. తథా=ఆప్రకారముగా. అహమ్=నేను. తవ=నీయొక్క. దర్శనమ్=దర్శనమును. నిరీక్షే=చూచుచున్నాను॥ తా॥ ఓరాజోత్తమా! నెమలిగ్రీష్మఋతువుచేతపీడింపఁబడినదై యుదకమునుగోరుచున్నదై మేఘమునుచూచుచున్నది.

అటులనే నేను నీదర్శనమునుకోరుచున్నానని తాత్పర్యము॥ అనిచెప్పిమఱియుని ట్లనియె. ఓరాజోత్తమా! నేనుహిమవత్పర్వతముదగ్గరనుండి వచ్చితిని. నీకీర్తిలోకప్రసిద్ధమైయుండుటచేత నీవలననాయభిలాషలను తీర్చికొందమనితలచివచ్చితిని. మఱియునోరాజోత్తమా!

శ్లో॥ కర్పూరాదపికైరవాదపిదళత్కుందాదపిస్వర్ణదీ। కల్లోలాదపికైతవాదపిచలత్కాంతాదృగంతాదపి। దూరోన్ముక్తకళంకశంకరశిరశ్శీతాంశుఖండాదపి। శ్వేతాభిస్తవకీర్తిభిర్ధవళితా సప్తార్ణవా మేదినీ॥

టీ॥ కర్పూరాదపి=కర్పూరముకంటెను. కైరవాదపి=తెల్లతామరకంటెను. దళత్కుందాదపి=వికసించుచున్నమల్లెమొగ్గకంటెను. స్వర్ణదీకల్లోలాదపి= ఆకాశగంగానదియందలి తరంగములకంటెను. కైతకాదపి=మొగలిపువ్వుకంటెను.చలత్కాంతాదృగంతాదపి=చలించుచున్నస్త్రీయొక్క కటాక్షములకంటెను. దూరోన్ముక్తకళంక శంకరశిరశ్శీతాంశుఖండాదపి=దూరముగా విడువఁబడిన యీశ్వరునిశిరస్సునందలి చంద్రశకలముకంటెను. శ్వేతాభిః=తెల్లనివియగు. తవ=నీయొక్క. కీర్తిభిః=కీర్తులచేత. సప్తార్ణవా=సప్తసముద్రములుకల. మేదినీ=భూమి. ధవళితా=తెల్లనిదైచేయఁబడినది॥ తా॥ కర్పూరముకంటెను, తెల్లకలువకంటెను, వికసించుచున్నమల్లెపూవులకంటెను, ఆకాశగంగయందలి తరంగములకంటెను, మొగిలిపువ్వులకంటెను, స్త్రీలయొక్క చపలములయిన దృగంతములకంటెను, ఈశ్వరునిశిరోభూషణమయినచంద్రఖండముకంటెను తెల్లనివగునీకీర్తులచేత సప్తసముద్రములతోఁ గూడుకొనినభూమియంతయును తెల్లగాఁజేయఁబడినదని తాత్పర్యము. మఱియును,

శ్లో॥ దేవ దేవతరుచ్ఛాయా మాశ్రితోస్మిమహీపతే। కిన్నామఖలు దైన్యంమే ధన్యోనాన్యోస్తిమద్భువి॥

టీ॥ దేవ=ఓరాజా! హేమహీపతే=భూపతివైన యోవిక్రమార్కమహారాజా! దేవతరుచ్ఛాయామ్=కల్పవృక్షముయొక్క నీడను. ఆశ్రితః=ఆశ్రయించినవాఁడను. అస్మి=అయితిని. మే=నాకు. దైన్యమ్=దీనత్వము. కిన్నామఖలు=ఏమియున్నది. భువి=భూమియందు. మత్=నాకంటె. ధన్యః=ధన్యుఁడు. అన్యః=మఱియొకఁడు. నాస్తి=లేడు॥ తా॥ భూపాలకుఁడవైన యోవిక్రమార్కమహారాజా! నేనుకల్పవృక్షముయొక్క నీడనుఆశ్రయించితిని. నాకికదీనత్వములేను. ఈభూలోకమునందు నాకంటెధన్యుఁడగువాఁడు మఱియొకఁడు లేఁడని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ దేవసర్వస్వదాతారం భవంతంపశ్యతోమమ। గాహతేహృదయంభూపంకంవదాన్యశిరోమణిమ్॥



టీ॥ దేవ=ఓవిక్రమార్కమహారాజా! సర్వస్వదాతారమ్=సమస్తమూలధనమునకును దాతవు. (అయిన) భవంతమ్=నిన్నును. పశ్యతః=చూచుచున్న. మమ=నాయొక్క. హృదయమ్=హృదయము. వదాన్యశిరోమణిమ్=దాతలలోనుత్తముఁడగు. కమ్=ఏ. భూపమ్=రాజును. గాహతే=ప్రవేశించున్నది॥ తా॥ ఓరాజోత్తమా! యాచకులకు సర్వధనములనుఇచ్చునట్టి నిన్నుచూచుచున్న నాయొక్కహృదయము దాతలలోనుత్తముఁడగు మఱియొకనియందుఁ బ్రవేశింపదని తాత్పర్యము॥ అనియాస్తోత్రపాఠకుఁడు చెప్పినమాటలనువిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓపురుషోత్తమా! నీవు దేనినితలఁచుకొనివచ్చితివి? అనినవాఁడు విజనుఁడిట్లనియె. ఓరాజోత్తమా! హిమవత్పర్వతమున కుత్తరదిగ్భాగమునందలి జంబీరనగరమునందు ధనేశ్వరుఁడనుపేరుకల రాజుకలఁడు. అతఁడుయాచకులయొక్క దారిద్ర్యదుఃఖమునుపోఁగొట్టి యాచకులనందఱను ధనపతులనుగాఁజేయుచున్నాఁడు. ఆకుబేరుఁడొకనాఁడనఁగా మాఘశుద్ధదశమియందు వసంతపూజచేయఁబడినది. మఱియునక్కడ దానముకొఱకు పదునెనిమిదికోట్ల సువర్ణమునునియమించె. ఈవిధముగా ఆరాజు మిగులనౌదార్యగుణముకలవాఁడై జాగరూకుఁడైయున్నాఁడు. ఈదేశమునందు అట్టిరాజొకఁడె కనఁబడుచున్నాఁడనినవిని విక్రమార్కమహారాజు ధనాగారాధ్యక్షునిపిలిచి యిట్లనియె. ఓధనాధ్యక్షుఁడా! ఇతనినితీసికొనిపోయి మనధనాగారములోని యనర్ఘములగు రత్నాదులన్నిటినిచూపి యితఁడెన్నిటినినడుగునో వానినన్నింటినిమ్మనియె. ఆమాటనువినికోశాధ్యక్షుఁడు ఆవందిజనునితీసికొనిపోయి వానినన్నిటినిచూపె. అంతటనాస్తుతిపాఠకుఁడు తనచేతకోరఁబడిన రత్నములనన్నింటిని యథేచ్ఛముగ్రహించి పరిపూర్ణమైన మనోరథముకలవాఁడై యారాజసమీపమునకుఁబోయి యిట్లనియె. ఓరాజోత్తమ! నేనునీయొక్కయనుగ్రహమువలన నవనిధులనుచేతియందుఁబెట్టుకొనినకుబేరుఁడనైతిని. హిరణ్యగర్భాదులుకూడ నీతోసమానులుకారు. మఱియును,

శ్లో॥ వేధావేదమయోవిష్ణుర్గోవిందోపిగదాధరః। శంభుశ్శూలీవిషాదీచ దేవఃకేనోపమీయతామ్॥

టీ॥ వేదమయః=వేదరూపుఁడయిన. వేధాః=బ్రహ్మదేవుఁడును. విష్ణుః=సర్వవ్యాపకుఁడును. గదాధరః=గదాధరుఁడును. (అయిన) గోవిందోపి=గోవిందుఁడును. శూలీ=శూలధారియును. విషాదీచ=విషపానమునుచే

యయువాఁడును. (అయిన) శంభుః= ఈపేరుకల. దేవః= దేవుఁడు. కేన= దేనిచేత. ఉపమీయతామ్= పోల్పఁబడుదురు॥ తా॥ వేదగర్భుఁడగు బ్రహ్మదేవుఁడును, సర్వవ్యాపకుఁడును, గదాధరుఁడును, అయినగోవిందుఁడును, శూలధారియును, విషమునుభక్షించినవాఁడును, అయినశివుఁడును, ఏకారణముచేత నీతోఁబోల్పఁబడుదురు? ఏకారణముచేతను పోల్పఁబడరనితాత్పర్యము॥ అనిస్తోత్రమునుచేసి బ్రహ్మాయుష్కుఁడవుకమ్మని యాశీర్వచనమునుచేసి తననగరమునకుఁబోయెనని యీకథనుచెప్పినవిని భోజమహారాజు మిగులనాశ్చర్యముకలవాఁడై సుముహూర్తముమించిపోవుటచేత మరలిపోయె.

ఇట్లని విక్రమార్కచరిత్రయందలియిరువదితొమ్మిదవ ఉపాఖ్యానము ముగిసెను.

---

## (*) ముప్పదియవచరిత్రము. (*)

అంతటమరలనొకనాఁడు భోజమహారాజు ఆసింహాసనముమీఁదఁ గూర్చుండవలయునని యెడు తలంపుకలవాఁడై సుముహూర్తమునువిచారించుకొని సపరివారజనముతోఁగూడుకొనినవాఁడైవచ్చి యాసింహాసనముమీదనెక్కఁబోవుచుండఁగా మఱియొకసాలభంజిక యిట్లనియె. ఓరాజోత్తమా! విక్రమార్కునియందుగల యౌదార్యాదిగుణములునీయందున్నయెడల నీవీసింహాసనముమీఁదఁగూర్చుండుము. లేనియెడల నీవీసింహాసనమును విడిచిపెట్టుమనినవిని యాభోజమహారాజు విక్రమార్కునియొక్క శౌర్యాదిగుణములను చెప్పుమనఁగా ముప్పదవసాలభంజిక యిట్లనియె. ఓరాజోత్తమా! ఒకనాడు విక్రమార్కమహారాజు సకలరాజకుమారులతోడను సామంతరాజులతోడను కూడుకొనినవాఁడై యీసింహాసనమునందుగూర్చుండె. ఆసమయమునందక్కడకు నొక్కఁడైంద్రజాలకుఁడువచ్చినమస్కరించి యిట్లనియె. ఓరాజోత్తమా! సకలవిద్యలను తెలిసిననీదగ్గరకు అనేకులగునైంద్రజాలికులువచ్చితమతమలాఘవములనుచూపిరిగదా? నేనునుకొన్నిలాఘవములనుచూపెదను. తమరనుగ్రహించిచూడవలయునని ప్రార్థించుచున్నాఁడననినవిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓయైంద్రజాలికోత్తమా! ఇదితగినసమయముగాదు. ఇదిమాకుస్నానసమయమైయున్నది. రేపటిప్రాతఃకాలమునందుఁజూచెదము. పోయిరమ్మని చెప్పి యామహారాజు నిజమందిరములోనికిఁబోయె. అంతటమరునాటప్రాతఃకాలమునందు విక్రమార్కమహారాజు కాలోచితకృత్యములనునెరవేర్చుకొని ప్రియబాంధవజనముతోఁగూడ వస్త్రాభరణాదులనుధరించుకొని కొలువుకూ



టమునకువచ్చి యాయైంద్రజాలికునిపిలిపించె. అంతట నాయైంద్రజాలికుఁడు అధికమైనశరీరముకలవాఁడును, అధికములయినమీసములచేత దేదీప్యమానమయినముఖముకలవాఁడును, కుడిచేతియందుఖడ్గమునుపెట్టుకొని మిగులమనోహరములయిన రూపలావణ్యాదులుకల యొకసుందరీమణితోఁగూడ ఆసభామంటపములోనికివచ్చె. వచ్చి యారాజేంద్రునకు నమస్కారమును చేసి కూర్చుండె. ఆసమయమునందు సభికులందఱును మిగుల నాశ్చర్యముకలవారై చూచిరి. మఱియు నీవెవ్వఁడవనియును, ఏదేశమునందు వాఁడవనియును, అడిగిరి. అంతట నతఁడిట్లనియె. అయ్యా! నేను మహేంద్రసేవకుఁడను. ఒకానొకనాడు దేవేంద్రునిచేత శపింపఁబడినవాఁడనై భూలోకమునందు తిరుగుచున్నాను. ఇదినాభార్య. ఇప్పుడు స్వర్గలోకమునందు దేవతలకును రాక్షసులకును అపరిమితమైన యుద్ధము జరుగుచున్నది. కావున నేనిప్పుడక్కడకు పోవుచున్నాను. మఱియును, ఈవిక్రమార్కమహారాజు పరనారీసహోదరుఁడని వింటిని. అందువలన నేను నాభార్యను విక్రమార్కమహారాజునొద్దఁబెట్టి పోవలయునని తలఁచితిననినవిని విక్రమార్కమహారాజు మిగుల నాశ్చర్యముకలవాఁడై కొంతసేపటికి అతనిభార్యనుతనయొద్దనుంచుకొనుటకు అంగీకరించె. అంతటనాయైంద్రజాలికుఁడు తనభార్యను విక్రమార్కునకువప్పగించి తాను అంతరిక్షమునకెగిరె. ఆసమయమునందాకాశమునందు ఓరే, ఓరే! చంపుముచంపుము. కొట్టుముకొట్టుము. అనియంతరిక్షమునందు మిగుల భయంకరములయిన మాటలు వినఁబడెను. ఆమాటలనువిని యెల్లవారును ఒక్కమాటుగా ఆకాశమునందు ముఖమును పెట్టి చూచుచుండిరి. అంతఁగొంతసేపటికి దృఢమైనపిడికిలిచేత పీడింపఁబడినఖడ్గముకలదియును, రక్తధారలతోఁగూడుకొనినదియును, అయిన యొకబాహువు అంతరిక్షమునుండి విక్రమార్కుని దగ్గఁబడియె. దానిఁజూచి విక్రమార్కమహారాజు సభికులతోనిట్లనియె. ఓసభికజనోత్తములారా! ఈభుజముకల పురుషుఁడు మహాబలవంతుఁడు. ఈభుజమును ప్రతిభటులుయుద్ధమునందుఁ దెగఁగొట్టి క్రిందఁబడవైచిరనియె. ఇట్లుచెప్పుచుండఁగా కొంతసేపటికి కళేబరముపడియె. అంతఁగొంతసేపటికి శిరస్సుపడియె. ఆశిరస్సునుచూచి విక్రమార్కునియొద్దనున్న యాయువిది యపరిమితముగాఁ గన్నీళ్ళఁగార్చుచు నిట్లనియె. అయ్యో నాభర్తను యుద్ధమునందు శత్రువులుచంపి క్రిందఁబడవైచిరి. ఇది నాభర్తయొక్కశరీరము. ఇదినాభర్తయొక్కకళేబరము. ఇదినాభర్తయొక్కశిరస్సు. నేనేమిచేయుదును. నాభర్త మఱియొకతె

ను దేవలోకమునందు వరింపకమునుపే నేనుగూడఁబోయెదను. నాకగ్నిఁ బెట్టుం డనినవిని విక్రమార్క-మహారాజిట్లనియె. ఓయమ్మా! బిడ్డా! నీవెందుకుమరణమునుపొందెదవు. నేను నిన్ను కుమార్తెనుపరిపాలించినట్లు పరిపాలించెదగనక నయ్యంగన యిట్లనియె. ఓరాజోత్తమా! ఇంకను ఈశరీరమెందుకు. నాభర్తమరణమునుపొందెను. ఈశరీరమునెవరికొఱకు రక్షించుకొనియెదను. తమరువ్యర్థముగఁ జెప్పఁదగదు. మఱియును, లోకములోని స్త్రీలందఱును భర్తయొక్క మార్గము ననుసరింపవలసినదిగదా? మఱియును,

శ్లో॥ శశినాసహయాతి కౌముదీసహమేఘేనతటిత్ప్రలీయతే। ప్రమదాఃపతివర్త్మగా ఇతిప్రతిపన్నంహివిచేతనైరపి॥

టీ॥ కౌముదీ= వెన్నెల. శశినాసహ=చంద్రునితోఁగూడ. యాతి=పోవుచున్నది. తటిత్= మెఱుపు. మేఘేనసహ= మేఘముతోఁగూడ. ప్రలీయతే= తొలఁగుచున్నది. ఇతి=ఇట్లని. విచేతనైరపి= చేతనరహితమైన వానిచేతఁగూడ. ప్రమదాః=స్త్రీలు. పతివర్త్మగాఇతి= భర్తయొక్క మార్గమునుపొందినవారని. ప్రతిపన్నంహి=పొందఁబడినదిగదా॥ తా॥ వెన్నెల చంద్రునితోఁగూడ పోవుచున్నది. మేఘముతోఁగూడ మెఱుపులుపోవుచున్నవి. ఇట్లుపోవుచు లోకములోని స్త్రీలందఱును భర్తతోఁగూడ పోఁదగినవారని తెలుపుచున్నవని తా॥ మఱియును,

శ్లో॥ మృతేభర్తరియానారీ సమారోహేద్ధుతాశనం। సారుంధతీసమాప్రోక్తాస్వర్గలోకేమహీయతే॥

టీ॥ భర్తరి= యజమానుఁడు. మృతేసతి= మరణమునుపొందినవాఁడగుచునుండఁగా. హుతాశనమ్=అగ్నిహోత్రుని. సమారోహేత్= పొందునో. సా=ఆయాఁడుది. అరుంధతీసమా= అరుంధతీదేవితో సమానురాలు. ఇతి= ఇట్లని. ప్రోక్తాసతీ=చెప్పఁబడినదగుచు. స్వర్గలోకే=స్వర్గలోకమునందు. మహీయతే= పూజ్యురాలగుచున్నది॥ తా॥ యజమానుఁడు మరణమునుపొందిన పిమ్మట అగ్నిహోత్రమునందు ప్రవేశించునట్టి యాఁడుది అరుంధతీదేవితో సమానురాలని చెప్పఁబడినది. మఱియునట్టియాఁడుది స్వర్గలోకమునందుపూజ్యురాలగుచున్నదని తా॥ మఱియును,

శ్లో॥ యావచ్చాగ్నౌ మృతేపత్యౌ భార్యాత్మానం ప్రదాహయేత్। తావన్ముంచతినోదేహం స్త్రీగరిష్ఠాకథంచన॥

టీ॥ పత్యౌ= భర్త. మృతేసతి= మరణమునుపొందిన వాఁడగుచునుండఁగా. భార్యా=భార్య. యావత్=ఎంతదనుక. ఆత్మానమ్=తనను. అగ్నౌ= అగ్నియందు. ప్రదాహయేత్= దగ్ధముచేయునో. తావత్= అంతపర్యంతమును. గరిష్ఠా=పూజ్యురాలయిన. స్త్రీ=ఆఁడుది. కథంచన= అతికష్టముగా. దేహమ్= శరీరమును. తావత్=అంతపర్యంతమును. నోముంచతి= విడువదు॥ తా॥ భర్తమరణమునుపొందిన పిమ్మట భార్య తనశరీరమును అగ్నియందు ఎంతపర్యంతముదనుక విడిచిపెట్టదో అంతపర్యంతమును పూజ్యురాలయినయాఁడుది శరీరమునువిడిచిపెట్టనిదగుచున్నదని తా॥ మఱియును,



శ్లో॥ మాతృకంపితృకంచైవ యత్రచైవప్రదీయతే। కులత్రయంపునాత్యేషాభర్తారంయానుగచ్ఛతి॥

టీ॥ యా= ఏయాఁడుది. భర్తారమ్=భర్తను. అనుగచ్ఛతి=అనుసరించిపోవుచున్నదో. సైషా=ఆయీయాఁడుది. మాతృకమ్ = తల్లియొక్క-కులము. పితృకమ్=పితృకులము. యత్ర=ఏకులమునందు. ప్రదీయతే= ఈయఁబడెనదో. తత్= ఆకులము. (అనునట్టి) ఏతత్=ఈ.కులత్రయమ్=మూడుకులములసముదాయమును. పునాతి= పవిత్రమైనదానినిగాఁ జేయుచున్నది॥ తా॥ లోకములో ఏయాఁడుది సహగమనమును చేయుచున్నదో ఆయాఁడుది మాతాపితృకులములను భర్తృకులమును పావనములయినవానినిగాఁ జేయుచున్నదని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ తిస్రఃకోట్యోర్ధకోటీచ యానిరోమాణిమానవే। తావత్కాలంవసేత్స్వర్గే భర్తారంయానుగచ్ఛతి॥

టీ॥ యా=ఏయాఁడుది. భర్తారమ్= భర్తను. అనుగచ్ఛతి= అనుసరించి పరలోకమునుపొందుచున్నదో. సా= ఆయాఁడుది. తిస్రః= మూఁడు. కోట్యః=కోట్లు. అర్ధకోటీచ= ఏబదిలక్షలు. (అనియెడుసంఖ్యకల.) యాని= ఏ. రోమాణి=రోమములు. మానవే=మనుష్యునియందు. సంతి= కలవో. తావత్కాలమ్= అంతకాలము. స్వర్గే=స్వర్గమునందు. వసేత్=నివసించును॥ తా॥ లోకములో ఏస్త్రీభర్తతోఁగూడ మరణమునుపొందునో అటువంటియాఁడుది మానవశరీరమునం దెన్నిరోమములుకలవో అన్నిసంవత్సరములకాలము స్వర్గలోకమునందు నివసించునని తా॥ మఱియును,

శ్లో॥ వ్యాళగ్రాహీయథావ్యాళం చిరాదుద్ధరతేబలాత్। తథాస్త్రీపతిముద్ధృత్యసహతేనైవమోదతే॥

టీ॥ వ్యాళగ్రాహీ= పాములవాఁడు. యథా=ఏప్రకారముగా. వ్యాళమ్= సర్పమును. చిరాత్=చిరకాలము. బలాత్=బలాత్కారముగా. ఉద్ధరతే=ఉద్ధరించుచున్నాఁడో. తథా=ఆప్రకారముగా. స్త్రీ=ఆఁడుది. పతిమ్=భా

ర్యను. ఉద్ధృత్య= లేవనెత్తి. తేనసహైవ= అతనితోఁగూడనే. మోదతే= సంతోషించుచున్నది॥ తా॥ పాములవాఁడు పాములపుట్టలోని పాములను ఏవిధముగా బయలునకుఁదీయునో ఆవిధముగా పతివ్రతయగునాఁడుది భర్తను పాపమునుండి యుద్ధరించి స్వర్గలోకమునందు సంతోషించుచున్నదని తా॥ మఱియును,

శ్లో॥ దుర్వృత్తం వా సువృత్తం వా సర్వపాపరతం తథా। భర్తారం తారయత్యేషా భార్యా ధర్మే సునిష్ఠితా॥

టీ॥ దుర్వృత్తం వా= దుష్టమైన ప్రవర్తనకలవాఁడైనను. సువృత్తం వా= సద్వృత్తికలవాఁడైనను. తథా= ఆప్రకారముగా. సర్వపాపరతమ్= సకలపాపములయందును ఆసక్తికలవాఁడైనను. భర్తారమ్= భర్తను. ధర్మే= ధర్మమునందు. సునిష్ఠితా= చక్కఁగానున్న. ఏషా= ఈ. భార్యా= భార్య. తారయతి= తరింపఁజేయుచున్నాఁడు॥ తా॥ భర్త సద్వ్యాపారము కలవాఁడైనను, దుర్వ్యాపారముకలవాఁడైనను, సకల పాపరతుఁడయినను, ధర్మవతియగు భార్య తరింపఁజేయుచున్నదని తాత్పర్యము॥ అను ప్రమాణానుసారముగ నో రాజోత్తమా! పతిహీనురాలయిన యాఁడుదానియొక్క జీవితమునందు ప్రయోజనమేమికలదు. ఏమియును లేదు. మఱియును,

శ్లో॥ దీనాయాః పతిహీనాయాః కిం నార్యా జీవితే ఫలమ్। శ్మశానవటవత్తస్యాశ్శరీరం నిష్ప్రయోజనమ్॥

టీ॥ దీనాయాః= దీనురాలును. పతిహీనాయాః= భర్తలేనిదియును. (అయిన) నార్యాః= స్త్రీయొక్క. జీవితే= జీవితమునందు. ఫలమ్= ఫలము. కిమ్= ఏమి? (ఏమియును లేదు) తస్యాః= అటువంటి యాఁడుదానియొక్క. శరీరమ్= దేహము. శ్మశానవటవత్= శ్మశానమునందలి వటవృక్షమువలె. నిష్ప్రయోజనమ్= ప్రయోజనరహితమైనది॥ తా॥ పతివిహీనురాలును, దీనురాలును, అయిన యాఁడుదానియొక్క జీవితమునందు ఫలమేమికలదు. ఏమియును లేదనుట. మఱియును, అట్టియాఁడుదానియొక్క శరీరము శ్మశానవటవృక్షమువలె నిష్ఫలమైనదని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ అతిబంధుయుతా నారీ బహుపుత్రగణైర్యుతా। భోజ్యా భవతి సా నారీ పతిహీనా తపస్వినీ॥

టీ॥ యా= ఏ. నారీ= స్త్రీ. అతిబంధుయుతా= అనేకులయిన బంధువులతోఁ గూడుకొనినదియును. బహుపుత్రగణైః= అనేకులయినపుత్రులతో. యుతా= కూడుకొనినదియును. భోజ్యా= అనుభవింపఁదగినదియును.



(అయి) వర్తతే= ప్రవర్తించుచున్నదో. సా= అటువంటి. నారీ= ఆఁడుది. పతిహీనా చేత్= భర్తృహీనురాలయ్యెనేని. తపస్వినీ= దీనురాలు. భవతి= అగుచున్నది॥ తా॥ లోకములో ఏయాఁడుది అనేకులయిన బంధువులతోఁ గూడినదియును, అనేకులగు పుత్రులతోఁ గూడుకొనినదియును, అనుభవింపఁదగినదియును, అయియున్నదో అటువంటియాఁడుది భర్తృహీనురాలయ్యెనేని మిగుల దీనురాలగుచున్నదని తా॥ మఱియును,

శ్లో॥ గంధైర్మాల్యైస్తథా ధూపైర్వివిధైర్భూషణైరపి। వాసోభిశ్శయనైశ్చైవ విధవా కిం కరిష్యతి॥

టీ॥ గంధైః= గంధములచేతను. మాల్యైః= పూలమాలికలచేతను. తథా= ఆవిధముగా. ధూపైః= ధూపములచేతను. వివిధైః= నానావిధములయిన. భూషణైరపి= భూషణములచేతను. వాసోభిః= వస్త్రములచేతను. శయనైశ్చైవ= పడకలచేతను. విధవా= భర్తృహీనురాలయినయాఁడుది. కిం కరిష్యతి= ఏమి చేయఁగలదు॥ తా॥ గంధములచేతను, పూలమాలికలచేతను, ఆవిధముగా ధూపములచేతను, నానావిధములయినయాభరణములచేతను, వస్త్రములచేతను, శయ్యలచేతను, భర్తృవిహీనురాలయినయాఁడుది యేమి చేయఁగలదని తా॥ మఱియును,

శ్లో॥ నాతంత్రీ వాద్యతే వీణా నాచక్రో యాతి వై రథః। నాపతిస్సుఖమాప్నోతి నారీ బంధుశతైరపి॥

టీ॥ అతంత్రీ= తీఁగలులేని. వీణా= వీణ. నవాద్యతే= మ్రోగింపఁబడదు. అచక్రః= చక్రరహితమైన. రథః= రథము. నయాతి= పోదు. అపతిః= భర్తృహీనురాలు. (అయిన) నారీ= ఆఁడుది. బంధుశతైరపి= అనేకులయిన బంధుజనులచేతనుకూడ. సుఖమ్= సుఖమును. నాప్నోతి= పొందదు॥ తా॥ తంత్రులులేని వీణ వాయింపఁబడదు. చక్రములులేని రథము కదలిపోదు. ఇటులనే పతిహీనురాలయినయాఁడుది అనేకవేల బంధుజనులతోఁ గూడుకొనియున్నదైనను సుఖమును పొందనేరదని తా॥ మఱియును,

శ్లో॥ మితం దదాతి హి పితా మితం మాతా మితం సుతః। అమితస్య తు దాతారం భర్తారం కా న పూజయేత్॥

టీ॥ పితా= తండ్రి. మితమ్= మితముగా. దదాతి హి= ఇచ్చుచున్నాఁడు. మాతా= తల్లి. మితమ్= మితముగా. దదాతి= ఇచ్చుచున్నది. సుతః= కుమారుఁడు. మితమ్= మితముగా. దదాతి= ఇచ్చుచున్నాఁడు. అమితస్య తు= అమితమునకు. దాతారమ్= దాతయయిన. భర్తారమ్= భర్తను. కా= ఎవతెయైన

పూజయేత్= పూజింపదు॥ తా॥ తండ్రియును, తల్లియును, కుమారుఁడు
ను, మితముగాఇచ్చుదురన్నారు. భర్తయనువాఁడు అపరిమితముగా నిచ్చుచు
న్నాఁడు. అట్టిభర్తను లోకములోనెవతెపూజింపదు. దుష్టురాలు పూజింప
దనితా॥ మఱియును,

శ్లో॥ దరిద్రోవ్యసనీవృద్ధో వ్యాధితోవికలస్తథా।పతితఃకృపణోవా
పిస్త్రీణాంభర్తాపరాగతిః॥

టీ॥ దరిద్రోవా- దరిద్రుఁడైనను. వ్యసనీ-దుఃఖముకలవాఁడైనను.వృ
ద్ధోవా-వృద్ధుఁడైనను. వ్యాధితోవా- వ్యాధికలవాఁడైనను. తథా- అప్రకా
రముగా. వికలోవా-వికలుఁడైనను. పతితోవా-పతితుఁడైనను. కృపణోవా
పి-నీచుఁడైనను. స్త్రీణామ్- స్త్రీలకు. భర్తా-యజమానుఁడు. పరా-సర్వో
త్తమమైన. గతిః=గతి॥ తా॥ దరిద్రుఁడైనను, వ్యసనముకలవాఁడైనను, వృ
ద్ధుఁడైనను, వ్యాధికలవాఁడైనను, వికలుఁడైనను, పతితుఁడైనను, నీచుఁడైన
ను, స్త్రీలకుభర్తయేగతియనితా॥ మఱియును,

శ్లో॥ నాస్తిభర్తృసమోబంధుర్నాస్తిభర్తృసమస్సుహృత్। నా
స్తిభర్తృసమోనాథో నాస్తిభర్తృసమఃప్రియః। వైధవ్యసదృశందుఃఖం
స్త్రీణామన్యన్నవిద్యతే। ధన్యాసాయోషితాంమధ్యే మ్రియతేభర్తురగ్రతః॥

టీ॥ భర్తృసమః- భర్తతోసమానుఁడైన. బంధుః- బంధువు. నా
స్తి-లేడు. భర్తృసమః-భర్తతోసమానుఁడైన. సుహృత్ - స్నేహితుఁడు.
నాస్తి=లేడు. భర్తృసమః-భర్తతోసమానుఁడైన. ప్రియః=ప్రియుఁడు.నా
స్తి=లేడు.స్త్రీణామ్- స్త్రీలకు. వైధవ్యసదృశమ్ - విధవాత్వమునకుసమా
నమైన. దుఃఖమ్=దుఃఖము.అన్యత్- ఇతరమైనది. న- లేదు. యా=ఏస్త్రీ. భ
ర్తుః-భర్తయొక్క. అగ్రతః- ముందర. మ్రియతే- మరణమునుపొందుచున్న
దో. సా=ఆయాఁడుది. ధన్యా-ధన్యురాలు॥ తా॥ స్త్రీలకు భర్తతోసమాన
మైన బంధుఁడును, భర్తతోసమానుఁడగు స్నేహితుఁడును, భర్తతోసమా
నుఁడగు నాథుఁడును, భర్తతోసమానుఁడగు ప్రియుఁడును, లేడు. విధవా
త్వముతో సమానమైనదుఃఖములేదు. లోకములో ఏయాఁడుది భర్తయొక్క
ముందరమరణమునుపొందునో ఆయాఁడుది ధన్యురాలని తాత్పర్యము॥ అను
నట్టి ప్రమాణవచనములనుచెప్పి యాయాఁడుది అగ్నిదానమును చేయుమని
విక్రమార్కమహారాజుయొక్క పాదములయందుఁబడె. అంతట నావిక్ర
మార్కమహారాజు ఆస్త్రీయొక్క పతిభక్తిని తెలుపునట్టి పావనవచనముల
నువిని కరుణారసముచేత ఆర్ద్రమైనహృదయముకలవాఁడై శ్రీఖండాదులచే



తవితినిచేయించి యగ్నియందు ప్రవేశించుటకు అనుజ్ఞనిచ్చె. అంతనాయా
ఁడుది విక్రమార్కునియొక్క యాజ్ఞనుపొంది భర్తయొక్కశరీరముతోఁగూడ
అగ్నియందుఁ బ్రవేశించె. అంతఁ గొంతసేపటికి సూర్యుఁడు అస్తమయము
నుపొందె. పిమ్మట విక్రమార్కమహారాజు సాయంకాలమునందలి కర్మము
నుసర్వమును నెరవేర్చుకొని క్రమముగా ఆరాత్రినిగడపె. అంతట మరుదిన
ప్రాతఃకాలమునందు విక్రమార్కమహారాజు మునుపటివలెనే సింహాసన
మునందు కూర్చుండియుండఁగా క్రిందటిదినము అంతరిక్షమునకు ఖడ్గహస్తుఁ
డైపోయిన నైంద్రజాలకుఁడు దేదీప్యమానమైన శరీరముకలవాఁడై భూమి
కిదిగివచ్చి పారిజాతపుష్పమాలికను విక్రమార్కమహారాజుయొక్క కంఠ
మునందువైచె. అనంతరమందు దేవేంద్రుఁడు చెప్పిన మాటలను కొన్నిటిని
చెప్పె. మఱియును, దేవలోకమునందలి నానావిధకథలను చెప్పుటకు ప్రా
రంభించె. ఆవృత్తాంతమును సర్వమునువిని సభలోనివారందఱును మిగుల
నాశ్చర్యమును పొందిరి. అంతట మరల నానైంద్రజాలకుఁ డిట్లనియె. ఓరా
జోత్తమా! నేనికకడనుండి స్వర్గలోకమునకుఁ బోతిని. అక్కడ దేవతలకు
ను రాక్షసులకును అత్యధికమైన యుద్ధముజరిగె. అప్పుడు నేననేకులగు రా
క్షసులనుచంపితిని. అంతట కొందఱు రాక్షసులు మిగుల భయముకలవారై
తమతమనివాసస్థానములకు పరుగిడిపోయిరి. అప్పుడు దేవేంద్రుఁడు పరమా
నందమును పొందినవాఁడై నాతోనిట్లనియె. ఓయీ నేను చిరకాలమునకు
సంతోషించినవాఁడనైతిని. ఇంతవఱకును నీవెక్కడనుంటివనిన నేను భూ
లోకముననుంటినని చెప్పితిని. ఇప్పుడు తమకు రాక్షసులతోఁగూడ యుద్ధము
తటస్థించినదనివిని వచ్చితిననినవిని దేవేంద్రుఁడు అధికానందము కలవాఁడై
నేను సంతోషించితిని. ఇకను భూలోకమునకుఁబోవద్దనిచెప్పి తనహస్తము
నందున్న కంకణమునుతీసి నాచేతియందుఁబెట్టె. ఆసమయమునందు నేనిట్ల
నినుడివితిని. ఓదేవోత్తమా! నేనువచ్చునపుడు నాభార్యను విక్రమార్కమ
హారాజునొద్దనుంచి వచ్చితిని. వచ్చినదిమొదలుకొని నాకేమియును తోచకు
న్నది. కావునఁ బోయితోడ్కొనివచ్చెదనని చెప్పి వచ్చితిని. ఓరాజోత్తమా!
నాభార్య యెక్కడనున్నదో రప్పింపుఁడనినవిని విక్రమార్కమహారాజు మి
గుల నాశ్చర్యముకలవాఁడై యేమియును పలుకక యూరకుండె. అంతట
నానైంద్రజాలకుఁ డిట్లనియె. ఓరాజా! నీవేమియు యూరకున్నావనినవిని యా
సభ్యులలో నొకఁడిట్లనియె. ఓపురుషోత్తమా! నీభార్య అగ్నియందుఁ బ్రవే
శించినదనిన నతఁడయ్యో ఇదియేమనినన నచ్చటివారందఱును నేమియును

పలుకక యూరకుండిరి. అంతట నాయైంద్రజాలికుఁడు మరల నిట్లనియె. ఓ రాజోత్తమా! నీవు పరనారీసోదరుఁడవని తలఁచి నాభార్యను నీయొద్దనుంచి పోతిని. నాభార్యను నీయంతఃపురమునందుంచుకొని యేమియును పలుకక యూరకుండుటయును, నీసభికులలో నొకఁడు నాభార్య అగ్నియందుప్రవేశించినదనుటయును, ఉచితమా? అనినవిని యావిక్రమార్కమహారాజు సంకుచితమనస్సుకలవాఁడై అంతఃపురమునందు కావలియుండు సౌవిదల్లు నిపిలిచి యిట్లనియె. ఓరీ సౌవిదల్లుఁడా! ఇతనిభార్య అంతఃపురమునందున్నదా? సత్యమును చెప్పుమనిన నతఁడిట్లనియె. రాజోత్తమా! దేవిగారితోఁగూడ ఇతనిభార్య అంతఃపురమునందు సంభాషించుచున్నదనినవిని విక్రమార్కమహారాజు ఆయిల్లాలిని తీసికొనిరమ్మనియె. అంతట నాసౌవిదల్లుఁడు అంతఃపురమునకుఁబోయి యామెను తోడ్కొనివచ్చె. ఆయంగనామణిని జూచి విక్రమార్కుఁడును, అతనిసభికులును అధికమైన యాశ్చర్యమును పొందిరి. ఇంతలోపల నాయైంద్రజాలికుఁడులేచి "జయమహారాజసకలమహీపాలమకుటకోటి మణికిరణపాటలిత పాదపీఠజయనిరర్గళదానోదకధారాపూరప్లవమాన నిఖిలమార్గణ విక్రమవసుంధరాధురంధర,, అనిస్తోత్రముచేసి యిట్లనియె. ఓరాజోత్తమా! నేను నింద్రజాలికుఁడను. నేను నావిద్యాచాతుర్యమును సర్వమును చూపితిని. ఇదియంతయును నామాయచేతనైన పనికాని మఱియొకటి కాదనియె. ఆమాటనువిని విక్రమార్కమహారాజు అత్యధికమైన యాశ్చర్యము కలవాఁడయ్యె. ఆసమయమునందు భాండారికుఁడువచ్చి యిట్లనియె. ఓరాజోత్తమా! పాండ్యభూపాలుఁడు పన్నునుపంపించియున్నాఁడనిన విక్రమార్కమహారాజు ఎంతద్రవ్యమును పంపెననిన భాండారికుఁ డిట్లనియె. ఓరాజోత్తమా!

శ్లో॥ అష్టౌహాటకకోటయస్త్రినవతిర్ముక్తాఫలానాంతులాః పంచాశన్మదగంధలుబ్ధమధుపాః క్రౌరంధరాస్సింధురాః।అశ్వానాంత్రిశతంచతుర్దశరథాఃపణ్యాంగనానాం శతంహ్యేతద్విక్రమ భూమిపాల భవతస్తత్పాండ్యరాజ్ప్రేషితమ్॥

టీ॥ హాటకోటయః=బంగారుకోట్లు. అష్టౌ=ఎనిమిది. ముక్తాఫలానామ్=ముత్యములయొక్క. తులాః=తులలు. త్రినవతిః=తొంబదిమూఁడు. మదగంధలుబ్ధమధుపాః=మదగంధమునందాసక్తికల తుమ్మెదలుకలవియును. క్రౌరంధరాః=దురంధరములును. (అయిన)సింధురాః=ఏనుగులు. పంచాశత్=ఏబది. అశ్వానామ్=అశ్వములయొక్క. త్రిశతమ్=మూఁడునూరులు. చతుర్దశ=పదు



నాలుగు. (అయిన)రథాః=రథములు. పణ్యాంగనానామ్=వేశ్యాస్త్రీలయొక్క. శతమ్=నూరు. ఏతత్=ఈసర్వమును. హేవిక్రమభూమిపాల=ఓవిక్రమమహారాజా! భవతః=నీకు. తత్పాండ్యరాజ్ప్రేషితమ్=ఆపాండ్యరాజుచేత పంపఁబడినది॥ తా॥ ఎనిమిదికోట్లబంగారము తొంబదిమూఁడుముత్యాలసరములు, మదగంధముతోఁ గూడుకొనిన యేనుగులుఏబదియును, నూఱుగుఱ్ఱములును, పదునాలుగురథములును, నూరుమంది వేశ్యాస్త్రీలును, పాండ్యమహారాజుచేత పంపఁబడెనని తాత్పర్యము॥ అనిధనాధ్యక్షుఁడు చెప్పినమాటనువిని యావిక్రమార్కమహారాజు ఆధనమును ఐంద్రజాలికునకిమ్మనియె. అంతటనాధనాధ్యక్షుఁడు ఆధనమును సర్వమునునతనికిచ్చెనని యీకథను చెప్పి ఓభోజరాజా! నీయందిట్టియౌదార్యాది గుణములున్నయెడలనీవీసింహాసనము నెక్కుము. లేనియెడల నూరకుండుమనినవినిభోజమహారాజుఏమియును పలుకక మునుపటివలెనే తనగృహమునకుఁ బోయెను.

ఇట్లని విక్రమార్క చరిత్రయందలి ముప్పదవ ఉపాఖ్యానము ముగిసెను.

---

## (*) ముప్పదొకటవచరిత్రము. (*)

అంతటమరలనొకనాడు భోజమహారాజు ఆసింహాసనముమీద నెక్కవలయునని యెడుతలంపుకలవాఁడై సుముహూర్తమునువిచారించుకొని పరివారజనముతోఁగూడవచ్చి మునుపటివలెనే సింహాసనము నెక్కఁబోవుచుండఁగా మఱియొకపాంచాలిక యిట్లనియె. ఓరాజోత్తమా! నీవుఈసింహాసనముమీద నెక్కవలయునని యెడు తలంపుకలిగియున్నయెడల విక్రమార్కునివంటివాఁడవు కావలయును. లేనియెడల నెక్కఁగూడదనినవిని భోజమహారాజు విక్రమార్కునిగుణములను చెప్పుమనఁగా నాసాలభంజిక యిట్లనియె. ఓభోజమహారాజా! విక్రమార్కమహారాజు రాజ్యమును చేయుచుండఁగా నొకదిగంబరుఁడువచ్చి.

శ్లో॥ శ్రీశోదదాతుభగవాన్భక్తానాంవస్సమీహితం। యద్భక్తిశ్శుకతామేతి ముక్తికన్యాపరిగ్రహే॥

టీ॥ యద్భక్తిః=ఏభగవంతునియందలిభక్తి. ముక్తికన్యాపరిగ్రహేసతి=ముక్తికన్యతో సాంగత్యముకలుగుచునుండఁగా. శుకతామ్=శుకత్వమును. ఏతి=పొందుచున్నదో. సః=అటువంటివాఁడును. భగవాన్=షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును. (అయిన) శ్రీశః=నారాయణుఁడు. భక్తానామ్=భక్తులయిన.

వః=మీయొక్క. సమీహితమ్=అభీష్టమును. దదాతు=ఇచ్చుఁగాత॥ తా॥ ఏనారాయణునియందలి భక్తిముక్తికన్యతో సాంగత్యముకలుగుచునుండఁగా శుకత్వమునుబొందుచున్నదో అటువంటివాఁడును, షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును, అయిననారాయణుఁడు మీయొక్కయభీష్టమును తీర్చుఁగాతఅనితాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ ధ్యానవ్యాజముపేత్య చింతయసి కామున్మీల్య చక్షుః క్షణం। పశ్యానంగశరాతురంజనమముం రక్షప్రభోత్వంనచేత్। మిథ్యాకారుణికోసినిర్ఘృణతర స్త్వత్తోస్తికోన్యఃపుమాన్। నిత్యేవంసవధూజనైరభిహితో దేవోజనః పాతువః॥

టీ॥ హేప్రభో=ఓస్వామీ! ధ్యానవ్యాజమ్=ధ్యానమనియెడుకపటమును. ఉపేత్య=పొంది. కామ్=దేనినో. చింతయసి=ఆలోచించుచున్నావు. చక్షుః=నేత్రమును. క్షణం=క్షణమునేపు. ఉన్మీల్య=తెరచి. క్షణం=క్షణమాత్రము. పశ్య=చూడుము. అనంగశరాతురం=మన్మథబాణములచేత పీడింపఁబడిన. అముం=ఈ. జనం=జనమును. రక్ష=రక్షింపుము. త్వం=నీవు. నరక్షచేత్=రక్షింపకపోతివేని. మిథ్యాకారుణికః=అసత్యమైనదయకలవాఁడవు. అసి=అయితివి. త్వత్తః=నీకంటె. నిర్ఘృణతరః=దయాహీనుఁడు. అన్యః=ఇతరుఁడైన. పుమాన్=పురుషుఁడు. కః=ఎవ్వఁడు. అస్తి=కలఁడు. ఇత్యేవం=ఈవిధముగా. వధూజనైః=స్త్రీజనముచేత. అభిహితః=చెప్పఁబడుచున్నవాఁడును. సః=ప్రసిద్ధుఁడును. దేవః=దేవుఁడును. (అయిన) జనః=జనుఁడు. వః=మిమ్ములను. పాతు=రక్షించుఁగాత॥ తా॥ ఓస్వామీ! ధ్యానమనియెడునెపమునుపొంది దేనినోఆలోచించుచున్నావు. క్షణమాత్రము కన్నులను తెరచిచూడుము. మన్మథునిచేత పీడింపఁబడుచున్న యీజనమునురక్షింపుము. నీవురక్షింపకపోతివేని అసత్యమైనదయకలవాఁడవును, మిక్కిలిదయాహీనుఁడవును, అగుదువు. మఱియును లోకములోనీకంటె దయాహీనుఁడగువాఁ డితరుఁడెవ్వఁడునులేఁడు. అనివధూజనముచేత చెప్పఁబడుచున్న శ్రీకృష్ణుఁడు మిమ్మురక్షించుఁగాతఅనితాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ ఏకంధ్యాననిమీలనానుకలితంచక్షుర్ద్వితీయంపునఃపార్వత్యా వదనాంబుజేమదలసద్భృంగాయితంయస్యవై। అన్యద్దూరవికృష్టచాపమదనే క్రోధానలోద్దీపితంశంభోర్మంగళదం సమాధిసమయేనేత్రత్రయంపాతువః॥

టీ॥ యస్య=ఏశివునియొక్క. ఏకమ్=ఒకటి. (అగు) చక్షుః=నేత్రము. ధ్యాననిమీలనానుకలితం=ధ్యానమునందలి నిమీలనముతోఁగూడుకొనినదో. ద్వితీయం=రెండవది. (అయిన) చక్షుః=నేత్రము. పార్వత్యాః=పార్వతీదేవియొక్క. వదనాంబుజే=ముఖపద్మమునందు. మదలసద్భృంగాయితం=మదముచేతప్రకాశించుచున్నభృంగమై ఆచరించుచున్నదో. అన్యత్=మూఁడవది. (అయిన) చక్షుః=నేత్రము. దూరవికృష్టచాపమదనే=దూరముగాఈడ్వఁబడినధనుస్సుకలమన్మథునియందు. క్రోధానలోద్దీపితం=క్రోధాగ్నిచేత ప్రజ్వలింపఁజేయఁబడినదో. తత్=అటువంటిదియును. మంగళదం=మంగళమునునిచ్చునట్టిదియును. (అయిన) శంభోః=ఈశ్వరునియొక్క. నేత్రత్రయం=మూఁడునేత్రములును. వః=మిమ్ములను. పాతు=రక్షించుఁగాత॥ తా॥ ఏపరమశివుని యొక్క ఒకనేత్రము ధ్యానమునందలి నిమీలనముతోఁగూడుకొనినదో, రెండవనేత్రము పార్వతీదేవియొక్కముఖపద్మమునందు మదించినతుమ్మెదవలె విలాసములుకలదియగుచున్నదో. మూఁడవనేత్రము దూరముగాలాగఁబడిన ధనుస్సుకలమన్మథునియందు క్రోధాగ్నిచేతప్రజ్వలింపఁజేయఁబడినదో. అటువంటిదియును, మంగళములను కలుగఁజేయునట్టిదియును, అయినపరమశివుని యొక్క మూఁడునేత్రములును మిమ్ములనురక్షించుఁగాత అనితాత్పర్యము॥ అనుశ్లోకములనుచదివి యాశీర్వచనమును చేసి విక్రమార్కమహారాజుయొక్క హస్తమునందు ఫలమునొకదానినిసమర్పించె. అనంతరమందు విక్రమార్కమహారాజు తగినయాసనమునందుఁ గూర్చుండునట్లుచేసె. అంతనాదిగంబరుఁడిట్లనియె. ఓరాజోత్తమా! నేనుమార్గశీర్ష చతుర్దశియందు శ్మశానమునందు హోమమును చేతును. నీవుమిగులఁబరోపకారివికనుక నాహోమమునకు సహకారివై యుండవలసినదిగాఁ బ్రార్థించెదననిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓమునివర్యా! నాచేతకాఁదగిన సహాయమేదియో చెప్పుమనినతఁడిట్లనియె. ఓరాజోత్తమా! మహాశ్మశానమునకుసమీపమునందొక జమ్మిచెట్టుకలదు. దానియందు భేతాళుఁడు నివసించియున్నాఁడు. అతనినిమౌనముతో నీవునాయొద్దకుఁ దీసికొనిరావలయుననిన విక్రమార్కమహారాజు నీయిష్టానుసారముగఁ జేసెదననియె. అంతటనాదిగంబరుఁడు మార్గశీర్షకృష్ణ చతుర్దశియందు హోమద్రవ్యాదులనుసంపాదించి మహాశ్మశానమునందు ప్రవేశించె. ఆసమయమునందు విక్రమార్కమహారాజుకూడ కృపాణమును (ఖడ్గమును) ధరించినవాఁడై యాదిగంబరుఁడున్న శ్మశానమునకుఁబోయె. అంతటనాదిగంబరుఁడు భేతాళపరిగ్రహముకొఱకు శమీవృక్షమునుచూపె. అంతటనామార్గముచేత ఆచెట్టునొద్దకుఁబోయి యామహారాజు భేతాళుని వీపునందుఁబెట్టుకొని తీసికొనివచ్చుచుండగాఁ భేతాళుఁడిట్లనియె. ఓరాజో

త్తమా! నీకు మార్గశ్రమము లేకపోవుటకొఱకు నీవొకకథను చెప్పుమనిన విక్ర
మార్కమహారాజు మౌనమునకు భంగమువచ్చునని యెడుతలంపుతో ఏమి
యును పలుకక యూరకుండెను. అంతట నాభేతాళుఁడు మరల నిట్లనియె. ఓరా
జోత్తమా! ఒకకథను చెప్పుమనిన చెప్పకున్నావు. మౌనమునకు భంగమువచ్చు
నని నీవు తలఁచినట్లు తోఁచుచున్నది. అట్లయ్యేనేని నేనొకకథను చెప్పెదను.
వినుము. కథావసానమునందు మౌనమునకు భంగమువచ్చునని యెడు తలం
పుతో తెలిసియును ప్రత్యుత్తరమును చెప్పని యెడల నీశిరస్సు వేయి వ్రక్కలగున
ని చెప్పి కథను చెప్పుటకు ప్రారంభించి యిట్లనియె. ఓరాజోత్తమా! హిమవ
త్పర్వతమునకు దక్షిణమునందు వింధ్యవతియను పట్టణ మొకటి కలదు. అక్క
డ సువిచారుఁడను నామధేయముకల రాజొకఁడు కలఁడు. అతనికి జయసేనుఁ
డను పుత్రుఁడొకఁడు కలడు. అతఁడొకనాడు వేటకొఱకు మిగుల గాఢమైన య
రణ్యమునందు ప్రవేశించె. ప్రవేశించి యక్కడ నొక యేనుగును చూచి దానిని
వెంబడించి కొంతదూరము పోయె. అట్లు పోవుచుండఁగా మార్గమధ్యమునం
దు అతికష్టము చేత నందొక నగరమార్గమును చూచి మెల్లమెల్లగా పోవుచు నొ
క నదిని చూచె. ఆసమయమునం దానదీతీరమునం దొకబ్రాహ్మణుడు కూ
ర్చుండియుండె. అంతట నా రాజనందనుడు అతని యొద్దకుబోయి యిట్లనియె.
ఓబ్రాహ్మణోత్తమా! నాకు దప్పియగుచున్నది. కాఁబట్టి నాకు దాహశాంతి
యగుటకు నేను నదిలోనికిఁబోయి యుదకపానమును చేసి వచ్చునంతవఱకును
నీవీగుఱ్ఱమును భద్రముగ జూచుచుండుమనిన నాబ్రాహ్మణుడిట్లనియె. ఓయీ! నే
ను నీ పనివాడనా యేమి? నీవీవిధముగాఁ జెప్పనగునా? అనిన నా రాజనందనుడు త
న చేతనున్న చబుకుతో ఆ బ్రాహ్మణుని కొట్టె. అంతట నా బ్రాహ్మణుడు అధిక
ముగా రోదనమును చేయుచుఁబోయి యా కొట్టినవాని తండ్రియగు సువిచారుడను
రాజుతోఁ జెప్పె. అంతట నా రాజేంద్రుఁడు కోపోద్దీపితుఁడై కుమారుని తన దే
శమునుండి వెడలఁగొట్టుటకు యత్నించె. ఆసమయమునందు అతని మంత్రి
యిట్లనియె. ఓరాజోత్తమా! రాజ్యభారమును వహించుటకుఁ దగిన వయస్సు
వచ్చిన కుమారుని స్వదేశమునుండి వెడలఁగొట్టుటకు కారణమేమి? ఇట్లు చే
యుట యుచితము కాదనిన నా సువిచారుడను మహారాజిట్లనియె. ఓమంత్రిపుంగ
వా! నేను ఈశిక్షను చేయుట యుచితమే యని తలఁచుచున్నాను. కారణమేమ
నిన వీఁడొక బ్రాహ్మణుని కొరడాతో కొట్టె. బుద్ధిమంతుఁడగు పురుషుఁడు బ్రా
హ్మణునితో ద్వేషమును పెట్టికొనఁగూడదు. మఱియును,

శ్లో॥ నవిషం భక్షయేత్ప్రాజ్ఞో నక్రీడేత్పన్నగైస్సహ। ననింద్యాద్యో



గిబృందాని బ్రహ్మద్వేషం నకారయేత్॥

టీ॥ ప్రాజ్ఞః=బుద్ధిమంతుఁడగువాఁడు. విషమ్=విషమును. నభక్షయే
త్=భక్షింపఁగూడదు. పన్నగైస్సహ=సర్పములతోఁగూడ. నక్రీడేత్=క్రీడిం
పఁగూడదు. యోగిబృందాని=యోగులసముదాయమును. ననింద్యాత్=నిందిం
పఁగూడదు. బ్రహ్మద్వేషమ్=బ్రాహ్మణద్వేషమును. నకారయేత్=చేయఁ
గూడదు॥ తా॥ బుద్ధిమంతుఁడగు మానవుఁడు విషమును భక్షింపఁగూడదు. సర్ప
ములతో ఆటలాడఁగూడదు. యోగులను నిందింపఁగూడదు. బ్రాహ్మణులతో ద్వే
షమును పెట్టికొనఁగూడదని తాత్పర్యము॥ అను శ్లోకమును చెప్పి మరల నిట్లనియె.
ఓమంత్రిపుంగవా! నీవు పురాణములను వినలేదా? ఏమి? పూర్వమునందు బ్రా
హ్మణశాపమువలన ఈశ్వరలింగము పడెను. మఱియును,

శ్లో॥ అత్యున్నతపదం ప్రాప్తః పూజ్యం నైవావమానయేత్। నహు
షశ్శక్రతాం ప్రాప్త శ్చ్యుతోఽగస్త్యావమానతః॥

టీ॥ అత్యున్నతపదమ్=అత్యున్నతమైన పదవిని. ప్రాప్తః=పొందినవాఁ
డు. పూజ్యమ్=పూజ్యుఁడైనవానిని. నైవావమానయేత్=అవమానింపఁగూడ
దు. శక్రతామ్=దేవేంద్రత్వమును. ప్రాప్తః=పొందిన. నహుషః=నహుషుఁ
డు. అగస్త్యావమానతః=అగస్త్యుని యొక్క యవమానమువలన. చ్యుతః=భ్ర
ష్టుఁడు. అభూత్=ఆయెను॥ తా॥ అత్యధికమైన స్థితిని పొందినవాఁడు పూజ్యుఁడ
గు వానిని అవమానింపఁగూడదు. దేవేంద్రపదవిని పొందిన నహుషుఁడు అగ
స్త్యుని అవమానము చేయుటవలన స్వర్గపదభ్రష్టుఁడయ్యెనని తాత్పర్యము॥
అను ప్రమాణానుసారముగ బ్రాహ్మణులందఱును పూజింపఁదగినవారే. మ
ఱియును,

శ్లో॥ ద్విజాశ్చ నావమంతవ్యా స్త్రైలోక్యేశ్వరపూజితాః। దేవవ
త్పూజనీయాస్తే దానమానార్చనాదిభిః॥

టీ॥ త్రైలోక్యేశ్వరపూజితాః=ముల్లోకములకును ప్రభుఁడయిన పర
మేశ్వరుని చేత పూజింపఁబడిన. ద్విజాః=బ్రాహ్మణులు. నావమంతవ్యాః=అ
వమానింపఁదగినవారు గారు. తే=ఆబ్రాహ్మణులు. దానమానార్చనాదిభిః=
దానము మానము అర్చనము మొదలగువాని చేత. దేవవత్=దేవునివలె. పూ
జనీయాః=పూజింపఁదగినవారు॥ తా॥ ముల్లోకములకును అధిపతియైన పరమశి
వుని చేత పూజింపఁబడిన బ్రాహ్మణులు అవమానింపఁదగినవారు గారు. కా
వున బ్రాహ్మణులు దానమానార్చనాదులచేత దేవతలవలెఁ బూజింపఁదగిన
వారని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ యైఃకృతస్సర్వభక్షోగ్ని రపేయస్సమహోదధిః । క్షయీచ సకృతశ్చంద్రో కో౽నష్టోవిప్రకోపనాత్॥

టీ॥ యైః=ఏబ్రాహ్మణులచేత. అగ్నిః = అగ్నిహోత్రుఁడు. సర్వభక్షః=సర్వమునుభక్షించువాఁడై. కృతః=చేయఁబడెనో. సః=ప్రసిద్ధుఁడైన. మహోదధిః=సముద్రుఁడు. అపేయః=పానానర్హుఁడై. కృతః=చేయఁబడెనో. సః=ఆప్రసిద్ధుఁడైన. చంద్రః=చంద్రుఁడు. క్షయీ=నాశముకలవాఁడై. కృతః=చేయఁబడెనో. విప్రకోపనాత్=బ్రాహ్మణకోపమువలన. కః=ఎవ్వఁడు. అనష్టః=నష్టమును పొందినవాఁడుగాఁడు॥ తా॥ బ్రాహ్మణులకోపమువలన అగ్నిహోత్రుఁడు సర్వభక్షుఁడై చేయుచున్నాఁడు. సముద్రుఁడు పానానర్హుఁడై చేయఁబడుచున్నాఁడు. చంద్రుఁడు నాశముకలవాఁడై చేయఁబడుచున్నాఁడు. కనుకవిచారింపఁగా బ్రాహ్మణులకోపమువలన ఎవ్వఁడునష్టమును పొందుటలేదని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ యతస్సోమంసదాశ్నంతి హవ్యానిత్రిదివౌకసః। కవ్యానిచైవపితరఃకింభూతమధికంతతః॥

టీ॥ యతః=ఏబ్రాహ్మణులవలన. సోమమ్=సోమము. ప్రవర్తతే=ప్రవర్తించుచున్నదో. త్రిదివౌకసః=దేవతలు. హవ్యాని=హవ్యములను. అశ్నంతి=భక్షించుచున్నారు. పితరః=పితృదేవతలు. కవ్యాని=కవ్యములను. అశ్నంతి=అనుభవించుచున్నారు. తతః=ఆబ్రాహ్మణులకంటె. అధికమ్=అధికమైన. భూతమ్=జంతువు. కిమ్=ఏది? తా॥ ఏబ్రాహ్మణులవలన సోమముప్రవర్తించుచున్నదో. దేవతలుహవ్యములను భుజించుచున్నారు. పితృదేవతలు కవ్యములను భుజించుచున్నారు. కావునబ్రాహ్మణులకంటె అధికమైనజంతువుఏదియున్నదని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ యైఃపూజితాస్సురాస్సర్వే మనుష్యాశ్చైవభారత । తపోవ్రతధనాయేచ కస్తాన్గతినార్చయేత్॥

టీ॥ భారత=ఓధర్మరాజా! యైః=ఏబ్రాహ్మణులచేత. సర్వే=సమస్తమైన. సురాః=దేవతలు. పూజితాః=పూజింపఁబడిరో. మనుష్యాశ్చ=మనుష్యులును. పూజితాః=పూజింపఁబడిరో. యే=ఎవరు. తపోవ్రతధనాః = తపస్సు, వ్రతము (అనియెడు) ధనముగలవారలో. తాన్ = అటువంటిబ్రాహ్మణులను. కః= ఎవ్వఁడు. నార్చయేత్=అర్చింపకపోవును॥ తా॥ ఓధర్మనందనా! ఏబ్రాహ్మణులచేత దేవతలందఱును పూజింపఁబడిరో, మఱియును, మనుష్యులందఱును పూజింపఁబడుదురో. ఏబ్రాహ్మణులు తపోవ్రతములే ధనములుగాఁగలవారో. అటువంటిబ్రాహ్మణులను లోకమునం దెవ్వఁడుపూజింపఁడని తాత్పర్యము॥ మఱియును,



శ్లో॥ పూర్వంపీతస్సముద్రో యైర్వింధ్యోయైర్వినిపాతితః। యైశ్చాపిదేవతాఃపుష్టాః కింభూతమధికంతతః॥

టీ॥ పూర్వమ్=పూర్వము. యైశ్చ=ఎవరిచేతను. సముద్రః=సముద్రము. పీతః=పానముచేయఁబడినదో. యైః=ఎవరిచేత. వింధ్యః=వింధ్యపర్వతము. వినిపాతితః=క్రిందఁబడవేయఁబడెనో. యైశ్చ=ఏబ్రాహ్మణులచేత. దేవతాః=దేవతలు. పుష్టాః=పోషింపఁబడిరో. తతః=ఆబ్రాహ్మణులకంటె. అధికమ్=అధికమైన. భూతమ్=జంతువు. కిం=ఏది? తా॥ పూర్వమునందు ఏబ్రాహ్మణులచేత సముద్రముపానముచేయఁబడినదో. ఏబ్రాహ్మణులచేతవింధ్యపర్వతముపడద్రోయఁబడినదో. ఏబ్రాహ్మణులచేత దేవతలుపోషింపఁబడిరో. అటువంటిబ్రాహ్మణులకంటె అధికమైనజంతు వేదికలదని తాత్పర్యము ॥ మఱియును,

శ్లో॥ యఏవందేవమన్విచ్ఛే దారాధయితుమవ్యయం । సర్వోపాయైఃప్రయత్నేన సంతోషయతుసద్విజాన్॥

టీ॥ యః=ఎవ్వఁడు. ఏవమ్=ఈప్రకారముగా. అవ్యయమ్=నాశరహితుఁడైన. దేవమ్=దేవుని. ఆరాధయితుమ్=సేవించుటకొఱకు. అన్విచ్ఛేత్=ఇచ్ఛయించునో. సః=అటువంటిదేవుఁడు. సర్వోపాయైః=సమస్తములయినయుపాయములచేతను. ద్విజాన్=బ్రాహ్మణులను. సంతోషయతు=సంతోషింపఁజేయుఁగాత॥ తా॥ లోకములో ఏమానవుఁడు అవ్యయుఁడైన దేవునిఆరాధించుటకొఱకు ఇచ్ఛయించుచున్నాఁడో అటువంటిమానవుఁడు సకలోపాయములచేతను దేవతలనుపూజించుఁగాత అని తాత్పర్యము॥ మఱియును, ద్వారవతీపట్టణమునందు కృష్ణుఁడుకూడచెప్పె. ఏమనిన?

శ్లో॥ ఘ్నంతంశపంతంపరుషం వదంతంయోబ్రాహ్మణంనార్చయతే తథామాం। సపాపకృత్ బ్రహ్మదవాగ్నిమధ్యే ధ్యశ్చదండ్యశ్చనచాస్మదీయః॥

టీ॥ యః=ఎవ్వఁడు. ఘ్నంతమ్=కొట్టుచున్నవాఁడైనను. శపంతమపి=తిట్టుచున్నవాఁడైనను. పరుషమ్=కఠినముగా. వదంతమపి=మాటలాడుచున్నవాఁడైనను. బ్రాహ్మణమ్=బ్రాహ్మణుని. నార్చయతే=అర్చింపఁడో. తథా=ఆప్రకారముగా. మాంచ=నన్నును. నార్చయతే=అర్చింపఁడో. పాపకృత్=పాపమును చేయునట్టి. సః=అట్టిమానవుఁడు. బ్రహ్మదవాగ్నిమధ్యే=కార్చిచ్చునందు. వధ్యశ్చ=వధింపఁదగినవాఁడును. దండ్యశ్చ=దండింపఁదగినవాఁడును.

అస్మదీయః=నాసంబంధి. న=కాఁడు॥ తా॥ కొట్టుచున్నను, శపించుచున్నను, కఠినముగామాటలాడుచున్నను, బ్రాహ్మణుఁడుపూజింపఁదగినవాఁడు. అటులనేనన్నును పూజింపవలయును. అట్లుచేయనివాపాత్ముఁడు కార్చిచ్చునను మకాల్పఁదగినవాఁడు. మఱియునుదండింపఁదగినవాఁడు. మఱియునట్టివాఁడు నాచేత పాలింపఁదగినవాఁడుకాఁడని తాత్పర్యము॥ మఱియును,

శ్లో॥ యశ్చమాంపరయాభక్త్యా హ్యారాధయితుమిచ్ఛతి। తేనపూజ్యాద్విజాస్సమ్య గేవంతుష్టోభవామ్యహమ్॥

టీ॥ యశ్చ=ఎవ్వఁడు. మామ్=నన్నును. పరయా=సర్వోత్తమమైన. భక్త్యా=భక్తిచేత. ఆరాధయితుమ్=పూజించుటకొఱకు. ఇచ్ఛతి=ఇచ్ఛయించుచున్నాఁడో. తేన=అట్టివానిచేత. సర్వే=సమస్తమైన. ద్విజాః=బ్రాహ్మణులు. సమ్యక్=లెస్సగా. ఏవం=ఈప్రకారముగా. అహమ్=నేను. తుష్టః=సంతోషించినవాఁడను. భవామి=అగుచున్నాఁడను॥ తా॥ లోకములోఏమానవుఁడు నన్నుపూజించుటకొఱకు ఇచ్ఛయించుచున్నాఁడో అటువంటివాఁడు సకలబ్రాహ్మణులను పూజింపవలయును. మఱియును, ఆవిధముగాఁజేసినయెడల నేనుఅధికముగా సంతోషించుచున్నానని తాత్పర్యము॥ అనుప్రమాణవచనములనుచెప్పి బ్రాహ్మణుని ఈసర్వార్థుఁడు ఏచేతితోఁగొట్టెనో ఆచేతినినఱుకుటయె శిక్షయనిచెప్పి కరచ్ఛేదమునుచేయుటకొఱకు నిర్ణయించె. ఆలోపలబ్రాహ్మణుఁడువచ్చి యారాజుతోనిట్లనియె. ఓరాజోత్తమా! నీకుమారుఁడుమిగులమూర్ఖుఁడు. అదియునుగాకపసివాఁడు. ఇఁకమీఁదటనిటువంటి దుష్కృత్యమునుచేయఁడు. కాఁబట్టి, ఇతఁడీసమయమునందు మన్నింపఁదగినవాఁడు. నేనును ఇతనినిమన్నించితిని. అనినవిని యారాజు తనకుమారునిమన్నించె. అంతటబ్రాహ్మణుఁడును తనయిష్టానుసారముగఁబోయెనని యీకథనుచెప్పి యాభేతాళుఁడు మరలనిట్లనియె. ఓరాజోత్తమా! నీకుఁదెలిసినయెడల ఈవిషయమునుచెప్పుము. ఈరాజబ్రాహ్మణులలో గుణాధికుఁడెవ్వఁడోచెప్పుమనిన భూపాలుఁడేగుణాధికుఁడని విక్రమార్కమహారాజుచెప్పె. అంతట మౌనము భంగమగుటచేత ఆభేతాళుఁడు తొలుతఁదానున్న జమ్మిచెట్టుమీఁదికిఁబోయెను. అంతట విక్రమార్కమహారాజు మరలనక్కడకుఁబోయి యాభేతాళునివీపుమీఁదఁబెట్టుకొనివచ్చుచుండె. అప్పుడు మరలనొకకథనుచెప్పి మౌనభంగమునుచేసె. ఇట్లుఇరువదినైదు పర్యాయములుచేసి విక్రమార్కమహారాజుయొక్క దయాదాక్షిణ్యాదులకు సంతోషించియిట్లనియె. ఓవిక్రమార్కమహారాజా! నన్నుఁదీసికొనిపోయినపిమ్మట ఆదిగంబరుఁడు నిన్నుఁజం



పుననిన విక్రమార్కమహారాజు అదియెట్లనిన భేతాళుఁడిట్లనియె. ఓరాజోత్తమా! నీవునన్నుఁదీసికొనిపోయినవెంటనె యిట్లనిచెప్పును. ఎట్లనిన:— ఓరాజోత్తమా! నీవుమిగుల శ్రమనుపొందితివి. కావునశీఘ్రముగ నీయగ్నికుండమునకు ప్రదక్షిణనమస్కారములనుచేసి పొమ్మనిచెప్పును. అప్పుడునీవు సాగిలపడి నమస్కారమునుచేయుదువు. ఆసమయమునందాదిగంబరుఁడు నీశిరస్సునుఛేదించును. అట్లుఛేదించి నీమాంసముచేత హోమమునుచేసి పూర్ణాహుతినిచేయును. ఆహోమమునందు నన్నుబ్రహ్మనుగాఁజేసికొని యీకర్మమునుసర్వమును బ్రహ్మార్పణమునుగాచేయఁగలఁడు. ఈవిధముగాచేయుచుండఁగా ఆదిగంబరునకు అణిమాద్యష్టసిద్ధులును కలుగుననినవిని విక్రమార్కమహారాజిట్లనియె. ఓస్నేహితుఁడా! అట్లయినయెడల నేనేమిచేయవలయునో తెలుపుమనిన భేతాళుఁడిట్లనియె. ఓవిక్రమార్కమహారాజా! నీవీవిధముగాఁజేయుము. ఎట్లనిన:—ఆదిగంబరుఁడు నిన్నునమస్కారమునుచేయుమని చెప్పినసమయమునందు ఓదిగంబరజనోత్తమా! నేనెప్పుడునునమస్కారమునుచేసియుండలేదు. సకలరాజులును నాకునమస్కారమునుచేయుచుందురు. కావున నాకునమస్కారమును చేయువిధమును తెలుపుమనిన నతఁడునీకుచూపుటకొఱకు సాగిలఁబడినమస్కారమునుచేయును. ఆసమయమునందునీఖడ్గముచేతఆతనినిఛేదింపుము. అప్పుడునేనునీకుబ్రహ్మార్పణముగాహోమమునుజేయించెదను. అంతటనీకుఅష్టవిధసిద్ధులును కలుగఁగలవనినవిని విక్రమార్కమహారాజుఆవిధముగానేచేసె. అప్పుడు భేతాళుఁడు ప్రసన్నుఁడైదిగంబరుని యొక్కశిరస్సునుపూర్ణాహుతినిచేసి సర్వమునుబ్రహ్మార్పణమునుగాఁజేసె. అనంతరమందు ఆభేతాళుఁడు అష్టవిధమహాసిద్ధులను విక్రమార్కునకిచ్చి నీకభీష్టమైన వరమునుకోరుమనిన విక్రమార్కమహారాజిట్లనియె. ఓభేతాళుఁడా! నీవువాస్తవముగా ప్రసన్నుఁడవైనయెడల ఈదిగంబరునిబ్రతికింపుము. మఱియును నేనెప్పుడునిన్నుస్మరింతునో ఆసమయమునందు రమ్మనినవిని భేతాళుఁడుమంచిదనిచెప్పి యథేచ్ఛముగఁబోయెను. అంతటవిక్రమార్కమహారాజు ఆదిగంబరునిలేవదీసి అష్టవిధములయిన మహాసిద్ధులనుఇచ్చి తననగరమునకు బోయెననియీకథనుచెప్పి యాసాలభంజికమరలనిట్లనియె. ఓభోజరాజోత్తమా! నీయందిటువంటి శౌర్యధైర్యాది గుణములుకలిగియున్నయెడల నీవీసింహాసనముమీఁదనెక్కుము. లేనియెడల నూరకుండుమనినవిని భోజమహారాజేమియునుపలుకక యింటికిఁబోయెను.

ఇట్లని విక్రమార్కచరిత్రయందలి ముప్పదొకటవ ఉపాఖ్యానము ముగిసెను.

## (*) ముప్పదిరెండవ చరిత్రము. (*)

అట్లు భోజమహారాజు పలుమారులు తిరస్కరింపఁబడియును, మరల నొకనాఁడు ఇంకొకపర్యాయము పోయి చూతమని తలఁచి సుముహూర్తమును విచారించుకొని పరివారజనముతోఁ గూడి బయలువెడలివచ్చి సింహాసనము నెక్కఁబోవుచుండఁగా కడపటిదగు సాలభంజిక యిట్లనియె. ఆహా! ఇదియేమి నీకు దురాశ ఇంకవఱకును నివర్తింపలేదు. అయినను, ఇంకొకపర్యాయము విక్రమార్కునియొక్క శౌర్యాదిగుణములను చెప్పెదను వినుమని యిట్లనియె. ఆవిక్రమార్కమహారాజునకు సమానుఁడగువానిని లోకమునం దెక్కడను గానను. విక్రమార్కమహారాజు కాష్ఠమయమైనఖడ్గముచేత నాలుగుసముద్రములకును మధ్యనున్న భూమండలమునందుకల రాజులనందఱిని జయించి సకలభూమండలమును ఏకచ్ఛత్రాధిపతియై పరిపాలించె. మఱియును, పరులయొక్క శకమును తొలఁగించి తనశకమును నెరవేర్చికొనియె. మఱియును, సకలదుర్జనులను అణచివేసి సకలయాచకులయొక్కయు దారిద్ర్యము తీర్చి సమస్తభూమండలమునకును సకలసుఖములును కలుగునట్లుగా ప్రజాపరిపాలనమును చేసె. అందువలన విక్రమార్కమహారాజునకు సమానుఁ డెవ్వఁడును లేడు. ఇటువంటి శౌర్యధైర్యాది గుణములు నీయందున్నయెడల ఈసింహాసనమునందు కూర్చుండుము. లేనియెడల ఊరకుండుమనినవిని విక్రమార్కమహారాజు ఏమియును పలుకఁజాలక యూరకుండె.

ఇట్లని విక్రమార్కచరిత్రయందలి ముప్పదిరెండవ ఉపాఖ్యానము ముగిసెను.

(*)

## ముప్పదిమూఁడవ చరిత్రము.

ఇవ్విధముగా ముప్పదిరెండుసాలభంజికలును చెప్పినవిని భోజమహారాజు సిగ్గుచేత తలనువంచుకొని నిశ్చేష్టితుఁడై చిత్తరువునందలి బొమ్మవలె నూరకుండె. ఆసమయమునందు ఆముప్పదిరెండుసాలభంజికలలో నొకసాలభంజిక యిట్లనియె. ఓరాజోత్తమా! నీవును విక్రమార్కమహారాజునకు సమానుఁడవే యని తలఁచుచున్నాను. నీవును విక్రమార్కుఁడును నరనారాయణస్వరూపులు. ఇప్పుడు నీకంటె నుత్తముఁడును, పావనములయిన చరి



త్రలుకలవాఁడును, సకలకలాప్రవీణుఁడును, శౌర్యధైర్యాదిగుణములే యాభరణములు గాఁగలవాఁడును, అయినరాజు లేడు. అందువలన నీయొక్క యనుగ్రహమువలన ముప్పదిరెండగుబొమ్మలయొక్క యాకారమునుధరించియున్న మాపాపము తొలఁగిపోయినది. మేము శాపమునుండి విముక్తులమైతిమి. అనినవిని భోజమహారాజిట్లనియె. ఓసాలభంజికలారా! మీకు శాపమెందుకు కలిగెను. అట్టిశాపము కలుగుటకు కారణమును చెప్పవలెనన ఆసాలభంజిక యిట్లనియె. ఓరాజోత్తమా! మాశాపకారణమును చెప్పెదను. వినుము. మేము తొలుత దేవాంగనలము. మాధు, సుకేశి, ప్రభావతి, సుప్రభ, ఇంద్రసేన, అనంగజయ, ఇందుమతి, కురంగనయన, లావణ్యవతి, కామకారిక, చంద్రిక, విద్యాధరి, ప్రబోధవతి, నిరుపమ, హరిమధ్య, మదనసుందరి, విలాసరసిక, మన్మథజీవిని, రతిలీల, మదనవతి, చిత్రరేఖ, సురతగహ్వరా, ప్రియదర్శన, కామోన్మాదని, చంద్రరేఖ, హంసప్రబోధ, కామశరోన్మాదిని, సుఖసాగర, మదనమోహిని, చంద్రముఖి, లావణ్యలహరి, మరాళగమన, జగన్మోహిని, అనునామధేయములు కలవు. మేమందఱమును ఒకనాఁడు కైలాసపర్వతమునందలి యొకశిలయందు కూర్చుండి ఏమేమో సంభాషించుకొనుచుంటిమి. ఆసమయమునందు పరమశివుఁడు మమ్ములఁజూచి అధికానందముకలవాఁడై రాగరమణీయమయిన దృష్టినిమాయందుంచె. ఆసమయమునందు పార్వతీదేవి ఆపరమేశ్వరునిజూచి మేము తనభర్తయొక్కచిత్తమునకు చాపల్యమును కలుగఁజేసితిమనుహేతువుచేత అధికమైనకోపముకలదై మమ్ముల నిట్లుశపించె. ఓచెలికత్తియలారా! మీరు జీవరహితమయినబొమ్మలై దేవేంద్రునియొక్క సింహాసనమునందుండుఁడనిశపించె. అంతట మేమందఱమును అధికమైన వ్యసనముకలవారమై అతనిపాదములయందుఁబడి మాకు శాపవిమోచన కాలోపాయములను తెలుపుమనిప్రార్థించితిమి. అంతట నాపార్వతీదేవి మిగులదయకలదై యిట్లనియె. ఓచెలికత్తియలారా! కలియుగమునందు విక్రమార్కమహారాజు మీరున్నసింహాసనమును భూలోకమునకుతీసికొనిపోయి యాసింహాసనమునందుఁ గూర్చుండి అనేకసంవత్సరములు ప్రజాపరిపాలనమును చేయును. అంతటఁ గొన్నిదినములకతఁడు పరలోకమునకుఁ బోవును. అతఁడు పరలోకమును పొందినపిమ్మట ఆసింహాసనమును పవిత్రకరమైన యొకభూమియందు అతనిమంత్రులు పాతిపెట్టుదురు. అనంతరమందు కొన్నిదినములకు ఆసింహాసనము భోజమహారాజునకు దొరకకలదు. పిమ్మట నతఁడు ఆసింహాసనమును తననగరమునకుఁదీసికొనిపోయి దానిమీదనెక్కుట

ము ప్రయత్నించుము. అట్లు ప్రయత్నించి వచ్చునట్టిసమయమునందు మీతోఁ గూడ సల్లాపమును చేయఁగలఁడు. అప్పుడు మీరందఱును క్రమముగ విక్రమార్కమహారాజుయొక్క గుణాదులను భోజమహారాజునకు చెప్పుటవలన శాపముక్తులగుదురనియె. అందువలన మేమిప్పుడు నీకు విక్రమార్కుని గుణాదులను చెప్పి శాపవిముక్తులమైతిమి. మఱియును ప్రసన్నురాండ్రమైతిమి. కావున నీకభీష్టమయిన వరమును కోరుమనిన భోజమహారాజిట్లనియె. ఓ దేవాంగనలారా! నాకుకోరదగినది యేదియును లేదు. నేను మీవచనములచేతనే సంపూర్ణమైన అభిలాషకలవాఁడనైతిని. అయినను పరోపకారముకొఱకు నేను దేనినైనను ప్రార్థింపవలసియున్నది. కాఁబట్టి ఈవిక్రమార్కమహారాజుయొక్క చరిత్రను వినువారికి సకలశుభములును కలుగునట్లును, ఈచరిత్రము సూర్యచంద్రులుండువఱకును కొనియాడఁబడుచుండునట్లును, ఈచరిత్రమును వినువారికి శాకినీ ఢాకినీ పిశాచాదిబాధలన్నియును తొలఁగునట్లును అనుగ్రహింపుఁడనిన నాసాలభంజికలు నీయిష్టములన్నియును నెరవేరుననిచెప్పి దివ్యరూపములనుధరించినవయి స్వానుసారముగ స్వర్గలోకమునకుఁబోయిరి. అనంతరమందు ఆభోజమహారాజు ఆసింహాసనమునుదీసికొనిపోయి విచిత్రములైనవిధములుకలుగునట్లుగా బంగారము వెలలేనిమణులు మొదలగువానిచేత చేయఁబడిన ప్రాసాదశిఖరమునందుఁబెట్టి ఆసింహాసనముమీద పరమేశ్వరునికూర్చుండబెట్టి ఆపరమేశ్వరుని సింహాసనముతోఁగూడ దినదినమందును పూజించుచు సుఖముగా చిరకాలము భూమినిపరిపాలించె.

---

ఇట్లని- బ్రహ్మశ్రీ- నోరి- గురులింగశాస్త్రి విరచిత ప్రతిపదటీకాతాత్పర్యసహిత శ్రీవిక్రమార్క మహారాజచరిత్రము ముగిసెను.

ఓం తత్సత్.



